# సంజయ రాయబారము

Hindi

## కళాప్రచారక సమితి, బరంపురం.

### మా మనవి

ఇరువదియవ శతాబ్దమున ఆంధ్రదేశమున వాఙ్మయ వాతావరణమున వింతసంచలనములు విలసిల్లినవి.

చిన్నయసూరిగారి కాలమున గండములుదాటి బ్రతికిన వాఙ్మయ బంధనరూపసరస్వతిని చిరాయువుగా జీవింప నటితలు చేయబూనిన యాంధ్రసాహిత్య పరిషత్తును, ఆసరస్వతిని సజీవముగాఁ జేయఁ గంకణముకట్టుకొన్న అప్పారాయ రామమూర్తి ప్రభృతుల పరిశోధనలును, ఆసంచలనమునకు ఫలములు.

పరిషత్తువారు వాఙ్మయప్రవాహమును గట్టుకట్టి యరికట్టివేయఁ బ్రయత్నింప, అప్పారాయ రామమూర్తిప్రభృతులు ఆగట్టుత్రెగఁగొట్టి యాప్రవాహమును స్వేచ్ఛగాఁ బాఱింపఁ బ్రయత్నించిరి. ఈ రెండుప్రయత్నములవలనఁ గలిగిన లోపములను బరిశీలించి వాఙ్మయప్రవాహము నవసరమైనంతవరకు మాత్రమే యరికట్టి, దానిపాయలకు కావలసినంత యవకాశమిచ్చి లోకకల్యాణమునకై యాప్రవాహము వినియోగించునట్లు చేయు నుద్దేశమున నీకళాప్రచారకసమితి యేర్పాటైనది.

ఈసమితిపక్షమున మేము ప్రచురించిన మొదటిగ్రంథము మా॥రా॥రా॥ దేవరాజు వేంకట కృష్ణారావు పంతులుగారు రచించిన "రాయబారము" లోని మొదటిభాగమగు "సంజయ రాయబారము". జగత్ప్రఖ్యాతిఁ గాంచిన మహాభారతమును గూర్చి ప్రత్యేకించి చెప్పనక్కఱలేదు. లోకోత్తరచరిత్రముగల మహాత్ముని హృదయ మెంతగంభీరమై యుండునో, శ్రీ మహాభారతహృదయ మంతగంభీరమైనది.

జగత్కల్యాణమునకై యవతరించిన శ్రీకృష్ణునిచరిత్ర మెంతయద్భుతమో, శ్రీ మహాభారత మంతయద్భుతము. అట్టి శ్రీమహాభారతమున. అట్టి శ్రీకృష్ణుఁడు నిర్వహించిన "రాయ

"భారము" మహాభారతగ్రంథముననే గాక, ప్రపంచవాఙ్మయముననే యత్యద్భుతము.

మహాభారతహృదయమును, శ్రీకృష్ణహృదయమును, లెస్సగాఁ దెలిసికొని, యీమహాత్ముని రాయబారమునందలి తత్త్వమును లోకమునకుఁ దెలియఁజేయుటకై యెందఱో యిదివఱకు ప్రయత్నించిరిగాని, వారందఱును పరిపూర్ణమనోరథులు కాలేదు.

ఈగ్రంథము రచించిన శ్రీ కృష్ణారావుగారు ఆంధ్రలోకమునకుఁ జిరపరిచితులు. ఆంధ్రభాషలోని ప్రథమనిరూపక నవలను — అపరాధపరిశోధక నవలను — వీరే వ్రాసియిచ్చిరి. అపరాధపరిశోధక నవలలు తెనుగున వ్రాయుటకు వీరిడినదియే భిక్ష. అనంతరము 1926 సం॥లో వీరు తప్పాలతమాషా యను నామాంతరముగల జానకీపరిణయమను పౌరాణికమగు నవలను క్రొత్తపద్ధతిని వ్రాసి ఆంధ్రలోకమున కొసంగిరి. ఇపుడీ రాయబారము నట్లే క్రొత్తత్రోవను ద్రొక్కుచు వ్రాసిరి. వీరీగ్రంథమును జిరకాలపరిశోధనఫలముగ ఆంధ్రదేశమునకుఁ బ్రసాదించిరి. వీరిగ్రంథమును బఠించుచున్నప్పుడు భారతము చదువుచున్నప్పుడు మనకుకలుగుచుండిన యనేకసందేహములు నిర్మూలములగును. కావున వీరిగ్రంథ మన్నివిధముల శ్లాఘాపాత్రముగా నున్నది.

మ॥రా॥రా॥ పింగళి లక్ష్మీకాంత కవిగారు దీనికొక లఘుపీఠిక యిచ్చినందుకును, విశాలపీఠికదయచేయ వాగ్దానము చేసినందుకును, వారికి మేము కృతజ్ఞులము.

ఈగ్రంథమును శ్రీ కృష్ణారావుగారు మాసమితి పక్షమున బ్రచురింప ననుజ్ఞయిచ్చినందుకు మాసమితివారు గ్రంథకర్తగారికి కృతజ్ఞులు. మాగ్రంథముల నాదరించి మాలోపములను దెలియఁజేసి, మాయాశయముల నభివృద్ధిచేయవలసినదని యాంధ్రలోకమును బ్రార్థించుచున్నాము.

బరంపురం — మండపాక పార్వతీశ్వరశాస్త్రి, సభాపతి

9-6-33. — కళాప్రచారక సమితి.

# రాయబారము

( మొదటి సంపుటము )

## సంజయ రాయబారము

— కృతికర్త —

దేవరాజు వేంకట కృష్ణారావు.

వాఁడే వీఁడు, నేనే, కాలూరాయి, విభ్రమరాఘవముల

గ్రంథకర్తయే యీ కృతికర్త.


రాయబారము
మొదటి సంపుటము
సంజయ రాయబారము
వెల రూ. 1-0-0

రాయబారము
రెండవ సంపుటము
శ్రీకృష్ణ రాయబారము
వెల రూ. 1-0-0

సర్వాంగసుందరముగు
రెండుసంపుటములునుగల ఒకేసంపుటము వెల రూ. 2-4-0.
( పోస్టేజీలు ప్రత్యేకము )

కనుక ఏ విధమునచూచినను ఇది నూతన్న వైఖరిని విరాజిల్లు స్వతంత్ర రచన యనకతప్పదు.

వేంకట కృష్ణారావుగారితో సంభాషించునపుడు. వారి మాటలో నొక ప్రత్యేకపులక్షణము గోచరించును. సత్యమును పురస్కరించుకొని మాటలాడునపుడు వీరు, ఎదిరి మనసు నొచ్చునన్నమైననుజంకక, తీక్షణముగ, ఖండితముగ మాటలాడు స్వభావముకలవారు. ఆ స్వభావమే యీరచనలో గూడ ప్రతిఫలించుచున్నది. కనుకనే శైలి, ఎరవు తెచ్చుకొన్నదిగాక, సహజమై యొప్పుచున్నది.

ఈ గ్రంథము సర్వధా ఉత్తమమై, ఆంధ్రవచన వాఙ్మయమునకు ఒకనూతనాలంకారమువలె నున్నదనుటకు సందయాము లేదు.

దీనికి, వస్తువిమర్శపూర్వకమైన ఉపోద్ఘాతము వ్రాయ దలచితినిగాని, ప్రస్తుతము వ్యవధిలేక పోవుటచే నింతతో చాలించితిని. రెండవభాగమున ఆమాటను దక్కించుకొందునని గ్రంథకర్తను వేడికొని యీరెండుమాటలుమాత్రము వ్రాసితిని.

విశాఖపట్టణము
1—6—33.

పింగళి లక్ష్మీకాంతం.
లెక్చరరు, తెనుగు,
ఆంధ్ర యూనివర్సిటీ కాలేజీ.

# పీఠిక

1928 సంవత్సరమున నేనును బ్రా॥శ్రీ॥ కొత్తపల్లి రాజలింగ కవిగారును భారతమున నుద్యోగపర్వమును చదువుచుండ 1929 సం॥మున నామిత్రులును ప్రస్తుతమున ననువాద గ్రంథమండలికి (పాలకొండ) సంపాదకులును అగు బ్రా॥శ్రీ॥ మంగిపూడి శ్రీరామ చంద్రశాస్త్రిలవారు బరంపురము వచ్చియుంటిరి. ఆతరుణమున వారితో మఱియొకతూరి యుద్యోగపర్వమునే చదివితిని. పూర్వాపరసందర్భములకొఱకు భారతమంతయు జదువవలసివచ్చినది. కొన్ని కొన్నిఘట్టముల నిరూపించుకొఱకు హరివంశ విష్ణుపురాణములను జూడవలసివచ్చినది. ఇట్లు తీగ గదుప డొంకంతయుగదలినది. అందందు నాకుపొడమిన సంశయములెల్ల శ్రీరామచంద్రశాస్త్రిల వారినడిగి తెలిసికొంటిని. అనంతరము 1930 లో కీ॥ శే॥ నాతమ్ముడు సీతారామస్వామితో కృష్ణచరిత్ర బరిశీలనాదృష్టులతో సంపూర్ణముగ బలుమారు దఱచితఱచి చదివిచూచితిని. భారతోద్యోగమున శ్రీకృష్ణుని పురస్సరణము బరిశీలింప నాగాథ నొకకథారూపమున వ్రాయనగునని తోచినది విమర్శింపదగినవిషయములు పెక్కులుండుటను నవలారూపమున విమర్శనయే రచియింపదగినదని తోచిన యంతన గ్రంథరచనకు గడంగి బ్రా॥శ్రీ॥ మండపాక పార్వతీశ్వర శాస్త్రిలవారికి, నావ్రాసినంతవట్టు జూప వారు నాయవలంబించిన మార్గమును శామోదించి, మఱికొన్ని నూతనవిషయముల నాకు సుబోధకమొనర్చిరి. వీరు నాకు 1898 సం॥నుండి గురువరులు. వీరు నావ్రాతప్రతిని జూచి, సవరించి, సంస్కరించి నను కృతకృత్యుంగా నొనరించిరి. ఏడవమున కెంత వ్రాసిన నాభాగము బ్రా॥శ్రీ॥ కొత్తపల్లి రాజలింగకవిగారికి చదివి వినిపించి, వారిసలహాలను పొందియుంట వారికెంతయు కృతజ్ఞుండను. శ్రీ జయంతి సోదరులును, బ్రా॥శ్రీ॥ కోట సూర్యనారాయణ శాస్త్రిలవారును (బొబ్బిలి) వీరి కుమారులు కోట లక్ష్మినారాయణగారును, కీ॥ శే॥ మహామహోపా

ధ్యాయ శ్రీమాన్ పరవస్తు వెంకటరంగాచార్యులుఅయ్యవార్లంగారి నునుమాఱు శ్రీమాన్ వరహ లక్ష్మీనృసింహాచార్యులు అయ్యవార్లం గారును, శ్రీమాన్ నిడాధూర్ అనంతాళ్వాన్ అయ్యవార్లంగారు ను, నాకు పెక్కుగతుల ప్రోత్సాహముకలుగజేసిరి. మఱికొంత కాలమునకు నాకుఁజేరిన బ్ర॥ శ్రీ॥ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రుల వారి భారతచరిత్రమును బ్ర॥ శ్రీ॥ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రులవారి కర్ణచరిత్రమును జూచి, నేనిదివరకువ్రాసిన కొన్ని భాగములు మార్చుకొనుటయు, కొన్నిపట్టుల వారియభిప్రాయముల నుండి భిన్నపడనగుటయు సంభవించినవి. నావ్రాసిన విషయముల సరిచూచుకొనుటలో మహాభారతచరిత్రమునుండియు కర్ణచరిత్రము నుండియు కొన్నికొన్ని భాగములు సరిగా నెత్తివ్రాయవలసివచ్చినది. అట్లగుట నెవ్వరెవరి గ్రంథములు నాకు సాయపడినవో వారివారి పవిత్రనామములతో వారివారిగ్రంథనామములనొకపట్టికలో యిందు బొందుపరచినాను. గ్రంథము ముద్రించుచునుండగానే, యెన్నెన్ని సభలలోనో యెందరెందరు పండితకవులయెదుటనో, చదివితిని వారివారి సదభిప్రాయముల నందితిని. వారందరికును కృతజ్ఞుడను.

1929, 30 సం॥రములలో నాకార్యముపైని మదరాసు నేను పోయినపుడు శ్రీ తాపీ ధర్మారావుగారిని కలిసికొని వారితో నేనేకవిషయముల శ్రీకృష్ణచరిత్రముగూర్చి చర్చించితిని. వారును కొన్నియంశములు నాకువెల్లడిచేసిరి. వారికిని కృతజ్ఞుడను.

1932 సంవత్సరములో శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారియెదుట నాప్రయత్నమంతయు వారికి నివేదించితిని. వారు నాకుగల కొన్ని సంశయములుదీర్చి, నాకు ప్రోత్సాహమొసంగి, నాగ్రంథమునకు పీఠికవ్రాయునటుల నాప్రయత్నమున వారికిగల యానందము వెల్లడించినందుకు నేను వారికెంతయు కృతజ్ఞుడను.

అనంతరము 11, 12, 13-3-1933 తేదీలను జరిగిన అభినవాంధ్ర కవిపండితసభలో నాగ్రంథము చదివి వినుపించ నను ప్రేరేపించిన

శ్రీ పంచాంగ్నుల ఆదినారాయణ శాస్త్రిలవారికి నాకృతజ్ఞతా సూచకనమస్కారములు. అప్పుడట రెండుమూడుఘట్టములుచదువగా తత్సభాగ్రాసనాధిపతియగు డాక్టరు శ్రీ చిలుకూరి నారాయణరావు గారు ఈగ్రంథరచనయందు నేనవలంబించినమార్గమున కానందించి, వారికికలిగిన తృప్తి నెన్నోవిధముల సభలో వెల్లడించి నాకెంతేని ప్రోత్సాహము కలుగజేసిరి. వారికేనెంతేని కృతజ్ఞుండను. తుదకు బ్రహ్మశ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిలవారు నాయందున్న శిష్య వాత్సల్యముచేత నాప్రార్థన మంగీకరించి, ఉపసంహారమనుపేర కొన్ని పుటలు వ్రాసి యీగ్రంథాంతమున నుంచునట్లుచేయుమని నాకాజ్ఞ యిచ్చిరి. వారికేనెంతయు కృతజ్ఞుండను. ఈగ్రంథము ప్రకటించిన కళాప్రచారక సమితివారి యాదరమునకే నెంతేని కృతజ్ఞుండను.

1929 సం॥నుండి రాయబారమనుపేర నీగ్రంథము రచియించుచున్నానని, తద్గ్రంథవిశేషముల, నా వేగుజుక్క ముద్రాలయముయొక్క క్యాలెండరులలో బ్రచురించుచునేయుంటిని. తుదకు 1932 సం॥ ఫిబ్రేవరునెలలో 'రాయబారము' అనుపేర నొక చిన్న పుస్తకము సుమారు 28-30 పుటలుగలది ప్రచురించితిని. అందు నారచియింపబూనిన యీరాయబారపుకథావిధానమెల్ల సుబోధకమగునట్లు వ్రాసియుంటిని. "వ్రియబోవుగ్రంథమునకువిషయసూచిక నిట్లు తొలిబ్రకటింపరాదు" అని నామిత్రులువలికిరి. అట్లు విపులమగు విషయసూచికను తొలిప్రకటించుటవలనను, పెక్కండ్రెదుట దొలిచదువుచుండుటవలనను, పొందదగిన ప్రమాదము, మరికూడదీయరానితెన్నున ననుభవించితిని. గ్రంథము వినినవారందరును గ్రంథకర్తకు సలహాయిచ్చుటకే వింతరసి యెట్లనగలము! నా గ్రంథముచదువగా వినినవారిలో పండితులును, పండితకవులును, నగువారు గ్రంథప్రాశస్త్యముకొరకు మంచివిషయములు సుబోధకమొసగిరి. గ్రంథకర్తలును గ్రంథప్రకటనవాణిజ్యకార్యమేవృత్తిగా గలవారు తామే 'ప్రకటింతుమి' మ్మని నాగ్రంథమునడిగినారు. అటీ

గ్రంథ మొదలుకు బ్రకటనార్థమొసంగ ననినంతనె నీసును రోసమ్ముం బూని నన్నీరాయబారము బ్రకటింపనలదని రాయబారములంపి నపుడు, ఒరులయున్నతి జూడనోపని పౌండ్రకవాసుదేవ, సృగాల వాసుదేవాదులు, వాసుదేవున కనిపిన రాయబారములే జ్ఞప్తికి వచ్చినవి. తుదకెట్లైననేమి స్వతంత్రముగ నిది ప్రకటించుటయె దటస్థమైనది.

నాయెడగల అభిమానముపెంపుననైననేమి, నాతోనున్న వ్యాసహారిక సంబంధముచేతనైననేమి, నాకడకు వచ్చుచుబోవుచు నున్న పరిచయముగాసిన స్నేహితునితోడను నేను శ్రీకృష్ణుని ప్రవర్తనమునుగూర్చి పలుపలు తెఱగుల జర్చించుచు నుచ్చరించుచునే వచ్చితిని. ఇట్లు 1928 మొదలు నేటివరకును నే నెందరతో జర్చించి యుంటినో, అందు గొందరు,—వారిమూలముననే నే నీగ్రంథము రచియింపగలిగితిని—అని పలుకుటయు బ్రాప్తించినది. ఇంతకును సర్వవ్యాపియైన వాసుదేవుడే యిన్నిరూపముల వచ్చి నా కీపనియందు దోడ్పడెననుటకు సందియమంజజాలను.

ఎన్ని విధముల తర్కించుకొని, జర్చించుకొని గ్రంథము రచి యించితినని నే ననినను, సరోవరోదకంబుల భేదించుకొని పైకివచ్చు నంతవరకేగద కోరకమునకు నిసర్గవృత్తి. ఆ సరసీరుహాకోశమునకు బరిమళమును, వికాసమును, శ్రీనివాసమును జేకూర్చువాడు సర్వశక్తి సంభరితుండగు సకలకర్మసాక్షియేకద. అట్లనే గ్రంథము రచియించు వాడు తత్త్వార్థవిషయముల కొకరూపమిచ్చి లోకమునకందిచ్చు నంతదనుకనె తత్కర్తకు విహితకృత్యమును; తదనంతరము పాఠక లోకమె, దానిమంచిచెడ్డల నేర్పరించుచునదగుట, నే నిట్లువ్రాసితి నట్లువ్రాసితి నని యనంబనిలేదని యింతతో విరమించితిని.

బరంపురం
జూన్, 1933.

దేవరాజు వేంకట కృష్ణారావు,
గ్రంథకర్త.

జూపినను, అల్లు న్నిల్లరిక ముంచుకొనుట యెట్లైన నల్లువారికి దాసత్వమై, లొంగి తిరుగ వలసిన బ్రదుకే యగును. వియ్యపు వారియింట నీ పాండునందనులు దినములు గడపుటకంటె, నన్నలును దమ్ములును. నెయ్యమునఁ బెనిచి పెద్దజేసిన పెదతండ్రియుండఁగలయిం టనే కలకాలము జీవనము చేయుట సమంజసము కాదా! అటుగాక క్షాత్త్రధర్మము నవలంబింతు మనిన, వేఱొకమార్గము ననుసరింప నగును. నేటికిని ద్రుపదునిచేతఁ గానిపని యీ నాఁడీ విరటుని, వలన నగునేమో యనియైనఁ దలంచుట భావ్యము కాదు; కాని, పాండవేయుల భాగధేయవృత్తి యెంతకాలము ఫలింపకుండు, నంత కాలము వీరలు కష్టపడుట తప్పదుకదా! ఎంతయుఁ గాకున్న, నాడిన జూద మెట్టిదైన నేమి, రాజ్యముతోడను, ధనసంపదలతోడను, ఏమాత్రమును సంబంధములేని యపూర్వపుఁ బందెమని తొలుత నుద్ఘాటించి పలికి, జూదమున నోడినవారు పండ్రెండేఁడు లరణ్యా వాసంబును, నొక్కయేఁ డజ్ఞాతవాసంబును సలుపవలయు ననియు, సం దెఱుంగఁబడి రేని, మఱల నరణ్యాజ్ఞాతవాసంబుల నట్లె సలుప వలె ననియు ననిరెను; కాని, జయప్రదంబుగ సమయంబు దీర్చి కొని, వీరలు స్వరాజ్యంబునకు మగుడునంతలోన వీరి రాజ్యంబును, వీరి వైభవంబును, తాము కొల్లఁగొట్టుట లే నాగరక దేశమునఁ గాని, యే బాధ్యతగలపరిపాలనమునఁ గాని, ఏనాఁడైనను జూచుచు నోర్చియుండుట యమానుషము కాదా! బాహుబలసమన్వితు లయి యుండియు, విపినావాసమును, గూఢచర్యయును, సమయభంగము కాకుండ, నెన్నియిక్కట్టులంబడియైన నిర్వర్తించుకొని మఱలివచ్చు నరికిఁ గూడులేనిపక్షు లయి, నాటి మన్నింపు నడుమ ననదలువోలె కూటికిని గుడ్డకును, గక్కుఱితి వడి, చింతలం జిక్కుచుండ, ధర్మ మార్గం బెఱింగినయిందఱు పెద్ద లుండియుఁ, బాండవులకు నిలువ

నీఁడయు, దిన నన్నమును, గట్ట గుడ్డయు, నిశ్చింతముగ దొరకెడు మార్గము నాలోచింపకున్న నుఱి యింకెవ్వఁడు? కాఁదగు వా రందఱును వచ్చి యున్నారు; చేయఁదగు యోచనల కింతకన్న సుసమయము మఱిలేదు. కావున నో నయవిదులారా! జూదమున జరిగిన సమయము చొప్పున నీ పాండవు లడవులపాలయి, క్రూర మృగముల నడుమను, రక్కసి మూఁకల మధ్యమునను, బడరాని యిక్కట్టులం బడి తుదవత్సరం బగు నియ్యేఁటఁ దమ్మొరు లెఱుంగ కుండుట కెన్నెన్ని యాపద లొందవినను, భరియించుమన్నైనఁ గడపిరి గదా! ఇట్టియెడ ధర్మజాదుల ఋజుమార్గ వర్తనంబును, వీరియెడ ధార్తరాష్ట్రుల యనుచితవృత్తియును, నౌదార్యవంతులగు తమకెల్ల రకును విదితము గాకపోదు. పాండవులకుఁ బైతృకం బగు నట్టియును, దాము దిగ్విజయంబున సంపాదించి కొనినట్టిదియును, నగు రాజ్యంబును గపటద్యూతాంతంబున నాదుర్యోధనుండు వంచనచే నన్యాయముగా నాక్రమణం బొనర్చుటయు, ధర్మజుని మహానుభావంబుఁ గాంచంగక, ధార్తరాష్ట్రులు పరిపరి విధంబులఁ దిరిగి బరిభవించినను, పెక్కండ్రు మూఁకల నేయని ఘా తాత్మ్యంబుపాటయు. నెఱింగనమీరలు, వంచనచే వారి నన్యాయాక్రమణం బొనర్చినభూభాగంబు నా ధార్తరాష్ట్రులే పాండవేయుల కిచ్చివేయు టయో తగినకార్యం బని యంతటఁ గేని, యా మార్గంబు నెవ్వ వలంతులగు మీరు. అయినను నాకుఁ దోఁచిన దొకటి తెలుపఁగోరెదను. సావధానులరై వినుండు. ... ... "

ఇటులఁ గృష్ణుండు పలుకు పలుకులు విని, ఆ మొదటి జప దాడి, తనలో, "ఏమిది? ఇపు డిట సమకూడిన యెల్లరు రాజుల సాను భూతియుఁ బాండవులయెడఁ బ్రసన్నత నొందిన తెలియఁగునను, ధార్త రాష్ట్రులయెడ నేవ జనింపఁజేయుటల్లను, నుపన్యసించి తుదకుఁ బాండవుల సత్ప్రార్థనము మాల వారికిఁ గీడు నుపాయము నాలోచింపఁ

డని యిపు డీ సభ నలంకరించి యున్న వారినందఱ నడిగియు, సభ్యుల నోట నొక్కమాటయు బయల్పడుటకైన నెపమీయఁ డిదేమి చిత్రము! తగినయాలోచన మడిఁగియుఁ, దనకుఁదోఁచిన తెఱంగెఱిఁగింతు సావధానులరై వినుం డని యనుచున్నాఁడే! ఇం దేదేని విచిత్రము లేకపోదు. ఈతనిపలుకులు సావధానముగ వినఁదగినవియే యయి యుండు" నని యనుకొని సభాసదులందఱు, కృష్ణునిపైన దృష్టి సారించి వినుచుండెను.

కృష్ణుఁడు మఱియు నిట్లనెను:—

"పాండవు లిపు డీయరణ్యాజ్ఞాతవాసంబుల నొనర్చుటకుఁ గతంబగు సముద్యూతప్రారంభంబున దుర్యోధనునకుఁ శకునియొనర్చిన విస్తారంపైపణంబును, సమ్మతంబున గ్రహించితిమేని, వీరి దీక్షానంతరము, వీరిసకలసంపదయును, వీరిరాజ్యంబును యథాపూర్వంబున వీరికిఁ జెందఁ దగినదే యయ్యును, వీరడవుల నున్న కాలమున, వీరి రాజ్యము ధార్తరాష్ట్రులు వంచనచే స్వాధీన పఱచికొని యన్యాయముగ ననుభవించుచున్నారనుట నిర్వివాదాంశమని మీరెల్ల రెఱిఁగినదియేకదా! కావున ధార్తరాష్ట్రులు వీరి భరతభాగము వీరి కొసంగరేని, యిపు డిట విచ్చేసి యున్న తామందఱును గలసియే వారి భూభాగము వారి కొసంగఁ జేయ వలంతులరు. క్షాత్రధర్మంబుచొప్పున వీరలా భాగంబుకొఱకే కొంతయు లేకుండ, జగడము సేసియైనఁ గైకొనుట యధర్మమని, నయకోవిదు లగుతా మెట్లు పలుకఁ గలరు? అట్లగుటఁ దోడి భూపాలుండగు ధర్మభూపాలుఁ డిట్లడవులపాలయి యుంట తమకు మాత్ర మేమాత్రపు మనశ్శాంతిని గలుగఁజేయఁగలదు? తమ యట్టి వారిమాటయేని ఆ ధార్తరాష్ట్రులు గైకొనకున్నను, పాండవు లింకను ననవలంబలేఁ గాలము గడపఁజాలమి, దమబాహువిక్రమముఁ జూపఁ దలపడుదురు. అట్టిపట్టుల వీరును వారును గలసి దేవాసురులట్లు

పోరఁగలరు. అందు మనకును, వారికిని, ఆ యుభయుల దేశములకును, శాంతి దక్కదు. కాన నట్టి కడఁకేలు కార్యంబు చేకురకుండఁ గాపాడు భారము వయోవృద్ధులును, ధర్మస్వరూపులును, నయకోవిదులును, నగు నిచటి యీ పెద్దలే వహించి, చేయఁ దగు కార్య మూహింపఁ దక్షులు. మీ యందఱితోడివారగు నీ పాండవుల నిట్టిడుములపాలు చేసి, యథాక్రమముగ సమానుపముగ సింకను వంచన సేయుతలంపును, నీచపుఁజూచనూహను, ధార్తరాష్ట్రులు కలిగియుండుట యెంతటి నింద్యమో, మన సాటి మనుష్యులం బ్రదీవిధమున గూడును లేని పక్షులవలె మలయుచుండఁ జూచుచు, వినుచు, నూరకుండుట మనకును నంతటి నింద్యమే యగును. మఱల నింద అనింద్యచరిత్రులును, ధర్మ సంస్థాపనార్థము ప్రాణముల నైన నొసంగ సంసిద్ధు లగువారును, విక్రమాఢ్యులును, నగు ధరణీపాలుర సమకూడుట యెఱిఁగి; కావునఁ దామందఱును సమయోచితమగు నాలోచనము నెఱపఁ బ్రార్థితులారు. ఇచట సమకూడిన మన మిట్లనుకొను చున్నాము; కాని, యెదురు మానసపుగ్రాహము నెఱుంగకుండ నెదయు నిశ్చయింపవలసినపని గనుక, ధర్మమార్గానువర్తినుండును, మనకు హితుండును నగు నొక్కఁడు నక్కురుపతి కడ కనిపి, సవిస్తరంబుగఁ జెప్పింపనొప్పు. సౌమ్యంబున నా కౌరవనాథుఁడు వీరి ధరణీభాగంబు వీరి కిచ్చివేసిన మేలు యగు. అందులకుఁ దప్పెనేని, అప్పటికిఁ బోలిన యత్నము గారయ నగుఁగాక—ఇప్పటి కింతకన్న మిన్న యూ మార్గము లేమి నిట్లు చేయ నగును."

అని కృష్ణుం డూరకుండెను.

బలరాముఁడు:— వింటిరిగదా, కృష్ణుని వాక్యములు! ఇరువైపులవారికి నివి హితములగుటయె గాక, లోకకల్యాణప్రదములుగూడ నై యున్న యీతని పలుకు లెవ్వరికి మాత్ర మభిమతము లై

విభవంబులకును గర్వించి వర్తించుచు,—మమ్మెదిరించు
వారును గలరా—యను గరువంబున నున్నసమయమున,
జూదంపుఁగారణంబున సిలుగుల నొందవలసివచ్చె; ఇంతకును,
దనకు నక్షవిద్యయం దాతురమెకాని, అందుఁ గౌశలము
లేమి నెఱుంగకున్నను, బంధుసుహృజ్జనామాత్య వర్గంబులు
జూదంపు వ్యసనము మాను మని యెంతగ వారించినను, వినక
యాయత్తపడుచుండ, దుర్యోధనునకుం గూడ నక్షవిద్యా
కౌశలములేమిని దనయమాత్యబంధుగణంబులు వల దని
యనుటను, దా నాడుట మాని, తనకు మాఱుగఁ బాచికల
యాట నారితేరి యుండిన సౌబలుని నియమింప నాతం
డొడ్డిన పందెమ్మున ధర్మతనయుం డోడి, యరణ్యాజ్ఞాత
వాసంబుల నిర్వర్తింపవలసి వచ్చె; అట్లగుట దుర్యోధను నెడ
నధర్మంబు నారోపించుట మన కధర్మంబు కాదె! ఇట్టిట్టుల
మనము పంపెడు రాయబారి రారాజుహృదయంబు పల్లవింపం
జేయఁదగు సంభాషణంబుల జరపి, వినయవృత్తి నవలంబించి
మనకుఁ గావలసిన కార్యంబు నెఱపి, జయంబు నొంది రాఁ
దగువాఁడుగా నుండవలయుఁగదా !

సాత్యకి:—బాగు-బాగు; ఇట్టి ప్రసంగములు సేయుటయందు నీకు
నీవ సాటి! ఇంతకును నీయిట్టి ప్రసంగములు చెవియొగ్గి వినిన
వారి ననవలయు నంతియకాని, నిన్ననిన నేమి ప్రయోజ
నము? ధర్మజుఁడు వేడుక పడి జూదం బాడెనో? లేక ధృత
రాష్ట్రుఁడానతి నేసి సభకుఁ బిలువఁబంచి, ఆ పిదపఁ దా రంద
ఱును బలవంతపఱచి, మోమోటమి కోటువఱచి, యాతనిచే
జూదంబునాడించిరో? ఈ మాత్రమే నెఱుంగనివా రిపు
డీ సభను లేకపోలేదు! ధర్మజుని యెడ నొక్క నిందమైన

యైనను, దుర్యోధనుపక్షమున నడచిన భూమీశులలో నొక్కండైనను బ్రదికి పోఁగలఁడా! దుర్యోధనుని వంటివారు నూర్గురెత్తి వచ్చినను, పాంచాలురును, వృష్ణివరులును, మన కవలవారును, పుత్త్రసంతానమును ధార్తరాష్ట్రుల నిట్టె పిండిసేయరే! చతుర్విధోపాయపరాయణుండును భుజబల యుతుండును, నగు నీ మత్స్యమహీపతి సహాయమున మనకుఁ దీర్పరానిపని యే మున్నది! ఏది యెట్లు జరుగనైయున్నను, నా మతమున మాత్రము, సంగ్రామమునఁ గానిపని యిం కొకటి కాదనియు, సౌమ్యవచనంబుల నా కురుభూపతితోడం బలుకఁ దలంచితేని, మన మిప్పుడంపుదూత దైన్యవిరహితమై ధర్మసమంచితమై, రాజసమ్మాన్యమైన తెఱంగున సంప్రదించి పదుమూఁడేఁడుల క్రిందట, పాండవుల యనుభవమున నుండిన ధరణీభాగ మెప్పటియట్ల ధర్మోచితముగ వీరి కప్పగించునట్లు బలుకందగు వాఁడుగా నుండవలెను. అట్లును నాతం డొడఁ బడఁడేని తత్ఫల మాతం డెల్లని యనుభవించు: నంతియు కాని, వేడుకోలు, తిరిపమెత్తుకొను తెఱంగు, దైన్యభావము, ఇట్టివి, రాచబిడ్డలకు—నందునను ధర్మయుతమగు వివాదాంశముం గూర్చి—పొందని సుద్దులు కావే!

ద్రుపదుఁడు:—సాత్యకిమాట మాటగాని బలరామునిమాట మాట కాదు. దుర్యోధనుండు దుష్టాత్ముండును, బలపరాక్రమ వంతుండును, బహుసహాయ సంపన్నుండును, నగుటను రాజ్య భాగం బీపాండవుల కాతం డొసంగుట కలలోనివార్త. మఱి యు, మృదుభాషణంబులచే నెన్నండును, దుర్జనులు ప్రసన్న తామహిమంబు నొందఁజాలకపోవుట యటుండ, శాంత యుతులును, మృదువచనరచనాయుతులును, నగు వారిం

జెప్పెడి విషయంబుల ప్రకారంబును, నేర్పుగఁ జెప్పి పుచ్చిన స్నేహంబును లాభంబును సమకూడు. నాకుఁ దోఁచిన తెఱం గెఱింగించితిని—అని చెప్పి ద్రుపదుఁ డూరకుండెను.

కృష్ణుఁడు:—ఇపు డీ పాంచాలపతి పలుకు వింటిమి. ఇంకఁ గౌరవ పాండవు లిరువురును నాకు సమానము. ఈ రెండు కుటుంబములవారును సస్నేహముగ సముచితముగ రాజ్యము లేలికొనుచు బ్రదుకుట మోదముతోఁ జూడ మాకు మాత్రము వేడుకగాదె! ఓ ద్రుపదభూపాలా! మీరు మా కెల్లవారికిని గురుస్థానము; ధృతరాష్ట్రుండును మీ యెడ బహుమానంబు సేయు; శాంతనవుండును మిమ్ముఁ గొండాడు; ద్రోణ కృపాచార్యాదులు మీ యెడ సఖ్యంబు వాటింతురు; కావున మీ పురోహితుని సంపుట సముచితముగఁ గార్యము జక్కఁబడు విధంబై యున్నది. మీమాటయు జవఁదాట నెంచినవా నుద్రిక్తులగువారె చెప్పుదురు. అట్లయ్యును శక్తి వంచనలేని మనప్రయత్నము గోష్పదఁ బొంగిపోవిన నది తెప్పయగును; అటుగాక మన ప్రయత్నమంతయు భగ్నమైన యెడ, మీ నుడివిన యట్టుల సహాయార్థము రాజులనెల్ల రావించి, చివరను మమ్మును బిలువ బంపుఁడు. మీ యాలోచన ప్రకారము పాండుతనూభవులకు రాజ్యభాగ మీకున్న దుర్బుద్ధియుండగు సద్దునకోపానలము కౌరవాన్వయ విపినమునకు దావానలమై భస్మము సేయక యూరకుండునా? ఇంతకును పెద్దలగు తా మందఱును నుచితానుచితమ్ముల సమయజ్ఞతతోఁ దెలిసి మఱియు నడపింప సమర్థులగు గదా! ఉత్తరాభిమన్యుల వివాహ కార్యమునకై ఆహ్వానింపఁబడి వచ్చియుంటిమి. శుభకార్యము సుఖముగ జరిగినది. ఇఁక మే మందఱమును ఇటనుండి సెలవు గైకొందుము.

నాఁడు. ధృతరాష్ట్రునిపైఁ బుత్రవ్యామోహపు నేరము మోపినాఁడు. రాధేయునిఁ 'దులువ' యని తూష్ణీంభావముఁ జూపినాఁడు.

కృష్ణ బలరాములిరువురును గురుసభకు దూతసంపుటకు సమ్మతించినారు కాని దూత సంపుటయే యనవసర మనినాఁడు సాత్యకి. ఇప్పట్టున ధార్తరాష్ట్రుల కడకు దూత సంపుట పాండవ దౌర్బల్యముం జాటుటయే గాక, వారి యనదతనముంగూడ సువ్యక్తముఁ జేయుటయె యని సాత్యకి ధృవపఱచియుఁ గృష్ణబలరాముల పలుకుల నవలఁ ద్రోయ మోమోటమి కోటఁవడి తుద కొప్పికోలునంబడి నాఁడా సాత్యకి.

ధార్తరాష్ట్రులవీఁటికి దూతసంపుటకుఁ గృష్ణబలరాము లిరువురు నేకాభిప్రాయము గలవారలెయయ్యును, గురుసభ నా దూత నెఱపు సంభాషణవిధానమున భిన్నాభిప్రాయు లైనారు. న్యాయనిష్ఠురతలచే, ధర్మసూత్రముల నుపన్యసించు విధానములచే, ధృతరాష్ట్ర ధార్తరాష్ట్రుల మనములఁ బాండవులకగు భాగము వారికి స్వాధీనపఱచు తెఱఁగు దోఁపఁ జేయు మనినాఁడు కృష్ణుఁడు. బలరాముం డటుగాక, గురుపతి తన మానసముకరఁగ, జాలిఁ దలంచియైనఁ బాండవుల కగుభాగం బిప్పించు తెఱం గెంచుమనినాఁడు. దుర్యోధనాదుల యెడ నేరము లెంచినాఁడు కృష్ణుఁడు; దుర్యోధనాదుల యెడ నేరమే లేదనినాఁడు బలరాముఁడు. కావుననే న్యాయనిష్ఠుర సంభాషణవిధానము నెఱపుమని కృష్ణుండును, సౌమ్యసంభాషణవిధానమే ప్రధానమని బలరాముండును సూత్రీకరించినారు. దూత నెఱపవలసిన సంభాషణ క్రమము పట్ల బలరామునిఁ ద్రోసిరా జనిపించు నాదుపదుంపు. తన యన్న

యగు బలరాము నభిప్రాయమునుండి, తాను భిన్నుఁడై యున్నను, దనసూత్రము నంగీకరించిన ద్రుపదాదులు కలరు కదా యని మిన్నకుండెను. తన యుపపాదన నంగీకరింపఁ బడలేదుకదా యని యెంచి కానోపు బలరాముఁడును మిన్నకుండెను.

ఎట్లయినను దుర్యోధనాదుల మానసతత్త్వము నెఱింగిన వాఁడౌటనో, రాజ్యభాగ విషయమున దుర్బలవాదము గలవారు పాండవులని తన యెదఁ దలంచుటనో గాని, బలరాముఁడు మాత్రము దౌత్యమున సౌమ్యమార్గమును, వేడికోలును, ఉపపాదించినాడు. కాని యిప్పుడిటఁ జేరినవారు, తమ తమ వ్యక్తిసంబంధములగు ప్రత్యేక ప్రత్యేక కారణములచేతనో, దేవాసురయుద్ధము నింకొకదాని నభిలషించుటచేతనో, లేక తమతమ ప్రాఁబగలఁ దీర్చికొనుటకు ననాహూతముగా సిద్ధింపఁబోవు మంచితరుణము నేలఁ బోఁగొట్టుకొనవలయునని యెంచియో, రగుల్కొనినయగ్నికి మఱింత పవనసహాయమును, ఇంధనసముపార్జనమును జేయుచున్నారు. కృష్ణునిదెస నాలోకింప నీతఁ డేదే నొక పెద్ద యెత్తు నెత్తు తలంపునఁ బన్నుచున్న యద్భుతవ్యూహమునకిటుల దిగ్బంధనకార్య మారంభించుచున్నాఁడా యని తోఁపక మానదు. ఉత్తరాభిమన్యుల కళ్యాణమంటప మిప్పుడిట్టి సంగర సమాలోచన మంటపముగా మారినది. కళ్యాణకారణమున నన్యోన్య మర్యాదలం దీర్చుకొన నేగుదెంచిన రాజలోకము, మహాయుద్ధమే జరుగఁబోయిన చో, నందుఁ బాండవులకు సహాయ మొనరించు రాజమండలముగను, ధార్తరాష్ట్రుల సేవగించు రాజచక్రముగను మారిపోయినది.

ఇంతతో వీరిసభ ముగిసినదే కాని కార్యము మించి వచ్చు చున్నది. మఱి నేనిటం దడయరాదు.

అని యనుకొనుచు నా మాయజడదారి తత్సభాస్థలిన్వీడి చనియెను.

శ్రీకృష్ణ బలరామాదులు ద్వారక కేగిరి. ఇంక నుపప్లావ్యం బునం బాండవులకడ మిగిలినవారిలో ముఖ్యులు ద్రుపద విరాటులు మాత్రమే.

ద్రుపదుండు తన పురోహితునిం బిలిచి పాండవకార్యార్థియై యా తనితో నిట్లు ప్రసంగించెను.

ద్రుపదుండు—మా వంశమునకుం బురోహితుండవును, వయోజ్ఞాన వృద్ధుండవును, సుకృతివియునై నాకు నెచ్చెలి వగుటను పాండవులకొఱకు ధృతరాష్ట్రుపాలి కరిగి నేర్పుంజూపి, కురు భూపతితోం బలుకవలయును.

పురోహితుండు—తమకు హితమునే కోరుచుండు నేను దమ యా జ్ఞానుసారము కార్యము నెరవేర్తును.

ద్రుపదుండు—పుత్రభూత పీడితుండగు ధృతరాష్ట్రుండు కుటిలుండు. కొడుకు కొట్టితెచ్చుదానిని దిని జీవించు నయ్యాంబికేయుని చంద మెఱుంగుదువు. ధర్మజు ననుపమానమగు సౌజన్యము నెఱుంగుదువు. ఇట్టి నీ వవ్వీట నా కురుపతి సభలో,—

—మీరలన్యాయాక్రమణము జేసి యనుభవించుచున్న పాండవులపాలు మీరు వారికి నొప్పగించుట యుచితము—

అని ధృతరాష్ట్రుతో ధర్మోచితసంభాషణము చేయుచుండ, యుద్ధమునకే సిద్ధపడియుండినదొరలయుం, దద్భృత్యులయు మనమ్ము లొక్కపాటుగం దిరుగంబడును. యుద్ధముమాట విననైననొల్లని గురుభీష్మాదుల, నేమిటకైన సంసిద్ధుండు

# రాయబారము

## రెండవ ప్రకరణము

—o—

హస్తిపురము—విరటునగరమున వివాహవేదికపై జరిగిన పాండవ బంధుమిత్రగణంబుల సంభాషణములను, తన గూఢచారుని మూలమునఁ దెలిసికొనిన దుర్యోధనుని చిత్తవిభ్రమము-కర్ణదుర్యోధనుల దూరాలోచనములు-వివాదకారణములు-భీష్మద్రోణాదులు పాండవులపై నభిమానము జూపుదురేమోయని దుర్యోధనుఁడు సంశయించుచుఁ దనయభిప్రాయము ప్రకారము సకారణముగ వారివారి యవస్థల సవిభజనముగఁ జూపిన చర్చ-పాండవపక్షంబున ద్రుపదపురోహితుండు రాయబారియై కరినగరిఁ జేరకపూర్వమే శ్రీకృష్ణుని సహాయ మభ్యర్థింప దుర్యోధనుని ద్వారకాభిగమనము.

(దుర్యోధనుఁడు—తనలో)

ఏమిది! ఇంత తత్తరపాటొందెనా ద్రుపదుండు! తనకు మా యెడఁగల ప్రాఁబగఁ దీర్చికొనుట కిదియె యదనని యెంచి ద్రుపదుం డాధర్మజుం జేరియుండునా! పాండవు లాద్రుపదున కల్లువాండ్రందుమేని, నేటివఱకును గాని యల్లుండ్రిపుడే యయిరా? ద్రౌపదీ వివాహము మొదలు నేటివఱకును నిదురించుచున్న ద్రుపదుం డిపుడే మేల్కాంచెనా? అలనాఁడు భీష్మద్రోణకర్ణార్జునులచే దా నోడింపఁబడి మాతోఁ గావించుకొనిన సంధినియమముల ననుసరించి, ద్రోణునకు స్వాధీనపఱచినదియు గంగానదికుత్తరదిశను మా కంది రాజధానిగాఁ గలదియునగు అహిచ్ఛత్రమును, వారణావతమును, మఱలఁ గైకొనుట కిదియె తరుణమనియెంచి కాఁబోలు ద్రుపదుండా ధర్మజుం జేరి, యాతని వెరపై బొమ్మ నాడించుకీర్తి నాశింపఁ దలంచినాఁడు. ఇదివఱకే కర్ణుఁడు యాదవుల పీచమడంచి సంధినియమముల

ననుసరించి కైకొనిన వృకస్థలము మఱలఁ దాము గైకొనుట కిదియె యదనని యెంచి కావలయు, నా యాదవులును ధర్మజుం జేరిరి.

తొల్లి పాంచాల పాండవముల ద్వివర్గసమ్మేళనమునకు భయపడి, యేమి మునుఁగునో యనియెంచియో, పాండవుల కింతతినుట కన్న ముండనిమ్మను భూతదయనో, పెద్ద మనసునొంచి, యెట్టులనో సంకీర్ణులగు నాపాండవులకు సంకీర్ణులగు నీభీష్మ ద్రోణ విదురాదులు ధర్మజునకుఁ దొలి యౌవరాజ్యపట్టాభిషేకము చేయించియున్నను, మాతండ్రి నా మొర నాలించి ధర్మజున కర్ధరాజ్యమొసంగి వారల నింద్రప్రస్థమునకుఁ బోవున ట్లొనర్చెను. అర్ధరాజ్య మను మిషను ఖాండవ మిప్పించితిని. నే ననుకొనినట్లు ఖాండవమున నున్న వన్యమృగములచేతనో, రాక్షసవర్గమువలననో, నిహతులగుటకు బదులు ఖాండవమెల్ల దహించి, క్రొత్త జనస్థానము లేర్పఱచుకొని, రాజసూయ మొనర్చి తమ విక్రమమే ప్రకటించుకొనఁ గలిగిరి.

రాజ్యమునం దేమాత్రమును స్వత్వములేని పాండవులే క్రమక్రమాభివృద్ధిఁ గాంచుచుండ వారి యుద్ధతికి సహింపలేక, జూదము నన్ని యందోడునట్లు పన్నగించి, తన్మూలమున వారు సర్వసంపదలం దూలు నట్లొనర్చినను రాజువారిం గరుణించి, మఱల వారిరాజ్యము వారి కొసంగుటం జేసి, ధార్తరాష్ట్రకులమునం దగ్రశాఖవారు ఖండరాజ్య మేలుటకు మనసొప్పమియుఁ, బురువంశీయు లేకాలమునన్నైన నవిభాజ్యమగు రాజ్యమును ఖండంబు లొనర్చికొని తినుట యెఱుంగమియుఁ బాండవులీ సమీపమున నున్నంతకాలమును రాజెట్లయినను గరుణించి యిచ్చుచుండుటో, రాజానంగఁ దలంచియు, నా పోరు పడలేక తన మానసము నెట్లేని చిక్కఁబట్టి యూరకున్నను గురువృద్ధు లెల్లరును ఆశసి యుల్లముఁ బల్లవింపంజేసి, యెట్లేని నాతని నొడంబఱచి, యొప్పించి యిప్పించుటో జరుగుచునే యుండును గదా యని యెంచి వారల పీలగుసంతకాలము దప్పులఁ బౌరఁదోల

బన్నాగ మొసర్చి, యనుద్యూత మేర్పఱచి, యం దరణ్యాజ్ఞాత వాసములే పణంబుగా నేర్పఱచి, యరణ్యావాసమునఁ గ్రూరమృగ ముల వాతఁబడి చచ్చుటో, లేక యజ్ఞాతవాసంబున నెఱుఁగంబడి రేని మఱల మఱల నరణ్యాజ్ఞాతవాసంబు లొనర్చుచుండుటో, జరుగు చుండునని యెంతో దూరము యోచించి వారి కరణ్యావాసాది కష్టపరంపర లొదవఁజేసియు, వారి నడవుల కనిచి దేశ భ్రష్ట త్వముఁగలుగఁజేసియు. వారియనుభవమున నవు డుండిన ధరణీ భాగమును, మయసభాది సంపదలనెల్ల స్వాధీనపఱచికొనియు, వారు మగిడి వచ్చినను జనాదరణము నొందకుండున ట్లెంతో ప్రయత్నించి నను వారు సక్రమంబుగ నరణ్యాజ్ఞాతవాసంబు లొనర్చి రాజ్య పరిపాలనకు మఱలసంసిద్ధులై అంతతో నాగక, అజ్ఞాతవాసదీక్షానం తర మా కోయరాజుకూఁతురౌ నుత్తర నభిమన్యున కిప్పించి వివాహము నెరపఁ జేసి, తత్కల్యాణమంటపసభాభవనము సంగరస మాలోచనరంగముగా మార్చి యా యాదవు లురులొడ్డుచు వ్యూహ ములఁ బన్నుచున్నారని గదా చారుఁడు చెప్పియున్నాఁడు. అల నాఁడు పాండవ పాంచాల సమ్మేళనమునకు జంకి మా జనకునిచే నిండ్రప్రస్థ మిప్పించినవారే, యిపుడీ పాండవ పాంచాల మాత్స్య మను నీ త్రివర్గ సమ్మేళనమునకు మఱింతజంకి యిం కేమేమి యిచ్చి వేయుమని మాతండ్రి నాకుఁ గట్టడిసేయున ట్లొనర్తురో కద! ఇఁక యాదవ సాహాయ్యము పాండవులకు సుస్థిరముగ లభించుటకుఁ బూర్వమే తొలుదొలుత నేనే ద్వారకకేగి, కృష్ణునిసాహాయ్య మడిగి చూచెదఁ గాక! ద్రుపదుఁ డంపిన పురోహితుఁ డీయూరు చేరక పూర్వమే నేను గృష్ణు సహాయ మభ్యర్థించి, తక్కుంగల రాజులఁ గూడ వారివారి బంధులతో నాకు సహాయ మొసంగుటకు బాండ వులకన్న మున్ముందుగ నేనే కోరి మరలి వచ్చెదఁ గాక!

(దుర్యోధన దర్శనార్థియై కర్ణుఁడు ప్రవేశించెను.)

అంగరాజా, జూదపు సమయము నిర్వర్తించుకొనిన పిదప, మనలను గలసికొనకయే పాండవులు విరటునగరమునం గూరుచుండి తద్రాజన్యునితో సంబంధబాంధవముల నెఱపికొని, పాంచాల మాత్స్యులతోం గూడి మనపై నెత్తివచ్చుటకు సిద్ధపడుచు, మనతోడి సంగరంబునకుం దలంపడిన పిదప మనకడకు దూతనంపుచున్నారంట, వింటివే!—అంగరాజా, మనలను భయపెట్టి రాజ్యమును గొను తలంపదికాదా! ఏదీ ధర్మజుని సౌమ్యభావము? తన యత్నములు సౌమ్యములని, తనసరివారును, దన సమాజమువారును దలంచుకొనుఱకును, ప్రజాభిప్రాయము త న్ననుసరించుకొనుఱకును, దన మానసమున నున్న దురూహలం గప్పిపుచ్చుకొని, న్యాయమువలె, ధర్మమువలె, నీతివలె, లోకమునకు గోచరించుగీతిని బ్రవర్తిల్లుటకు ధర్మజుండు వేయుచున్న పరమలౌకికపు టెత్తులు జుమీ యివి! ధర్మజుం డెంతటి ధర్మపరుండని యనుకొంటివి!

* * *

జనదారి వేసమునం బోయివచ్చిన మన చారుండు చెప్పిన దంతయు నీవును వింటివి గనుక మనతోం గయ్యమునకె కాలుం ద్రవ్వుచున్న పాండవులతో జరుగంబోవు సమరమున మనకు సాయము సేయంగోరుచు రాజులం జూడంబోయెదను. కావున నేను మఱలివచ్చువఱకును నీవు రాజ్యపాలన విధులయం దప్రమత్తుండవై యుండుము.

కర్ణుడు—తమ యాజ్ఞల శిరసావహింతును.

దుర్యోధనుడు—మన శత్రువుల ప్రయత్నముల నీవు నేర్పున గుర్తించుచుండుము.

అని పలికి మిత పరివారముతో ద్వారకంగూర్చి దుర్యోధనుండు పయనమై పోయెను.

# రాయబారము

## మూఁడవ ప్రకరణము.

ద్వారకానగరము:— చరిత్రాత్మక, భూగోళశాస్త్రవిషయిక పౌరాణిక, నైసర్గిక, ప్రాముఖ్యతలం జూపుచు చిత్రించిన వర్ణనము-అర్జున దుర్యోధనుల ద్వారకానగరప్రవేశాభివర్ణనము-శ్రీకృష్ణుని ప్రతిభను దర్శనౌచిత్యము-కృష్ణ దుర్యోధనుల సంభాషణము-కృష్ణార్జునుల సంభాషణము-అభిలషితసహాయవాంఛాఫలసిద్ధి నడసిన యర్జున దుర్యోధనుల సంతృప్తి-శ్రీకృష్ణుని కార్యములవల్ల భగవత్స్వరూప సమర్థనము-అర్జునుఁ డుపప్లావ్యమునకున్న ధర్మజునొద్దకు కృష్ణుం గొనిపోవుట-సహాయ మభ్యర్థించుటకుఁ దక్కిన రాజులఁ జూడఁగోరిన దుర్యోధనునిగమనము.

పౌరాణికకథా కాలమునాఁటి ప్రదేశము లిప్పటి కింకను అదేరీతిని భూభాగములుగనో, జలభాగములుగనో, యుండక, యిప్పటి భూభాగము లిపుడు జలభాగములుగఁ గాని, యిప్పటి జలభాగము లిపుడు భూభాగములుగఁ గాని. పూర్తిగనో, యసంపూర్తిగనో, మారి కొన్ని తావుల నామమాత్రావశిష్టములయియు నింకం గొన్ని యెడల మఱపునకు వచ్చియు, నయనగోచరములు కాకయు, నుండియున్నవి. భారతయుద్ధకాలమునాఁటి జనపదములు కాలక్రమముగఁ గొన్ని జలాంతర్గతములై యున్నవి. కొన్ని యడవులుగా మాఱినవి; కొన్నింటి నామములే యిపుడు స్మరణకు రాకున్నవి. ఇట్టిమార్పులుపొందిన పెక్కుతావులలో శూరసేన దేశమునకు ముఖ్యపట్టణముగానున్న ద్వారక యొకటి. అలనాఁటి శూరసేన దేశము ఈనాఁటి గుజరాతు దేశమైయున్నది. కచ్ వియుక్తాగ్రగుడము శ్రీకృష్ణ నిర్యాణానంతరము

పొంగిపొరలి వచ్చుటచే ద్వారక యా నీటిముంపుదునకు లోనైనది. మన కిపుడు కానవచ్చుచున్న ద్వారక, యలనాటి ద్వారక కాక సముద్రతీరమున కట్టబడిన మఱియొక ద్వారకయై యున్నది.

భూతలవైకుంఠమని భాగవతులచేతను, దమకోటపటనే వాసుదేవుచే నిర్మించుకొనఁబడిన దాఁగుడుచోటని వైరులచేతను, వరుసగా నభినందింపఁబడి, నిందింపఁబడిన ఆ ద్వారకానగర మాద్వాపరమున రాచవారు నిర్మించిన వీడులలో వైభవమున మొదటిదియుఁ గాలమునఁ గడపటిదియునై యుండి, సాత్రాజితి కోర్కెదీర్ప మున్ను పేంద్రుఁ డింద్రుని నందనవనమునుండి తెచ్చి పెరటిచెట్టుఁగ నాటిన పారిజాత మందుండుటనో, ఉపేంద్రుని రాజధానియగుటనో, దాసజనముల కోర్కెలీడేర్చు నచ్యుతుం డందు నివసించుచు, భగవద్భక్తుల దరింపఁ జేయ వేచియుండుటనో, గాని, యక్రూర ప్రముఖులందఱును, ఆ ద్వారకను రెండవయమరావతి యని పిలుచుచుందురని పురాణము లందుఁగలవు.

ఒకనాఁటిమధ్యాహ్నము ద్వారకానాథుఁడు భోజనానంతరము తనభవనమున నపరంజి కోళ్ల మంచముపైఁ బరుండియుండి, తనతల యంపిదెస రుక్మిణీసతి తములపాకులమడుపుల నందిచ్చుచుండ, సత్యభామయు మిత్రవిందయుఁ దమ కరపద్మములఁ జామరములఁగొని, వీచుచుండ, జాంబవతి కాల్కడఁగూరుచుండి తన పాదారవిందముల నొత్తుచుండఁ సాత్రాజితితో, నెడనెడ ద్రౌపదింగూర్చియు, నర్జునుం గూర్చియుఁ బ్రశంసించుచుఁ గొంతతడవుగడపి, నిదురింపనెంచి, యువతీజనమును వారివారి సదనములకుఁబో సెలవొసంగి, కొంత విశ్రాంతినొందనెంచి బోయి యదుయాదవకులశేఖరుండు తన కనుదమ్ముల నరమోడ్చి నిదురించెను.

ద్వారకానగరపుఁ దూర్పుద్వారమునుండి సర్పకేతనపటాం

చలముతోఁ గన్నులు మిఱుమిట్లు గొల్పువేగమున నీలిమ గ్రక్కు-
చుండిన పారసీకములఁ బూన్చినరథమునఁ గూరుచుండి, పవన
వేగమున యదుకులభూషణుని నగరముం గూర్చి కడురయమున దుర్యోధ
నుండు వచ్చుచుండ, దక్షిణద్వారమునుండి, యనుపమానభక్తి
చిహ్నమగు కపిరాజు కేతనము మెఱయుచుండ, విజయసూచకములౌ
ధవళాశ్వములఁ బూన్చినరథముపై నధివసించి నగరివాకిటఁ బ్రకాశిం
చుచున్న గరుడధ్వజ సమీపమునఁ దనయరదము డిగ్గి, గరుడధ్వజము
నకు సాగిలబడి మ్రొక్కి ప్రదక్షిణము సేయుచున్న పార్థుం గాంచి,
పాపమా దుర్యోధనుండు, "అన్నా, తరుణము మించెఁగా" యని
తత్తరంపడి, ఫల్గుని ప్రదక్షిణ నమస్కారములు పూర్తి కాక
పూర్వమే, తనగమ్యస్థానము ముందుగఁ జేరనెంచి, రథగమన వేగము
ద్విగుణము సేయుమని తనసారథికిఁ గట్టడియొనర్చెను. సారథియుఁ బయ
నపుటాయాసమునైనను సరకుఁ గొనక, అంతలోనె నందనందనుని
భవనద్వారముకడ నరదమ్ము నిమ్ముగ నిలుప దుర్యోధనుం డరదంబు
డిగ్గి, తత్సమీపంబున నిలిచిన దౌవారికుని మూలమున యదుపుంగ
వుండు నిదురించుచుండెనని తెలిసికొనియుఁ గృష్ణుని శయనమందిరము
నకుఁ ద్రోవఁ జూపుమని యాతని నడుగ, నాతండును బరోపకారాయి
కా నా దౌవారికుని వెంటనంటి సుయోధనుండును దచ్ఛయన మంది
రముఁ జేరెను. కృష్ణుఁడు నిదుర మేల్కాంచునంతఁ దానె మున్ముందుగ
నాతనితో మాటలాడు తలంపునఁ గానోపుఁ గృష్ణుఁడు నిదురించు
చున్న మంచమునకుఁ గాల్క్రిందనున్న పీఠముఁ జూచియుఁ, దలయంపి
చెంతనున్న పీఠముపైఁ గూరుచుండి, యతండు నిదుర మేల్కాంచునం
దాక వేచియుందునని కావలయు, మిన్నకుండెను.

నగరమధ్యముననున్న గరుడధ్వజమునకుఁ బ్రదక్షిణ నమస్కా-
రములొనర్చి పదంపడి తనరథము నధిరోహించి, యరదముఁ బోనిచ్చి,

నగరివాకిటఁ దనవాహనముడిగ్గి, పుండరీకాక్షు మందిరద్వారమునకు నమస్కరించి, దౌవారికునిచే దుర్యోధనాగమన మెఱిఁగి, కక్ష్యాంతరములు దాటిదాటి, కృష్ణునిశయనాగారము ప్రవేశించి, మొదటఁ బీఠోపవిష్టుండగు దుర్యోధనునిఁ, దరువాతఁ గృష్ణుని శిరోభాగంబునను, బిమ్మట రుక్మిణీకాంతునికాళ్లకడ నుండిన యనర్ఘమణిఖచిత పీఠమునుఁ జూచి మెలమెల్లనఁ బదములిడుచు నటకేగి యించుక తడ వట నిలిచి, తనమనమునఁ గృష్ణుం గీర్తించుచు, మోడ్పుంగేలుదోయితో శ్రీకృష్ణునిముఖారవిందమె చూచుచుండ, దేవకీనందనుండు మేల్కాంచి కన్నులు విప్పినంతనె తనదృష్టింబడిన విజయుంజూచి, పదంపడి తన శిరోభాగపు దెసఁగూరుచుండిన వానిం గుఱుతించి, చప్పున లేచి కూరుచుండెను. 'ఎపుడునిదుర మేల్కాంచు నీయదుపుంగవుం'డని వేచియున్న దుర్యోధనునాననపుటారాటము ద్విగుణీకృతమయ్యె ననుట కేమి సందేహము కలదు! నిదుర మేల్కాంచి కృష్ణుఁడు కన్నులు విప్పినంతఁ బార్థుఁ డయ్యాదవకుల జలధికౌస్తుభమగు కౌస్తుభలాంఛనుని పాదముల దక్కున నట్టెనిలిచి, కనికరమ్మును, రాజనీతియు నొకవంకను, విజ్ఞానమును, యోగేశ్వరేశ్వరతా సూచకంబగు ననాసక్తతయు మఱియొకవంకను, వెదచల్లుచుండు విశాలపుండరీకలోచనములును, లోచనాంతములనంటి శ్రీకారములంబోలు వీనులును, వీనులమీఁద నుండి నునుఁజెక్కుటద్దములపైఁ జిందులాడుచుఁ బ్రతిబింబించు మణికుండలద్వయాధాళధళ్యమును, దొలుకాఱు మబ్బునా వెలయు కోమలశ్యామల శరీరకాంతియుఁగల ప్రద్యుమ్నునికన్నతండ్రిం దన కన్నుల కరవుదీఱఁ గాంచి, "కాళీయుని ఫణాగ్రములఁ దాండవంబాడి, మున్ను బలిచక్రవర్తి నవరత్నఖచిత కిరీటముపైఁ గొంతతడవు విడిసి, సకలజగత్పావన కారణమగు వియద్గంగకు జన్మస్థానమగు నీ పాదరాజీవంబుల కివె నమస్కరింతు" నని యంబుజోదరుముఖారవిందము

గాంచి తనకరాబ్జములతో, శ్రీకృష్ణుని పదాబ్జములకు మనఃపూర్వక ప్రణామంబు లాచరించి మానసికధ్యానంబు నేయుచు నిలచియుండెను.

నిద్రమేల్కాంచిన దృష్టినే ధనంజయ దుర్యోధనులఁ గ్రమంబునఁ జూచిన కృష్ణుఁడు, "ఏమిది— త్రోవదప్పివచ్చితిరే! చిరకాలంబునకు మీసందర్శనలాభంబు నడసితి. ఏదేనిమహాకార్యాం బుండనిచో మహాత్ములరగు మీ రూరకరారు. కావున మీకార్యం బెఱింగించి నన్నుఁ గృతకృత్యుం గావింపుఁ" డని పలికెను.

దుర్యో:— యదునందనా, కౌరవ పాండవయుద్ధమున మే మిరువురము నీ సహాయ మభ్యర్థింప వచ్చితిమి. మేమును వారును స్నేహ బాంధవముల నీకు సమానులము. కావున నిను సాయ మొసర్పఁగోరి నిను సందర్శింపవచ్చుట యబ్బురముకాదు. సుజనులు మున్ముందుఁ గాంచినవారి నే ప్రసాదం మట సుప్రసిద్ధము: అం దీవు సౌజన్యసారయుతుండవు. అట్లగుట మొదట నినుఁ గానవచ్చిన వాని కీవు తోడుగావలయునని కోరుచున్నాను.

కృష్ణుఁడు:— (కొంచెము స్మృతి నభినయించి ప్రకాశముగా) బావా! నీ చెప్పినయది నిక్కము. నన్ను మొదటఁ జూడ వచ్చినది నీవ యయ్యును, నేను మొదటఁజూచినదియర్జునుం గాని నిన్నుకాదు. నీ చెప్పినయ శ్లోకార్థులై వచ్చిన మీ యిద్దఱకును సమానముగ సాదరంబుగ సాయమొసంగవలెఁ గావున మీ కోరికలెట్లో యట్ల నెరవేర్పఁగలను. నాతో సమానులును, నాచే శిక్షనొందినవారును, సంగర పాండితీ మహిమాన్వితులును, చాపాద్యాయుధ కళావిశారదులును, నగు పదవేలమందినారాయణగోపాలు రను కంచురథాల వా రొకయెత్తును, నిరాయుధుండనై, పరమాప్తుండనై, యూరక నిలుచు నే నొకయెత్తును నై యున్నారము. ఇందెవరి కేవంతు

కావలసిన, వారద్దానింగైకొనఁదగుంగాని మీ యిరువురలోఁ దొలుదొల్త నెంచికొనుటకుఁ గొండికకే యర్హత కలదు.

ఫల్గునా, మీయిరువురలో నీవు చిఱుతవాఁడవు గావున మొట్టమొదట నీవే నీ యిష్టమువచ్చిన వంతుఁ దీసికొనుము.

అర్జు:— నేను నిన్నే కోరుకొందును.

ఈ ప్రత్యుత్తరము విజయుముఖమునుండి వెలువడుటయె తడవుగఁ బెన్నిధిఁగన్న పేదవిధాన, పదివేవురు కంచురథాలినారాయణగోపాలుర బలంబులఁ గైకొని దుర్యోధనుఁడు, “బావా! నా యాప్సితంబు గుర్తించితివో—యన నెఱిఁగి యెఱిఁగి నా కోరిన సేనయే నాకుఁ దక్కునట్లు చేసిన నీ ప్రేమకు నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. నీ నారాయణగోపాలుర కిపుడె యాజ్ఞ యొసఁగి నా రాజధాని కనుపుము. సెలవొసఁగి నన్ననుపుము.” అనిదుర్యోధనుఁడారంగము వీడి వెడలిపోయెను.

* * * *

కృష్ణు:— పార్థా, కోదండపాండితీ మహిమాన్వితులై సంగ్రామారంభ శీలురగు నారాయణగోపాలుర దుర్యోధనుఁడు దృప్తిమెయిఁ గైకొన, నిరాయుధుండనై సంగరారంభ రహితుండనగు నన్నుఁ గోరుకొనుట నీ కేమి ప్రయోజనకారి యని యనుకొంటివి ?

అర్జు:— యుద్ధమునకు నేను సహాయముకోరను. సుప్రసిద్ధుండవగు నీవే సమర మొనర్చినచో, యుద్ధమున నేనెంత శ్రమించినను పేరును బ్రతిష్ఠయు నీవియ యగును. మఱియు నీకుఁ బ్రతిపక్షమూని జయంబుగొనుట దురూహ్యమగుటను, విజయమునకు నీవు మూల మగుటను, నిన్నే కోరుకొంటిని. కావున నపార కృపామతితో నా కీవు సారథ్యంబొనరించుచు, నన్నుఁగాపాడుచు,

నాకు జయము సమకూడఁజేయుము. చిరకాలమునుండి నీ సారథ్య గౌరవము నేను పొందఁగోరి, కోరికోరి నిన్నిపుడు వేడుచున్నాను.

కృష్ణుఁడు — అర్జునా! నీ యభీష్టము నెరవేర్చుటయే నాకు విధ్యుక్త కార్యము గావున నీకు సారథ్యం బొసఁగించి, అసమయుద్ధక్రీడను నీకుఁ బరమాప్తుఁడనై యుందును.

అర్జు — యదుకులభూషణా! నాకీ వరమె చాలును. ఈ వరమె మహాపదివేవురు నారాయణగోపాలుర బలమును కౌరవ సేనావారమును బోసిరాజునుఁజేయఁగల దను దృఢవిశ్వాసము నాకుఁగలదు.

ఇఁక మనమిపవ్వురమును ధర్మజు వాలికింబోవలయు. నిను దోడుకొని రమ్మని నాకుఁగట్టడిసేసి యుధిష్ఠిరుఁడు నన్నిటకుఁ బుత్తెంచెను గావున నీవును నేఁడే నాతోఁ బయనము కమ్మని ప్రార్థించుచున్నాను.

అంతఁగృష్ణుండును నర్జునునితోఁ [illegible] బయనపు సన్నాహము సేయఁ దొడంగెను.

* * * *

## సింహావలోకనము

సెబాసునోయీ కృష్ణా! ఏకక్రియాద్వ్యర్థకరీ బభూవ — యను నార్యోక్తిని నీ యొనర్చిన కార్యమున నొప్పించితివోయి! నీకడ కరుదెంచిన వారిరువురును నేక కార్యార్థులనుమాట సత్యమె యగును. అందుఁ దొలి మర్యాదనుఁజే నినుఁజూడ, వచ్చె ననుమాటయు నసత్యముకాదు. మొదట నీ సహాయము కోఱకు నోరు దెఱచి

నిన్నడిగినది దుర్యోధనుఁడై యుండ, 'నర్జునునే తొలిదొలి చూచితి నను సమయస్ఫూర్తి నెగడఁ జేసితివి. అర్జునునకు స్వయముగ నీవే సాహాయ్యముసేయ నీ మనమున నిశ్చయించియే కావలయు, దుర్యోధనుఁడు పశుబలమువంటి బాహుబలము పై నాధారపడువాఁడని యెంత కాలమునుండి గుర్తించితివో కాని, నీ వ్యక్తిబలమును, నీ నారాయణ గోపాలురబలమును సమానమగుపంతు లని దుర్యోధనుని మానసమున కెక్కించి, నిన్నెవరు గోరుకొన్నను,-నిరాయుధుండనై, యనుపమానప్రేమతోఁ బరమాప్తుండనై "యూరక నిలుతు" నని బాహుబలముపై నెల్లయెడల నాధారపడియుండుదుర్యోధనునకు, నీ వ్యక్తిసహాయ మనుపయోగమని తోచుతెఱంగున సంభాషించితివి! అంతతోనాగక, నీవు వేసిన రెండుపంతులలో, నీ 'వ్యక్తి' యనుపంతును దుర్యోధనుఁడు గోరుకొనఁడని నీ వెఱింగియు, నవకాశమేల నొసంగవలయునని యెంచికానోపు, పంతుల నెంచికొని యెత్తికొనుటలోన 'చిన్నవాఁడే మొదట నెంచికొనవలె' నను ధర్మసూక్ష్మము వెదకినావు.

నారాయణ గోపాలురతో దుర్యోధనుఁడు మరలిన పిదప నీవర్జునుం జూచి, 'నిరాయుధుండ నగు నన్నేల గోరికొంటివి? కోదండపాండితీమహిమాన్వితులగు నారాయణగోపాలుర దుర్యోధనుఁడు గోరికొనెనే' యని బావమరదితో హాస్యములుపలికి, నీ నిరాయుధత్వమునకుంగల కారణములను నీమనసున నునిచికొనియే పరిహాసములాడితివి ! ఎంత సమయస్ఫూర్తితో నట్లంటివో కాని మఱి వెల్లడించి నావు కావు. కాని నీవే చక్రముపట్టి పాండుసుతులపక్షము వహింతువేని యెన్ని చిక్కులు తటస్థించునో, నీవుమాత్ర మెఱుంగవుగనుకనా! చక్రపాణివై నీవే పాండవపక్షమునఁ బోరఁదలపడుదువేని దుర్యోధనునకు గదావిద్యయందాచార్యుండును, తన శిష్యులందఱిలో దుర్యోధనునందు ప్రత్యేకపుటభిమానముగలవాఁడును, నీయన్నయు నగు

బలరాముండు తన హలమునుబూని ధార్తరాష్ట్రుల పక్షమునఁ బోర సిద్ధపడెననియు, దస్మాలమున మీ యన్నదమ్ము లిరువురకును యుద్ధము సభ్యర్థించినవాఁడవగుదు వనియు, సయ్యది లోకమునకు దుష్టమగు నుదాహరణ మగునుగదా యనియు, నింతవరకును జరిగిన కార్యకలాపమును, గురుపాండవవివాదములో నీవు జోక్యముకలుగఁ జేసికొనినప్రకారమును, నీజనకుండగు వసుదేవున కిష్టములేకుండుట నీ వెఱుంగుటకుఁదోడు ప్రద్యుమ్నాదులగు నీ కుమారవర్గముఁ గూడ నిను సేవగించునో కా యనియు, శంకించియు నిరాయుధుండనయి యుందునని యనియుందువు. మఱియు నీ వాయుధపాణివైనచోఁ దా నెంతదూరము నైతికపరుండయినను, విదురుం డూరకుండక కౌరవపక్షమున నిలువనట్టకమానండనియుంగూడ దలంచియుందువు. మాండవ్యశాపమువలన యముఁడే విదురుండయి జన్మించె ననియు, నట్టి—విదురుండే విలు వట్టిన నిక నాతని కెదురే— యనియు నీ వెఱుంగుదువు. యముఁడే సమరమునకు బూనెనేని సర్వమును నాశనమగునుగదా యని కూడ మదిం దలంచి యుందువు! అట్లు జరిగియుండెనేని అపుడు కురుపాండవయుద్ధముకాక, కురు పాంచాల యుద్ధమును గాక, కృష్ణబలరామయుద్ధమును, కృష్ణ విదుర యుద్ధమును నయి, అట్టియుద్ధమున నీవు ప్రత్యేకముగ గుర్తింప బడవలసివచ్చునుగదా యని, నీవు 'నిరస్త్రపాణివై యుండు' నని యని యుందువు. నీవు కురుపాండవసమరమునఁ జేయిచేసికొనినచో, బల రాముండును నీ యనిమొన నిలువకపోవు ననియుఁ దలంచియుందువు. నీ నస్త్రముఁబూనకున్న విదురుండును నెప్పటియట్లు నీవలనిమైత్రియు నీయెడ భక్తియుఁజూపుచుండుఁగదా యనియు, దస్మాలమున గౌరవ పక్షపురహస్యములును విశేషములును దెలిసికొనుచుఁ గథాక్రమము నడపింపవచ్చును గదా యనియు నెంచియుందువు కావలయు. శాపము వలన నొకరును, అంశవలన నింకొకరును, క్రమముగాఁ దండ్రి

కుమారు లగుట పరస్పరము తెలియకున్నను, విదుర ధర్మజులు, యమ యమనందును లయి, పుత్రప్రేమయు పితృగౌరవమును పొందియుండుటను, దొలినుండియు ధర్మజాదులయెడఁ గల ప్రేమచే వారి నరసి రక్షించుచున్న విదురుని సాహాయ్య మేలగోలుపోవలె ననియు నెంచియుందువు! నీవే చక్రము వట్టినచో, యాదవులు నీపైఁ బగబూనుదు రనియుంగూడ దలంచియుందువు. ఔరా! ఎంత ప్రతిభాశాలివి! ప్రథమసోపానముననే యింతలు సేయఁ గలిగిన నీ చేతలయం దిమిడియున్న యంతర్భావములను పామరులమగు, మేము గ్రహింపఁగలమా! నీ యంతర్భావములును, నీ సంకల్పములును, నీ సంకల్పములకుఁ గలకారణములును మానవదుర్భేద్యములౌట, మేము దెలిసికొనఁజాలని సందర్భములపట్ల నీచేతలు భగవంతునిచేతలుగాఁ దలంచుటయం దసంగత మేమున్నది? మా కన్నులె కొలబద్దలుగను, మా మనములె కొలపాత్రలుగను, గల మేము నీ యొనర్చు కార్యములును నీ సంకల్పకారణములును దెలిసికొనఁజాలని తరుణము లసంఖ్యాకము లైనపుడు నినుఁ దలంచినపుడెల్ల నొకయెడ నీవే భగవంతుండవనియు, నింకొకయెడ, నీవు భగవదవతారంబవనియు, మే మెన్నుచుండుట యెట్లసంగతము కాఁగలదు!

దుర్యోధనుఁడు కోరినది దుర్యోధనునకును, అర్జునుఁడు కోరినది యర్జునునకును నొసంగి, తన్మూలమున నీ భావికార్యములకెల్లఁ ద్రోవలఁ దీర్చికొంటివి. ఇట్లొక్క కార్యమువలననే రెండు ఫలములనేకముహూర్తమున నొందఁగల బుద్ధి బలము నీ పిననాఁట నుండియుఁ బ్రదర్శిత మగుచునేయున్నది! ఎప్పటి కప్పుడు ప్రమాదము రానీయకుండ నుక్తిపై నుక్తిబన్నుచు మంత్రరక్షణకళచేఁ బరిస్థితులఁ ద్రిప్పఁ గల ప్రతిభాశాలిని నాఁటికిని నేఁటికినింగూడ నినుదక్క నింకొకనిని మరి కానను!

# రాయబారము

## నాలవ ప్రకరణము.

(i) మార్గమధ్యమున దుర్యోధనుఁడు బలరాముఁగలసి సంభాషించుట-పాండవ పక్షమునఁ జేరిన కృష్ణునిఁగూర్చి బలరాము నభిప్రాయము-ధర్మజుదర్శనార్థమై పోవుచున్న శల్యుని మార్గమధ్యమునఁ గలసి, దుర్యోధనుఁడు శల్యుసహాయలాభము వంచనమెయి నొంది కరినగరముఁ జేరుట.

ద్రుపదపురోహితుఁ డానాఁడే కురుపతిసభకు రాయబారిగఁ బంపఁబడియెను. మఱియు శల్య, కేకయ, ధృష్టకేతు, సహదేవాద భూపతుల కడకును వారి వారి సాహాయ్యముఁ గోరుచుఁ బాండవాగ్రజుండు దూతల నంపియే యుండెను.

సాహాయ్యముఁగోరుచు శ్రీకృష్ణునిదర్శింపనేగిన దుర్యోధనుఁడు తనకుఁ గృష్ణుఁ డొసంగిన యా పదివేల కంచురథాలవారినిఁ గరి నగరమున కనిపి, మార్గమధ్యంబున బలరాముంగలసికొని మ్రొక్క బలరాముండును దనప్రియశిష్యు నాశీర్వదించి, సేమంబడిగి తెలిసికొనెను. అనంతరము కానయియున్న కురుపాండవసమరమున బలరాముని సహాయము దుర్యోధనుఁ డభ్యర్థించెను.

బలరాముఁడు:—సుయోధనా, అభిమన్యు, వివాహమునకుఁ బ్రభు వర్గంబెల్లఁగూడంబడియుండ,నాసభను నీకొఱకే నేమిపలికితినో ఏమి మాటలు వచ్చిన్నవో, మీకరినగరమున నాడుకొనలేదే! నీవు వినలేదే! పాండవపక్షపాతంబునఁ బ్రతికూలవచనంబులు పలికినకొండలు నా పలుకుల కసహ్యాపడుటయు, నయ్యావి

కృష్ణునకుఁ బ్రియంబులై యుండుటయుం బొసఁగినది. కృష్ణుని బాసి యే నొక్క నిముసమును నుండఁజాలమియు, నాతనితో విరసంపుమాటలు వలుకఁజాలమియు, నేనేమియు ననఁజాలక ఒకనిశ్చయమ్మున నుంటిని. మీరును వారును జలమునఁ బోరిన నం బెద్ది యెటులైనను నేనూరకయుండ నిశ్చయించితిని. అట్లగుట నే నెరికిని సాయ మొసఁగఁ జాలను. నాయట్లే కృష్ణునిపుత్రులగు ప్రద్యుమ్నాదులును దటస్థభావము నూని యున్నారు. ఇఁక మజ్జనకుండగు వసుదేవుం డేమనునో!
అట్లగుట దుర్యోధనా, నీ ప్రయత్నమున నీవుండ నగును.
అని బలరాముం డాతనికి దీవెనలిడి యంపివేసెను.

దుర్యోధనుం డాతనికడ సెలవుఁగైకొని, ధర్మజుని కోరిక చొప్పున నాతనిఁ జూడవచ్చుచుండిన శల్యభూకాంతుని మార్గ మధ్యమునఁ జూచి తొలుతఁ దానే యాతని సహాయ మభ్యర్థింప, నెంచి, యాతఁడు విడిసియుండు తావుల వసతులన్ని సదుపాయముల సన్నాహంబున సన్నాహపఱచుచు, సుప్రసంగవశమున నిపుడుజరుగఁబోవు కౌరవ పాండవయుద్ధమునఁ దనకు సమాత్యుండయి, వాహినీపతియై, సమర సారథ్యంబొనరుచు సహాయ సంపద నాతనినోటఁ దొలుదొల్త వాగ్దాన రూపంబునఁ దాఁబడసి, తనతోఁ గరినగరంబున కరుదేరఁ గోర, శల్యుండును బాంధవులం జూచి మరలివచ్చి తన్నుఁ [దుర్యోధనుని] జేరుదుననియు నాతని కోరిక కొప్పుకొంటిననియుఁ దుర్యోధనునకుఁ దెలిపి, శల్యుం డుపప్లావ్యంబునకుఁ జనియెను.

దుర్యోధనుండును, దాఁజూడఁ దలంచిన రాజులఁ జూచియు, వారి వారి సాహాయ్యము నొందియు, హాస్తిపురిం జేరుకొనియెను.

శల్యుండును బయనంబు సాగించి, ధర్మరాజాదు లున్న తావునకుఁ జేరుకొనియెను.

*  *  *  *

## నాలవ ప్రకరణము

### ( ii )

(ii) శల్యుఁడు ధర్మజుని దర్శించుట:—ధర్మాధర్మ విచక్షణులఁ జూపు వారిసంభావన-ధర్మజుఁడు శల్యసహాయ మభ్యర్థించి, చేయు ప్రసంగఫణితి-శల్యుని వాగ్దానము-శల్యుని తాత్కాలికపు మానసిక తత్వవిచారము-అధర్మములుగఁ దోఁచిదోఁపఁజేసి యనంతరము ధర్మములై నెగడు కార్యముల విపులచర్చ-కార్యాకార్య నిరూపణము-ధర్మజుశీల విమర్శనము.

అదివఱకే పాండవపక్షముం జేరుకొనియుండిన చమూ సమూహములనెల్ల నుల్లమలరఁ గాంచి, శల్యధరణీపతి, ధర్మనందనుని యావాసంబున కరుగఁ నట నీ శల్యుని కొఱ కెదురు సూచుచుండిన ధర్మజుండును, దన భ్రాతృవర్గంబును, ద్రౌపదీ సుభద్రలును, నభిమన్యు ప్రభృతి పుత్రసంతానమును దోడురా, నెదురేగి శల్యు నాలింగన పూర్వక గౌరవంబుల సంతుష్టాంతరంగుంగా నొనరించి యర్ఘ్యపాద్యాది సత్కారంబుల నాతని హృదయంబు పల్లవింపంజేయ నాతండును బునరాలింగనంబుఁ జేసి, యన్యోన్య మర్యాదలం దీర్చికొనిన పిదప ధర్మజుండు శల్యుని కుశలంబడిగి యాతని సముచితాసనంబున నుపవిష్టుం జేసెను.

శల్యుఁడు—ధరణియు రాజ్యముపీడి భార్యయు ననుజన్ములును, మీరలును, నీయడవులఁ గడు నిడుమలువడితిరి. అంతకంటెను ఘోరతర కష్టమౌ నజ్ఞాత వాసముఁ గూడ ననుభవించితిరి.

ఇన్ని కష్టములఁబడియైన జూదమునాఁటి పందెపు నియమముల జయప్రదముగ నిర్వర్తించుకొనఁ గలుగుటకు, మీధైర్యసూనృతాదులును, సద్ధర్మాచరణ శీలమును, దేవల మానుష శక్తియొల్లక కారణకార్యసంబంధమున లెనుండు దైవమానుషముల రెంటనునాద్రప్రవర్తించుమీసుస్వభావమును గారణములు కావలయు. కౌరవులింతనుక మిముఁబెట్టిన బాధలకును, వారి మూలమున మీరు పొందిన మీ మానసపుకష్టమ్ములకును, నీ లోకము నారెల్లరును గమనించిరి. ఎంతవారికిని విధిప్రేరణ యనుల్లంఘనీయమగుట మీరలింపేలువడుట తటస్థించనది.

మీ దూత నన్నుఁ బిలిచినపిదప మిముఁజూడ నే నేతెంచుచుండ మార్గమధ్యమున దుర్యోధనుండు నన్నుఁ గలిసికొని, తాను పాండుసుతులతోఁ బోరుట సిద్ధమయ్యె ననియుఁ దనకు నే నమాత్యుఁడుగా చమూపతిగా సమర సారథిగా నుండఁగోరి, నావలన వాగ్దానంబునొంద, తనతోడన నిభపురమున కిపుడే రమ్మనికోర, మిముఁ జూచివత్తునని ప్రత్యుత్తరంబిచ్చి వచ్చి మిముఁ జూడఁగంటి.

దుర్భరమగు కష్టపరంపర లనుభవించిన మిమ్మిపుడు గనుంగొని నా మనసు గలఁక దేఱినది.

అని వారియెడ నా శల్యుఁడు తన సానుభూతి నెఱపెను.

ధర్మరాజు:—మంచిపని చేసితిరి. ఒకరినిమెచ్చి వారికోర్కెఁ దీర్చుట పెద్దలగువారికి సహజగుణము కదా! ఇట్టి మీ మహోదాత్త గుణమున కెంతేని హర్షమొంది మీ కడ నొక్కటి వేడసాహసించుచున్నందులకు నను క్షమియింపఁగల కర్తలు.

మీఫల్గునునకుఁ గృష్ణుఁడు సారథ్యంబు సేయనున్నాఁడు. కర్ణుఁడు ఫల్గునుతో నెల్లప్పుడును మచ్చరించుచుండును. కర్ణార్జునులకు సంగరంబు జరుగుచున్నప్పుడు కృష్ణునకుఁ బ్రతి సారథ్యం బొనరుపఁ గౌరవపక్షంబునఁ దమరుదక్క నింకొకరు సమర్థులు లేకుంటఁ గర్ణునికొఱకు సారథ్యంబు మీకవశ్యంబు ననివార్యంబు నగును. కావునఁ దాము తప్పక యీ కార్యమున కొల్లమింజూపక, సమర సమయంబున సారథ్యంబుఁ బూనుటకు ముందు నిరాకరించి పలికి, కర్ణుచిత్తంబునకుఁ జాంచల్యంబు కలుగఁజేసి, మీ పలుకులఁ గలఁక పుట్టించి కర్ణుని తేజంబు దూలఁజేసి మా పార్థునకుఁ బరిరక్షనొసంగఁ బ్రార్థించుచున్నాను. ఇయ్యది యకృతంబని యనుమానింపక, మానసంబున నెవ్వగనొందక, నా ప్రార్థనం బెల్లవిధంబుల ననుష్ఠింపవలయు. ఇంతమాత్రంబు తా మొనర్చిన నయ్యది పాండుసుతులకు విజయసూచకంబ యగును.

శల్యుఁడు:—ధర్మనందనా, గాంధారీనందనుఁడు నను నమాత్యుఁగా నుండుమనిమె; సేనానేతగా నుండు మనిమె; సమర సారథ్యంబొనరింపు మనిమె; అంతియేకాని సూతపుత్రునకు సారథివి కమ్మని కోరియుండలేదే! ఆతఁడు సమరసారథి యని యనియెనేకాని, రథికుని పేరుజెప్పి నన్నాతనికి సారథి కమ్మని చెప్పియుండ లేదే. నాసాయము కోరుట సూతపుత్రు సారథ్యమునకా? నాయట్టి వానికిఁ దగని సారథ్యము వహియింపు మనుట కాతనికి నోరెట్లాడును?

ధర్మ:—ఆతనికి నోరెట్లాడుననియా తమకుఁగల సందేహము? నన్నుఁ జూడవచ్చియుండిన తమకు మార్గమధ్యంబున పథికశ్రమంబు వాపఁదగిన సకల సౌకర్యములు నేర్పరించి, తమయుల్ల మల

రించి, నాకన్నమున్న తమసహాయ వాగ్దానము నైకొన్న యా వంచకుని సాహసమునకుఁ దామాశ్చర్యము నొందజాల రేని, అంతటి సాహసునకు నోరెత్తుటకు నని తాము దలంప నక్కఱలేదు. వంచనాన్వితముకాని కార్యములుగాని, వంచన మిశ్రితముకాని పలుకుగాని, యూహింపఁ దగదు. ఇఁక సమా త్ములను కంపెని తమ్ముఁ దొలుదొలుత గోరుట నభ్యభినం దించుటయే యగును. పవస సేనాసేనలు కంపెని యేపుగుట, తమ యుద్ధమై పుణ్యముఁ గొనివచ్చుటయు యగును. పవంపడి సమర సారథ్యంబొనరుపఁ గోరుట యుద్ధరంగ మంతయును నడుపుమని తమ్ముఁ గోరుటకాదు. ఒక రథికునకు సారథ్యం బొనరుపఁ గోరుటగాక యింకొకటి కాఁజాలదు.

ఇఁకఁ గర్ణార్జునులే ప్రధాన వీరులును, తొలినుండియును మచ్చరము పెరిగియున్నవారలును నయియున్నారలు. అర్జును నిర్జించుటకే కర్ణుని దగ్గఱఁ జేర్చికొని నాఁడు దుర్యోధనుఁడు. అర్జునునకుఁగల యన్నిలాంఛనములును, సౌకర్యములును, కర్ణునకుఁగూడ లేనియెడఁ బ్రతియోధుని మహత్త్వమునకు లోపము కలుగును. అందును శ్రీకృష్ణ సారథ్యంబునకుఁ దుల్య సారథ్యంబు శల్యసారథ్యంబయగుట మిముఁగర్ణునకే సారథ్యం బొనరుపఁ నాతఁడుగోరుట తప్పదుగనుక తప్పక కర్ణునకు మీ సారథ్యంబె కర్తవ్యంబయగును. కావున మద్రదేశాధీశుఁడనగు న న్నొక సూతపుత్రునకా సారథ్యంబు సేయఁగోరుట యని మీ మానసమున నెంచక, మీ మనసు నెట్లయిన యొప్పించుకొని, వశీకృత చిత్తముతోఁ బ్రకాశముగాఁ దొలుత నిరాకరించి పలికియు, నవల నెట్లో యొడంబడినట్లు నటియించి, కర్ణునకు సారథ్యం బొనరింపుఁడు. రథారోహణ మొనర్చినది మొదలు

కర్ణుని కఠోరవాక్యములచే ధృతిదూలఁజేయుచు సారథ్యంబు నెఱపెనచో, దుర్యోధను కోరికప్రకార మాతనికిని, నా ప్రార్థనము చొప్పున నాకునుంగూడఁ దాము సాహాయ్య మొనర్చిన వా రగుదురు. మా పార్థుని బరిరక్షణ మొనర్చిన వారునుంగూడ నగుదురు. అట్లగుట నెల్లవిధంబులఁ గర్ణునకు సారథ్యంబొనర్చుటయె కర్తవ్యంబగును.

శల్యుఁడు—దుర్యోధనున కేను సాయపడెద నని తొలుత ననుటను నాతని కోర్కె దీర్పవలయును.

మీ రంపిన దూత చెప్పిన చొప్పున మిము సందర్శింప వచ్చుచుండిన నన్ను మార్గమధ్యంబునఁ దన యొనర్చిన నదుపాయములచే నీవ కా యని తోఁపఁజేసి, వంచనమెయి నా వలన సాహాయ్యవాగ్దానముం గొనుటను, నిట్టి సాహాయ్యమే చేయవలయును. పిన్నపెద్దల తారతమ్యము తెలియంగ నెంచక, సూతపుత్రునకే ననుసారథ్యం బొనరుపఁ గోరెనేని, తాఁ గోరినయట్లు సూత సారథ్యంబొనర్చుచు, నిజానకు నర్జునుం గాచు తెఱంగారయుదు. మహాహవసమయమునఁ గటువాక్కులచే నా దుర్నయవిచారుమనసు కలఁచి కలఁచి, కర్ణునకుఁగల దర్పమును, తేజమును, మానితొలంగు నట్లొర్చి వివిధభంగుల నాతని నోనాడుచు, నా పలుకులచే నేమి సేయుటకును దనకుఁ జేతులాడకున్నతఱిఁ గర్ణు నర్జునుండు తన తీవ్రబాణ పరంపరల పాలుపఱిచి, నిర్జించు.

యమనందనా, ఇదియొకటియే యననేల? మీ మనసునఁ గలదేది చేయుమనికోరిన నయ్యది చేయఁబూనితిని. అలనాటి జూదమున నీ సూతసూతి, యనార్యనిరీతి, మిము సభనాడిన యవినీతికి, నందఱ హృదయములును గడునొచ్చియుంట మీ

కేవిధానమైన మేలొనఁగూర్పనిశ్చయించితిమి. ఎంతెంత యవినీతులకైన మీ కోర్కి, దుర్యోధనుఁ డెంతవవరించను! మీరది సైఁచి యూతఁడు మిముఁ బెట్టిన యట్టుల కెల్లఁ బ్రతిక్రియ సేయఁజాలియుండియు, మీరలు శాంతయుక్తులై సైరణ సేయుటం జేసి, మీ పడిన యూపద లెవ్వరి నొవ్వఁ జేయవు! నిర్బంధమును, దుర్మార్గంబును, ప్రధానగుణములుగాఁగల యవియవినీతిపరుండగు దుర్యోధనుని చేత నేరికిమాత్ర మేవగింపఁ జేయకుండును! అట్లయ్యును, నిట్టి బన్నముల నడిలితిమే యని మీరలు మఱి చిత్తమునందెన్నక, మనమున వగవక, మానసంబున గ్రిందుపడక, కర్తవ్యంబునడపఁ జూచుఁడు. నాథవుండే కలఁడని నమ్మిన మీ మనోరథమ్ము ఫలమ్ము నొందక నమ్మకాఁజాలదు. దేవస్త్రీలను మెచ్చుసంతోదారము మీ ప్రశాంత ప్రవర్తన ప్రకారము ప్రకాశింపఁజేసితిరి. ఇంకేమి సేయవలయు! మఱియెంతకును బశ్చాత్తాపముదయింపఁ జాలని యయోమయహృదయుండగు నా సుయోధనునెడ వెనుక ముందు లాలోచింపనీకఁ బనిలేదు. సమయము దప్పివచ్చిన దేవతలైనను జిక్కువడి యాపదలం బొదలిన కథ లెన్నేని కలవు. ధైర్యము చిక్కఁబట్టి, దైవముపై భారముంచి యొనర్చుచున్న మీ యుద్యోగమున మీకు జయశ్రీ లభియింపఁ గలదు.

ధర్మ:—మద్రభూకాంత! భవ్యభవదీయ భాషణ శ్రవణంబున చిత్తంబు కలంక దేఱె.

అని ధర్మజుండు పలికి మద్రపతికి సముచితంబులగు మజ్జన భోజనాదుల నేర్పఱచి, కొంతవడి విశ్రాంతి చేసినపిదప శల్యుండు పయనంబున కాయత్తపడుచుండ మఱల యుధిష్ఠిరుండు—"మీరలు రాధేయుఁ

బలుకుట మఱువరాదుసుడీ మముఁదలఁచినైన—'' నని శల్యునికి సూచించెను.

శల్యుండును ధర్మజుంజూచి; ''యట్ల చేయుదు; సంశయము వల'' దని యూరడఁ బలుకఁ బరస్పరగాఢాలింగన పూర్వక మర్యాదలం జేసిన పిదప మద్రపతియుఁ గౌంతేయాగ్రజుకడ సెలవుఁ గైకొని తన బలమ్ములతో హస్తిపురమ్మునకు మరలెను.

## సింహావలోకనము

యమనందనా, నీ విపుడు శల్యునితో నెఱపిన సంభాషణపు ఔచిత్యముంగూర్చి మే మిఁకఁ బరిశీలింప వచ్చును గదా:—

"—అకృత్యంబని యనుమానింపక—, మానసంబున నెవ్వగ నొందక, నా ప్రార్థనంబెల్ల విధంబులననుష్ఠింపవలయు''నని కదా యంటివి! కావున నీకోరినయది యకార్యమని నీవయెఱుంగుదువంట నిర్వివాదాంశమె యగును. అట్లకార్యమని నీ వెఱింగియుండియు, స్వలాభాపేక్షచే శల్యునిఁ దత్కార్యమొనర్పుమని కోరియుంటివి. కావున నిప్పట్టునఁ గేవలము స్వలాభమునే చూచుకొని శల్యునాచరింపుమని కోరినది యకార్యమని యెఱింగియుండియు నీ మనమున నణుమాత్రమును ననుమానింపక యుండుటకుఁదోడు, పైపెచ్చు శల్యుండొక వేళ యీ యకార్యకరణమునకు సంశయించునేమో యని నీవు శంకించి, —యకార్యమని సంశయింపకుమా—యనికూడఁ దుద కాతనితో నంటివి! నీ వెంత నీతిమంతుఁడవో, నీ మాటవిని, యట్లే చేయుదునని తానును నీ మతము ననుసరించుటకుఁదగినకొన్ని యుపపత్తుల నేర్చి కూర్చి చర్చించి, తనయొప్పికోలు జూపిన యల శల్యుండును నంతియ నీతిమంతుఁడు గదా!

దుర్యోధనుని కోరిక మేరకు దా సమాత్యుండగుటకు శల్యుఁ డంగీకరించినను, తేని సేనల నడపుట నాతఁ డొల్లకపోవచ్చును. తొలి పలుకుఁబడి ననుసరించి చమూపతి కాయనుమతించినను సారథ్యంబునఁ గొననకపోవచ్చును. సారథ్యంబు వహించుట తప్పనిసరియయినను సూతసూతి యఱదంబు గడప నొడంబడకపోవచ్చునే గాని, ధర్మజా, నీ కుటిలపుటాలోచనయే లేకయున్నచో, రాధేయునకు రథచోదకుఁడ గుట కిష్టపడుటగాని, యిష్టపడినచో, నాతని నోనాడుచు, నాతనిఁ దేజోవీర్యహీనునిఁగఁ జేయుపలుకులు శల్యుఁడు పలుకక పోవుటగాని జరుగక పోవచ్చును.

ధర్మజా! తఱితప్పి వచ్చునందాఁక నే నీ నీతి పథక్రమంబు గాని, మీఁదుమిక్కిలి యైనచో మాత్రము, నీవు కార్యవాదివై నీ కార్యానుకూలమున కనువగు తెన్నే చూచెదవనుట నిర్వివాదాంశము సుమా! మఱియు నీవు నీ యెదిరినిఁ గృష్ణునింబోలె సంపూర్ణముగ నెఱుంగుదువు. ఎవనినిబట్టిన నీ కార్యము సానుకూల్యము కాఁగలదో, యావానిం బారపడకుండఁ జక్కఁగ గుర్తింపఁ గలవని నీ పలుకులంబట్టి తెలిసికొన వచ్చును. శల్యుని సారథిగ నుండఁ గోరినను, కర్ణునకే సారథిఁగ నుండుమని శల్యుని దుర్యోధనుఁడు కోరునని నీవు పోల్చుకొనుటయందే అపారమగు నీయనుభవజ్ఞానము వెల్లడియగుచున్నది. అందునను మద్రమహీనాథు నంతవానిని రాధేయునకు రథచోదకుఁగా నుండఁగోరు నా సుయోధనుండని యెద నెఱింగి శల్యున కయ్యది మున్ముందుగ నెఱుంగఁజేసి, తన్మూలమునఁ గర్ణుని నిస్తేజునిఁగఁ జేయ నెంచి, నీ కాయుపకార మొనర్పుమని శల్యునిఁ బ్రార్థించి యట్లొనర్ప నాతని నొడఁబఱచితివి! ఇది యంతయు నీసమయజ్ఞతాస్ఫూర్తిని వెల్లడించుచున్నదసుమా! ఇంతకును ముందుముందెన్ని విశేషములు పొడసూపునోగద!

కానున్న మహాహావమునఁ బనిసేయు వీరు లిట్టులనే ఒక్కొక్క రొక్కొక్క కారణమున నొకొక్కరిపైఁ బగసాధింపఁ బూని కార్యక్రమము నడప నెంచినపు డేకీభావము లేని కార్యంపుఁ బర్యవసాన మెట్లు యథాయథలై పోవక యుండఁ గలదు!

# రాయబారము

## ఐదవ ప్రకరణము

హస్తిపురము:—కౌరవసభ—ద్రుపదపురోహితుని రాయబారము—కౌరవ పాండవుల బలాబల నిరూపణము—సంధిప్రయత్నమునకుఁ గర్ణుని యాగ్రహము—భీష్మకర్ణుల వాక్కలహము—ధృతరాష్ట్రుని ప్రశాంత ప్రసంగము—శ్రీకృష్ణుని దర్శింప నిశ్చయము—ప్రత్యేక వార్తాహరుని—ద్రుపద పురోహితుని వాక్యములకుఁ బ్రత్యాఖ్యానము.

ఆ మరునాఁడు కౌరవేయులు నిండుకొలువున్న సమయాన, దౌవారికునిచేఁ గబురంపి, రాజాజ్ఞఁ గైకొని, ద్రుపద పురోహితుండు, ధృతరాష్ట్రుని కొలువుఁ బ్రవేశించి, కృపద్రోణ విదుర గాంగేయాది కురువృద్ధుల సముచితాసనంగని, దుర్యోధనుని సందర్శించి. సముచితాలాపంబుల నాతనిఁ బ్రసన్నచిత్తుం గావించుకొని, యంబికాతనయు నభిముఖుం జేసికొని, యఖిల సేనానాయకులఁ గలయుఁగనుంగొని, తా నరుగుదెంచిన కార్యంబుఁ దెలుపందలంచి, యిట్లుపన్యసింపఁ బ్రారంభించెను.

ద్రుపద పురోహితుఁడు:—

"ధృతరాష్ట్ర భూపతియుఁ, బాండుమహీపాలుండును, నన్నదమ్ములగుటను, ధృతరాష్ట్రుఁడు జ్యేష్ఠుండయ్యును జాత్యంధుండగుట రాజ్యపాలన కనర్హుండగుటను దొల్లి పాండుమహీపాలుండె హస్తిసామ్రాజ్యంబున కభిషిక్తుండయ్యెను. తన యన్న యందలి గౌరవము కతమునను, నభిమానంబు పెంపునను, జ్యేష్ఠుం డగు

నంబికానందనుసందె రాజ్యభారం బిడి, పాండుండె పరరాజ్యాలఁ గెల్చి, పరభూపతులకుఁ బ్రాణగొడ్డ మయి, ప్రబలియుండి, కాలవశమున మృతినొందుట నాతని యనంతర మాతని రాజ్యాధికార మాతని తనయులఁనె జెందఁదగినదగుట నిర్వివాదాంశమెకద! అట్లగుటఁ బాండవుల "కెట్టి" భూఖండ మేర్పఱుపఁబడియెనో మనమందఱ మెఱింగినదేకద! పాండవులు తమపుణ్యవశమునను నిజబాహుబలమునను, రాజసూయాది క్రతువు లొనర్చి తమ రాజ్యమును ధర్మముదప్పక పరిపాలించు కాలమున నీ ధార్తరాష్ట్రులేయుపాయములఁ బన్ని యెట్లు పాండవుల నడవులపాల్సేయ గలిగినదియు, నెంతెంత వంచనమార్గముల వారి సర్వసంపదల నపహరింపఁ గలిగినదియు, పాపము వారడవులనున్న కాలాన, వారల నెన్నెన్ని విధముల బాధించుచుఁ దమ నిర్బంధాధికార మా పాండవులయెడ నీ ధృతరాష్ట్రతనయులు ప్రవర్తిల్లఁజేసిరో, యివియన్నియుఁ దామెల్ల రెఱింగియేయుంట, మరల వానినెల్ల నే నిపుడిట నుగ్గడించుట చర్విత చర్వణమ యగును.

ఇఁక ద్రోవది నానాఁ డాసభకీడ్చుకొనివచ్చిన యవమానము పాపము పాండవు లోర్చియు, సమయంబు చొప్పున నరణ్యాజ్ఞాతవాసంబు లొనర్చికొని మగుడి వచ్చునంతలో వారి సర్వస్వము వీరలపహరించినను, ప్రజా నాశనకరమగు యుద్ధమునకుఁ బాండు తనయు లొర్వకుండుటంజేసియెఁగాని కానిచో నన్నేల నిటకు రాయబారిగఁ బంపి, సంధిక్రమం బనుసరింపఁ బ్రయత్నింతురు? సంధిపలుకుల నవలంబించిన కారణమునఁ బాండవులు కొలదులని తలంప వలనుపడదు. వారలును మీవలెనే ధర్మపరులు కానిచో, నింతకాల మీరీతిగఁ దగవు నడప నవకాశమే కలుగకుండెడిది. కాని, వీరికి బాహుబలాఢ్యులు వెనుదంపఁ గలరనియుఁ బదునొకండక్షౌహిణులబలము కలదు

గదా యనియు, వారికి బల మేదేకద యక్షౌహిణులనియుఁ దలంపఁ జూతురేని ఆవల బాహుబలవిక్రముఁడౌభీముండును, సాహసరసికాత్ముఁడౌ సాత్యకియు, వారికిఁ గలరని మీ రెఱుంగుదురా? ఆహావ పాండితీమహిమమున ననన్యసామాన్య శేముషీవంతుఁడౌ గాండీవ ధన్వుని, భండనమున నెవరొక్కండు నని యెనఁడు తలంచినను, కొండందాకినతగరు పొగరణఁగినగతియ యగునుగదా! ఆ విజయుని శరవిద్యాకౌశలముఁ బందికినై బవరము సల్పిన నాఁటి శాంబరీ భిల్లుఁడగు హరునకుఁదక్క నొరున కెట్లు తెలియుందగు? పాండవుల బలగంపుసంపద యింతతో నాగక, వివిధోపాయపరాయణుండును, శత్రుబలమును దాఁ గన్నారఁజూచినంత మాత్రమున నే కొల్లఁగొను నంత ధీమహిమాన్వితుండును, దన మంత్రశక్తిచే స్వజనమును రక్షించుట యం దెదురులేనివాఁడును, ధైర్య స్థైర్య వివేకాది సకల సుగుణోత్తరుండును, సకలకళాసందోహసంవేద్యుంపును నగు దేవకీ నందనుం డా దెసఁ బాండవుల కండయైయుండ, నింకను వారికసాధ్యం బొండుండు నే! ఇంతయుం దెలిసికొనకుండనుండుట, మనబుద్ధిమాంద్య ముగాక, యిం కేమున్నది! ఏదీ కురువీరుల యొద్దనున్న యోధవరు లలోఁ బాండుసుతులపక్షమున నున్న వెన్నున కెదిరిగ నిలువం దగిన ప్రతిభాశాలినో, బుద్ధిశాలినో, మతిశాలినో, యొక్కనిఁ జూపుఁడు; చూతము! ఇంకను సమయము మించకుండ నా పాండవేయులఁ బిలువనంపి, ఆంబికేయా, నీకును, లోకమునకును, హితమును, శ్రేయము ను నగు తెఱం గెఱింగి వారిది వారికొసంగి, మీరును మీరునుం గలసిమెలసి మనుట సమ్యగ్ జ్ఞానము గలవారి రీతియని తోఁచెడిని."

ద్రుపదపురోహితుఁ డిట్లనుట వినుచుండిన భీష్ముఁడు: —

[పురోహితు దెసం జూచుచు]

"బ్రాహ్మణోత్తమా, శ్రుతికిఁ గఠోరంబైన నగుంగాక, గాని

నీ విట్లింత శుద్ధవైదికముగాఁ బలుకుట విప్రస్వాభావికమే యైనను, నిష్పట్టున నొప్పిదమై యున్నది. ఉన్నదియున్నట్లు పలుకవలసి వచ్చినప్పు డెట్లైనను, శ్రుతికిఁబరుషము కాకతప్పదు. ఇంకను బాండు నందను లిక్కట్టుల పాల్పడకుండ, ధృతరాష్ట్ర పాండు భూపతుల వంశములు సుహృద్భావంబున క్షీరనీరంబులంబోలెఁ గలసి మెలసి హృద్యమార్గమునం జనుట లోక కళ్యాణకరము గాదె!

[ ధృతరాష్ట్రు దిక్కు మొగంబయి ]

"సంపూర్ణ విక్రమాఢ్యులయ్యును నశక్తుల చాడ్పున నీ వీడు వీడిపోయిన వారి నాఁటి దైన్యమును, నరణ్యావాసవిషాద వేదనశ్రమ మును, అజ్ఞాతవాసంపుదుఃఖమును, లోకమునకుఁ గ్రొత్త కావే! అన ఘుల నట్టెలు పెట్టఁబాడియగునే! పితృపైతామహమగుసంప్రదాజ్యము నుచితమా తెఱంగునఁ బాండుతనూజులకుంగూడఁ బంచియిచ్చి, లోక మువారలు మెచ్చునట్లు వారలంగూడ నాత్మజులంబోలె నాదరమునఁ జూడవలదా! తప్పనిసరియైనట్లు మీరలు చేయుటచేత మోమోటమి కోడి, కాదనఁజాలక, మిక్కిలి విచారముతో మీతో వాగుఁజూదమాడి, ధర్మమునకుఁ గట్టువడి, మీరొనర్చినవంచనలకు సైరణచేసిన ధర్మజు మోము జూచి విజయుఁ డోర్చెనేకాని, కానిచో, నాతని యచ్చపుఁ గిన్కకు నోర్వఁగలిగిన మెట్టిమగవారలనైన నీజగానఁగానఁగలమా!''

అని భీష్ముఁడు పాండవులదెస సానుభూతిం జూపెను.

ఆసభనదివఱకే యలంకరించియుండిన కర్ణుఁడు విని విని బలు కోపము దెచ్చుకొనినాఁడు. మొగమెఱ్ఱవారినది. భీష్ముని దిక్కు మొగమయి పలుక నారంభించినాఁడు.

— కర్ణుఁడు —

"దుర్యోధనునికొఱకు శకుని జూదంబాడి, మేదినిగెలుచుట ....., ధర్మపుత్రుం డోడుటయును జనులెల్ల రెఱుంగుదురు. ఇంత లోకపటతంబైన యీపనికై యింతగా నిన్నిసా ర్లుగ్గడింపవలయునే!

మాతండ్రి పాలం బూరఁ బంచియిమ్మని, యిట్లుశీయరితనముచేసి, తొలఁగుదుమని, యిపు డిట్లభిముఖులౌట తప్పగాని, జూదమున నోడిన వారు తత్సమయానుసారముగ నడవులకేగి సిలుగు లొందుటయం దేమితప్పగలదు ? ఇంతతో నాగక, ప్రత్యేక ప్రత్యేక కారణములు గల పాఁబగలఁ దీర్చుకొనఁ దరుణములకు వేచియున్న దుష్టాదులఁ నిపుడు దోమనేసికొని, రాజ్యలోభమున, యుద్ధమున కెత్తివచ్చి నంతమాత్రం గురుపతి వెఱచి పా లిచ్చునని తలంచు టేటితగవు?"

భీష్ముఁడు:—ఏనాఁడును నోడనిపోటుమానిసివి గనుక నింత యూఁడఁ గలిగితివి. ఇంతటిమెక్కుడుమాటలాడ వినువారలున్నవ్వొదరని యైనను నీకుఁదోపదాయెఁగా? మొనమొన్న నేకద అనన్యసామాన్య విక్రమమూర్తియగా నర్జునుం డొక్కఁడె కాదె, యల యుత్తరగోగ్రహణమున మనయూర్వ్వర నుగ్రరణాన గెల్చినది; నేఁ డిపు డిక్కడ నీరాజుకొల్వున నాఫల్గుణుని వాగ్రణమున గెల్వఁజాలుదీవు! అగు-నగు- కిరీటిని గెలువఁగలుగుట కీవె తగుదువు.

అని ధిక్కరణం బొనరించెను.

కర్ణుఁడు:—శాంతనవా, వయస్సుమీఱినకొలఁది బుద్ధియుఁ జేవ దేరునని వింటినిగాని, వయస్సుజాఱిన కొలఁది బుద్ధియుఁ గ్రమంబుగ దిగఁజారు నని నే నెఱుంగకుంటిని. నీయెడ న య్యది విపరీతమె కాకున్న, నే నన్నదేమి, నీ వనిన దేమి ? కర్ణార్జునులలో నెవ్వరుగెల్చునదియు నటుండనిచ్చి, కవ్వడి యుబ్బైనను మనకిపుడు ప్రసంగాంశమె కాలేదే! తఱచుగ మన ధృతరాష్ట్ర ధరణిపతిని,-మానవసహజమె యైనను-సుతువాఁడని మెత్తిపాడుచుందువే కాని, నీవిపుడు కూఁటికిని గుడ్డకును గురుపతిం జేరియు, రిపువాఁడవై, పాండుసుతుల బూతురీతిఁ బొగడుచున్నావు- కానిచో, మన ప్రసంగాంశము

కాని యర్జును నిర్జించుచో ప్పేల నీతలంపునకువచ్చు? వారిని, వారివారినిఁ బొగడుచు నెవరియన్నము దినెదవో, వారి యపయశస్సే కోరుచుఁ గాలముపుచ్చుట నీ వెఱింగినంత దూరము ప్రసంగశుద్ధి నీ వెఱుంగ వైతివి—

— ధృతరాష్ట్రుఁడు —

"రాధేయా! నీకెంత వయసువచ్చినను, పిన్నపెద్దల తారతమ్యము మాత్రము గుర్తింపఁజాలకున్నావు. ఇఁక నింతతో నైన నీ వీ ప్రలాపములు విరమించినచో, నింకను మిగిలియున్న మా యందఱి గౌరవములు దక్కుఁతువు. నీవు మిన్నకున్నఁ గుల వృద్ధుల గౌరవించుటయు, కౌరవగౌరవము కాపాడుటయు, నగును.

(భీష్ము నుద్దేశించి)

"శాంతనవా! మంచిచెడ్డలఁ బాటింపక ప్రసంగంబులఁ బ్రల్లదనంబులు చొరకుండఁ బ్రశంసించు నే ర్పెఱుంగని రాధేయుని మాటల నంతగాఁ బాటింపక మనప్రస్తుతాంశము విచారింతుముగాక!"

అని, రాధేయుం గినిసియు, నాపగాతనయు ననునయించియు, వారి వారి వాగ్వాదముల నప్పటి కపనయించి, ధృతరాష్ట్రుండు:

(ద్రుపదపురోహితు నుద్దేశించి),—

"భూసురాగ్రణీ, పురోహిత హితామాత్య సుహృద్బంధు జనంబులతోడ, వివేకముతో నాలోచించి, మామనోగతియుఁ గర్తవ్యమును విస్పష్టముగ ధర్మజుమ్రోలఁ బలుకుటకు సౌమ్యగుణప్రధానుఁ డొ నొక్కరునిఁ బంపి సమస్తభూప్రజకును, మాకును, వారికిని, హితకరమగు మార్గము ననుసరింప నెంతుము; గావున నీవు ముందుగ నేగుము."

అనిపలికి య ప్పురోహితునకు నమూల్యాభరణాదు లొసంగి విడెం బిడి, వీడుకో లిచ్చి, పుచ్చి, తనమంత్రివర్గములోనివాఁ డగు

సంజయుండను వానిఁ దనకొలువునకు రావించి, ధృతరాష్ట్రుండాతనితో నిట్టులఁ బ్రసంగమున కుపక్రమించెను.

— ధృతరాష్ట్రుఁడు —

"వింటివా! సంజయా, పాండుసుతు లుపప్లావ్యమునకు వచ్చి యున్నారఁట! నీవట కేగి, వాసుదేవసహితముగ వారినిఁ గలసికొని, వారి విషాదవేదన లెట్టు లడంగఁగల వట్టు వారితోఁ బలుకవలయు: మఱియు నామాటలుగా వారితో — 'మీరు వనవాసాద్యనూనసంకటంబులంబడి తుదకు సురక్షితముగ నుపప్లావ్యముఁ జేరఁగనుట విని మీయయ్య హృష్టాత్ముండయి మిమ్ముఁ జూచిరా నను మీకడ కంపె' — నని సిన్నపోయిన మొగాన ననుము."

అని సంజయుతోఁ బలికి తనకొలువున నున్నవారినిఁ జూచి—

"నాకొడుకు కార్యాకార్యజ్ఞుఁడు గామి నింతకలక గలిగెఁగాని, కాకున్నచో నార్యాలును, దృఢధైర్యాలును, రణశూర్యాలును, నగు పాండుతనూజులు దోషాన్వితు లగుదురే! మనమును, వారును, క్షీరనీరములు తెఱంగునఁ గలసిమెలసి బ్రదుకవలసినవారము కామా! వా రిషుమొఁ బడఁదగినవారు కారే! పితృభాగమేలఁ దగినవారు కారే! పాండుసుతులతోఁ గలసి జీవించుటకు మన మిష్టపడనేర మనియు, గర్వాల మనియు, మన మన్యాయపరుల మనియు నిఁక బ్రజలు మనల నమ్మనేరరు. ప్రజానురాగముఁ బాయుటకుఁ దోడు, ప్రజల విశ్వాసమునకుఁ గూడ బాహ్యమయ్యేనేని, అట్టి పరిపాలన నామమాత్రావశిష్ట మగును. నాకొడుకుల యవినీతి ప్రవర్తనకుఁ దగవునడపింప సౌమ్యుఁడౌ ధర్మజుండు గలఁడు గనుకగాని, కాకున్న నింతకుఁ బూర్వమె యెంతెంతలు పుట్టి యుండునోకద! మనము దుర్మానంబువాటించి, కూడనికార్యంబు లొనర్చి, గర్వోక్తు లాడుచు, వారి పాలు వారి కొసంగకపోయినంతమాత్రమున, మనము వారిని గెలువ

నేర్తుమె? పార్థుఁడే నిజముగ నలిగెనేని, విజయమూలకంబగు తన గాండీవంబు నారిసారించి కృష్ణునిసారథ్యంబుతో నని మొన నిల్చె నేని, త్రిజగంబులును సంక్షోభంబు నొందకుండునే! కడుభయంకరంబగు తన గదఁబూని భీముఁడు కురుకుమారవర్గముపైఁ గవియుననుమాట మనమునఁ బడియెనేని నా మేనెల్లఁ జెమ్మటలుగ్రమ్మ, కంపమొందు చుండును. నిజముగ వాని మార్కొన నాహవరంగమున నిలుచు వా రెవరు! మాద్రేయులగు కవలుమాత్రము తమయన్నలకన్న నేమితక్కువ! ద్రుపదుఁడు మాత్రమేమి మాటలఁబోయెడువాఁడె! ఆతనిపుత్రులో—బాహుబలసమన్వితులు! విరటుండును, నాతని తమ్ములును కొడుకులును అలఁతులఁబోదు రే! సాత్యకియునునలుపాలఁ బోయెడువాఁడే! వృష్ణికుమారులును, పాండ్యుండును, గేకయ పతియు, నాదిగాఁగల బంధుమిత్ర గణంబులతో నాహవరంగమున నిలిచినఁబాండవులం గెలువదలంచుట వెఱ్ఱితనముకాకయింకేమగును! సంజయా! ఉన్నదియున్నట్లు చెప్పవలసివచ్చినచో, మహావిక్రమ స్ఫూర్తిని దాల్చు భీమునకేను మనమున డింకను; మాయాకిరా తుండగు మాహేశ్వరుందూలించిన కఱ్ఱివిక్రమంబునకైనను డొంకను; సృష్టిస్థితి లయములకుం దావని యనుచున్న హరికింగూడఁగొంకను; కాని మనవారిందఱను, గెలువంగలవార మని విఱ్ఱవీఁగినను, రుద్రున కైనంగెలువరాని ధర్మపుత్త్రుని కోపమునకైన జంకవలదే!

[ఎల్లవారును వినునట్లుచ్చస్వనమున మరల ధృతరాష్ట్రుఁడు]

"సంజయా,—నీవు ధర్మజుపాలికిఁ బోయి యాతని యనుజ వర్గంబును బంధుమిత్ర గణంబులును వినునట్లు స్నేహముపాటించి, యాతనికోప మపనయించునట్లు, నాతని మనమునఁ గయ్యమను మాటయే పోవునట్లు, మాపై వ్వారి కిపుడుండిన కోపము పోవునట్లు, గడు తీయందనమునుజూపు మాటలచే నాతని నియ్యకొలిపి, నాకు వారియెడఁగల ప్రేముడియం దబద్ధములేమిం దెలిపి, గుప్తా

ర్థములుగల భావములం దెలిపి, మఱియు నీపోవుకార్యము జయప్రదముగఁ జేసికొని మరలిరమ్ము."

అని ధృతరాష్ట్రుండు పలికి రథంబెక్కి పొమ్మని సంజయుని వీడుకోలిచ్చి పుచ్చెను.

× × × ×

"ఆంబికేయా, ఏమోయి యీసాహసము! ఏమని పాండవులతోఁ బలుకుమంటివి! అచటనున్నవారి కింపుపుట్టంగ బలుకుమంటివి; నెయ్యము వాటించి కపటదయ్యామెసంగ బలుకుమంటివి; వారియలుకలెల్ల దీఱునట్టులుగాఁ బలుకుమంటివి; కయ్యమును తలంపు వారి మనమున మానునట్టి తెఱంగునఁ బలుకుమంటివి; అంతియేకాని, మీ రాజ్యభాగంబు మీకొసంగెద రండను వార్తనంప నీకు గుండె నిబ్బరము లేకున్న లేకుండకపోవచ్చునుగాని, వనవాసాద్యాయాసంబులు దీర్చికొనన్నైన వారిని నీవెంటఁ గొనిరమ్మని నాతో ననఁ జాలవైతివే! నీమెత్తని రిత్తపలుకులకు లోఁబడువారా పాండవేయులని తలంచితివో! రాజకీయపరిస్థితులను వారితో సంప్రదించి వారిని శాంతాత్ములుగాఁ జేయుందగు తెఱంగు తెల్పకపోతివి; కార్యదీక్షతో నున్నవారిని, వంచితులయి సర్వస్వమును గోల్పడియున్నవారిని, బుడిబుడిమాటలచే సపనయించు తెఱంగునందలి కష్ట మెఱుంగకపోతివి! రాజకీయమునకుఁ జోటులేదు; ధర్మమార్గంబునఁ బల్కెదు మన్న ధర్మజుమాటల నవియెల్ల హనుమంతునిముందలి కుప్పిగంతులగును. మఱి యేమార్గమును దెలుపవైతివి. ఇఁకమిగిలినది వేదాంతమార్గము. ఏతన్మార్గమున, వారిని గలకాలమును నడవులఁ గందమూలఫలభక్షణచేఁ గాలముపుచ్చుఁడని, ప్రబోధము సేయవలయు. వారి కాచార్యుండయి నిలుచు కృష్ణుం డిదివిని యూరకుండునా?"

అని చిరకాలమునుండి ధృతరాష్ట్రు నెఱింగిన సంజయుండను కొనుచు నుపప్లావ్యము దెస బయనమయి పోవుచుండెను.

---

# రాయబారము

## ఆఱవ ప్రకరణము

### (i) ఉపప్లావ్యము.

పాండవశిబిరముననున్న శ్రీకృష్ణ మందిర వర్ణనము-రహస్య గోష్ఠీనిరతుండగు శ్రీకృష్ణుని యునికిచందము-కృష్ణార్జునుల విలాస సంభాషణము-ద్రౌపదీ సత్యభామల యన్యోన్య సంభాషణము-అవమానితయౌ ద్రౌపదియొనర్చిన యుద్రేకపూరిత భీషణ భాషణములు-సంజయుఁడు శ్రీకృష్ణుని దర్శించుప్రకారము.

ఇపుడు ఢిల్లీనగరమని వాకొనఁ బడుచున్నదియు నింద్రప్రస్థమునకు దక్షిణమున నున్నదియు నగు నుపప్లావ్యంబను ప్రదేశంబున విడిసియున్న, పాండవులకు సాయపడు తలంపున సానుభూతి నెఱపుచు వచ్చిన రాజుల విడుదులు లెక్కకు మిగిలియుండెను. ఏడక్షౌహిణుల సైన్యము విడిసియున్న బయలున నిసుక చల్లిన నేలరాలఁ జాలనంత సాంద్రమై కోలాహలముగ నుండెను. రాజుల కేర్పఱచిన శిబిరములలో శ్రీకృష్ణునకని యునినది తక్కినశిబిరములకుఁ గొంతదవ్వున నుండెను.

ఒకనాఁటి యపరాహ్ణమునఁ దన శిబిరమున శ్రీకృష్ణుండొక శయ్యం బరుండియుండఁ, దన యొడినిడికొని శ్రీకృష్ణుని పాదముల నర్జునుం డొత్తుచుండఁ, బాంచాలియు సాత్రాజితియు వేఱ్వేఱు పీఠములపైఁ గూరుచుండియుండ, నా సమయానఁ బానలనాఁడు ప్రాగ్జ్యోతిష పురముననున్న నరకుని వధియించిన నాఁటి ముచ్చటలనెల్ల శ్రీకృష్ణుఁడు నుడువుచుండ, యుద్ధమధ్యమున నరకవధార్థము తాను

శ్రీకృష్ణున కొసంగిన చేయూఁత లాదిగాఁగల విషయములన్నీ సత్య భామయాదికిఁ దెచ్చుచుండ, ద్రౌపది విని విని, "అమ్మా, కానయి యున్న కురుపాండవ సమరమునఁగూడ నీ సహాయ మవసరమయ్యె నేని నిన్నును శ్రీమపెట్టక తప్పదని తోఁచెడి" నని తన యూహ్యాంశము సూచింప సత్యభామయు, "వివేకముగల పురుషులెన్నండును సంగర మొల్లరేకాని, సంగరమునఁగాక తీర్పఁబడనిపట్టుల వారికిఁగల పట్టుదల స్త్రీలకుండఁ జాలదు. అయినను గార్యాచరణముపట్ల స్త్రీలకుఁగల తెంపరితనము పురుషులకు మృగ్యము. అట్లగుటను ధర్మనందనుని ధర్మ నిరతియు, నందనందనుని నేర్పును, జీవరవఱకును జూచియే, మనము చేయఁదగినది చేసి చూపుదుముగాక!" యని కాఁగల కార్యముంగూర్చి సాత్రాజితి నిర్వచించెను.

ద్రౌపది:—సత్యా! తనరాజ్యభాగముఁ దనకిమ్మని ధర్మనందనుఁడు గాంధారీనందనునిఁ బ్రార్థనా పూర్వక దీన సంభాషణముల నైన నెఱపుచు, నాతఁడీని రాజ్యభాగంబున కెదురుతెన్నులు సూచుచుండుటేగాని, దుర్యోధనుఁడెంతమాత్రము నే మాత్ర ముగాని ధాత్రీభాగ మీనేర్చునే! కీడెంచి మేలెంచుమనునట్లు భ్రాతృభాగ మాతఁడెట్లీని, యేపాటి యొసంగినను, బాండ వాగ్రజుండాహవ ప్రయత్నములనొల్లఁడు. వీరినడుమ హృద యశల్యముగనున్న నన్నవమానము నొందించి, రాజసభ కీడ్చి వారెంతలుపఱచిరో నీవెఱుంగనిదికాదు. అవమానాగ్ని నన్నెంతె దహించుచున్నను, యమసుతుండొల్లని సంగరము తద్భ్రాతృవర్గము మాత్ర మూనునా? అట్టిమెడసాత్రాజితీ, అలనాఁడు నరకుని ననిమొన నెదుర్కొని, యమపురి కాతని ననిపిన నీ ఖడ్గ మప్పుడే త్రుప్పుపట్టి యుండదుకద! అలనాఁటి నీ యాహవకేళీ కౌశలము నింకొకపరి చూపి, కర్ణ దుశ్శాసన దుర్యోధన పాతకుల సంహరించి, తదక్తధారల

నీవీడియున్న క్రుమ్మడిఁగ్రమ్మఁగట్ట, నాకు నీసాయమున్న, నీ కృష్ణుండేల, యీ యర్జునుండేల? నీ వింత మాత్రము సహాయ మొసంగినఁజాలు.

ఈ సంభాషణ మందలి లాలిత్యమునకు శ్రీకృష్ణుని మోమునఁ జిఱునవ్వు లొలుకుచుండ, నర్జును మోమునఁ జిన్నతనంబు చెలంగుచుండ, నింతలో నొక ప్రతీహారివచ్చి—"దేవా, దేవరదర్శనార్థియై సంజయుండను నొకరుఁడువచ్చిద్వారముకడ వేచియున్నాఁ" డని నుడివి, శ్రీకృష్ణునాన నీ ప్రతీహారియుఁ బోయి సంజయుదోడ్కొని వచ్చెను. సంజయుఁడును శ్రీకృష్ణుని సమీపించు నంత, కృష్ణుఁడు సాదరదృక్కుల సంజయు నవలోకించుచుండ, సంజయుండును దన యుత్తరీయంబును శిరోవేష్టంబుగా ధరియించి, వినీతవేషుండయి, యెదుటంబడి, సాగిలిపడి సాష్టాంగంబుగఁ దన కరారవిందంబుల శ్రీకృష్ణుని పదారవిందంబులంటాకి, ప్రణామిల్లి ప్రఫుల్లమగు శ్రీకృష్ణుని ముఖారవిందము దెసం జూడ్కి నిలిపి, కొంతవడి మానసికధ్యానమొనర్చి నిలువ, శ్రీకృష్ణుఁడును సంజయునాశీర్వదించి, యుచితాసన మొసంగనెంచి తనకాల్కడనుండిన కనకమణిమయంబగు పీఠంబుఁ జూపుచు సాత్రాజితిదెస దృక్కులు సారింప,నర్జునుండును పాంచాలికిఁగనుసన్న సేయ, ద్రౌపదీ సత్యభామలారత్నస్థాపిత స్వర్ణపీఠంబుదోడ్కొని దెచ్చి శ్రీకృష్ణుని సమీపంబున నునుప, శ్రీకృష్ణుండును సంజయుంగూరుచుండ నియోగించెను. తన ప్రేల్చిన కాల్గుదిగిచికొని శ్రీకృష్ణుండును గూరుచుండెను. తనకని యునిచిన, యయ్యున్నతాసనము నా సంజయుండును దనకరతలంబున నంటుచు, ధరణీతలంబునన గూరుచుండి, నిజఫాలతలంబున మొగిడ్చిన తన కేలు కెందామరలంగదియించి ధ్యానము చేయుచు నట్టె నిలచెను.

# ఆఱవ ప్రకరణము

## (ii)

కృష్ణసంజయుల సంభాషణము—ధర్మరాజు సముఖమునఁ దాఁ బలుకవలసినవిగా నేర్పఱుపఁబడిన ధృతరాష్ట్రుని పలుకులు తాను ధర్మజున కెఱిఁగించు నవసరమున శ్రీకృష్ణుని వాక్సహాయమును సంజయుఁడు కోరినప్రకారము-శ్రీకృష్ణుని ప్రత్యుత్తరము.

"వదినా, మే మంపిన ద్రుపదపురోహితుపలుకులు విని, మము ననునయింపగావలయు, ధృతరాష్ట్రుం డీసంజయుని బంపియుండ నోపు" నని సత్యభామతోఁ బలుకు ద్రౌపది దెస చూచుచుండిన నీలవర్ణులును, బాహుమేధాబలసంపన్నులును నౌ నరనారాయణులం జూచునపుడు సంజయునకు హర్షాశ్రుపులకలును భయకంపంబులును నొక్కసారియె జనియించుటను నిమీలితనేత్రుండయియుండ, శ్రీకృష్ణుం డాతని సేమం బడిగి, కురువృద్ధులంగూర్చి గౌరవ సూచక ప్రసంగంబుల నెఱపుచు, దుర్యోధను సేమముంగూడ నెఱుంగఁగోరి కానోపు:—

"ఆపన్నలౌ కులాంగనల సభల నవమానించు నలవాటు మాని, మానియై, సుఖియై, యున్నాఁడుగద రారాజు!" అని నిర్ధారణార్థమునఁ, బ్రశ్నార్థకమును కృష్ణుఁడు సూచించెను.

సంజయుఁడు శ్రీకృష్ణుని వాక్యము వినినంతనె, విన్నఁదనంబు దోఁచుచిన్నెలతోఁ, శ్రీకృష్ణుంజూచుచు, "హేకృష్ణా! ద్వారకావాసా! మముఁబోఁటులొనర్చు నేరముల సైరించుటయు, మము సన్మార్గవర్తనులుగఁ జేయుటయు, శీలముగాఁగల నీయంతటి మహాత్ముఁడే యకృత్యముల నింకను క్షమియింపక, గోరంతలు కొండంతలు చేసి, యింకను రేపెట్టుచుండిన నిఁక కాఁగల కార్యములు చక్కఁబడు టెట్లు?" అని వినయముగ సంజయుండనెను.

— కృష్ణుఁడు —

"ఇపుడు నీ వచ్చిన కార్యముకాఁ దగియుండియు నావలననే కానోపదు కావలయు! ఎట్లైనను ఒకరొనర్చినహాని సైరింపవచ్చునే కాని మఱపునకు మాత్రము రాఁజాలదుసుమా! లోకమున నేకాలమునసైనను రాణివాసము నవమానించుట యాలకించితివే! అందును, నన్న దమ్ముల గుంజులాటలలో! రారాజుపంపున దుశ్శాసనుచే సభ కీడ్వఁబడిన పాండువిభుకోడలు, -సాధ్వి- తన మానముఁ గోల్పడఁబోవు సమయాన, దవ్వులనున్న నన్నుఁ బలవించుచుఁ దన మనోబలమున నాత్మగౌరవముఁ గాపాడుకొనినపాటు తీరని యప్పయి బహుభారమయి, చలింపక యున్నది. ఇతరకారణముల నెల్ల నటుండనిచ్చి యీ యొక్క కారణము మూలమున నొక్క త్రుటికాలమునఁ గౌరవ పాపాటవీదహనకార్యమును వారింప రానిదిఁగఁ జేయుచుండ నీవు చెప్పవచ్చిన దేదియైయున్నను, మీతేని పంపున జరిగిన యీ యమానుషకార్యమును మాత్రము మాటుపఱుపఁజాలదు. కౌరవ వంశ మేమయిన నగుంగాక, గాని, సృష్టికార్యము నడచుచున్నంత కాలమును, ద్రౌపదీ పరిభవమును గూర్చిన వాదుమాత్రము ఆచంద్రార్కమును మహాప్రళయముపర్యంతమును నాశనము కాదుసుమా!"

— సంజయుఁడు —

"నంద నందనా, రాజకీయవేత్తలలో నినుమించిన ప్రభువీ కాలమున నింకొకఁ డుండఁజాలఁ డనిన నందులకు నీకుఁ బదివేల మ్రొక్కులిడెద. భారతవర్షమున నిపు డట్టుడికించి నట్టుడికింపనయి యున్న కౌరవ పాండవ దాయభాగ విషయమున, నీ నిమిత్తమున యాదవ పాండవ పాంచాలమను నీ త్రివర్గ సమ్మేళనముచే, రుధిర సహితమహావిప్లవ మొకటి రానయియున్న దని నిన్నుఁగూర్చి మ్రొక్కవలసినచో మఱింత మ్రొక్కువాఁడనే కాని, ధృతరాష్ట్రి

నభిమతముఁ దెలుపవచ్చిన నా ముఖమునఁ దద్విషయము సాంగముగ సావధానముగ విననైన నెంచక, తొలుదొల్తనే, తీరని బాధలంగూర్చియు, సమయానుసారంబుగ మానసోద్రేకము కతమునఁ దటస్థించిన సంఘటనములంగూర్చియు, నిపుడు తలంచుచు, వానినెల్ల మరల మరలఁ గెలిలించుచుఁ బ్రస్తుత విషయమును గమనింపక, వివాదాంశము పొత్తుపడురీతినైనఁ దలంపక, ప్రత్యేకముగ నిను దర్శించి నీ ముఖమున, నయ్యజాత శత్రుఁ బ్రసన్నుం జేసికొనవ నే నేగుఁ దెంచిన యట్టి తరుణముననే నీవింత బిరుసుగఁ బ్రసంగించుచున్నచో, నిఁక నా ధర్మజు సముఖంబున నెట్టులుండునోకద యని శంకింపవలసి వచ్చుచున్నది. సౌమ్యభాషణంబుల నా చెప్పఁబూనినది సాదరంబుగ విని, ససాకల్యంబుగ నీవును బౌర్వాపర్యంబుల నూహించి, యిరు దెగలవారికిని, లోకమునకును గల్యాణ పరిదపూపరిణామికను బ్రసాదించుటే ప్రథమ కార్యంబుగా నెంచక, పాప మెంతటి పూర్ఖ మనుచు మూర్ఖజనములపట్ల గనికరమును బూనుటకు బదులు, వారియెడ నింతవేగిర పాటొందుట నీ యట్టి లోకోత్తర ప్రజ్ఞా నిధికిఁ బాడికా దని, దర్శన మాత్రముననే శత్రుజన వీర్యము నపహరించుటయందు సంపూర్ణసామర్థ్యముగల నీ మ్రోలఁ బలుకుట దుస్సాహస మగునేమో యని సంశయింతునుగాని, కానిచో, దృఢీకరింపఁ దగిన విషయమేజుమ యిది! నీ మూలమున ధర్మజాదుల సేమ మారసి నీ యనుమతి వడసి, యాతనిఁ బ్రసన్నునిఁ జేసికొని పోఁదలంచి వచ్చితినేకాని, మాధవుఁ డే పక్షమున నుండిన, నా పక్షముననే జయలక్ష్మి బంధీకృతయై యుండు నని యెఱుంగని వాఁడను గాను. అట్లయ్యును నీ పురుషకారము ప్రధానమనియు నెఱుంగని వాఁడను గాను. కావున సకల భువనంబుల నొక్క నిమేషంబున నరచేతికిఁ దేరంజాలిన ప్రజ్ఞానిధివియును, మహారాజకీయ వేత్తవును, మహాపురుషుండవునునగు నినునేదర్శింప వచ్చుట, యేరికిని దుస్సాధ్యంబైనది

నీకు సుసాధ్యంబగునని యెఱింగి నీ వలన నయ్యేది కార్య సిద్ధిఁబొంద గలదనిసుమా!

"ఏదియెట్లున్నను బోరుకలుగకుండ నుండున ట్లేయుపాయమునైనను నీవ చెప్పవలంతివి. నీ వలనఁగానిపని యింకొకని వలన నెంత కాఁజాలదో, నీ వలన గానయియున్న కార్య మితరులచే వారింపఁబడనుం గూడ నంత కాఁజాలనిదే. నే నిన్ని యెఱుంగక కాదు నిన్నే తొలితొలి చూడవచ్చుట! ధర్మజుమ్రోల నుడువఁ దగిన పెక్కు విషయములు వారి తండ్రి నా ముఖమునఁ గబురంపెను. కావున నుచితసమయ మెఱిఁగి, ధర్మనందనుని దర్శనము నాకు లభియింపఁజేసి, నాచేయుప్రసంగంబున నీవును ప్రసక్తికలుగఁజేసికొని, నావచ్చినకార్యము సఫలతనొందు తెఱంగారయ నినువేడుచున్నాను."

— కృష్ణుఁడు —

"మీరును వీరునుం గలసిమెలసి జీవింతుమన్న వలదనుట నా కేమి ప్రయోజనకరము? సర్వవిధములఁ బొందే సమకూర్పఁ బ్రయత్నింతుముగాక. ఇంతకును బెరవారలా? కాని దాయభాగము కొఱకుఁగాని, నష్టసంపద నిమిత్తముగాని, జగడములు చేసినవారు లోకమున లేకపోలేదు. కాని తన్మధ్యమున, నమానుషములగు కృత్యములంగూర్చి ప్రసంగము వచ్చినపుడు నేనే యననేల, లోకము మాత్రము సహించునే? అంతదూరము పోనేల? సర్వము నెఱింగిన నీవుమాత్ర మలనాఁటి ద్రౌపదీ పరాభవమునకు సహింతువే? ప్రసంగ వశమున సంప్రదించి యనవలసంటేఁగాని, వారివారి పొందికజీవనమును గూర్చియుఁ దత్సంఘటనముఁ గూర్చియు నెంతవఱకు శ్రమం పడవలె నంతదూరమును బనిచేసి తీరుదుము. ఎంతో దూరమున నున్నకరినగరమునుండి, యాంబికేయుపంపున యుధిష్ఠిరుం జూడ వచ్చిన నిన్నలజడి నొందించుట కాడిన మాటలుగానెన్నఁబోకుము. తత్ప్రసంగమే మానసోద్రేక జనకము కాదా !

"మనము రేపకడలేచి కాల్యములందీర్చికొని ధర్మజుఁడు కొలువున్న సమయాన నాతనిం జూడఁబోదముగాక!"

అని కృష్ణుఁ డప్పటి క్కా సంభాషణ చాలించి సాయంసంధ్యా వందనాచరణార్థము లేచెను.

సంజయుండును నామఱునాఁడు కృష్ణ ధర్మజాదులు కూడి యున్న సమయమున ధర్మజుంజూచు తన నిశ్చయము కృష్ణునకు విన్నవించి యాతని యనుజ్ఞవడసి తనవిడిసియున్న తావునకు మరలెను.

# రాయబారము

## ఏడవ ప్రకరణము

### ఉపప్లావ్యము

శల్యువాగ్దానముం గూర్చి తన తమ్ములతో ధర్మజుఁడు ప్రసంగించుచుండ శ్రీకృష్ణసంజయులు ధర్మజుం జూడ నేగుట-సంజయ ధర్మజుల యన్యోన్య సంభాషణములు-ధర్మజుఁడు కౌరవుల యోగ క్షేమము లరయు ప్రకారము-తద్వ్యాఖ్య-ధర్మజుని వాక్యపుణ్యము-సంజయుఁడు ధర్మజుని గ్రహించినరీతి ననుసరించిన వ్యాఖ్యానము-కురుపాండవ బలాబల విమర్శనము-సంజయు రాయబారపు టుప న్యాసము-సంజయుఁడు యుద్ధము వలదని ధార్మికముగ ధర్మజునకు శుష్క-ప్రియోక్తులతో, శూన్యహస్తములతో, నుపదేశ మొనర్చిన యుపన్యాసము; తద్వ్యాఖ్యానము. సంజయ ధర్మజుల స్వభావ పరి శీలనము-సవివరముగ, భావగర్భితముగ, శ్రీకృష్ణుఁడొనర్చిన యుప న్యాసము-సంజయుఁడు శ్రీకృష్ణున కొసంగిన ప్రత్యుత్తరము-శ్రీకృష్ణ భీమార్జునుల స్వభావ నిరూపణము-తన రాయబారపుఁ గార్యానంత రము కరినగరమునకు సంజయు నిష్క్రమణము.

ఆ మరునాఁడు ధర్మజుం డనుజ తనుజ సమేతుండయి శల్యుని వాగ్దానముంగూర్చి పౌర్వాపర్యంబులఁ జర్చించుచును, ద్రుపద పురో హితుని మూలమున నంపిన రాయబారముం గూర్చి సంశయించు చును, ననుద్యూతమున నరణ్యాజ్ఞాత వాసంబులు పణంబులుగా గాంధారీనందనుండును, సౌబలుండును, నేర్పఱచుటయందిమిడియుండిన భావంబును, బునర్విమర్శ చేసికొనుచును, శ్రీకృష్ణు నెడ నెడ నంస్మ రించుచును, నున్న సమయంబున గృష్ణసంజయులు ధర్మజు దర్శింప

ద్రోవదియును ననుజులును, పుత్రిసంతానమును, సేమమున నుంట
యీతండ్రి విని నీక్షేమము నారయ నన్నుఁ బుత్తెంచెను."

ధర్మజుండును, నొక్కపెట్టునఁ దమ పడిన బన్నములును, గౌరవ్యులొనర్చిన భంగపాట్లును, దన తలఁపునకు వచ్చినవో యన నొక వేడినిట్టూర్పు విడిచి,—

"మాయెడ నారాజునకుంగల కారుణ్యముకతమున సుఖమున నిట్లున్నారము. మా సేమ మారయ నిను గారవమున నంపుట నామది హర్షమందినది." యను ప్రత్యుత్తరమున సంజయు ధృతరాష్ట్రుల నభినందించి ధర్మజుఁడు మరల నిట్లందుకొనియెను.

ధర్మ:—ఆరాజును, బుత్రులును, మనుమలును సేమముగ నున్నారు గద; రాజ్యంబున శుభపరంపర గలదుగద; ద్రోణుఁడును, గృపుఁడును, ద్రోణసుతుండును సుఖమున్నవారె? సుశ్లోకుండగు భీష్మునిపెత్తనంబు గౌరవించి కౌరవులు మెలఁగుచుండిరే? రాజ్యంబున బ్రాహ్మణులకు మన్నన గలదే? మేమలనాఁడొసంగినవృత్తులు సెల్లుచున్నవే? రాజ్యంవుఁ గలఁకులం దొత్తుడుగలుగునాఁడు గాండీవి భుజబలంబును, భీమసేనుగదావిహారంబును, దలఁపునకు వచ్చుచుండునే!

——సంజయుఁడు—— (తనలో)

"అన్నా! తనవారలసేమ మడుగు నెపమున నెన్నెన్ని యెత్తిపొడుచుచున్నాఁడు! తమ యిచ్చిన వృత్తులుగూడఁ జెల్లనీకుండఁ జేసిరో కా కౌరవు లనికూడ సంశయించుచున్నాఁడు! కురువృద్ధుండగు భీష్మునిమాట కౌరవులు గౌరవింపరని సూచించినాఁడు. తనకాలము నాఁటఁబోలె బ్రాహ్మణులకు మన్ననలుండ నోప వని స్థిరపఱచినాఁడు. తనకాలమునం దొత్తుడు గల్గునాఁడు, తనయనుజుల బాహుబలంబుల మూలమున గెలుపు గలిగెం గాని, యిప్పట్టున నట్టియొత్తుడగల్గినచో, నేమగునో గదాయను సానుభూతి

నెఱపువానిం బోలెఁ బలుకుచుఁ దన యనుజుల బాహుబల విక్రమంబుల నభివర్ణించుచు, నను నదలింపఁ బూనినాఁడే! మఱియు నింకెన్ని తెఱంగులఁ బలుకునో సావధానంబుగ విందును గాక—" అని తనమనమున సంజయుం డనుకొను చుండెను.

ధర్మ:— పాండుకుమారులు కౌరవగౌరవముఁ గాపాడిన తెరుఁగెఱిఁగి యని చెప్పుటకు నొకనాఁడా, రెండునాళ్ళా—ఏయొక్కనాఁడని నీకు నెంచి చూపఁగలను? ఘోషయాత్రకు గంధర్వులు వచ్చినప్పటి చరిత్రము మనవారి మనములం బాయఁ దగినదికాదే! ఇంతలో నింత మఱపు చేకుర వచ్చునే? కృతమును మఱచినవారి నింక నేమందుము? పోనిమ్ము—మనయిరువురమును మధ్యస్థులమై మాటాడుదము. రణరంగమున నర్జును నోడించి, తన మానమును ప్రాణమును దక్కించుకొని పోయినవాని నొక్కనినైనఁ జూపఁగలవే! కావున నీ, ప్రసంగవశమున నడుగ మఱచితిని: దుర్యోధను నింటఁ గార్యమునకును, ఖడ్గమునకును దగుదు నని చతురతమెయి వర్తించుచున్న కర్ణుని శూరత్వమును, పెద్దఱికమును జెప్పుచున్నవి గదా!

ధర్మజుని పలుకులు వినుచు, సవిమర్శంబుగ

—సంజయుఁడు— (తనలో)

"ఔరా! ధర్మజుం డెన్నిరసంబు లాలోకించుచున్నాఁడు! ఘోషయాత్ర నుదాహరణంబుగఁ జూపి, తనవారి నిర్వక్రవిక్రమంబుఁ బ్రకటించినాఁడు! తనకక్కఱలేకను నట్లు, మధ్యస్థులమని చెప్పి, నాకు మెప్పు పుట్టించ నెంచి, తన్నుఁగూడ నాలోఁ జేర్చికొనినాఁడు. అర్జును నెదిర్చి యనిమొన మానప్రాణంబుల దక్కించుకొనినవాఁడు లేఁడనూ యని భయపెట్టువానిం బోలెఁ బలికినాఁడు. కౌరవవర్గమువారి కుశల మడుగుటలోఁ బాండవులకుఁ

ప్రధానవైరి యగు కర్ణునిఁగూర్చి మఱచి యడిగినట్లు తుట్టతుదకుఁ గర్ణుని యార్యత్వమును, నధికారమును, జెల్లుచున్న వేషమునిఁ గూడఁ గ్రుచ్చి గ్రుచ్చి యడిగినాఁడు. పూర్వపుణ్యమునం గాని లభియింపని యీతని వ్యాపన్నపుణ్యముం గూర్చి యెంతని యభినందింతును! సముచితప్రసంగములనే కాని యీతనిఁ బ్రసన్నుం జేయ వేరుమార్గము గానరాదు."

అని సంజయుఁడు తన మనమున ననుకొని తుట్టతుదకు ధర్మజునకుఁ బ్రత్యుత్తరంబుగాఁ బ్రకాశంబుగా నిట్లనియె.

—సంజయుఁడు—

"కౌంతేయాగ్రజా! నా సవినయ విజ్ఞప్తి నాలింపుము—

"కురురాజునొద్ద నొకరి మాట యింకొకరి కెక్కనివారు పెక్కండ్రు కలరు. అవినీతులును, నీతిమంతులును, సత్త్వసంపన్నులును, దురహంకారులును నైన కురుసభనున్నవారి నంత యనం జనిలేదు. ఏమి చెప్పఁ దలంచినను, నీతిపరులును, సత్త్వగుణప్రధానులును, లోకమునకు వెఱచువారును, జనులకు నొడంబాటగు విధమునఁ జరియించువారును, సంఘముతోఁ బొంది పొసఁగి మను తలంపు ప్రధానముగఁ గలవారును, నగు మీతోడన చేయు ప్రసంగంబు ప్రస్తుతికెక్కం గలుగుట, నటఁ బలుకుటకంటె, మీతోడన పలుకుట మేలని తలంతును.

"మీ యడిగిన వారందఱకును నిప్పటి వఱకుఁ గాకున్న మానెఁగాని, పొందే ముఖ్యమని తలంచి యెంతశ్రమింపడ్డినను ధార్తరాష్ట్రులతోడి నెయ్యమునకై ప్రయత్నించు మీ విమలహృదయంబుకతంబున నీక మొదలుగనైన క్షేమలాభంబులు సమకూరు నంబికేయునకు వృద్ధత కతమునఁ మన మొక తెన్నునఁ బోకుండుటఁ దన సుతుని పొగరుఁబోతుఁడనము మాన్పఁజాలక

పోయియు, నిప్పుకించుకచిత్తశాంతిపొంది, మీయెడ నిష్క-
పమా ...మక్కువఁ బూనియున్నాఁడు. ఇట్టిపట్టుల సంపూర్ణ
హృదయమున మీయెడ సైరణ, ధర్మప్రవీణహృదయులరగు, మీ
యజాత శత్రుత్వంబునకు, మఱింత మెఱుంగువెట్టినదై, మీశాంత
స్వభావం బఖిలలోకవిశ్రుతమగునట్లుచేయక యూరకుండునా!

"ధర్మనందనా! నీవు కొలువున్న సమయాన, నీవును
దమ్ములును, నీ యాప్తవర్గమును, కృష్ణుండును, వినుచుండ,
నీ సమక్షమున విన్నవింపుమని మీ పెద్దయ్య పలికిన పలుకులు
గలవు. అనుజ్ఞ నొసంగిన విన్నవింతును."

అని సంజయుండొక్క త్రుటికాలము ధర్మజుదెసఁజూచుచుండెను.

ముఖమునఁగెంపు గదుర, దృక్కులు చెదరఁ, బెదవులదర,
సంజయుం జూచుచు ధర్మజుండు:—"సంజయా! వీరె నాతమ్ములు;
వీరె యాప్తులు; ఈతఁడె కృష్ణుఁడు; ఇఁక నీకొలువునఁగల తక్కిన
యందఱును వినుచునె యుందురు. ఓ యయ్యా! నిన్నేమనుమని
మాయయ్య నాకడ కనిచెనో యవియెల్ల వాయెడక వచియింపం
దగు" నని విన్నకుండెను.

ఈ పలుకులు యమసుతుని మోమునుండి వెల్వడుటయుఁ
బలుకుచున్నప్పటి ధర్మసూతి ముఖకళలు మాఱుచుండుటయు,
సంజయుండు చూచి చూచి—

"అన్నా—యీ ధర్మజుని గరువంపుఁ బలుకుల విధంబు
నేమందును! దుర్యోధనుని యున్నతిం జూడఁజాలక, తన మెయివడిఁ
గల ప్రవర్తనకుండొడు నోటివడితనముంగూడఁ జూపుచున్న
ఈ యమసుతుంగూర్చి యేమి తలంపవలయు? ఈతనియం దిదివఱ
కెన్నండును గని విని యెఱుంగని రజోగుణము నేఁడు చూడవలసి
వచ్చెనే! కటకటా! నీళుల నగ్ని పుట్టినట్టు లయ్యెఁగదా! లోక
సానుభూతికొఱ కెదురు తెన్నులుచూచువాని సైరణ మితిమీఱినచో

నేమి యగును? కాలపరిమానావధి దాటినచో నయ్యది వెల్లి విరియక తప్పదు. ఇంతకును నికృష్టకష్టము లకారణముగ నెంత కాలమని సైరణ సేయఁగలఁడు! ఏది యెట్లున్నను విన్నవింప వలసియున్నవి విన్నవింపక తప్పదుగదా!" యని సంజయుండు లోలోన ననుకొని, సద్భక్తి వెలిఁగ్రక్కు దృక్కులఁ గృష్ణుని దెసం జఱపి, భీమార్జున నకుల సహదేవుల నెయ్యముం జూపు చూపులఁ జూచి, దృష్టద్యుమ్నుని సవినయంబుగ నవలోకించి, ద్రుపద విరాట భూమిపతుల సంప్రీతిమెయిం దిలకించి, యుధిష్ఠిరుదెస మోడ్చిన కేలుఁగవతో సంజయుఁడు ప్రసంగము ప్రారంభించెను.

"యమనందనా! మీయయ్యం దలంచి, మిమ్ము స్మరియించి, మీ పెదనాయన చిత్తశాంతి నొంది, మనః కళంకము వీడి, మీ తోడి పొందికకునికి మనమున ననయము గోరికోరి, యెంతే మోదమున నను నిట కనుపునపుడు, నాతో రేగెడి త్రోవఁ జెప్పుచు, నీ సమ్ముఖమ్మున నెఱపెడి సంభాషణవిధానముఁ దెలుపుచు నెంతో దవ్వుల నను మీకడ కంపకముపెట్టఁ దనవారిని నావెంట నంపిన యాభూకాంతుని మానసమున నీదెస ననురాగంపు కల్మి యెంతకలదో, కాని, యాతని మనసు గ్రహియించి, యిఁకనైనను మన మొఱుక గలిగి కార్యక్రమము నడపఁగడంగుట సమంజసము కాదా!

"ఈ సందర్భమున నెంతదూర మాలోచించినను సర్వధర్మజ్ఞులును, బరమశాంతులును, నని లోకమునఁ బ్రసిద్ధిఁగాంచిన మీరలు లోకులు మిక్కిలి చులుకనగా వాకొనఁ దగిన కార్యము సేయంబూనుట యేమాత్రమును దగవు కానేరదు. మధుఁగు వంటి కౌరవాన్వయమునకుఁ గౌరవేంద్రు కతమున మసియంటినను, కార్యనిపుణహృదయులరగు మీ రద్దానిని దొలఁగఁ ద్రోసి, కీర్తిచంద్రికలం బ్రసరింపంజేయఁగల సమర్థులరయ్యును, పామరజన

పరిపాలింపఁదొడఁగుట యెంతయు గర్హ్యము కాదా! సకల జనక్షయ కారణంబగు యుద్ధమున జయాపజయంబుల నేది సమకూడినను సుఖ మొదవని యాపనికి మీవంటి యుత్తమోత్తములు పూనఁ దగునే! ఆహవకేళీవిక్రములగు మీ రీయుద్ధమున నాబాల వృద్ధజనంబుల, సఖుల, బంధువులఁ ద్రుంచి, కట్టకడ, నొందిన సుఖము లవేటికి ?

“దయాపయోనిధీ!- యని సుజనునిఁ బిలువఁ జాలుదువే!

“మీ వీరజనంబుల నెంతుమన్న, యోధాగ్రేసరులగు భీమార్జును లరాతివనదావానలములు. సాత్యకియును, విరటుండును, నసమానయోధవరులు. ఇఁక సంగ్రరణశోభితుఁడౌ నీ ద్రుపదుం డున్నాఁడో, మీ చుట్టాలకెల్ల మేమువు. మీ విజయమునకెల్ల మూల మీ కృష్ణుఁడు. సురలకైన నజేయులగు నిట్టివారిం గూడియున్న మీ విజయమున కేమి కొఱంత!

“అటు కౌరవబల మూహింతుమన్న ద్రోణ భీష్మ కృపాశ్వత్థామ కర్ణ శల్యుల ప్రాణములే యా సుయోధనుని పాలివని లోకు లనుచున్నారు. సుయోధను ననుజు లసహాయపరాక్రములు. వారి కొడుకు లజేయులు; ఇఁక నా బాహ్లిక సోమదత్తు లాస్థానమునకైన నోడరు. వారిని నిర్జింప నీ యిరుగలవారిలో నెరికి నశక్యము. ఇంతింత బలపరాక్రమవంతులౌ మీ యిరువాఁగుల వారికిని నన్యోన్య కలహంబు క్షేమంబుఁ గూర్చునని నాకుఁ దోఁపదు. ఈమాట నాడటఁ గాదటంచనెనవేని, మీ యిరువురకును బ్రియముసు, హితముసు గోరువారి నడిగి చూడుము.”

అని కృష్ణుని దెసం జూపుల్కలు నిలిపి, సభం గలయం గనుం గొని, సంజయుండు మఱల నిట్లందుకొనియెను.

“క్రోధ శాంతికై వాసుదేవునకు నమస్కరించెదను; సవ్యసాచికిం జేతులు మోడ్తును; తక్కిన మిత్ర బాంధవ హితప్రియు

మంత్రివయస్యకోటికి నభివాదన మొనర్చెను. అసూయలువీడి, ప్రాఁబగలఁ దోలఁగఁద్రోసి, పాండవు లడవులంబడిన యగచాట్ల మఱలమఱలఁ గెరలింపక నామాట పాటింపఁ బ్రార్థించుచున్నాను.

"తన నేల యేలుటలో, ప్రజలఁ బాలించుటలో, దేవ బ్రాహ్మణగురు జనుల నాదరించుటలో, సర్వజనంబుల కోర్కెలొసంగు టలోఁ, గ్రతువులొనరించి తన్నుచితప్రకారంబుల గౌరవించుటలో ధృతరాష్ట్ర నగ్రనందనుఁ డీపాండుతనయాగ్రేసరున కేమాత్రము దీసిపోఁడని మన మందఱు మెఱుంగనిది కాదు. ఒక్క పాండవులను ద్వేషించినంతమాత్రాన దేవబ్రాహ్మణులకు మన్నన కల్గఁబోదనియు మీనాఁటి యూహలు సెల్లునిచ్చుట లేదో కాయ నియు భీష్మాది కురువృద్ధులమాట పాటింపఁబడ నేరదనియు, శంకింపం బనిలేదు. ప్రత్యేక కారణమున మిము ద్వేషించియుండు నా సుయోధనుఁడు కొంతకాలంబున మీకు ద్రోహంబు సేయ నెంచెనని యిప్పుడా కురునాథుఁ డెఱింగి మిగుల వగచి, మీవలనఁ జేరిముడికతమున నను మీకడ కనిపెను. ఇంతకును సౌఖ్య డకిరి కెట్టవోయి యెట్టువచ్చునో యెవరి కెఱుక? స్వయంకృత కర్మము ననగదా సుఖదుఃఖములు కలుగుచుండును! అనుభవింపక తీఱునే యెవ్వరికైనను? పురుషున కుండఁదగినధర్మంబులన్నియు నీయందుండుఁ గలవు. క్లేశములు కలిగినను మనమునవైన వగవని ధీమంతుండవు. సకల ధర్మజ్ఞుండవగు నీవు, నీయెడ నొరు లెగ్గు దలంపకుండఁ బ్రవర్తింపనేయునే కాని సర్వ బంధుజన వినాశహేతుభూతం బయిన యుద్ధము సహింతువా? స్వజన వినాశకరంబుగ మీ రొండొరు మనసది జరుగునేయయినను, అద్దాని నపజయము యంత్రి సూ తత్త్వజ్ఞులు. ఇపు డెంతకాలమునకైన నగుఁగాక గాని, సమర సన్నాహమే నీకు మోదావహమేని యీపాటి కని యూనోడె యొనర్చి, దుర్యోధనుని లోకప్రద్విష్టుల పాల్పడనీయకులశిఖా

ఆరణ్యాజ్ఞాతవాసముల నన్నియు నుడుగుచు గుండెవలకింపుండకయే పోవునే! ఇవియన్నియుం దలంచియే గద మీ పెదతండ్రి, శాంతి వహించుటయు శ్రేయమని నీకుఁదెలుపు మని, నన్ను నిట కనిపి పుచ్చుట! ఆహవప్రయత్నముల నింకనైన విరమించుటయే శ్రేయోదాయకమని మీ పితామహుండున్ను, విదురాది సజ్జనులుం గూడ నీకడ విన్నవింపు మనిరి. నీ విప్పట్టున నీ పట్టు వీడిన నిఖిల లోకకల్యాణప్రదమని నీ కురుగురుజనంబు లందరును వాకొను చున్నారు."

— ధర్మజుఁడు. —

"సంజయా! నే నెంతయో సేపు మాట్లాడ లేదు కాని, మాటలాడినంతవఱకును సౌహార్ద్రమును, స్నేహమును, గాని మాట యొక్కటియైనను నా నోట వెడలివచ్చెనే! నేను సంగరభీరువును గాకపోయినను, యుద్ధావసర సమయమున మాత్రము ప్రాణనష్టము నకు సర్వదా భయంపడుదును. పోరులేకుండ మేమును వారునుం గలసి క్షీరోదకన్యాయమున జీవించుటయె సర్వదా నేఁ గోరు చున్నది. మాటయుఁ బోరులేకుండ సమకూడెడి యుద్ధసిద్ధి యేవెట్టి దైన నొల్లనననా? లౌకిక దూషకులగు దుర్యోధనాదులే దుర్వర్తనులు కారనినచో, నిక లౌకికసమ్మతధర్మనిబద్ధకార్య పరులగు ధీమాజ్జనులేనా దుష్కర్మములకు రోయనివారలు?

"నీవు వేడెడిపై సంధి యొనఁగూర్పనెంచి వచ్చితివి గాని, సంపదఁ బోగొట్టుకొని యశక్తులం బోలియున్న మమ్ముఁ బిలిచి, యాచరించుట కా సుయోధనుఁ డంత బేలయా! బుద్ధులు చెప్పెడి వారి నాతఁడు మన్నింపఁడు. ఆతని చరిత్రము నీకును [illegible] గ్రొత్తకాదు గద! 'తగవిది' యని యెఱింగిన యాంబికేయుఁడే రాజ్యకాంక్షాంధుం డగు కొడుకు తెన్నునే యనుసరించి నడచు చుండ నింకెవరిని సత్పథమునకు రమ్మని పలుకుట!

"జూదపుసిరి యాసపడందగదని విదురుఁడు నుడివిన యప్పు డాతని మాటల నాదరించుటయుఁ, గర్ణాదుల యిచ్చకపుఁబలుకుల నాదరింపకుంటయు, జరిగించియుండినచో, నంతయు నింతదూరము పెరుఁగక యుండునే! శకునియుఁ గర్ణుండును నెక్కుత్రిప్పిన సడిదిలిగాను దుర్యోధనుఁడు తండ్రినిఁ దనవశము చేసికొని, యింతలు సేయుచు గలుగుచున్నాఁడు. నీ వింకను వెఱంగువై యాచార్యులవా రొసఁగు తెన్నుల మాటలాడెదుగాని, దుర్యోధనుని యవినయ మనివార్యము సుమా! చక్రధరుఁడైన లెక్కసేయక, పరాక్రమనిధియగు మన యర్జునుం గెలువ రాధేయునిపై నాధారపడి రాజ్యసంపదనెల్లఁ బోఁగొట్టుకొనుట కాయత్తపడుచున్న పరమావివేకి సుమా—పాపము— మూఢ దుర్యోధనుఁడు!

* * * * * *

కొంతసేపు మిన్నకుండి మఱల యుపక్రమించెను—

"సంజయా! ఫల్గునునికపిధ్వజప్రభలు శత్రువుల కన్నులు మూఁతపడునట్లొనర్చుటయు, నాతని దేవదత్తధ్వానము వారి చెవులు చిల్లులుపోవఁజేయుటయు, చాపాచార్యుండౌ ద్రోణుండును, గురుపితామహుండౌ భీష్ముండును, ద్రోణసుతుండగు నశ్వత్థామయుఁ, గర్ణదుర్యోధనులును మాత్రమెఱుంగరే! నీవుకూడ మఱచితివే! ద్రుపదపురోహితుఁ డంపఁబడెనుగదా యని నిన్నందులకుఁ బ్రతిగా నిటకంపితిగాని, నీవు మాత్రము స్వయముగ నెఱుఁగని దేమికలదు ? నీవు మాటనేర్పరివి గాన, తొలుదొలుత మేము బాహువిక్రమాద్భుతుల మనియును, గదాశాంతుల మనియును, మనుఁబొగడి పొగడి, పిదపఁబడి ధార్తరాష్ట్రుల నని గెలువ నరిదియని, సులభముగఁ జెప్పితివే కాని పక్షపాతవృత్తిని బలుకుచున్న నీనుడులు సమంజసములని నేఁడలంతు ననియే నీవూహించితివే! కౌరవుల జేయులౌట వారిఁ

గెలువఁదరమే యను నీమాట లటుండనిచ్చి, సద్గుణుండవౌ నీవు వచ్చి, కోపోపశమనంబుగ నింతవట్టు పలికితి వంతెచాలు. వారిచేఁ బరాభూతుల మయ్యును, నీ మాటలచే నింకను గొంతతడవు సైరణ చేయుదుము. ఇంతకుఁ బూర్వము వారు మాయెడ నొనర్చిన దుర్నయములనెంత సైఁచితిమో నీవును గొంతమైన నెఱుంగుదువు కదా; ఇంకనుంగూడఁ వారియెడఁ గీడుదలంపకుండ నీ వుండుమనునంత కాలము నుండుము. కొడుకులపట్టు మముఁగబురంపి, పాలిన్నుని తనకొడుకులకుఁ జెప్పి, యింద్రప్రస్థమో కాక వే ఱొకటియో, మాకిచ్చి, మను సంతుష్టాంతరంగులఁ జేయుట యాతని కుచితము గాదా!''

—సంజయుఁడు—

"ధార్తరాష్ట్రులొనర్చిన యెట్టిదుండగముల నైన మీరు భరించి శాంతిమిమె యమూల్యాభరణముగఁ దాల్చితిరి, కావున మీతోడ నింతదూరము పరిసంగింపఁగలిగియుఁ, దృప్తినొందక మరల విన్నవింపఁ బూనుకొంటిని.

"నీకున్న వైభవ మంతయు నహింసయు ననింద్యచరిత్రమును గాక మ రేమున్నది? దుశ్శీలురగు కౌరవులు మీకుఁ బాలీక చెడఁ దలంచిరేని,—నేఁజెప్పెద, వినుఁడు—రక్తపుఁగూడు కన్న, మీ సత్ప్రవర్తనకుఁ దగినది భిక్షాన్నంబుకన్నను, మిన్నయై, భిన్నమైనది మఱిలేదు. ఇది కాదందువేని, రాజసూయ మహాధ్వరం బొనర్చి, ద్విజులకును దేవతలకును, దృప్తినిఁగలుగఁజేసి, శాంతియు దాంతియుఁజూపి, సకలలోకములఁ బొగడొందిన మహాపుణ్యమూర్తి వగు నీ పుణ్యచరితంబు మహాపాపకారణమున హింసాకళంకితముగఁ జేయనెంచు టెంతయు నీ కొప్పియుండదు సుమా!

"ఇంకొకమాట—

"మాయజూదమొనర్చి, మిము మోసపుచ్చి యింత లొనర్చిన ధార్తరాష్ట్రుల గర్వము నేల యింతవట్టు చెల్లనిచ్చితివి? లోకముచేత వారల నేలతిట్టులువడఁజేసితివి? తాలిమిందూలకయడవులపాలయి మీ రందఱన్ని యిడుముల నేలపడవలసివచ్చినది? ఇన్నింటికిని మీయనింద్య చరిత్రమును, దాక్షిణ్యమును గదా ప్రధాన కారణములు! ఇంతవడి యును, మట్టుతుదకు, సకలజనక్షయకారణంబగు రణంబునకే యొడం బడి, బంధుగుల, గురుల, ననుజుల, వెదకి వెదకియైనను, వధి యింప లభియించు నా సురలోకసౌఖ్యంబైనను నదియేల? అస్థిర మును, నార్యనింద్యమును గాదా? లోకములోని సర్వజన సామాన్య మానవప్రకరప్రవర్తన మనుసరించినచో, మీకు ధార్తరాష్ట్రులు పరాభవములో, ప్రాణాపాయములో కలిగించిన సమయములనే మీరు వారికిఁ బ్రతీకారములు సేయవలసి యుండియుఁ దగిన సాహా య్య సంపత్తి దొరకకుండుట నయ్యది యసమయమని మీరపుడు తలంచి మిన్నకుండి యిపుడు మీకు సాహాయ్యసంపద సమకూడినది గదా యని, సమరము సకలజనక్షయకారక మని యెఱింగియు, నిపుడు ధార్తరాష్ట్రులపై దాడి వెడలఁదలంచియే, యింత కాలము మిన్నకుంటిరేని, మీ రిన్ని యేఁడు లడవులఁ గడునిడుమలఁబడి యుండుటయు నధర్మము కాదనవలసివచ్చును. మీ రిపుడిట్లు వారిపై నెత్తిరాఁదలంచి యుండుటయే కావలయు మిము దుర్యోధనుఁడట్లు బాధలు పెట్టెనో కాయని తోఁపఁజేయుచున్నది. ఇపుడు నీకు సాయ మొనర్ప నెంచివచ్చిన రాజు లపుడు మాత్రము రా మని యనిరా? వారపుడు లేరా? అలనాఁటి రాజసూయమునకుఁ బూర్వము మీచే జయింపబడిన రాజులేకద మిము నాశ్రయింపవచ్చుటలు! ఈ కృష్ణుం డును ద్రౌపదీస్వయంవర కాలమునుండియు మిము సంభావించుచునే యుంట, మీరడవులకుఁ బో నియమింపఁ బడినప్పుడే, యిపుడు చేయఁదలంచిన యీ రణయజ్ఞ మొనర్చి మీ ధరణీ భాగముగైకొని

యుండిరేని, మీ రిన్ని యిడుమలఁబడకపోయి యుందురే! కాని సహజ ముగఁ దీవ్రవృత్తియే యెఱుంగని నీకీ పాపాకరమగు యుద్ధపుటూహ తగదు సుమా! కోప మెఱుంగని నీవు కోపసంభావితమును, ప్రజ్ఞావిరుద్ధమును నగు ఘోరతర కార్యమునకెట్లు తత్తరమునఁ దలపడుచున్నావోకదా!

"జనక్షయ కారకమగు యుద్ధమునకు నే నెదఁ దలంకెదనని పలుమా అనుచున్నావు గాన, నే నిపు డాడవలసిన మాటయొకటి లేకపోలేదు!

"ధార్తరాష్ట్ర వినాశమే నీ ముఖ్యోద్దేశము కానిచో, నీ తమ్ముఁడగు నర్జునుని దివ్యాస్త్ర సంపాదనకై తపమునకుఁ బంపునపుడు, మున్ముందుఁగ నీవు భీమునితో నాడిన మాటల యర్థమేమి? నీ రాజనీతి లోకోత్తరమైనది. మఱియు నీ కాలమున రాజనీతి పరులని యనిపించుకొనుచున్న వారిలో నగ్రగణ్యుండగు శ్రీకృష్ణుండుకూడ నీ పథమునకు లోఁబడినవాఁడె! ఏ సమయమున కేమాట యాడవలయునో, అది నీ వెఱిఁగినంతవట్టు శ్రీకృష్ణుండుఁగూడ నెఱుంగఁడనియే తలంతును.

"లాక్షాగృహ దహనము స్వయముగ భీమునిచే నొనర్పఁ జేసియుఁ దద్గృహదహనపు టపవాదమును దుర్యోధనుని మెడకుఁ జుట్టి, మరణమును నిషాదవనితకును, దత్సుత పంచకమునకును బంచి పెట్టి మీరు వెడలిపోవుట యందును;

"అట్టుల వెలువడిన వెంటనే ప్రచ్ఛన్న వేషులయి ద్రౌపదీ స్వయంవరసమయము వఱకును నందందుఁ బ్రాకులాడుట యందును;

"ద్యూతానుద్యూతానంతరమున మీ రడవులఁ దిరుగాడు నాఁడు ద్రౌపదియును భీముండును నిను యుద్ధమునకుఁ బురికొల్పుచుండ సమయము గాదిది యనియును, సమయము నిర్వర్తింపఁబడు నంతవఱకును మాటాడరాదనియును, వారిని వారించుట యందును;

"సమయనిర్వాహణానంతర మైనను సుసమయము వచ్చునందాఁక వేచియుండవలెనని వారిని శాసించుట యందును;

"మీలో మొనగాఁడని యనిపించుకొనిన యర్జునుని, ధార్తరాష్ట్ర వినాశము కొఱకు దివ్యాస్త్ర సంపాదనార్థము తపమునకని, యనిపిన పిదప మీరందఱును దుర్యోధనుని దాఁకికోడి తీర్థయాత్రల నెపమున, దీక్షాభంగ భయమునఁ, దక్కినవారితో నానాపర్వత వనాదులం ద్రిమ్మరుటయందును;

"మీరరణ్యావాస మొనర్చుచుండునాఁడే, మున్ముం దేజనావాసమున నజ్ఞాతవాసదీక్షను దీర్పఁగల మను నాలోచనము మన మునఁ జేసికొని విరటునగర మందుల కేర్పఱచికొనియే యరణ్యమున మీ విడిసిన తావులు మార్చుకొనుచుండుటలో మత్స్యదేశము దెసనే మీరు నడచి నడచి తుదకు సులభముగ నందుఁ జేరి మీ రేమి చెప్పిన నది నిజమనియే నమ్మి మిమ్మాదరింపఁగల యమాయకుండగు విరటుకొలువును జేరుటయందును;

"నీ రాజ నీతిజ్ఞత వెలువడలేదా? నా కన్నుల యెదుటఁబుట్టి పెరిగి విద్యాబుద్ధులఁ గఱచి, పరమవివేకివై నీవు పరమరాజనీతి పరుండవగుట నాకేమాత్రమును శిరోభారము లేదుసరిగదా, నామానసమునమఱియు నెంతేని గరువము కలుగుచుండును. కాని నీవు యుద్ధము వలదనుటలో, నీ సౌమ్యసమాధాన వాక్యములలోఁ గేవలము శాంతి కోరియేయనిగాని, మున్ముందు స్వలాభ చింతాలేశము లేక యని గాని, యనఁగలమా యను శంకమాత్రము లేకపోలేదు. యుద్ధచింత యేమాత్రమును లేదనియనుచున్న నీవు, ద్రౌపదీవివాహానంతర మొక వత్సరము మీరందఱును ద్రుపదునింటనున్న కాలాన ధార్తరాష్ట్రుల రూపుమాపు టెట్లను నాలోచన మీరును బాంచాలురును యాదవులును గలసి గుణించు కొనుచుండిరను వార్త వినియే కద భీష్మాదులు మిముఁ బిలిపించి, యింద్రప్రస్థము మీ కిప్పించి రాజ్యార్ధమున

మిము నిలువఁ జేసిరి. ఈ మాత్రము కార్యకారణ సమన్వయ మెఱుంగని వాఁడను గాను.

"ధర్మజా! ఇంతవఱకును జరిగినవేవో జరిగిపోయినవి—గాని యరణ్యాజ్ఞాతవాసములు నిర్వర్తించుకొనిన వెంటనే మాది మాకిచ్చి వేయుఁడని సుయోధనునకుఁ గబురంపి యుందురేని, 'పాండవులెన్ని యిడుమలఁ బడియున్నను సమయబద్ధులే' యని యెంచి దుర్యోధనుఁడు మీ రాజ్యము మీకేల యిచ్చియుండఁడు? మహావివేకివగు నీకీ మాత్రము తోఁపక పోయెనే? 'ద్రుపదపురోహితుముఖమున దౌత్య మొనరింప లేదా' యని యందువేమో! ఏమోగాని, ధార్తరాష్ట్రుల నరమున నిర్జింప నెంచి, సైన్యముల సమకూర్పుకార్యము మున్ముం దొనరించిన పిదపనే ద్రుపదపురోహితు నాకురుపతి కడకంపలేదని నీవు డనఁగలవా? ఆహవప్రయత్నములయందు మీరే తొలుత ముందడుగిడుటనె కదా, దుర్యోధనుఁడును మిముఁజూచి, తానును సహాయ మభ్యర్థింపఁ బెక్కురకడకుఁబోయెను! కడు శాంతాత్ముల మనుచు, సమయము కొఱకెదురు సూచి చూచి, మీరే తొలుతొలుతఁ గయ్యమునకుఁ గాలు ద్రవ్వుచుంటిరి కాని, సుయోధనుఁడే ముందడుగిడలేదే! ధార్తరాష్ట్రులచే నెన్నెని యిక్కట్టులు వడియు, మాఱుసేయక సైరించిన శాంతాత్ముండని నిను నీవారును, వారివారును, పలుమారనుచుందురేకాని,యసహాయస్థితియును నసమయమును బోయి, సహాయసంపల్లాభమును, సుసమయవీక్షణమును ప్రధాన కారణములుగ నీ వప్పటికి మాఱుసేయకుంటి వని, ధార్తరాష్ట్రులు మీ కొనర్చిన యగచాట్లకు వారలతోఁబాటు మాప్రజనెల్ల మడియింప సమకట్టిన నీ యాంతరంగికకఠినభావమును మాత్రము వారు గ్రహించి యుండరు కాఁబోలు నని యనుకొనవలసి వచ్చుచున్నది.

"ధర్మనందనా, కారణ మెట్టిదైననేమి జూదమున మీరోడితిరి

గాని, సుయోధనుండే యోడెనను కొందము. మీరప్పుడు వారల నడవుల కనుపఁ దలంపకుందురోటు! జూదమునకుఁ బ్రారంభించునపు 'ఓడుదు-నరణ్యావాసాదులొనర్తు-' ననునిశ్చయముతోడనె కూరుచుంటినోటు! గెలిచియుందువేని దుర్యోధనుఁడిప్పుడు నడిపించిన కార్యకలాపమంతయు—మానినచో, నాతని పూర్వజన్మవాసనాయుతములగు నొకటి రెండు పనులు మాత్రము మానియుందువేమోగాని—యంతయు — నీవును నడిపించియే యుందువు. ఇందెంత మాత్రమును సంశయము లేదు.

"కౌంతేయాగ్రజా!, పరబ్రహ్మమునందాత్మానుసంధాన మొనర్పనేర్చి, యెదిరి మానసము నొవ్వఁజేయనొల్లని, నీ కిపుడిట్టి పాపకార్యమునందెట్టుల మానసము లగ్నమయ్యెనో యని లోకులనుకొందురని నైనఁ దలంక వలదా? ఇంత క్రూర కార్య మొనర్పఁ జేయఁగల కాఠిన్యమును దుర్యోధనాదులంబోలె నింత రాక్షసహృదయంబును, నీ చిన్ననాఁటనుండియు లేని నీ కిపు డెట్టులలవడియెనోయి! ఐహికసౌఖ్యములు తుచ్ఛము లనియు వినశ్వరము లనియుఁ దలంచి కదా యడవులఁ గందమూల ఫలంబులైనఁ దినుచు దినములు గడపుదునని యెంచిన నీవు, కర్మసంబంధమగు ఫలమును వీడి, వైరాగ్యసంపన్నుఁడవై, పునరావృత్తిలేని మోక్షసంపాదనార్థమె, యోగాభ్యాస మొనర్చుట కైనఁ బ్రారంభింపవు. అఖిలజనక్షయము వలనఁగాని లభ్యముకాని రాజ్యసంపదవలనఁ బ్రయోజనము లేదను విజ్ఞానముతో, గర్మరాహిత్యమును బొంది, లోక సంగ్రహార్థముసత్యము, దమము, సౌజన్యము, జీవదయాళుత్వము, వదలిపెట్టక సంచరించుచుఁ గడకాలము పుచ్చితివేని, యింతపట్టును నీ వార్జించిన కీర్తియుఁ బ్రతిష్ఠయును శాశ్వతముగ నియ్యిల నిలువఁగలవు. దుర్జనులకు హితమగు క్రోధమును దిగఁద్రావి సుజనులకు హితమగు శాంతినే వహియించి జీవవధవలనఁ గలుగు నరకమును బొందఁ

దలంపును దప్పులకుఁ బాఱఁదోలి, తాలిమియె ప్రధానామూల్యాలంకారముగ నెన్నుచున్న నీ విదివఱకే గడించిన అజాతశత్రుండవను పేరు నిలిపికొనుము. నీవు వహించిన శాంతి యంతస్సున రగులుచున్న యగ్గిగ నుండనీయకుము. నీయట్టి సైరణపరుఁ డీ యిల లేఁ డను నానుడి మారనీయకుము. అనన్యసామాన్యమైన హాలాహలము మ్రింగిన నీలకంఠు నెన్ని పొంగి పొరలెడుకోపము దిగమ్రింగు ని న్నెన్నవలె. అట్టి నీవు శాంతింపవలెఁ గాని కాకున్నచో నీ పేరు కాలకాలములు నిలుచునే!''

సంజయుఁడు ధర్మజుం దర్శింప వచ్చినది మొదలు సంజయ ధర్మజుల సంభాషణము సాంగముగఁ దదేకధ్యానముగ వినుచున్న కృష్ణుఁడు తనలో—“ఆహా యేమిస్తోత్ర పాఠ పారాయణము! తా వచ్చిన కార్యము నిరాఘాటముగ నెఱవేఱుటకు ధర్మజు నీశ్వరునితో సరిపోల్చుచున్నాఁడు! దేవతలనైన మెప్పించునంతటి యోగ్యు వీరి కున్నను, మఱియు మఱియు నిక్కట్టులం గుడువుమనుచున్నాఁడే! కౌరవులను దుశ్శీలురనుచు, నట్టిరు పాలీయకున్న, మీరు నడయ దలంచిన రక్తాన్నముకన్న, మీ సత్ప్రవర్తనకు భిక్షాన్నమే మిన్న యన్నాఁడు. ఔరా! ఎంతదారుణము! తుదకు బికిర మెత్తుకొని జీవింపు మనినాఁడు! రాజులకిచ్చుచోటే గాని యడిగి కోలులేదని యెఱుంగఁడు గాఁబోలు! బ్రాహ్మణ ధర్మము నూతఁగాఁగొని, నృపధర్మమును దిద్దఁబోవుచున్నాఁడు! ధర్మములంగూడఁ దారుమారొనర్పఁ బ్రయత్నించుచున్నాఁడు. ఆహా! ఏమి బుద్ధివిశేషము! ఏమి వక్తృత్వము!—''

అని తన మనమున ననుకొని కృష్ణుండు మిన్నకుండి వారి సంభాషణ వినుచుండెను.

—ధర్మరాజు—

“సంజయా, నయసంభాషణంబులం జొప్పి నను నిందించు

చున్నావని నే నెఱుంగనివాఁడనుగాను; కాని, కార్యారంభమునఁ గొన్ని కర్మంబులు ధర్మంబులుగాఁ జూపట్టినను, బదంపడి యా ధర్మములే, యధర్మములుగా మారునని యెఱుంగవోటు! మఱియు గొన్ని కర్మములు, తొలి తొలి యధర్మములుగాఁ గానవచ్చియుఁ దుట్టతుదకు ధర్మస్వరూపము నొందుచుండుఁ గావున నా చేయు నది యధర్మంబని సహేతుకంబుగ నిరూపించి, పిదప ననుదూఱుము. ఇంతియగాక, వంశదూషకులును, లోకకంటకులును నగు వారిని నిర్మూలనంబొనర్చుటయే ధర్మంబను పెద్దలమాట నీవు విని యుండవో! సంగ్రామంబు క్షాత్త్ర ధర్మంబుకాదని నీవు నిర్వచింపుము; చూతము. ఇంతకును, మనకిది కర్తవ్యం; బిది యకర్తవ్యం-బని వచియించి, మనల శాసింపంగల వాసుదేవుఁడిటనుండ మన కీ వితర్కమేల? ఈతండు ధర్మాధర్మ విదులకు గురుండు; కార్యాకార్యనిరూపకులకు శిక్షకుండు; ఉచితానుచితజ్ఞులకు మార్గదర్శి. ఈతని మఱియు సమస్త పురుషార్థములకును మూలంబగుట నీతని చెప్పెడి చొప్పు మన కెల్లరకును నవశ్య మనుసరణీయంబయగును."

అని ధర్మజుండు కృష్ణుని దెసంజూచుచు నిన్నకుండెను.

అంత నందనందనుండును సంజయుదెస నవలోకించుచు, వేడ్కతో నిట్లని వచియించె.

—కృష్ణుఁడు—

"పాండు పుత్త్రులకు శుభమునే కోరుదును. పుత్త్ర పౌత్ర మహిమోజ్జ్వలుండగు నాంబికేయునకుఁ జేటు మేలుకాదందును. ఇంతవఱకును గథాక్రమం బెట్లునడచినను, నిపుడా ధృతరాష్ట్రుండు తెలివొంది, యీ పాండవులఁ బలుకులఁ దేర్చుటకు నిండుమనంబున నిన్నిట కనిపినందుకు నే నెంతేనియుఁ బరితృప్తుండ నైతిని.

"ఆత్తని పనుపున వచ్చిన నీవు వివేకమూర్తివి కావున నుచిత మార్గమున, స్నేహము వినయము బాంధవమును సమ్మేళన మొనర్చి,

వీరు శాంతిని బొందు విధంబున, నీకుఁదోఁచిన ధర్మముల బోధించి పలుకఁ గలిగితివి. కాని నీ నుడివిన విధానమది యెంత యొప్పిదమని నీవు దలంచినను, పాండవాగ్రజుని పలుకులరీతిఁజూడ, సంధిపొసఁగదు కా యని తోఁచెడిని. ఇంతకును, నున్మత్తుండగు దుర్యోధనుని, సుతు వాఁడౌ ధృతరాష్ట్రుని, మనము కొంత కొంతయైన నెఱుంగని వారము కాముగద! నీవు కడునేర్పరివి గనుక, ఆపేఁడు వీరిదెసఁ జూపుమైత్రియును, గారాబమును, గడుఁదీయని నీ మాటలచే వన్నెవెట్టి చెప్పుచున్నావుగాని, వీరిభాగము వీరికొసంగకయె, మధుర మధుర ప్రసంగములతో నీకార్యము గడతేఱు ననుకొందువా? వీరిది వీరి కిచ్చివేసినచోఁ గౌరవులింతదాఁక వీరికొనర్చిన పరిభవములనెల్ల సైరించి, వానిని మరల మరల మనములఁ ద్రవ్వకొనక, శాంతులై వారలతోఁగూడి వీరు జీవింపఁ బూనుట, వీరి కరుణార్ద్ర హృదయత్వమును, శాంతాత్మతయు, జగంబున శాశ్వతముగ నిలుచుటకుఁ గారణములగును. అటుగాక, వీరికేమి యొసంగుటకును ధార్తరాష్ట్రు లొల్లనిచోఁ, దమస్వత్వములఁ గౌరవు లపహరించిరని వీరు వారిపై నెత్తివచ్చిన నెత్తివత్తురుగాక! అందేమి ద్రోహమున్నది? వీరవమానము నొందియు, నిటుల నణఁకువచే వారికి లొంగియుండుట కంటెఁ దమ యౌజ్జ్వల్యముచే, శత్రులనుదాఁకుట యేల కర్తవ్యము కాదో? ఎంత విచారింతమన్నను యుద్ధమే వీరికి మేలుగాఁ దోచుచున్నది.

" 'రాజులకు యుద్ధము ధర్మమగునా కాదా చెప్పు' మనికదా యుధిష్ఠిరుండు నన్నడిగెను. ద్విజులగు బ్రహ్మక్షత్రియ వైశ్యులకు యజనయాజనాదికర్మకరణవిభాగంబు ధర్మశాస్త్రాచార్యులు విధించునపుడు, రాజు లిచ్చువారేకాని, వేడుకొనువారు కారని యయ్యాచార్యులు సూత్రీకరించుట లోకప్రసిద్ధము కాదా! అనదలై యున్న వీరికి నీవు చెప్పెడి శాంతధర్మములు మీా దెఱుంగక కడు

మోహాకులై చెడుతెరువునం బోవుచున్న, కౌరవులకుంగూడ నీవు చెప్పవలదా!

“సంజయా, త్రవ్విన కొలఁది పెరుగునుగదా యని యూరకుండవలసి వచ్చుచున్నది గాని, కానిచో, నాఁడా సభలో వేయి మందియెదుట—నది యెంతపగయో కాని, ద్రౌపదిని—వారెట్టి తులువలును గాకపోయిన—నట్టులిక్కట్టులఁ బెట్టెదరే! జూదము లాడుట లోకమున లేదే! ఇట్టి సంప్రదాయమొందేనిఁ గలదే! మొదటి జూదమున వీర లోడుటం జేసి రాజ్యమును ధనమును సంపదయుం గోలుపోయిరిగా యని యాంబికేయుండు గరుణించి, వీరి రాజ్యమును ధనసంపదయుం గూడ మరల వీరికొసంగుటఁ జూపోపమి దుర్యోధనుఁ డనుద్యూతము నేర్పఱచి, సౌబలునిచే—‘ధృతరాష్ట్రుండు మిమ్ముఁ గరుణించి, ధనసంపద్రాజ్యంబులను మీకొసంగి సత్కరించెను; గావున నీద్యూతంబున వాని నొడ్డందగదు. అపూర్వంబైన పణంబు నొకదాని నిపుడొడ్డంబూనవలె; ఇట్టి యపూర్వంబైన పణంబొడ్డి యాడి, యం దోడు వడిన వారు, నారచీరెలుగట్టి, వన్యమూలఫలంబుల నారగించి బ్రహ్మచర్యాశ్రమంబునం బండ్రెండేడులు విపినావాసంబుచేసి, పదుమూఁడవయేఁట జనపదంబున గూఢచర్యను జీవింపవలె; ఇందెఱుంగంబడిరేని, మరల నరణ్యాజ్ఞాతవాసంబులఁ గ్రమంబున నిర్వర్తించువారు సక్రమంబుగ నరణ్యాజ్ఞాతవాసంబులం దీర్చికొని యేతెంచిన వారు యథారూపంబున వారి రాజ్యంబు గైకొని యేలుకొందురు” అని కదా యుద్ఘాటింపఁజేసిరి. అట్లయ్యును ధర్మజాదులు సమయము నిర్వర్తించుకొని మగుడివచ్చుసరికి, వీరిరాజ్యం బాకౌరవులు గైకొంట యేకాలపునీతి? ఏ నాగరకప్రపంచమున నిట్టివిడ్డూరంబు గలిగె? వీ రడవులనున్న కాలమున వీరి సంపద్రాజ్యములఁ గాపాడుభారము తమకెంత కలదని యనసాహసింతురో, సమయము నిర్వర్తించుకొని వచ్చిన పిదప, యథారూపమున వీరి సంప్రద్రాజ్యంబులు వీరికొసం

గుటయందుఁగూడ వారికంత భారమును కలదని యెఱుంగవలదా? ద్రుపదపురోహితు ముఖమునఁ గబురంపిన పిదపనైన, వీరిది వీరి కొసంగక యింకను దమస్వాధీనమం దుంచుకొనుట, మఱియు నను భవించుట లే నాఁటి రాజనీతులు ?

"మయసభాది నిరుపమసంపదలయందలి మక్కువచే, ధర్మజు ప్రతిష్ఠయెడ నసూయచేఁ బాండవుల నెట్లయిన దవ్వులకుం బాఱఁ దోల నెంచియుండ నోపు. కానిచో నేకాలమునసైన జూదమునం దోడినవారికి విపినావాసమును గూఢచర్యయు విధియించుట యను విద్దూరంబైన పణంబు వింటిమే? పాండవుల నెట్లయిన దేశభ్రష్టులఁ జేసి పెద్దకాలము సిరుల కెడఁజేసినచో వీరలు తమ సమయము నిర్వర్తించుకొని మగుడి వచ్చినను జిరకాలపు టెడఁబాటు ప్రజాను రాగ బాహ్యులుగను, దమ సంప్రదాజ్యపు టధికార భ్రష్టులుగను, జేయునుగదా యని కానోపు పాపము దుర్యోధనుఁడు వంచన సేయనెంచెనే కాని ధార్తరాష్ట్రుల మూలమునఁ బాండవు లొందిన పరాభవముల కెల్ల వీరుమారుసేయక ప్రశాంతముగ సైరిం చుట ప్రజానురాగమును మఱింత వీరిదెస నభివృద్ధినొందించి జయ సూచక చిహ్నములనే శతాధికగుణములుగ మార్చివేసినదని యిప్పటికిని మన దుర్యోధనుఁ డెఱుంగఁడు గదా!

"సంజయా దుర్యోధనునే యననేల? ఆతనికిఁ దండ్రియేకదా ధృతరాష్ట్రుఁడు? లేని మన సెఱుంగనికారణమున భీష్మాది కురువృద్ధు లందఱును నాజూదపు సభయందుండియుఁ జూచియు నోరెత్తఁ జాలకకదా యూరకుండిరి. తన కుమారులబుద్ధి మరల్పఁ దగినట్లు గట్టిగాఁ జెప్పుట కైనను ధృతరాష్ట్రునకు నోరువిడలేదు. కాని య ప్పట్టునఁ దాను దనకొడుకుల దుడుకుఁదనము మాన్పఁగలిగినచో నేనే యననేల లోకములెల్ల సంతసింపవా? అంతటి పుణ్యమా తనకును మనకును !

"పాప మా పాంచాలిని దుస్ససేనుఁడు దయావిహీనుఁడై, యా కొలువులోనికిఁ దలపట్టి యీడ్చి తెచ్చినది యపుడా రాజేట్టుల సహింయించెనోకద! తనకోడలి యేడ్పు తెలుంగు నా మామ యెటు లోర్చెనోకద; యిపుడీ శుష్కపిప్రియోక్తులతో నీ ముఖమున నీ రాయబార మంపుట కెటుల నేర్చెనో గద! పాంచాలీఁ దిభవ సభ నలంకరించియున్న వారిలో నొకరుంజయిన నిది తగ దని యడ్డు పడక చిత్తరువుల యాకృతి నొంది నిలిచియుంటఁజూచి, పాప మమ్మానిని, తన మానసిక బలముచేఁ దననుదాఁ గాపాడు కొనుశక్తి గలిగి యున్న కారణమునఁగాని, కాకున్న నక్కురుసభ నింకేమేమి విస్తారములు పుట్టియుండునోకద! ధర్మజు సహనమె, కౌరవులనట్టుల పైపైఁ బడఁజేసినదికాని, కాకున్న నచ్చపు రాకొమరులేకాలమున నైన, నిట్టిభంగపాటుల పాలయ్యెనోర్చి,— గెలిచినను, గెలువకున్నను ప్రతికిప్రియాహరహితులయి—యుంట వింటివే! ఇంతతోఁ గథ పరిసమాప్తము నొందెనె ననుకొంటివా? కర్ణుఁడెంతేసి మాటల నాడిపోసె ననుకొంటివి? ఆ సభలో నమ్మానవతీ శిరోమణికి భర్తలు లేరఁట! ఉన్నవారు జూదమున నామె నోడి విడిచిరఁట! ఇఁక నాసభనున్న వారిలోఁ దనపైఁ గూరిమి గల మగని నెన్నుకొనుమనికూడ ద్రోవది నానాడుట నీ వెఱుంగనిది కాదే! పాప మా మాట యయ్యాజ్ఞసేనకు వాగ్రూపకమైన బాణమై హృదయమున నాటి యింకను గదలకయున్నదిగదా! ఇందుకేమందుము? కర్ణుఁడే యట్టులనియెఁగదా, నేనేల యూరకుండవలెనని కానోపుఁ బాపము దుశ్శాసనుండును దలయెత్తి పాండునందనులదెసంజూపుచు—వీరందఱును గొడ్డువోయినవారలనియును, పౌరుషంబుగల మానిసి యిం దెవ్వండనియును, ననియెఁగదా! దుశ్శాసనుం డనినట్టులు నిజముగ వీ రందఱును నింత కాలంబును గొడ్డువోయిన వారలే యగుదురు. వీరి వలన వారికేమి ప్రతిక్రియ లభించినది గనుక! అనవలసి వచ్చినది గనుక, యంటిని

గాని, యలనాఁటి యా సభలో మఱియుఁ బడిన పలుకు లన్నియు నిపుడుగ్గడింప వలసినవి యయ్యును, దూతవగు నీ వచ్చిన సంధికార్యము మఱియు దుర్ఘటంబగునుగదా యని వెనుకముందు లాలోచింప వలసి వచ్చుచున్నది కాని, కానిచో నలనాఁడు జూదమున నోడిన వారు నారచీరెలుగట్టి యడవుల కేగుతఱి, దుస్ససేనుఁడు వీరిని దఱియ వచ్చి—మీరు చచ్చినట్టివారు; అడవులంబడి కడు నిడుమలఁ గుడువుం-డని యుద్ఘాటించి, వీరిపై షండతిలలను విసరిచల్లెఁగదా! మా దృష్టి దాటినంతనె, మీరు చచ్చితిరని యానందించి, ఆశౌచస్నాన మొనర్చి మైలవడుటను దీర్చికొందుమని నొక్కి వక్కాణించి పాండవులు తమ్మువీడి నాల్గడుగు లిడినంతనె మృతాశౌచస్నాన మొనర్చి తడి యుడుపులతో నిలిచి పాపము దుర్యోధనుఁ డానందించి, తనభ్రాతృవర్గమును, రాణివాసమును, దక్కుంగల జ్ఞాతివర్గమును, స్నాతులుగ నొనర్పఁగా లేదని యిన్నియు నెఱింగిన నీవు మాత్ర మనఁగలవా? అనంతరము ధర్మజాదులంగూర్చి ప్రసంగము వచ్చినపుడెల్ల మృతకళేబరములంగూర్చి మాట్లాడినట్లేకద యాతఁడు పలుకుచుండును! మఱియు వీరు వీరి సర్వస్వము నోడిన పిదప, మఱియు నొడ్డ నింకేమి కలదని ధర్మజుండనుకొనుచుండ,—నాలినొడ్డు—మనిమీసాబలుండన లేదా? ఇట్టివియెల్లఁ బాపమువీరిమనసులగాటముగ నాటుకొనియుండఁ ‘బోరుగాక వేఱేమగు!’ నని, నీతో ననవలసియే యున్నది. అట్లగుట నిప్పటికి ధర్మజు ధోరణింజూడ నీ వచ్చిన కార్యం బశక్యంబని తోచెడిని.

“ఇఁక నీవు పాండవులను గర్మరాహిత్యమును బొందుమను నూహాను బలికిన పలుకులందలంతుమన్న నదియొక పెద్ద విషయము. వైరాగ్యమువలన ముక్తులగుదురని కొందఱందరు—కాని సంసారమున నున్నవారికి, ముక్తికిఁ బెక్కు దారులు పెద్దలు చూపిరని నీ వెఱుంగవోటు! వైరాగ్యంబన నది మీదిమీది యన వాటంబుగాదు;

కర్మానుష్ఠానంబునకుఁగాని దుర్బలులు వైరాగ్యంబె యభివర్ణింతురు. కాని కర్మము వలననె సృష్టియంతయు నడచుచున్నదని యెరుంగమిం గద నెంతెంత మూర్ఖునకైన వాటంబగుచున్నది. కర్మపరిభావంబు సిద్ధించుటచేత నేకద దివిషదులు దేవత్వమందుటయు, గాలివీచుటయు, నగ్ని వెలుఁగుటయు, విధువు పక్షముల మార్చుటయు, నదులు ప్రవహించుటయు బొసఁగుచున్నవి. అనుల్లంఘనీయమగుకర్మమది యెంతో బలవత్తరమైనదియు గాకుండిన, దానెంతటి సమర్థులైయున్నను నీ పాండవు లింతకాలమును కర్మమునకుఁ గట్టువడియేఁగదా, యిన్ని యిడుములఁ గుందుచు, రాజధర్మము లెఱింగియుంగూడ, దమకుఁ రాఁదగిన రాజ్యభాగంబు కౌరవులు మొదలంట ద్రోచుకొంట చక్కఁగ నెఱింగియు, నింకను వీరు మీఁనమేషములు లెక్కించుకొనుచునుం గూడ వేచియున్నారు. కాని సంజయా, కంటికే కావరాకుండ దొంగిలించిన వాఁడును, నెట్టయెదుట నిలిచి బలాత్కరించి సంపద నపహరించిన వాఁడును, వీరిరువురును నిందార్హులేగాని, మీధార్తరాష్ట్రులీ రెండు తెగలలో నేతెగలోనివారో నీకునుఁ దెలియదో!

"ఇక నీ మృదూక్తులచే వీరు మెత్తపడకున్నను, నీ కార్యంబశక్యంబైనను నేను పాండవులను ప్రబోధించియైనను, కౌరవుల కడకువచ్చి, కౌరవులకు బుద్ధులు చెప్పి చూచెదను. లోక కళ్యాణకరముగ వారలు పాండవులకుఁ జెందఁదగిన రాజ్యభాగంబు వారికొసంగిరేని, మృత్యుపాశమ్ములనుండి తప్పియుందురు. ఇందుఁ దగవును నేర్పును నామీఁద నిలిచియుంట, నాకుంగీడు లేదు. అన్యాయ విరహితమై లోకకళ్యాణప్రదమై శుభంకరమగు నా పలుకులకు వారొడంబడక కేరడము లాడిరయేని, వారిలోభమను చిచ్చు నలుఁగడల రేగి, వారినే భస్మము చేయందగు. ఇందుకుఁ బాండవ బాణాగ్ని యవసరమే కానరాదు. కాని కలయికమనికియుందుఁగల

గౌరవమును ప్రయోజనమును గౌరవులకుఁ దెలియుమి తోలిమాండియు మనకుఁ దేటతెల్లము.

"ధృతరాష్ట్రుండును బుత్రులునుసను వనమునఁ గుంతీపుత్రులు సింహములు కారా? సింహములు లేని వనము నెవరు కొట్టుకొని పోవరుగనుక? వనావృతముకాని సింహములు మాత్రము సేమమున నుండఁగలవా? కావున వారును మీరునుం గలసి పొందికతో జీవించుట మేలని నేను స్వయముగఁ జెప్పఁ బూనుదును. సంజయా! పాండవులు కౌరవులకుఁ బరిచారకులై యుందురు. శత్రుకోటి నెదుర్కొని నెదుర్పఁగలుగుదురు. అట్టి వీరిని వనకొడుకులతో సమముగఁ జూచుకొనుట ధృతరాష్ట్రున కెంతయు నొప్పిదము కాదా! అతఁ డొప్పినను, నొప్పకున్నను, నే నీపని కటకు స్వయముగ వచ్చెదను. అందువలన నే మేముఖ్యాతి గడింతుము. కావున మా మత మెల్ల నమ్మానవనాథునకుఁ దెల్లము సేయుము.

**సంజయుఁడు:**—అట్లయినంగడు లెస్స; నావచ్చిన కార్యంబు దీరినది.

భీమార్జున నకుల సహదేవ సాత్యకి ద్రుపద విరాటాదులం జూచుచు "మీయందఱచే ననుజ్ఞాతుండను. పోయివచ్చెద. నా యిపు డాడిన పోడిమి యందేమియు ననుచితములును, ననయములును, ససభ్యములును, ససందర్భములునునగు పలుకులు లేవుగద!'' యని సంజయుండు లేచి నిలువంబడియెను.

ఈ చివర పలుకులువిని పాండవాగ్రజుండును "నీ విపుడాడిన పలుకుల యందేమి యనయము లుండగలవు? ఒక్క మాటయైన ననుచితమైనది లేదే! నీవు చెప్పినట్లుగాక, యింకెట్లు చెప్పనగును? ఎదిరినిగూర్చి యున్నది యున్నట్లు చెప్పుటకు నీవుజంకవు. సహజముగా నీవు దుర్ణయములును, గఠిన భావములు గలవియును, వర్ణాశ్రమనిర్ణీతధర్మములకు విరుద్ధములును నగు పలుకులు నీ నాలుకకు రానేరవు. వ్యాసశిష్యుండవును, నయోన్నతుండవును

నగు నీవు గాని నాకు నయవిదుండగు విదురుండు గావలె—నిట్టి పట్టుల చేతోకరు గాఁగలరా! ఈ విషయము నీ నేర్పును నింకొకని కలవడఁ గలదా?

"ఇంత కేమి గాని, నీ వటఁ జేరిన పిదప నాకుఁ గడుంగూర్చు వారగు గురుకృపపితామహాదులఁ గాంచి, నా నమస్కారములు వారికిఁ దెలియఁజెప్పి వారి సేమ మడిగితినని ప్రశుతపలుపుము.

ప్రకృతిదుర్లలితుండును, నాజన్మపాండవద్వేషియు, నైశ్వర్యమదమత్తుండును, గ్రూరపరాక్రముండును, దురుద్యోగియు, నగు దుర్యోధనుని యోగము నరసితిననుము. అతని తమ్ముఁడే యనఁదగు నా దుస్ససేనుని కుశలము నడిగితినని నుడువుము. వారి కుమారవర్గము యొక్కయు, వనితాజనంబుల యొక్కయు, సౌఖ్యము నెఱుంగఁ గోరితినని పలుకుము. సకల కష్టదశలయందును భగవంతుం బోలె జనకునిం బోలె మమ్మరసి రక్షించిన విదురునిఁ బ్రశంసించితిననుము శల్యుం జూచి, మా తాతని దెస ననయము గల వినయము దెల్పి, తానమాకు విజయమూల మని తెలిపి, మా యందలి భక్తియుఁ దెలుపుము. ద్రోణసుతుం గౌఁగిలించితిననియు, బాహ్లిక సోమదత్త భూరిశ్రవః ప్రముఖుల నెల్లయెడల మా వెసదలఁ దలంచుచుందుమనియు, వంశవంతులును వయోవృద్ధులును నగు ధరణిపతులను, కర్ణ, శకుని, సైంధవాదులను, మిగిలిన రాజకోటిని, యుద్ధసన్నద్ధులై గాంధారాజనకుఁ దోడువచ్చిన సకలవిషయాధిపతులనుం గాంచి, వారి వారి ప్రణామవినయబాంధవమైత్రీవాత్సల్యంబులకు నెట్లెట్లు తగునో యాయావిధంబుల నా మాటలుగా నీవు సంభాషించి, పలుకుము. నీవుపోయిన మొగాన నే కురుపతి కడ నుడువఁదగినది చెప్పియే యుంటిని.

పిదప నిండుకొలువునందు మాయయ్యతో నిట్లనుము.

"కురురాణ్మణీ, నీ యాశీఃపరంపరలబలంబునఁ, బాండునందనులు కదాప్త బంధుజనసహితంబుగ సుఖముగనున్నారు. పాండురాజ రాజ్యపరమునఁ దత్సుతులను నిలిపి, చిరుతప్రాయమునుండియు, వారికి రాజ్యమేలెడినేర్పు నలవరింపఁజేసి వారికిఁ రాఁదగినవని నీకుఁదోఁచినపదవులిచ్చివారినిఁబ్రోచియు, నీనాఁటికి వారియెడ నుపేక్షఁజేసి, దయావిహీనుఁడవై, పాండుసుతులు కూటికినిగుడ్డకును వెలియయి వారు పొందరాని బదవలఁబొదలుచుండఁ, జూచుచు నూరకుండుట నీకుఁదగునే? మనకుఁబడనివారికి గుండెగాలమై యుండునట్లు, మన రెండు కుటుంబములవారును గలసి మెలసి వెలయుట లోకకళ్యాణకరము కాదా?"

అని పిదపఁ బితామహుంజూచి యిట్లనుము:—

"ఓ మందాకినీ నందనా! అపుత్రకులైనవిచిత్రవీర్య, చిత్రాంగదులయనంతరము-అడుగంటిపోవుచున్న శంతనుని యన్వయము నట్టేయడఁగిపోనీయక, మరల నీబోధనవలన— శంతను నన్వయమును నీవపెంపొందఁజేసి, మేమెల్లరమును జననము నొందఁజూచి, యిపుడు నీ పౌత్రు లిట్టులధర్మమునకును, లోకపుసడికిని, పాల్పడియున్న సమయాన వారికి సద్బోధనముచేసి రక్షణనొసంగినచో, భూజనంబులును, భూసురులును, భూజానులును నినుమెచ్చుకొనరే! ఇంతలు పుట్టినను, నౌదార్యమును, సహనమును ప్రధానాలంకారములుగాఁ గల ధర్మజుఁడు యుద్ధసంపర్కము కోరఁడు సరిగదా, యుద్ధము మాటయైనను వినసహింపఁడుసుమా—"యని యాసభఁగల బుధజనులెల్లరును, వినునట్లుల నుచ్చైస్స్వరమునఁ బలుకుము. మఱియు నదే సమయమున నా సభనున్న వారందఱును వినునట్లు సుయోధనునితో నిట్లనుము:—

'బాహుబలమున నీకుఁదీసిపోవని మమ్ము సామాన్యజనముగా నెంచి; బలహీనులను వెడలఁగొట్టినరీతిని వెడలఁగొట్టిన యప్పటి

దుర్మానమిశ్రితమౌ నీ నిరంకుశాధికారపు పెత్తనమును దన విశాల హృదయముతోఁ బాండవాగ్రజుండు సైరించె;

'వంచనచే మము నడవులకనిచి దుర్గమారణ్యములను, గొండ చఱియలను బెద్దకాలము వేధించిన యలనాఁటి నీ కఠినతను, నీ యెడఁ జాలిగరంగు హృదయముతోఁ బార్థుండు క్షమియించె;

'నిండుకొలువునఁ బాంచాలినిఁ దలపట్టి యీడ్చి నలువుర ముంగటికిం దెచ్చిన తన తులువఁదనమును భ్రాతృభావంబున నిండిన సదయహృదయముతో వృకోదరుండు సహియించె;

'నీ దురుసుఁదనంపుఁబలుకులను, గార్యములను బాండుపుత్రులొక్కొక్కరె నిన్నుక్షమియించిరి కావున నీకనైనఁ గురువంశీయులసందఱి నాలమున నిట్టి దిగమ్రింగికొనక నొరుల సొమ్మున కాసపడక వారిదివారి కొసంగి వారును మీరునుంగలసి క్షీరోదక న్యాయమునఁగూడి జీవింపుఁడు—'

అని మోమోటమికోడని వాఁడవు గాన నీవు మరవక పలుకుము. మేము యుద్ధము కోరము; తనతోఁ బొందికతో జీవించుటయే కోరుదుము. తనకుఁగల దురాశాపిశాచము, దుర్మానపిశాచము, దురహంకారపిశాచము, నను నీ పిశాచ త్రయబల మత్యధికమగుట నే నింతదూరము చెప్పవలసివచ్చినది. తనపక్షమునన్నున్న యోధాగ్రేసరు లెంతటివారైనను లేకుంట సత్య మేయైనను, ధర్మమును, గృష్ణుండును, మాకుఁ జేదోడు వాడోడుగనుండ, మముఁ గెలువ నెరికిని సాధ్యము కాదు. భీమసేనాదులకును దుర్యోధనాదులకును నేను బెద్దవాఁడనగుట, వీరును వారును గలసి, నాయభీష్టమునకు భంగము వాటిలనీయక, యింకను నన్యాయాసము పడనీయక, కయ్యములు మాని యెవరి యర్థము వారనుభవించుచు, వారును మేమునుం గలసి కడమ

కాలమైనను బుచ్చుట, మనకును మన పెద్దలకును, లోకమునఁగల బుద్ధిమంతులకునుంగూడ పరితోషము కాదె!

మాకు రాఁదగిన దంతయు నొసంగ నొల్లక యింకను లోభోపహతుండయ్యెనేని, (1) కుశప్రస్థము (2) వృకస్థలము (3) మాకంది (4) వారణావతము నను నీ నాల్గు తావులును నింకొక్కటి యెందైనను నియ్యైదు స్థలములును మా యైదుగురకు నొసంగి మము మననిమ్మనుము. ఇట్లయిన మనవంశమ్మునకు యశమ్మును దెచ్చినవార గుదురు. శత్రురాజులకుఁ బాణిగొడ్డములమై యుందుము. మఱియుఁ గురుయాదవ పాంచాల మాత్స్యసమ్మేళనము పరస్పర ప్రేమాస్పదమై, దిగంతవిశ్రాంత కీర్తివంతమై నెగడఁగల దని యమ్మహాత్మునకుం దెలియఁజెప్పుము."

—కృష్ణుఁడు—

[తనలో] అన్నా! ఎంతవాతప్పొనర్చె నీ ధర్మజుఁడు? సైఁచి సైఁచి, తుట్టతుద కొక లేఁబలుకు పలికి గొంతుమీఁదికిఁ దెచ్చుకొని, తన్ననుసరించియున్న వారింగూడ శృంఖలాబద్ధులం జేయుచుండును. రాజసూయము నొనరుపఁ జేసి, తనను బెద్దఁగ నందఱంగీకరించునట్లొనర్పఁ జేసి, తనయుద్ధతి సిద్ధాంతపరుపఁబడిన పిదప, భ్రాతృవర్గమె యగుఁగాక, క్షాత్రధర్మమె యగుఁగాక, జూదమునకుఁ బిలిచిరిగాయని పోకుండ నుండరాదని క్షాత్రధర్మవిరుద్ధమని, తలంచి జూదమాడుటయే మొదటి పొరపాటు; తన్మూలమున నొదవిన యగచాట్లనుభవించియు, స్వరాజ్యమును గోలుపోయియుఁ గట్టకడను శాంతింపుండను సంజయుని రాయబార మిపుడా యనియైనఁ దలంపక యె యైదూళ్లైన నొసంగిన మే మూరకుందు మనుట తమయసమర్థతను వెల్లిగక్కు నీ ధర్మజుని ప్రత్యుత్తరము రెండవపొరపాటు! జూదపుటాట నాపరోక్షమున నయ్యె నను కొందమన్నను, నా ప్రత్యక్షమున నింత

లేతపలుకు బలికెనే యీ యుధిష్ఠిరుండు! సంజయుండిపుడువోయి, కురుసభ నీ పంచగ్రామసంధి వాకొనియెనేని, ధర్మజు మహానుభావంబు గుర్తెఱుంగక, యీ పాండవుల నందఱు నలసులుగ నక్కారవులు దలంచి, పై పైఁ దలకొందురు. ఇందు కేమిసేయవలయు! ఇంకేమేమి వెలితిమాటలు వచ్చునోకద!

సంజయుఁడు:—యుధిష్ఠిరప్రభూ, దేవరయానతి నతిక్రమింపక, యట్లనె మనవిసేయుదును. నీకును, దమ్ములకును, వాసుదేవునకును నెట్లు ప్రియం బట్లె జరుగుంగాక !

అనుచు సంజయుండు ధర్మజునకునమస్కరింప, ధనంజయుండు సంజయుదెస నవలోకించి,—

"సంజయా! నీవుమాకును బాలసఖుండవు; నీ మంచితనము మే మెఱుంగనిదికాదు; శైశవలీలల కాలమునుండియు, వారిదుశ్శీలత నీ వెఱుంగనిదికాదు. కౌరవసభలో నానాఁడును, మా యారణ్యావాసకాలమునాఁడును, నిచ్చట నీ నాఁడును, నియ్యాజాతశత్రుని కృపాహస్తాంకుశ మా మత్త గజేంద్రాకృతియైన మాభీము నంరంభము నాపివేయుటకుఁదగినంతదయియుండ ధార్తరాష్ట్రుల కేలనోకద నీతిమార్గావలంబనమును, శాంతాత్మయును గలవారలకుండఁదగిన విచారక్లేశములు!"

ధర్మ—ఇపుడా ప్రసంగముతో నేమింపనియోఁగు ఫల్గునా! కారణకార్యము లెఱింగిన సంజయుని సత్కరించి, సగౌరవంబుగ వీడ్కొలిపి, సంజయునిచేఁ గాఁదగు కార్యంబును బ్రతీక్షించుటయె మనకిఁకఁ గర్తవ్యంబు—

కిరీటియుఁ దన యన్నయాన సంజయుని సత్కారపూర్వకంబుగ సాగనంపి, మరలివచ్చి, తన యన్నగారితో మఱల సంభాషించుటకు ప్రారంభించెను.

అర్జు—భవదాజ్ఞాబద్ధుఁడనై సంజయు నంపకము నెట్టి వచ్చితిని గాని, యా సంజయుని రాయబారపుఁ బరమార్థ మేమియని ?

కృష్ణు—ధనంజయా, సంజయుని సంభాషణమంతయు సాంతముగ వినివిని కూడ, నిట్లడుగుచున్నా వేమి?

అర్జు—ఆతని సంభాషణములో మాభూభాగము మాకిచ్చుమాటే లేదే!

కృష్ణు—అంతవఱకైనను గ్రహియించితివికద చాలును—ధార్తరాష్ట్రులు మీకీయరుగనుక మీసంపద మీరొందు తలంపున, మీరుపోరాదఁ జేసినచో, నేతన్మార్గమున మీ కొదవెడు రక్తపుఁగూడుకూడదనియు, మీకు దినసన్నము లేదంటిరేనిఁ భిక్షమెత్తుకొని జీవింపుఁడనియు, మీకు నచ్చఁ జెప్పుటయే సంజయు పలుకులకుఁ దలకట్టు.

— ధర్మజుఁడు —

"దేవకీనందనా, మనయర్జునుని పలుకులకేమిగాని, సంజయుని దేమి నేరము? యుద్ధమువలనఁ గలిగెడు జనక్షయమునకు నే నెంతఁ కుందుచుంటినో పాపము సంజయుండును అంతియ విచారించుచు, మాది మాకిచ్చుటకుఁగాని, మాకు గ్రాసవాసములకగునంతయైన నిచ్చుటకుఁగాని, దుర్యోధనుఁడు సమ్మతింపకుండుటకుఁదోడు తనతండ్రి మనకొసంగఁదలంచినను, నీయకుండఁ జేయుచున్న దుర్యోధనునొప్పింపఁజాలక, సౌమ్యసంభాషణలకై మనసొగ్గెడు మనకడనింతకన్న మిన్నయైన యేతెఱంగున నెవరుమాత్రము సంభాషింపఁగలరు? సంజయుని తప్పేమి కలదందు? రాజులకు భిక్షాన్నము తగదుగనుక మనమొల్లకున్నాముగాని, సంగరమువలనఁ గలిగెడి ప్రాణహాని యెవరుమాత్రము మన్నింతురు? యుద్ధపుటూహ విసర్జింపఁజేయుటకు భిక్షాన్నమె మేలని సంజయుండును, సమరసన్నాహమే విరమించుటకుఁ గందమూల

ఫలాహారమునసరణ్యావాసమే మేలని నేనును, నుపపాదించుచుందుము. మాయుపపాదనములలో నేమాత్రమును దోసములేమి యెల్లరెఱుంగుదురు; కాని యిప్పటి మాస్థితి కనుగుణమగు కార్యమేదియో నిర్వచింప సమర్థుండ వగు నీవు మాయండనుండ మాకేమి కొదువ? ఇంతకును గార్యకారణము లెఱింగిన సంజయుఁడు కురురాజునెదుట నేమి ప్రసంగములు చేసి మనకాహవశ్రమఁ గలుగకుండఁ జేయునో, యేమి కానయి యున్నదో, చూడవలయునుగదా!

— ద్రౌపది —

"అన్నా, వినుచుంటివికదా! ఏమికానయియున్నదో యింకను జూచుచుందురంట! తండ్రి పిలిచెనని ఇంటనున్నవారినిఁజూదపుసభకు దోడ్కొనిపోయిన విదురుఁడింతలోన ర్చెను? ఇఁకమిగిలినది సంజయు మూలమున నెఱపఁజేయఁ దలంచి, పాపమాతండ్రి తన సుతులలోఁ గొందఱిని మాత్రము భిక్షాన్నముఁ దిని జీవింపుఁడనియు, తక్కిన వారలు సామ్రాజ్యధురంధరులై యుందురనియు, నిపు డీరాయబార మంపెను. కాని వాసుదేవా, నేనొందిన యవమానమునకుఁ దోడు నేనిపుడింకను వీరివెంటఁ, జేతులజోలిఁ బట్టుకొన నెంతయభిమానము గోసికొనినను, దిరుగుటవలనఁ గలిగెడి యవమానము మఱి పొందఁ జాలను."

కృష్ణుఁడు—మనమిపుడేమియు ననఁజాలము. ఏమికానయి యున్నదియు నిరూఢపరుపఁజాలము. మీయరణ్యాజ్ఞాతవాసాద్యవమానములును, దేశకాలపరిస్థితులును, వీరిమానసములును నేక కాలమునఁబరిపక్వతం జెందినఁగాని భావికార్యరూప మేర్పడఁ జాలదు. కావున నీవింకను నోపికనేయవలయును.

అని కృష్ణుఁడు యుధిష్ఠిరునివంకఁ దిరిగి యాతనికి మ్రొక్కి యనుజ్ఞాతుండయి నిజమందరమునకు వెడలెను.

# రాయబారము

## ఎనిమిదవ ప్రకరణము

### మొదటి ఖండము

— విష్కంభము —

సంజయుఁడు తన రాయబారము నిర్వర్తించుకొని కరినగరమునకు మఱలుట-సంజయుఁడు మార్గమధ్యమున వేగు వానినిఁ గలసికొని సంభాషించుట- ధర్మరాజుశీల పరిశీలనము- పంచగ్రామసంధిసూత్రముపై వ్యాఖ్యానము-కౌరవ పాండవుల మానసతత్త్వ విచారము, పరిశీలనము, పరిశోధనము-కృష్ణుని శీలపరిశోధనము-రాయబారి విహితధర్మము.

పాండవులకడ ననుమతివడసి కరినగరోన్ముఖుఁడయి వెడలిన సంజయుఁడు కడు రయమునఁ దేరిపైఁ బోవుచుఁ గొంతదూరమేగుసరి కాతనిచాపున నొకరుండు వచ్చి సంజయురథంబునాప సంజ్ఞఁజేసెను. తే రాగుటయు ఈనూతనాగతుం డాతని సమీపించి "సంజయా! ననుఁబోల్చుకొంటివా?" అని ప్రశ్నించెను.

సంజయుఁడు—నీ వెవరయినదియు నీ యాకారముచేఁ దెలిసికొంటిని. కాని బాహ్యవేషముచే నీవొక సారథివలెఁ గానవచ్చుచున్నను నిజమున నీవెవ్వండవయి

నదియు నేఁ బోల్చుకొనఁజాలకున్నాను. దుర్యోధను నానతిని, ధర్మజు నాజ్ఞను, దిరుగుచున్న వేగువారికి మితిలేకున్నది. నీవు ధర్మజు వేగువాఁడ వయ్యును దుర్యోధనునివేఁగ వని చెప్పవచ్చును; కాక ధర్మజువాఁడవే యన వచ్చును. చెప్పుటల కెక్కడికి? ఇంతకును నాతో నీకేమి పని?

ఈ నూతనాగతుఁడు సంజయుని రథముచెంగట నిలిచి యాతనిచెవిలో నేమియో చెప్ప సంజయుండాతనితో "ఎంత సహజముగా నటించినదోయి నీకీసారథివేషము! నిను నీవ తెలుపుకొన్నంతవరకును నేను బోల్చుకొనఁ జాలకపోతిని. మా దుర్యోధనుని పక్షమునఁ బనిసేయుచున్న వారిలో నీకీ మారువేష మమరినట్లితరుల కమరుట యిప్పటికి నేఁజూడలేదు. సరియే-రమ్ము. మనమిరువురమును గలసియే పోవుదము." అని సంజయుఁ డాతనితోడ నాతని రథంబెక్కించుకొని ప్రయాణము సాగించుచుండెను.

వేగు—సంజయా, రాయబారమునకని నిన్ను కురుపతి యిటకనుప నీవు ధర్మజునితో మృదువుగాఁ బ్రసంగింపక యాతని మాటలనే ప్రధానముగా నెంచితి విదియేమి ధర్మమయ్యా?

—సంజయుఁడు—

"రాజ్యభాగమిమ్మని పాండవులు కోరుచుండ, భాగమిచ్చు మచ్చమియును లేక, ఇత్తుననక, నీయననక, మధుర మధుర ప్రసంగములచే వారిననయింపఁ జేయుమనిగదా నాకాజ్ఞయిచ్చెను మా కురుపతి! వారి వనవాసాద్యాయాసంబులు వోపు తెఱంగునఁ బలుకుమని నాఁడే కాని, వారి యాయాసం బడంగునంతవనుకనైనను ఏపకడ నుండుమని కోరలేదు. అట్లగుటఁ బాండునందనుల ప్రవర్తనయందున్న సన్నకొన్ని ఘట్టములు గైకొని, వానికి 'పాండవుల దోషము' లను పేరొసఁగి, వారి నిందించి వారినొకింత మానసమునఁ గ్రిందు పడఁజేసి, పదంపడి కౌరవస్వదోషము లెన్ని, వారినిం గూడ నిందించి, కట్టకడ ధర్మజుని శాంతాత్మత బొగడి యుద్ధమున నున్న శాంతి విరుద్ధమైన ముఖముఁ జేటుపఱచి, యాతని మహాప్రభు నశేషము ననుసరింపఁ జేయవలెనుగదా! రాయబారి చేయఁదగినదియంతయుఁ జేసితిని; కాని కృష్ణుఁడొకఁ డటనుండుట నేమగునోయని నేను తొలినుండియు సంశయించుచునే యున్నాను.

ద్రౌపదిన్యాయనిష్ఠురముల కోర్వఁజాలక భీముఁడును, కుమారాస్త్ర విద్యాకౌశల పరీక్షాసమయమునందె యావహించిన ఈర్ష్యాకారణమున నర్జునుండును, కదనమునకే తన్నెంత బలవంతపఱచినను, సత్త్వగుణప్రధానుఁడై, శాంతియె పరమభూషణముగాఁ గలిగిన పరమలౌకికుఁడగు ధర్మజుఁడును సమరము మానఁదలంచినను, దురాత్మనముతో నహమికతో నిరంకుశాధికారము వహించిన దుష్టుల నెల్ల వధియింపనే కంకణముగట్టుకొనిన యదుకులభూషణుఁ డొకఁ డీకొననిచ్చునా? అప్రియోక్తులతో, శూన్యహస్తములతో నాముఖమునఁ గబురంపెనే కాని యట్టి శూన్యోక్తుల కాతఁడియ్యకొనునను కొనియే నేనంతదూరము ప్రసంగించితినా? రాయబారమునకుఁబోవుచు, వివాదాంశముతో సంబంధించినవిషయము మాట్లాడుట కవకాశము లేనపుడు శూన్యోక్తులు పలుకవలసి వచ్చినపుడు శూన్యహృదయముగాక, యింకేముండును? తద్విధ సంభాషణము జరుగవలసినపుడు వాఙ్మయైంద్రజాలము తప్ప వేఱొండుండఁ గూడు నెట్లు! కనుకనే, నే నన్నివిధముల ధర్మజుం గొనియాడుచుఁ ధర్మజుని యహింసాజీవనమున కనుగుణమగు, హింసాయుతమగు, రక్తపూరితాన్నముకన్న భిక్షపుటన్నమే నయమని, యనవలసివచ్చినది కాని, రాజు లిచ్చువారే కాని పుచ్చుకొనువారు కారను సంప్రదాయమెఱుంగక కాదు నే నట్లుపపాదించుటకుఁ గారణము! పాపము నేనామాత్ర మెఱుంగ నని కావలయుఁ గృష్ణుఁడు, కర్మకరణవిభాగములం గూర్చిన సూత్రములఁ నాకుబోధింప బూనినాఁడు. ధర్మజుఁడిపుడు కురురాజుపయి దాడివెడలి జనక్షోభమును బ్రాణిహింసయు లోనుగాఁ గల క్రూరకర్మము లొనర్పఁగల కఠిన హృదయుఁడగుటనే దాదాపిరువది వత్సరములనుండి కురుకుమారవర్గముచే నన్నియిడుమలును, నరణ్యాజ్ఞాతవాసాద్యాయాసములును నొందియుండుట పరమధర్మమని కార్యకారణ సమన్వయమును నపసవ్యముగాఁ ద్రిప్పిన హేతువాదసూత్రముచే ధర్మజుని మనస్సుఁ ద్రిప్పఁ బ్రయత్నించితినే గాని, నేనుమాత్ర మానందించి యట్లు ప్రసంగించితినా?

కాని యీ పరిస్థితులలో భిన్న భిన్న వ్యక్తులు భిన్నభిన్నాశయములతో నుంట నేదియుఁ బొత్తు పడకున్నది—

దుర్యోధనుఁడు కర్ణుని సాయమున బాండవులఁ గలనంద్రుంపఁగలనను స్థిర బుద్ధితో నున్నాఁడు.

పరార్థమునకు భంగము రాకుండ చూచుకొనుచు ప్రవర్తించువారు;

స్వార్థపరార్థముల సమముగ నెఱిఁగి యుక్తియుక్తముగఁ బాలించుకొనుచు లోకకళ్యాణప్రదమగునటులఁ బ్రవర్తించుచుండువారు;

ఈ ముత్తెఱంగుల వారును నిపుడీ కురుక్షేత్రమునఁ గనఁగొని యున్నారు:—

పరార్థవినాశముచేతనైనను, తమకు లభ్యమగు స్వార్థమునే ప్రధానముగ జేసికొనుచున్న ధార్తరాష్ట్రులొరుల మందలింపుల వినఁదలంపకుండుటచే, వినాశము నొందెదరు సూచనలే కానవచ్చుచున్నవి;

స్వార్థవినాశము చేతనైనను లభ్యమగు పరహితమును ప్రధానముగ జేసికొని ప్రవర్తించుటచేత పాండవులు, ప్రతిపక్షమందును సంశయమనస్కులై కడునిడుమలం బడుచుండుటచేఁ దమ్ము నడిపింప గృష్ణుని సారథ్యము గోరుకొనవలసి వచ్చినది;

లోకకళ్యాణమునకై, స్వార్థ పరార్థములకు భంగము రాకుండ తమ్ము నడిపింపఁగల శ్రీకృష్ణుని యుద్బోధన వలన యుధిష్ఠిరుఁడు స్వార్థమునుంగూడ గమనించి యుద్ధోన్ముఖుఁడైనచో నాతని మతిమరల్పఁగల వారుండఁ జాలరు.

ఇంత యెఱింగియేకద, వశీకృత చిత్తుఁడౌ ధర్మజుని సహజ క్షమాగుణమును మఱింత బలపరచుటకు రుధిరాన్నముకన్న భిక్షాన్నమె మిన్నయని యంటినేకాని పరధర్మమును లోకకళ్యాణప్రద ధర్మముగ మార్పఁగల కృష్ణుని యెదుటనా నాకార్యకారణసమన్వయసూత్రము!

కుమతిప్రియోక్తులతో నా ముఖమున రాయబారము నెఱపఁజేసెనుగదా యని యా కురుపతి చెప్పిన సూత్రము నాధారముగఁగొని, వారికిఁ జెప్పవలసిన మాటలు చెప్పితిని. నా పలుకులవలన నెంత ప్రయోజనము కలుగవలెనంత ప్రయోజనమును గలిగియే యున్నది. ఇఁక వీరినుడు లాకురుకథను నివేదింపవలసి యున్నది. ఇచట నీ పాండవుల సమక్షమున నేవిధమున నిట్టిపట్ల రాయబారి పలుకవలెనవ్విధమున నెట్లు పలికితినో, యదేవిధమున నా కౌరవుల యెదుటనుంగూడ నెట్లుపన్య

ఓంపవలె నట్లొనర్చి, యుద్ధముచేసి, పాండవులకింత యిమ్మనినట్లొర్ప సంభాషించి ప్రయత్నించి చూచెద. ప్రయత్నమే పురుషకర్తవ్యముగాని, ఫలవిశేషములో పురుషునకు నిమిత్తములేదు. కావునఁ గౌరవులా పాండవులకు భాగ మిచ్చు కార్యమున కింత మూర్ఖత వహియించినను, రాయబారిగఁ బోయిననేనుమాత్రము నా కార్యము విహితమార్గమున నెరవేర్పక మానరాదుకదా!"

వేశ:— మీ రెంతోడనను నంతయు నాడితిరని నే నెఱుంగుదును కాని మీతో ధర్మజుఁడు తెలిపిన ప్రసంగమున నింద్రప్రస్థమో, వేఱొక పట్టణంబో తమ కొసంగుమని యని, తుదకు వారియైదుగురకును నైదు తావులిమ్మని యూరకుండక, యా యైదుతావులకు బేర్కొనఁబోయి, నాల్గింటిని జెప్పి యైదవది యెచ్చటనైనను సరియేయని యనియెనే! మొదట నట్లు కోరుటయు, పదంపడి మరియొక తెన్నునఁగోరుటయు, నాకేమియు సుబోధకము కాలేదు.

— సంజయుఁడు —

"నీ వడుగఁదగినదియే యడిగితివి. కాని నే నెంతమాత్రము సరిగాఁ జెప్పఁగలనో నాకే సంశయము పుట్టుచున్నది. ఏది యెట్లున్నను విశాలమై గంభీరమై సామాన్యముగ సంచలనము నొందని మహాసముద్రమువంటి ధర్మజు హృదయము తెలియుంగుట మహాకష్టతర కార్యము.

"నేను ధర్మజుని దర్శింపఁబోయినది మొదలు నే నాతనికడ సెలవుగైకొనువఱకును నడచిన ప్రసంగము లన్నియును క్రమముగా నీవు వినియుంటివా?"

వేశ:— అందువలననే మి మ్మిట్టుల నడుగవలసివచ్చినది.

సంజ:— ఆతఁ డింద్రప్రస్థ మిమ్మని యడుగునప్పటికి నాతో కృష్ణుఁడు పలుక నారంభించినాఁడా?

వేశ:— లేదు; కృష్ణుఁడు మీతో మాటలాడుట కారంభించుట, యుద్ధము క్షత్రధర్మమగునా కాదా యను ప్రశ్నము వచ్చిన పిదపనెగదా!

—సంజయుఁడు:—

"కృష్ణుఁడు జోక్యము కలుగఁజేసికొనకపూర్వము తమకు ధృతరాష్ట్రుఁడొసంగిన యింద్రప్రస్థము మాత్రమే కోరినాఁడు. కృష్ణుఁడు జోక్యము కలుగఁజేసికొనిన

పిదప వారికైదుగురకును నైదూళ్ళిమ్మని కోరుచు కుశస్థలము-వృకస్థలము-వాసంతి-వారణావతము-నని నాల్గూళ్ళపేరులు చెప్పి, యైదవది యేతావునైన నిమ్మను మనికోరినాఁడు. అట్లొకస్థలము మాత్రము తాఁ బేర్కొనక యూరకుండుటలో -ధార్తరాష్ట్రులిచ్చు మచ్చేరయైనచో-'మేమనుభవించుటకొసంగినదియు, చిరకాలము మా యనుభవమున నున్నదియునగు మా యింద్రప్రస్థము మరల మాకొసంగకుందురా! అదియే యైదవతావేల కాఁగూడదు!' అని తలంచి మొదటనే పేర్కొనిన యింద్రప్రస్థ మొక్కటియొసంగిన నూరకుందునని తొలుతననిన యా ధర్మసుతుఁడు—తన యభిమానపుబలుకులతో కృష్ణుఁడు—"పాండవేయులను ప్రార్థించియైనను నేను గురుపతికడకువచ్చి బోధించినను పాండవులకు రాజ్యమునఁబాలొసంగరేని మృత్యుగహ్వరమునఁబడుదు" రని చెప్పుదునని పలికిన పిదప, కృష్ణుని సహాయ మనాహూతమయి లభ్యమగుచుండు నీ తరుణమేల పోఁగొట్ట కొనవలెనని ధర్మజుఁడెంచి—మాకైదుగురకును నైదూళ్ళిచ్చినఁ జాలు ననియుండును.

"తమ్ముఁ గౌరవసభ కనుపుమని ధర్మజుని తనకుఁదానుగాఁగోరుట సముచితము కాదనితెంచి, కృష్ణుఁడు నాతో ప్రసంగించుచు, తత్ప్రసంగానుసరమున ననవలసి వచ్చుట నట్లంటిననుకొనుటకో యన, ధర్మజునకాయూహ తోసంగెను. ఆ ధర్మజునకా కృష్ణుఁడే సరి.

"ఇంద్రప్రస్థము, వృకప్రస్థము, జయంతము, వారణావతము మొదలగునవి కోరుటలో నాయా తావులఁ గౌరవులు పాండవులకు నెరపినవిషభోజనము-లాక్షాగృహదహనము-ద్యూత సభాప్రవేశాదికములు దుర్యోధనునకు జ్ఞప్తికిఁ దెచ్చుచు నాతని నెత్తి పొడుచుటకో యనిశ్చయునవచ్చునుకాని అంతకన్నను బలవత్తరమయిన యితర రాజకీయములగు కారణములు కానవచ్చుచున్నవి."

వేగు:—నే నాకారణములు వినవచ్చునా?

సంజ:—నీవు కారణములు వినుటయం దేమి తప్పుగలదు! ధర్మజుఁడనగా లేనిది-నీవు వినఁగా లేనిది-అయా పలుకులయం దిమిడియున్న భావగర్భిత కారణములు గంభీరస్వభావుండగు ధర్మజుం డూహించియే పలికెనని మన మనుకొనుటయందేమియు దోషము కానరాకున్నది.

"కృష్ణుఁడు ధర్మజుని ప్రార్థించినగాని సంగ్రామము నాపఁబోదునని నాతో ననినంతనె తత్పూర్వము నేనాతని నోనాడిన న్యాయనిష్ఠురములచే కించిన్మ్లానత నొందిన మానసమున కొకింత యూరట దొరకెగా యని సంతసించి యిదియే యదనని యూహించి తమ కైదుగురకు నైదూళ్లు నిమ్మనుచు నాఁటిని జేర్కొని యైదవదానిం జేర్కొనక యదనరకే తనచేఁ గోరఁబడిన యింద్రప్రస్థమునె వాంఛించి యుండెనో ప్రభూ! ఇంతకును ముందిన యింద్రప్రస్థమును దాఁ గోరుటయం దేమి వాతిప్పు కలదు? కాని తాఁ జేర్కొనిన నాలుగు తావులలోఁ దొలుదొలుత కుశస్థలము నే వచియించుటలో ధర్మజునకొక ప్రత్యేకపుటూహ యుండియుండకపోదు. పాండవు లరణ్యమున నున్నకాలమునఁ గర్ణుఁడు తనదిగ్విజయమున యాదవుల వెడలించి కుశస్థలీ-మధుర మున్నగు తావుల జయించి కురురాజ్యమునకుఁ జేర్చుటను, కుశస్థలిని మన కర్ణుఁడనుభవించుచున్నాఁడు. యాదవౌత్సుక్యముకొఱకు, యాదవోద్ధరణము కొఱకు తనజీవితమె ధారవోయుచున్న కృష్ణుఁడిప్పటికి పౌండ్రకవాసుదేవునితోఁ బోరాడుచుండుటం జేసిగాని, కానిచో కృష్ణుఁడు కర్ణువిజృంభణంబునకు సహించునా? యాదవ దౌర్బల్యమున కోర్చునా? ముఖాముఖిగాఁ గాకున్నను కర్ణుని ప్రతిఘటింపక పోవునా? కర్ణునిచే నానాఁడట్లు కొలుపోఁబడిన కుశస్థలినే తొలి కోరుటయందు కృష్ణుఁడానందించుననిగాని లేక యీపంచగ్రామసంధికి కౌరవు లొడంబడిరేని తనదౌత్యఫలమున తనకు లభియించు నీ కుశస్థలము యాదవులకొసంగు తలంపుకలిగి కాని కోరియుండును. అనంతరము కోరిన మాకంది వారణావతము లొకప్పుడు పాంచాలురనుండి కైకొనిన ప్రదేశములు కావా? వానిని మా ద్రోణాచార్యులవారును మావారును అనుభవించుచున్నారు. అట్లగుటఁ గర్ణు ననుభవంబున నున్న కుశస్థలమును, ద్రోణుననుభవమునను్న మాకందీ వారణావతములను, మా దుర్యోధనుఁ డెట్లొసంగఁగలఁడు? కర్ణద్రోణుల బలాత్కరించి యీ ప్రదేశములు వారివారినుండి కైకొని పాండవుల కొసంగుటయే తటస్థించినచో, మన రాజుపక్షమునఁ బనిచేయుచున్న ప్రధాన వీరులకు మన రాజునెడ నసూయకలుగుటకు హేతువే యగును. అట్లవుట, ధర్మజుఁడు కుశస్థలమును మాకందియు వారణావతమును గోరుట కృష్ణాది యాదవులకును ధృష్టద్యుమ్నాది వీరులకును నుత్సాహము పుట్టుటకును, కౌరవులలో నంతఃకలహము

లుపయోగించి ప్రధానవీరులగు కర్ణ ద్రోణులకు మా రాజుపైఁ గినుక జనింపఁజేయుటకును, గురిచేసి యడిగిన యూహలుగా నివి యని గూడ దోపఁజేయుచున్నవి.

ఇంకొక చిన్నవిశేషము చూడఁ గానవచ్చుచున్నది. మా కురురాష్ట్రములోనిదికాదు వారణావతము! మా రాజుతోఁ బాండవులు కలిసియున్న కాలమునఁ బాంచాలీ పరిణయమునకుఁ బూర్వము ద్రుపదుని మీఁదికి యర్జునుఁడు పంపఁబడినయప్పు డర్జునుఁడు ద్రుపదుని జయించిన తోడనే అర్జునుతో ద్రుపదుఁడు చేసికొనిన సంధినియమముల ననుసరించి అహిచ్ఛత్రము అను రాజ్యమును అర్జునునకు ద్రుపదుఁ డొసంగ నద్దాని నర్జునుఁడు ద్రోణున కొసంగినాఁడు. అహిచ్ఛత్రమునకు రాజధాని మాకంది. ఇది గంగానది కుత్తరదిశనున్నది. అర్జునుఁ డద్దానిని ద్రుపదునకిచ్చివేసినాఁడు. ద్రోణుఁ డిపు డద్దాని ననుభవించుచున్నాఁడు. తనకు మామగారగు ద్రుపదుఁ డద్దాని నింతకుఁ బూర్వమే తన మూలమునఁ గోల్పోవుటచేతను, ద్రుపదుఁ డిపుడీ సమయమునఁ బాండవులకు సాయమొసంగుచున్నాఁడు గావునను, మాకంది తనకు రాజొసఁగినచో మఱల నద్దాని నా ద్రుపదున కొసంగ నూహయు ధర్మజుఁ డొందియుండనోపు! అట్లు యాదవులకుఁ దమ కోల్పడిన కుశస్థలియు, పాంచాలురకుఁ దారు కోల్పోయిన మాకందియు, నొసంగుతలంపే యమనందనునకు లేకయుండినచో వారలూరక పాండవులకు సాయముఁ జేయుటకుఁ గతంబుండదు. ఔదార్యముగల వారు తమ సేయు నుపకృతికి ప్రతిఫల మపుడే కోరకున్నను, కార్యానంతరమైనను దమ కొసంగఁబడు దానిని స్వీకరింపక పోరు. అట్లగుట నిట్టియూహలు ధర్మజునకుండియుండు ననుటకును దావు లేకపోలేదు. కాని తొలుతఁ దన కొసంగఁబడిన ఇంద్రప్రస్థముఁ గోరియు మఱి దానినిఁ జేర్కొనక కుశస్థలము మాకంది వారణావతాదులఁ గోరుటయందు దనకు స్వలాభాపేక్ష యంతగ లేదనిగూడ స్ఫురింపఁజేయుచున్నది. కుశస్థలము తనయందభిమానము వహించిన యాదవులకిచ్చివేసి మాకంది వారణావతములఁ బాంచాలుర కొసంగివేసినచో నిఁక దనకు మిగిలినదేమి? ప్రాముఖ్యలేశముగల వృకస్థలమును, మనవారొసంగినచోఁ దొలి తన యనుభవమున నుండిన ఇంద్రప్రస్థమును, మాత్రమే కదా! అట్లగుట నొకరికిచ్చివేయుటయే ప్రధానకార్యముగా నెంచి స్వలాభాపేక్షకూడ లేకుండఁగోరిన యూహలుగా నివి యనిగూడఁ దోపఁజేయుచున్నది.

ధర్మరాజుంగూర్చి నే నిట్లొనరించిన సంభాషణమును బరిశీలింప మఱియొక విశేషము గూడ స్ఫురించుచున్నది.

తాఁ జేరుకొనిన నాలుగు గ్రామములును దనతమ్ములు నలువురికును జాలునని చెప్పి, తనకుఁ దనకేమియు లేదోయని యుంచుకొనక పోఁ జేయుట, తొలి దాఁ గోరిన యింద్రప్రస్థము మానసార వాంఛించియుండెనో ఫు.

ఇన్నివిధముల నిన్ని తెన్నుల నా ధర్మరాజు పలుకులఁ గూరిచి నా మనమూహించుట కాదని గాఁ ధర్మహృదయము కారణము.

ధర్మరాజు సర్వాంగ సమరమునకు సిద్ధమైన రాజ్యహేతువులకుం గంగణముగఁ డో, వనమ్ములకేగి, కందమూలఫలాహారమ్ములఁ గొని, కటికనేలఁ బన్నుండి, మునివృత్తిని గడదాక కాలముఁ బుచ్చుటకంతె సిద్ధపడిత్తుండు. క్రోధము దిగమ్రింగి, శాంతమూ వహియించుటకెట్లు సమర్థుండో, పంగన సేయువారిని భస్మము సేయఁ గార్యవాదియై యుద్యమింపనుంగూడ నట్లే సమర్థుండు. కాని, తనప్రతిపక్షులును, తనకు సంబంధించినవారును, తనకెంతెంత యపకారముఁ గూర్చుచున్నను, వారెన్నటికైనను బశ్చాత్తాపులు గాకుందురా, వంచనమార్గము విరమింపరా, యని ప్రతిక్రియారహితుండై ముందువెనుకలు చూచిచూచి, తుట్టతుదకు కార్యరంగమున కుఱుకఁ గలఁడు. అట్లుఱికినపిదప మఱియొకని నోర్వనేరికిం గాని కానిపని.

శాంతిమార్గమునఁ, బ్రేమతత్త్వమున, సౌజన్యవిరహితమైన తెలివునఁ దమభాగము దామొందుటకేగస, రెంతెంత వంతలనైనఁ బ్రశాంతముగ నొందుటకాతఁడు మన స్సొగ్గినాఁడు! కానిచో, దుష్టపుర్రోహితరాయబారమునకు బ్రతిగా నా రాయబారమయిపోయినది కదా — నా సంభాషణయందు ధార్తరాష్ట్రులమ్ముటనుగూర్చి యేమియుఁ బ్రసంగము లేకున్నను, ధర్మరాజుం డెంతప్రశాంతముగ, భావగర్భితముగ బలుకుచుండెనో వినుచుంటివికద! అంతలు వడియును నాతఁడు సంధినే కోరు చున్నాఁడు. ధార్తరాష్ట్రులతోఁ గలిసి జీవించుటనే వాంఛించుచున్నాఁడు.

ఇంతకును సంధికోరువారే ఉభయపక్షములవారునైన నో రాయబారులకు సంధిపొసగింపనవుపడునేమోగాని, సుయోధనాదులు వీరికేమియునొసంగమనియు,

రాజ్యమున వీరికి స్వత్వమే లేదనియు, వీరు పాండవులే కారనియు, నటుగాక వీరను పాండునందనులేయైనను కురురాజ్యమే నాఁడును పాండుఁడేల లేదనియు, నెవరైనను నాహవమునఁ గెలిచి రాజ్యమేలఁదగునే కాని తనచిన్నతనమునఁ దన తాతతండ్రులు తన శక్తిసామర్థ్యము లెఱుఁగక రాజ్యమున భాగ మొసంగినంతమాత్రమున తనరాజ్య వ్యవహారముల స్వతంత్రముగఁ దనకుఁ దాను జూచుకొనఁగలిగిన తరువాతఁగూడ వెనుకటి యాటలమాటి సాగనిత్తునా యనుచున్న దుర్యోధనుఁడు పాండవులను భండనమునకై పిలుచుచుండ, - భండనము కానీయకుండ - వారికేదేని నొసంగుదుననకుండ - శుష్క-ప్రియోక్తులతోఁ గాలముబుచ్చ నయ్యంబికాతనయుండు వాక్ప్రయత్నములు పలుపుచుండ, పాండవులు తమకు పైతృకంబగు భాగమిమ్మనుచుఁ, దాము దిగ్విజయంబున నలఘరుమకొనిన దాని నిమ్మనుచుఁ, గపటద్యూతంబున మా వారపహరించిన దాని నిమ్మనుచు, తాము మనవారికిఁ జాలక కాకి పోయినను, కదనమున లభ్యమగు రక్తాన్నముఁ గుడువఁ జాలక వారి యైదుగురకును నైదూళులైన నొసంగినఁ జాలునని వారనుచుండ, నిఁక సంధి పొసఁగు టెటులు? సంధియను కార్య మిరువాగలవారును వాంఛించినఁ గదా. సమకూడునది! అట్లు కూడనినాఁ డది సమకూడునె?

ధర్మజుని సహజసాత్వికతత్త్వమునకుం దగిన యా వేదాంతబోధ యేమాత్రమేనియుం బనిసేయుటకైనను వీలులేకుండ—వంచకుల నడంప, విషయభోగేచ్ఛచేఁ బ్రకృతిజనంబుల బాధించువారిని నిర్మూలింప, ప్రకృతి దుర్లలితుల రూపుమాయింప, దుష్టజనసంహారనాటకమునకు సూత్రధారుం డనఁదగు—కృష్ణుం డావల వలనుగ నిలిచియుంట లేదియు సమకూడదు, అని నేను తొలినుండియు శంకియింపక పోలేదు

—వేగు—

కృష్ణుఁడు పాండవపక్షమున నిలిచినవాఁ డనిగదా నుడివితిరి. అట్లయినఁ బాండవులు ద్యూతమున నవమానము నొందునాఁడును, ద్యూతజితులై వనమునకేగి సిలుగుల నొందుచున్నప్పుడును, కృష్ణుఁడో యాదవులో పాండవులకు సహాయ మొసంగి వీరిని కష్టములనుండి తొలఁగించి అపుడే యుద్ధముగాఁ జేసిరైనను, వీరిది వీరికిప్పించి వీరినేల యుద్ధరింపరైరి?

# ఎనిమిదవ ప్రకరణము

—సంజయుఁడు—

పాండవులు ద్యూతమున నోడి మనరాజుచే నవమానితులైనసమయము కృష్ణుడు సాళ్వునితో హోరాహోరిగఁ బోరుచున్న సమయమగుటను బాండవులను గూర్చి దలంపనైనఁ దలంపఁ జాలఁడాయెను.

ఇంకఁ బాండవు లడవులం దిరుగుచున్నకాలమున సాళ్వయుద్ధముచే యాదవు లలసియుండుట చేతను—

పాండవుల రాజసూయసమయమున జరిగిన శిశుపాలవధచే దంతవక్త్ర పౌండ్రకవాసుదేవాదులు కుపితులై యాదవులపై యుద్ధసన్నాహములు చేయుచుండుట చేతను—

తక్కినరాజులుకూడ పాండవుల రాజసూయయాగమున వారియైశ్వర్య విభవంబులఁ గాంచి కోపాసూయలచే నెవరేపక్షమునఁ జేరుదురో యను సందిగ్ధస్థితి కలుగుట చేతను—

యాదవులలోఁ గూడ భోజకులులగు కంసకృతవర్మాదులకును, వృష్ణికులజులగు కృష్ణాదులకును అంతఃకలహములు పెరిఁగియుండుటచేతను—

కృష్ణాది యాదవులు పాండవపక్షముం జేరరైరి.

యాదవులేలఁ బాండవులకు సాయపడరేవని యడుగుచున్నావుగాని, యాదవులీసమయమున నీకురుపాండవసంఘర్షణమున జోక్యముఁ గలిగించుకొనుటయే కృష్ణున కిష్టములేదు. ఎంతదూరము శ్రమపడినను, తానును తనతమ్ముండగు సాత్యకియు మాత్రమే కద!

ఇంతయేల? కృష్ణుడు పాండవపక్షమునఁ బనిచేయుచున్నను దన కుమారులగు సాంబప్రద్యుమ్నాదులుగాని, అన్నయగు బలరాముండుగాని తనకు సహాయముఁ జేయ నిప్పటికిని రాలేదే!

కృష్ణునితమ్ముఁడగు సాత్యకి అర్జునుని శిష్యుండగుటను బాండవులం జేరినాఁడు.

శమంతకమణి నక్రూరుం డపహరించుట జరిగిన పిదప సత్యము దెలిసికొనఁ జాలక కృష్ణుఁడే యపహరించినాఁడని బలరాముఁడు పొరపడి కృష్ణునివిడిచి మిథిలా

నగరమునకుఁ బోయి యచట దానుండిన మూఁడు సంవత్సరములలోను మా దుర్యోధనుఁడాతనికడ నేగద గదాయుద్ధము నేర్చికొని బలరామశిష్యుండయ్యెను. అట్లగుటనె బలరాముఁడు దుర్యోధనునెడ పక్షము వహించుచుండియు కృష్ణునియెడఁ బ్రేముడికతమున నాతనికి బ్రతిపక్షము వహింపనోపక, నేరికిని సాయమొనర్ప మన సొప్పక, దవ్వులకేగినాఁడు.

శతధన్వాక్రూర కృతవర్మలలో నొకనికిఁ దనకూతురగు సత్యభామనిచ్చి వివాహమొనర్తునని సత్రాజిత్తుమాట నిచ్చియుండెను. అనంతరము సంఘటిల్లిన శమంతకమణి గాథవలన సత్రాజిత్తు సత్యభామను కృష్ణునకిచ్చి వివాహమొనర్చుట తటస్థించెను. అట్లగుటనె శతధన్వాక్రూర కృతవర్మలకు కృష్ణ సత్రాజిత్తులయెడ వైరముద్భవించుటకు గతంబైనది. సత్రాజిత్తునెడ పగసాధించుకొనుటకు శతధన్వుఁ డాతనిఁ జంపివేసెను. కాని అక్రూరకృతవర్మలకు కృష్ణునెడఁగల ఈర్ష్యాసూయలు- కాలము గడువగడువ- అక్రూరుని కృష్ణభక్తునిగా నొనర్పగలిగియు కృతవర్మను పరమశత్రువుగనే యుంచినవి. అట్లగుటనే కృతవర్మ తన యక్షౌహిణీ సైన్యముతో వచ్చి మాదుర్యోధనునకు సాయమొనర్పఁ జేరినాఁడు. కృష్ణుఁడు వృష్ణి కులజుఁడు. కృతవర్మ భోజకులజుఁడు. భోజ వృష్ణికులజులకు చిరకాలము నుండియు విరోధములు ప్రబలియే యున్నవి. ఈ కులవిరోధమె గదా, రుక్మిణీవివాహ సమయమందేమి, మా పెద్దలు చెప్పుచువచ్చిన ప్రకారము దేవకీవసుదేవుల వివాహ సమయమందేమి, బాంధవ్యముంగూర్చి వివాదములును, కలహములును, పెరుఁగుటకు కారణమైనది. ఏది యెటున్నను తన యదుకులమువాఁడుగదాయని కృష్ణునెడ సానుభూతిఁ జూపునేమో గాని కృతవర్మ, వంశభేదములచేతను, వ్యక్తిపరమైన శత్రుత్వ కారణముచేతను, కృష్ణు నెల్లప్పుడును, నసూయాభావముననె చూచుచుండును. కృతవర్మలో నింకొక విశేషముకూడ కలదు. కృష్ణు నెవ రేమనినను దా నోర్వజాలఁడు-కాని తనకు ప్రత్యేక కారణముచేత కృష్ణునెడ నీర్ష్యయుండుటచేత కృతవర్మ యెల్లప్పుడును కృష్ణునకు బ్రతిపక్షమే వహించుచుండును.

అంతదూరము పోనేల, యాదవులలో మహావీరుండును, పలుకుబడిగలాడును, కృష్ణజనకుండును నగు వసుదేవుండియు వ్యూహమున ఐక్యముకలుగఁ జేసికొనలేదే!

ఇట్లగుట తమయాపత్సమయముల సహాయసంపదదొరకమి పాండవులన్ని యాపదలం బొందలుటకు గతంబయినది.

—వేగు—

మనవారెన్ని యిడుముల కల్పించినను పాండవులంతంత సహించి మానమును ధనమును గోల్పోవుటకుఁదోడు ప్రాణాపాయకరంబులగు పరిస్థితులు ఘటిల్లించినను వారటులోర్చి మారుసేయక మిన్నకుండుటఁ జూచినవారికి మాత్రము "పాండవులసమర్థులగుటనె మిన్నకుండిరి" అని తోపఁజేయుచుండును. కాని పాండవులంగూర్చి యిపుడున్న మాటమాత్రము వారి యనుపమాన తేజోవిలాసములఁ జాటుచున్నది. అట్లగుటఁ బాండవుల మనసునిల్కడ, మారుసేయమి, అనన్యాయము కాదా?

—సంజయుఁడు—

మా ప్రభువునకుఁగల సంశయమే నీకును దోఁచుచున్నదే!

శాంతియుతమై దౌర్జన్యరాహిత్యమై ప్రతీకారగవేషణము లేక శత్రుజనంబులవే దామొందుచుండువిపత్తులనెల్ల బలవంతముగభరించుమందు ప్రవర్తనలకు ప్రతిఫలము లోకసానుభూతి నభ్యర్థించుమ బరిశాంతముగఁ దమకు గార్యసిద్ధి యగునపుడు తుట్టతుదకు రక్తపాతమునకైనను జీవహింసవలననయినను దమకుజయముకలుగ గలదని యెదురుచూచుటయె యగును.

'శత్రుజనపీడనమున కెంత సైరణనొందియుండిన నంత ధ్రువమగుచుండు తమకు జయ' మని యెంచుచు, ఆత్మశక్తి సూత్రముల నెరింగిన వారి తెరంగిట్లేకద యుండును! నిర్బంధాధికారము చిరాయువునొందుపట్టంతము కానేరదని యెఱుంగని మహామానియగు మారాజునెంత దిట్టలంబడఁజేసిన, మారాజుగర్వంబు నెంత పెల్లనిచ్చిన, దనకంత సహాయము దొరకు ననునూహ యుధిష్ఠిరునకు లేకపోయి యుండదు. మన రాజును లోకమెంత నిరుచుండిన నంతసుళువుగఁ దన కర్థసిద్ధి యగునను నూహ వశీకృత చిత్తుండగు ధర్మనూతికి లేకుండక పోదు.

ఎంతటి మేటిమైనను తన యభ్యర్థిత కార్యమునకు సుసమయ మాసన్నమగు దాఁకనోర్వకున్న తమప్రయత్నములు సఫలీకృతములు గాకుండుటపక్క యింకొక

ఫలముండదని యెఱింగినవా రిట్లే తెచ్చికోలైస్వరణమైన నూహచుందురు. ఇంతకును గారణ మాధర్మజుని వశీకృతచిత్తతయే యని యనవచ్చును.

నీలకంఠా, మనము కరినగరము సమీపించుచున్నాము. మనము సంభాషణములో మునిఁగియుంట నెంతదూరము వచ్చితిమో తెలియ కుండగనే వచ్చినాము.

మాటలసందడి నడుగమఱచితిని- నిన్నే మనుమని యుపప్లావ్యమున కనిచినాఁడు మా రేఁడు?

—నీలకంఠుఁడు—

మా భగదత్త మహారాజజనకుండగు నరకుని వధియింప నెఱపిన కృష్ణుని సేవగించుచున్న మా భగదత్తుఁడు 'పాండవపక్షముంజేర కృష్ణుం' డని యెఱింగినంతనే యాతఁడు కౌరవపక్షముంజేరినాఁడు. మా ప్రభునానతి నేనీసారథివేసమున వేగునైతిని. మీరు పాండవులకడకు దూతలైపోయి కురువీరుల వలసఁగఁ బ్రసంగింతురో, పాండుసుతుల స్తుతియింతురో, విని రమ్మను సుయోధను కోరిక మేరకు మా ప్రభునానతి నే వట[illegible]గితిని కాని పాండుసుతుల నేమాత్రమును గరుణింపక, వారినినోనాడుటయుం దేమాత్రము నేమరక, మీ నెఱపినసంభాషణవిధాన మత్యంతసంస్తవనీయము.

—సంజయుఁడు—

సంధి యొనర్పంబోవువాఁ డిరువాగులవారిలోపముల నెన్నుచు, దూఱుచు, నెదుటి వారి నగ్గజముగ నెగ్గించుచు, పదంపడి స్తుతియించుచు గాఁదగుకార్యముం గూర్చి ప్రసంగింపందగును.

అని వీ రిట్లనుకొనుచుండఁగనే భగదత్తునకని నిర్మించిన మందిరమున కీరథము సమీపించినది. నీలకంఠుఁడు రథావరోహణంబుగావించెను. సంజయుండును దనయరదంబునుఁబోనిచ్చి ధృతరాష్ట్రమందిరసమీపమున నిలిపి రథంబుడిగ్గికురుపతిని దర్శింపఁ దత్సభాభవనమున కేగెను.

# ఎనిమిదవ ప్రకరణము

## రెండవ ఖండము

హస్తిపురము:—ధృతరాష్ట్రు సందేశము పాండవులకు నివేదించి మరలిన సంజయుఁడు ధృతరాష్ట్రునిఁ దొలుదొల్త దర్శించుట—సంజయుఁడు ధర్మజుస్వభావము నిరూపించుట—ధృతరాష్ట్రునిఁ బరివర్తనయందున్నదని తనకుఁ దోఁచిన లోపములను సంజయుఁడు నిరూపించి చెప్పుట. సంజయు నిష్క్రమణము.

కురుపతి సామ్రాడ్విభూతితో సభాభవనమున గూరుచుండి యుండినసమయాన 'సంజయుండువచ్చె' నని తనకుఁదాఁ దెలుపుకొని, ధృతరాష్ట్రు నంఘ్రియుగ్మమ్మునకు మ్రొక్కి నిలిచి యాతఁడు చక్రవర్తితో నిట్లనియెను.

—సంజయుఁడు—.

మీయానతి నతిక్రమింపక, యుపప్లావ్యంబున నున్న పాండవ్యులం గంటిని. అప్రమేయసుగుణాన్వితుండగు నయ్యుధిష్ఠిరుని దర్శించితిని. ఆతఁడు మీకు నమస్కరించెను. నను సంభావన జేసెను. మిగుల బ్రసన్నుఁడై, మీసుఖశ్రీ విభవంబుల నడిగి కురుకుమారుల సేమము నరసి యానందించెను.

—ధృతరాష్ట్రుఁడు—

సంజయా, ఆ యజాతశత్రుండును, తదనుజన్ములును, సుఖముగనున్నారు గద!

—సంజయుఁడు—

భవదీయ స్ఫారబలము కారణమున సుఖముగ నున్నామని యన్నారు. నిజమునకుఁగూడ నంతియే కద!

ఇంతకును ధర్మజునకు ధర్మములింపైనట్లు భోగములింపుకావు. నిర్మల బుద్ధిచేత యోచించినచో, నహింసకే యతఁడు కలఁడు. అట్టి యుధిష్ఠిరుఁడు మానవశక్తినొల్లఁడు; సముంచితమగు దైవశక్తిపై నాధారపడియుండును. అట్లని మానవప్రయత్నములఁ బరిగ గణింపకపోఁడు. మానుష దైవికముల యుచితసమ్మేళనమే, లౌకిక కార్యసాఫల్యమునకుఁ గారణమని నమ్మియుండును. అట్టి సుగుణసంపత్తిగలధర్మజుఁడు పుణ్యమును బాపమును నీపయిబెట్టి ప్రవర్తించుచుండును. ఇఁక నినుగూర్చి యోచింతుమన్న నీవు నీపుత్రునధీనుఁడవై యెంత తెన్నునఁబోఁజాలకున్నావు. ఇఁకమిగిలినది కార్యనిశ్చయము. అది కర్ణసౌబలుల యధీనమైయుంట యథాయథలై పోవకతప్పదు. ఇది యెందఱికిని దెలిసిన విషయమే. ఇట్టి పరిస్థితులలో నీమతమును నీ ప్రవర్తనమును నెంతమాత్రమును నొప్పకున్నది. ఆలు బిడ్డలు లేని ద్రిమ్మరికేకాని, మఱేరికైన నిట్టి ప్రవాదములు జరుగుచుండ, జూచుటకిచ్చ బాడమునే! ఇంత తెలియక యూరకుంటివా? కొడుకెటు ద్రిప్పిన నటు దిరిగెదు నీవు, నీకొడుకు నడవడి వడివడిఁ ద్రిప్పఁజాలమి నాకేకాదు లోకమునకంతకును గర్హ్యముగా నున్నది. అకుంఠిత తేజులగు కొమరులుగల నృపులెందరీ యిల నేలలేదు! అట్టివారైనను, దమకొడుకు లోకప్వాదు చెవుత్రోవంబడిరేని, తగవుచెప్పక, యుప్పరికించుచు, నూరకుండిరే! లోకము నోటికివచ్చినట్లెల్ల నిను దిట్టుచుండ, విని విని నాచెవులు గీపెట్టుచున్నవి. మీతండ్రీ కొడుకులు కర్ణసౌబలదుస్ససేను లెట్లాడించిన నట్లాడెడు కీలుబొమ్మలయియున్నారు. పెక్కుభంగుల మీ వలనఁ జిక్కులు వడి

మిక్కిలి యలసియున్న పాండవు లాగ్రహావృత్తికిం జొత్తురేని, నీచల ముని, బలమును, గులమునుంగూడ నొక్క మహాహావమున నిట్టె జక్కంబెట్టుదురు సుమీ! కొండను విరుగంగొట్టుటకు డీకొనువెండె లాగున నున్నదికాదా మనవారి దుస్సాహస ప్రియత్నము?

ధర్మజు సైరణను వెఱపుంగా మనవారలు సమర్థించుచు సంత సించుచున్నారే కాని, పాపము తుద కేమగునో యనియైనం దలంప లేకున్నారు.

సత్కులీనులకు సాంప్రదాయికముకానిది జూదమని మన వారెఱుంగక పోలేదు. అట్టి కానిజూదమునాడే యవినీతి పుట్టినది. ఆ సందర్భమున నీ యుపేక్షయే యెంతయుం జిచ్చువెట్టి కాల్చినది. ఇపుడింకను నేమి క్రొత్తగం బుట్టవలెను? తానుగ రచ్చకెక్కుస్వభా వము లేని ధర్మజుండు వశీకృతచిత్తుండు. తనకొనర్పంబడిన యే యాప కృతినైన నెమ్మదిగభరియించి, తరుణమువచ్చినపిదప విమువక, శత్రు జన వినాశమొనర్చెడు మెత్తనిపులి. లోకముగుర్తెఱిగి తనకార్యము జయప్రదముగం గొనగట్టుటకుం దగినరీతినెదుటివానిమనస్సు రంజింపం జేసియైనం దత్సానుభూతి నొందంగల సమర్థుండు. లోకమున నెల్ల లును నీపయి నేరమువోపునందాక నిశరచింతలుమాని, మీాయిడిన పాట్లెల్ల శాంతముగ భరియించును. సుసమయమునం విజృంభించుటకే యింతశాంతత వహించుచున్నధర్మజుం డొకతూరి యాహావమునకే గడంగెనేని, మరియాతని మాన్పను, మార్కొనను, మన కెవరికిని శక్యముకానిపని. మీారెంతలొనర్చినను, అతండు సైరణ సేయుచు, సమర్థుండయ్యును మాఱుసేయనొల్లకుండుట సంపూర్ణముగలోకంపు సానుభూతింగోరి, మనసారం దాం గోరినంత మాత్రాన నిట్టె జయశ్రీ నొందుటకని మనవారు తెలిసికొనంజాలక, యాతని సైరణ వెఱపుగను; మాఱు సేయకుండుట నాతని యసమర్థతగను, బాపము

సమర్థించుచున్నారు. మనవారియూహలు భ్రమప్రమాదమూలము లని మనవారు తెలిసికొనునప్పటికిఁ బరిస్థితులుమించి, మఱితేరఁగరాని దురవస్థను దేఁగలవు. ఇది సామాన్యులు తెలిసికొనఁజాలరు.

ధర్మజునిగూర్చి మఱొక్కవిశేషముగూడఁగలదు. దౌర్జన్యరాహిత్యమై, శాంతియుతమై, సైరణ ప్రధానాంగముగాఁగలిగి, సాటిమన్నీండ్రయభిమానమును, జనసామాన్యఁపుటభిమానమును, సానుభూతియును మిక్కుటముగఁ గోరుచు, నరాతిజనంబులెంత వెక్కసముగఁ దన్నరికట్టి వేధించిన నంతయానందముగ నాపాటులఁ బరిగ్రహించుచుఁ— 'దన సైరణవలననైనఁ, దన యెదిరికిఁ బశ్చాత్తాప ముదయించియైన దుర్నయములు మఱి మానకపోదురా' యని యూహింపుచుఁ దన యనుజులెంత వేగిరంపడి మనపైనెత్తిరా లేచుచున్నను, వారి కడ్డువడి వారినప్పటికి నిరుత్సాహులుగఁ జేయుచు, మెలంగెడి సాత్త్వికనిరోధము, తన ప్రవర్తనకుఁ బ్రధానాంగముగ నెంచియున్న వశీకృత చిత్తుఁడగు యుధిష్ఠిరుఁడు లోకఁపుటచ్చఁపు మెచ్చునకు వచ్చునుగదా! తత్కారణముననెకదా లోకమాతనిఁ గొండాడును! అట్టి యుధిష్ఠిరుపై ధ్వజమెత్తుట కొఱవిం దలఁగోఁకికొనుట యగుంగాదే!

నీకు ముపునంగన్న మోహాంబుకతన, నీకొడుకుల జెడుగులని వివేకించుకొనఁజాలక, నీకొడుకులందనియింప నెంచి,- నీమేలుఁగోరి నినుఁగొలుచుచు, నీవిడుకూడుఁగుడుచుచు నీచరణకమలసాన్నిధ్యమున నీసమాన మెలంగ నెంచియున్న -పాండుసుతులదవ్వులకుం బాఱద్రోలి, యిపుడింత గొంతు మీఁదికి దెచ్చుకొంటివి. ఇఁకముం దేమి రానయియున్నదో యెవరికెఱుక! ఆప్తజనంబులఁ జేరఁదీయక ననాప్తులను స్వలాభముకొఱకును స్వమనోవాంఛాఫలసిద్ధికొఱకును నీ కొడుకులను బురికొల్పుచుండు వారిం జేరఁదీసి, చెడిపోయి, కురుకులంబెల్లఁ గూఁకటి వ్రేళ్లతోఁ బెకలింపఁజేసికొనె నను నపవాద మీయుఁ గలకాలము నీవు నీజనముల

చే బ్రిప్పఁదిట్లువడుటయె తుట్టతుద కలవడు ఫలశ్రుతి యగుం గనా యని నేనును, నీయాప్తవర్గమును దుఃఖింతుము.

కౌరవేశ్వరా, వేగమరలివచ్చుటను, పథికశ్రమంబున నొడ లొచ్చుచున్నది. ఇపుడు ప్రొద్దును బోవుచున్నది. ఇప్పటికి సెలవు గైకొందును. రేపు నీవు, నీపుత్రులును, బందుగులును, నాప్తజనంబులును బరివేష్టించియుండ నాపోయివచ్చిన కార్యము సంపూర్ణంబుగ సవిస్తరంబుగ నివేదింతును. ఇప్పటికి నాకు సెలవొసంగుము."

అని సంజయుండు నిలువ, నక్కురుపతియు నాతనికి సెలవొసంగి కార్యచింతం దగిలి, విదురునకుం గబురంపెను.

ఈతఁడు హస్తినాపురమేలెడు చంద్రవంశపురాజులలో మూఁడవ వాఁడగు పూరుచక్రవర్తి తరువాత కొన్నితరములుగడచినపిమ్మటఁ బ్రజలచే నెన్నుకొనఁబడి చక్రవర్తిగఁ జేయఁబడిన 'కురు' అనువాని యయిదవతరపు మనుమఁడును, ప్రజలచే నెన్నుకొనఁబడిన వాఁడును, నగు శంతనుచక్రవర్తికి రెండవకుమారుఁడగు విచిత్రవీర్యుఁడు సంతాన రహితుఁడై మృతినొంద, నాతనిభార్యయగు నంబికయొక్క దాసికిని వ్యాసునకును జన్మించి, జ్ఞానియు, మేధాసంపన్నుండును, బ్రఖ్యాత వేదాంతియు, విశేషించి నీతిపరుండునునై ధృతరాష్ట్రపాండురాజపరిపాలనకాలమున రాష్ట్రమునకుఁ బెద్దగడ్డమై, వజీరునకు హేజీబునునై నెగడిన మహాపురుషుఁడు. ఈతఁడు నుడివిన నీతులు సమయోచితములు మాత్రమేకాక, ఈయిలఁ గలకాలమంతకును ఒప్పించియుండును. అమలచరిత్రుఁడౌ పాండుభూవిభుఁడు రాజ్యమునఁ జురుకుగఁ బనిసేయుచుఁ దన యన్నయందలి గౌరవముపెంపున సింహాసనముపై ధృతరాష్ట్రుని గూరుచుండఁజేసిన కాలాన, రాజ్యపరిపాలనవిధానమున నీ విదురుండే ధర్మములను నీతులను బోధించుచు, రాష్ట్రపాలనమునఁ గడు దోడ్పడుచుండెను.

———

# ఎనిమిదవ ప్రకరణము

## మూఁడవ ఖండము

విదుర ధృతరాష్ట్రుల సమావేశము-లౌకిక, నైతిక, ధార్మిక విషయసమన్వితమగు విదురునుపన్యాసము—ధృతరాష్ట్రుని లోపముల నిరూపించుటయు, వానిని సవరించునిధానము విదురుఁడు ధృతరాష్ట్రున కుపదేశించుట.

మఱికొంత సేపటికి వచ్చిచేరిన విదురునితో — "తమ్ముఁడా, పాండుపుత్రులపాలికి మనమంపిన సంజయుఁడు మఱలివచ్చి — మఱి యచ్చట నేమి తెలిసికొనివచ్చెనోకాని,—అవచ్చిన మొగాననె నన్ను నానమ్ముఖమ్మునవె దూఱి, రేపచ్చట ముచ్చటలను, అచ్చటిపనులను జెప్పువాఁడనని చెప్పి, మార్గాయాసమున నింటికిఁబోయెను. సంజయుని పలుకులు విన్నదాదిగ మనసుకలఁగి దుఃఖము నన్నలమికొనఁగ నిప్పుకలం బొరలినట్లయి ధృతిఁదూలి నిదుర రాక, నొగులఁ బొరలుచున్నాను. సంజయుండెంతెంత మాటలనైన ననునాడిపోసెను. పాండవశిబిరంపు పన్నాహము లేయాకృతిఁ దాల్చినవో, వా రేమనిరో, మఱియాతని కేమి దోఁచినదోకాని, ననులోకము తిట్టుచున్నదనియు, పాండవేయుల యాయాసంపుఁబాట్లకు నేనే కారకుండననియు, నెంతెంత మాటలనయిన నను నిందించి వెడలినాఁడు. నామానసికవేదనకు మార్పుఁగలిగించి, నీ నోటిమేల్మాటలచే ననుఁదేఱున ట్లొనర్పుమో విశుద్ధవిచారా!" యని ధృతరాష్ట్రుఁడు మిన్నకుండెను.

— విదురుఁడు —

(తనలో) పాండవుల సమరసన్నాహములను సంజయుఁడు తెలిపియుండును. కావున నిశ్చితరాష్ట్రుండు ధృతిఁదూలి యున్నాఁడు

(ప్రకాశముగా)

కౌరవేంద్రా, సంజయు పలుకులు వినినంత మాత్రమున నీకు నిదురపట్టకుండుట తటస్థమయ్యేనేమి! అంతనిదుర లేకుండుటకు నీకు బలవంతుండగువాఁడు నీపై కత్తి వచ్చునని యా? పరుల సొమ్ముల గ్రుచ్చలింప నెంచితి వనియా? కామాకులచిత్తుండ వైతివనియా? సంపదఁ గోల్పోయితి వనియా? ఇందేది నీకు తటస్థమైనను దుఃఖమునకుఁ గారణమై, మనమునఁ గలఁతపుట్టించి నిదుర రానీయదు. ఇపుడు నా నుడివిన నాలుగు కారణములలో నేదిబలవత్తరమై నీకుగూరుకు రానీయకున్నదో నీవే యోచించుకొని నీనిదుర రామికి గతంబీవే స్థిరపఱుచుకొనుము.

—ధృతరాష్ట్రుఁడు—

ధర్మజుమాట యేవాటముగ నున్నదో యెఱుంగమి నింత గుందవలసి వచ్చుచున్నది. నీవది తెలిసికొన సమర్థుండవగుట నా యలమటఁ బోఁద్రోలఁగలవు.

— విదురుఁడు —

నేనేమి చెప్పినను మాయలనాఁటి కపటపుజూదపుటాట మాటయే యగును. వయోవృద్ధుండవగుటనీసూనునివశంబవైపుత్రవ్యామోహాముకతననీవేమియుఁజేయంజాలవు. నీసూనుండును అహంకారవశుండయి, సంపూర్ణస్వార్థపరత్వంబున మునిఁగి తేలుచుండ, నీవునునీకొడుకులునుం గూడ కర్ణ, శకుని, దుశ్శాసనులపై రాజ్యభారంబుఁ బెట్టుకొని యుంట నిఁక భారతవంశంపు భావిజీవనము కర్ణాదుల పాలఁబడియెను.

అటు ధర్మజుం దలంతుమన్న నాతఁడు నీకు బందుగుండును, జెలికాఁడును, తగినభటుండును, మంత్రియును, గురుండునునై, శాంత మూర్తియై, ప్రకటీకృత సత్యనిరతుండై, సద్వినయవివేకశీలగుణ విశ్రుతకీర్తివంతుఁడై యుండునాతండొక్కనాఁడైనఁ గీడుఁబలుకఁజాలఁ డు. దారుణపుటూహలు తనమానసకాసారంబునఁజొరనీయనొల్లఁడు. శ్రుతికటువగు పరుషోక్తులు పలుకంజాలఁడు. తనబలముఁ దా నెఱుంగుట- వేగపడమి- తాలిమి సెడమి- బట్టువిడుపులును- నిర్బం ధరాహిత్యమును- లేని ప్రభుత్వ మేకాలమందైనను గంటిమే! ఏదీ! యీతీరగు సమానుషచర్య నొక్కటినైనఁ జూపఁగలమే పాపమా ధర్మజునెడ? వా రింతదిని మనుటకొసంగుఁడని బ్రతిమాలినను, మఱి మాలిన మనవారొసంగక, వారు గొప్పివ్వి మనపై నెత్తివత్తురే యను నట్టి నీసుతుల నేమనందగును? సంజయుముఖమునఁ గబురంపియు, నిదియిచ్చెద మిదియీయమని స్థిరపఱుపక, శుష్కప్రియోక్తులతో నారాయబారమంపిన నిన్నే మనవలె? విషయప్రాధాన్యములేని రాయ బారమునుఁగూర్చిననీబుద్ధిహీనత కేమందును? ఏమనిన రాయబారమది? లేక, రాయబారమను నెపమునఁ బాండవుల ప్రయత్నములును, వారి హృదయమును నెఱిఁగి వచ్చుటకు నీవు నెఱపఁజేసిన రాయబారమా యది? స్వార్థాభిజ్ఞత, పరార్థానభిజ్ఞత నిన్నును నీకుమారునిం గూడ సమముగ నల్లుకొనియుంట నింతమూడినది. పుత్రవ్యామోహ దోషాంధత నీయందును, ప్రకృతి దుర్లలితుండగుటకుఁ దోడు మహాభిమానియు నగుట అహంకార దోషాంధత నీసుతుని యందునుఁ బ్రవర్తిల్లుచున్నవి. ఇందెవరునుఁద్రోవకువచ్చువారు కారు. పురువంశమంతరించుకాలమాసన్నమయ్యెనా యను దిగులెల్లప్పుడును గలుగఁచునేయున్నది. ధర్మజాదులు బాల్యముననే పితృవిహీనులగుట, నిన్నే తండ్రిగానెఱింగి, తగవునకు నినునమ్మి, మోసపఱచినపిల్లల

లోకుల కచ్చెరువుఁ బుట్టునంతఁదనుక సైరించిరన్! నీవును ఎఱుంగుదువు. వారి సైరణఁజూచి నైన నీహృదయము మృదులత నడయదు కద!

— ధృతరాష్ట్రుఁడు —

సంజయుచే ధర్మజాదుల కెఱుకఁ బఱచిన స్వాంత్వనవచనములు వారియెడ నుపయోగింపకున్న మనమిఁక నేమిచేయవలయును? యుద్ధమే సన్నద్ధమైనచోఁ దిరుగుచున్నచున్న నామానసపరిస్థితి యింకనుఁ బాడగును. అట్లగుట నీహితభాషణములచే నామనస్సుఁ గుదురువడునట్లు చేయుము.

— విదురుఁడు —

అంబికేయా, ఇది ధర్మ మిదియధర్మమని బొత్తుగ నెఱుంగనివానికెంతఁ జెప్పినను చెల్లునేకాని, నీయట్టి ధర్మాధర్మవిదునకు, నయానయాభిజ్ఞునకు వేరేమి చెప్పఁగలము? ఇంతకు నొకరు నీకు దెలుపకునికి నింతలువాటిల్లెనని యనలేము. మోహ మనర్థముఖములఁ బరిఢవిల్లును. అందుఁ బుత్రవ్యామోహ మొకమోహము. ఏ మోహమైనను, కూడనంతదూర మెగఁబ్రాకినపుడు అది దురంతమైన వంత సమకూర్పక విడువదు. నీవు నయాభిజ్ఞుండ వెయ్యును బుత్రవ్యామోహాంధకార మలముట నేమియుఁ జేయఁజాలకున్నావు. ఇది యందఱెఱింగినదే! ఎఱుకఁ గలిగియుండుట యొకటి. ఆ యెఱిఁగిన దానిననుసరించి కార్యములొనర్పుచుఁ బ్రివర్తించుటయింకొకటి. సాధారణముగ నెఱుకలేక కార్యములొనఁగూర్చుటయు సంభాషించుటయుఁ జేయువారిసంఖ్యయే లోకమున మ్నూఁడువంతులు. ఇఁక మిగిలిన వారిలో నొకపా లెఱుకఁ గలిగియు, ననుసంధానమునందు వెనుకబడినవారి సంఖ్యయే యధికముగనుండును. కావున నేమియొనర్చినను నెఱుకతోఁగూడి యుండవలెను. ఎఱుక, చేఁత: అను నీరెంటికలయికయే మోక్షమునిచ్చును. దుష్కార్యముఁ జేసినను, సత్కార్యముఁ

జేసినను, నాయొనర్చునది సత్కార్యమనిగాని దుష్కార్యమనిగాని సంపూర్ణముగ నెఱిఁగి, పౌర్వాపర్యములఁ జర్చించుకొని తన యంతరాత్మను పూర్తిగఁద్రుప్తిపఱచి మఱియుఁగార్యమొనర్చినచో, సత్కార్య పర్యవసితఫలమునందలి గుణదోషములు మఱి కర్తృ కంటఁజాలవు. ఇంతదూరమెఱిఁగి కార్యములొనర్చు ధర్మజుఁడుఁకర్మచేసినను జేయనివాఁడే యగుచున్నాఁడు.

— ధృతరాష్ట్రుఁడు —

తమ్ముఁడా, ఇంతదూరము చెప్పుచున్నావే! ఒక్క సందేహముఁ దీర్పుము. సంజయుని శాంతప్రచారపుఁ బలుకులను వారు విననొల్లక, వారింకను సమరమునకే సంసిద్ధులుగ నుందురేని, సంగరము ప్రాణహానిఁ గలుగఁజేయునుగదా! అది యెట్లు వారికిఁ దగును? ధర్మజుండు హింసకు లేడట! శాంతమే మూర్తీభవించిన వాఁడట! ఇది యెట్లు సంగతమగును?

— విదురుఁడు —

కురుకులనాథా, అడుగదగినదియును నడుగక వీడరానిదియు నగుదానినే యడిగితివి. ఏకార్యమునకును పర్యవసానము తన యీప్సితమున కనుగుణమగునా కాదా యనియెంచి, తదీప్సితార్థమునకు దా నేర్పఱచుకొను మార్గము, దా ద్రొక్కుడుత్రోవయు ననుగుణ్యముగ నున్నవో లేవో చూచుకొని ప్రారంభింపవలెను. అంతేకానిఁ తత్కార్యపర్యవసాన మొకప్పుడు చెడి, తా గోరిన ఫలమీయక, తాననుకొనని వేరొకఫలమొసంగినచోఁదనమార్గముతప్పెనిగాని, తత్పర్యవసానము సందర్భశుద్ధి లేకున్నదనిగాని యూహింపరాదు. మానవుఁడు తనకు విపద్దశ సంభవించినప్పుడు తద్దశనుఁ దొలఁగించుకొని సౌఖ్యదశాప్రాప్త్యర్థముఁ బ్రయత్నింపక మానకుండుట సర్వజనసామాన్యలక్షణము. తత్సిద్ధికొఱకు దానవలంబించుమార్గము తన మనోరథ

మీఁదేర్పునని యెంచుకొని, అప్పటి కవలంబింపవలసినమార్గము నవలంబించియే తీరవలెను. కాని, వెనుదీయరాదు. ఇదికాదందువేని:- పాండవులు తమకుఁగూడ నీరాజ్యమున స్వత్వముకలదని నమ్మి యున్నారు. ఇదిలోకమువారందఱు నెఱింగిన దేకద! మీ వంచనమార్గముచే వా రడవులంబట్టి తిరిగితిరిగి తుద కిలుజేరఁ గొందమనుకొను నప్పటికి వారిని గూడులేనిపక్షులుగనొనర్చుటయె కాక, మిమ్ములఁ బ్రార్థించినను వారిదివారికిమీరొసంగకున్నారు. వా రరణ్యవాసమునకు బోవునాఁటికి వారివి యనిపించుకొనిన స్వాస్థ్యము లిపుడు నష్టసంపదలగుట మఱల వారువానిని సంపాదించుకొనుట వారికిఁగర్తవ్యము. వారిది వారికందనీయకుండఁ జేయుట నీసంతానపుసంకల్పము. కావున, నిందు మీకునుమీకునుంగల కర్తవ్యాకర్తవ్యములసాంప్రదాయికతఁ జూచుకొనవలసిన దేకాని, కర్తవ్యమునకువలయు సాధనసంపత్తిని గూర్చిన యాలోచనతో మఱి నిమిత్తములేదనుసరికదా, తమకుఁగల కర్తవ్యమునందలి నిర్దుష్టత స్థిరపఱుపఁబడిన పిదప, తమకార్యమున జయమొనఁగూడకపోయినను, తమ కపజయమునకుఁ దోడు మఱి కొన్ని క్రొత్త చెడుగులు సంభవించినను, తామొనర్చు కార్యమున మాత్రము తత్కర్తలకు తద్దోష మావహిలఁజాలదు.

కార్యపర్యవసానముంబట్టి కార్యాచరణవిధానమును, తద్విధానమున కవసరమగు సాధనసంపత్తియు, మంచిదనిగాని, చెడ్డదని గాని మన మనలేము.

ఏపర్యవసానముకొఱకు మనము ప్రయత్నింతుమో అట్టిఫలము మన సంకల్పముచేతనే చెడ్డదైనచో, మనకార్యమునకు మన ముపయోగించు సాధనసంపత్తి యెంతమంచిదయినను తత్ఫలము కర్తకు చెడ్డదిగనే పరిణమించి తత్కర్తను వేధించుచునేయుండును.

కార్యాచరణకుఁ బూనునపుడు తత్ఫలము సంకల్పముచేతనే

మంచిదయినచో, తత్కార్యావసానమునకొఱకుఁ దా నవలంబించు సాధనవిధాన మెంత చెడ్డదయినను ఆసాధనవిధానపుఁ జెడ్డతనము తనకంటక తనసంకల్పనైర్మల్యమువలనఁ దనకు మంచిఫలమునే యొసంగఁగలదు.

మానవుని మనస్సునందిమిడియున్న సంకల్పమును, తత్సంకల్పము నెఱవేరుట కతఁడవలంబించు సాధనవిధానమును ఫలము లిచ్చుటలో, నన్యోన్యాశ్రయములై ప్రతిఫలించుచుండును.

ఇపుడు పాండవులకుఁ దమ నష్టసంపదను సంపాదించుకొనుట కర్తవ్యము కాదా? వారిని మీరింతకాలమును వేధించుచుండుటయు వంచన యొనర్చుచుండుటయు మీకు నయమగునా? మీపరిపాలన మున్నంతకాలమును వారి బ్రతుకిటులే యుండునని వారికిఁదోచిన చో భారతభూమి స్మశానవాటికగ మారినను, అట్టిమార్పి కౌరవదుర్మానఁపు బరిపాలనముకన్న మిన్నయన్న తలంపు వారికిఁ గలిగినను గలుగవచ్చును. అందేమి నేరముకలదు? ధర్మజుఁడు పెద్దకాలము యోచింపక ఏపనియు నొనర్పఁడు. మీరొనర్చిన యకృత్యములనెల్ల భరించుచు, నవమానములను సైరణతోఁ గైకొనుచు, నింతకాలముంగూడఁ దమ కష్టపరంపరలు తొలఁగఁజేసికొనులాగునఁ జేయందగు కార్యముంగూర్చియే యోచించుకొనుచుండును. ఇప్పట్టున ధర్మశాస్త్రములు చెప్పిన చొప్పునను, నీతిపథంబు నవలోకించినను, దనకుయుద్ధమే కర్తవ్యమని తోచకమానదు. అట్టిస్థిరబుద్ధి యాతనికిఁ గలుగకపూర్వమే మీరు మేల్కాంచియుండుట పరమధర్మము. మధురఫలాదులను మనము దినునప్పుడుసైతము మన మొరులకిడకుండఁ దిననొల్లముగదా! పాపము పాండవులడవులనున్న సమయాన, నీకొక్కటైన నేమి,- దక్కెను గదా రాజ్యమనుచు నంతయు నాపోశనముఁబట్టఁదలంచితివేగాని, నీ తమ్మునిభాగ మాతనిసంతానమునకొసంగక, నీవును నీసంతానమును మాత్రమెట్లు మ్రింగఁగలరు? అదె ట్లరుగఁగలదు? ఆహార

భర్తీమను గ్రక్కునగాలమ్ము మ్రింగి, తుదకును పల్లఁబోయి మీను బ్రతుకగును జుమీ కురువంశఁపుఁబత్రికుఁడు!

అంబికేయా, చక్కగనాలోచించి పాండవులకుండగు నలంతి పల్లియలనైననిచ్చి, వారిని మనము లోఁబఱచుకొని, మననిచ్చితిమేని, వారు మనకు వశంవదులై మనకెంతేని యుపయోగింతురు.

—ధృతరాష్ట్రుఁడు—

విదురా, నాకు హితమును, గర్తవ్యమును నగుచందము నెఱిఁగింపుము.

—విదురుఁడు—

క్రొత్తగ నేనెఱింగించుట కేమున్నది? నాయెఱింగినంతవఱకు, నీబుద్ధికి హితమైనది నీవాచరించుచునే యున్నావు; అది లోక కల్యాణప్రదము కాదు కావున, కర్తవ్యమును కాదు. ఇఁకఁ గర్తవ్య మైనది నీకుహితము కాఁజాలదు. అట్లగుట మఱిచెప్పుటకేమున్నది?

—ధృతరాష్ట్రుఁడు—

నీ ప్రసంగఫణితి నాయుల్లమును మఱింత కలఁత వెట్టినది. కావున, నీతుల నుపదేశించి ననుఁ దేర్పుము.

— విదురుఁడు —

నీతుల నుపదేశించుటకేమున్నది? కూడనివన్నియును ధార్త రాష్ట్రకులమునందే కూడియున్నవి. కావున నవియన్నియును ద్యజించుటయే యవినీతినుండి తొలంగుట యగును.

ఒక్క సామాన్యవిషయముఁ జూడుము.—ఒరులు నినుఁదిట్ట నీవోర్వఁగలవా? అట్లగుట నొరుల నీవెట్లు నొవ్వఁజూచెదవు? నిన్ను గౌరవించువారిని, నీయెడఁ బితృభక్తిఁజూపువారిని, నీవనాదరమునఁ జూచినపుడు, నీవువంచించుచుండునపుడు, వారోర్వవలెనో? ఇదియేమి ధర్మమో!—ఇచ్చి వగచుమచ్చు నీకెట్లువచ్చెనోగద!

ధార్తరాష్ట్రులచేఁ బాండవులు చిరకాలమునుండియు పొందు

చుండినపాట్లన్నియుఁ బాండవులచే ధార్తరాష్ట్రులే పొందుట తటస్థమయియుండిన-చో మీరోర్వఁగలరా? లేశమైనను సైరణఁ జేయగలరా? వేయేల? లోకములో నింద్యములనిపించుకొనినమార్గములను విరమించుకొని, జనులకు నోడఁబాటగువిధమునఁ జరియించుచు, దనకన్న నున్నతినున్న వారినిఁ జూచి, యేవగింపక ప్రజలతోఁ బొందికఁ గలిగి జీవించుటయే జన్మమునకు సార్థకతయగును. నీపెద్దఱికమును గౌరవించుతలంపున యుధిష్ఠిరుండును, నతనిమూలమున భీమార్జునాదులూను, సైరణ నేయుచున్నారేగాని, వారసమర్థులై కాదీ మిన్నకుండుట!

నీ కొడుకులకు విద్య యలవడమియుఁ, బెద్దలతోడి సాంగత్యము నెఱుంగమియు, నింతలుదోసంగులు వాటిలుచున్నవి. మన దుర్యోధనాదులు ధర్మముల నెఱుంగరు. కార్యదీక్షనొందఁజాలరు. కార్యములు కావలెనని కోరుచుందురు. తమవాంఛితకార్య మెట్టిదైనను నయ్యది తమవంశమునకుఁ దగునా తగదాయను చింతఁ జేయనోపరు. తుదకు నోటివడితనముఁ జూపి, బంధుకోటికిని, జ్ఞాతివర్గమునకును మనములునొచ్చునట్లు పలుకుట కేమాత్రమును వెనుఁదీయరు. ఇట్టి నీ కుమారవర్గము సంపూర్ణముగఁ బ్రకృతికిలోఁబడి యున్నారు. ప్రకృతికిలోఁబడుట సర్వజనసామాన్యలక్షణమెయయ్యును, ఎఱుకతో కూడిన ప్రకృతిసంసర్గ మెంతకలిగియున్నను, ప్రకృతికిలోఁబడజాలఁడు. తన్మూలమునఁ జింత తగ్గుచునేయుండును. ఎఱుకఁగలవాఁడు ప్రకృతితో సంబంధించిన మాయను ఛేదించుకొనఁ జూచుచునేయుండును. తానెంతవఱకీమాయను ఛేదించుకొనఁ గలుగునో, అంతవట్టును మోక్షము నందుచునేయున్నాఁడు. మోక్ష మనఁగాఁ బ్రకృతిమాయాబంధములనుండి విముక్తుఁడగుటయేకద! అట్టి మోక్షమునకు బ్రధానసాధనములు విద్యయుఁ బెద్దలతోడి సాంగత్యమునై యున్నవి. విద్య యధికమైన కొలఁదిని స్వార్థము తగ్గుచునేయున్నది. స్వార్థము రెండువిధములుగాఁ బరివర్తించి ఉత్తేజితమగుచున్నదని యెఱుకఁగల

వారు వాకొనుచున్నారు.

"స్వ" [లేక స్వార్థచింత] యనునది తనపట్ల తగ్గితగ్గిమఱిలేకయే పోవుట ఒకటి.

"స్వ" యనునది [స్వార్థచింత] తనపట్లనుండి హెచ్చి హెచ్చి, తన కుటుంబమునకు బ్రాకి మఱియు హెచ్చి, తనయూరంతయు నల్లుకొని, పిదప దేశముపై బ్రాకి, మఱియు విజృంభించి, ప్రపంచమంతయునిండి, లోకమంతయు తనదిగాభావింపఁజేసి, లోకమునకుఁగానిది తనది కానిదిగాభావింపఁజేసి, లోకపు మెప్పునకు వచ్చునదే తనమెప్పనియు, లోకమే తాననియుఁ, దా నన లోక మనియు, విశ్వమయతనొందిన "స్వ" లేక స్వార్థచింత, లోకకళ్యాణ చింతగా పరివర్తించి లోకకళ్యాణ చింతయందు స్వార్థములీనమై, మఱి కానరాకయేపోవుట రెండవది.

ఇట్టి విజ్ఞాన ముదయింపఁజేయునది విద్య. అట్టివిద్య యీ నెమ్మ లక్షణమునకుఁ బెద్దలసేవ లక్ష్యము. ఇది యెఱింగి యాసక్తి నెవఁడు గోసికొనునో, యాతఁడహంకారమును భస్మము జేసికొనినవాఁడే యగుచున్నాఁడు. అపుడాతఁడు లోకమునంతను వశంవదముగా నొనర్చుకొనుచునే యున్నాఁడు.

ఇదియంతయు నిట్లుండ, లోకసంగ్రహావృత్తము యోచించి చూడ, నియమబద్ధజీవనులయి, నియమబద్ధమగు లోకసంగ్రహావృత్తిగలిగి యుండవలెను. అట్లగుటంజేసి స్వేచ్ఛాప్రేరిత కార్యము లందు యథేచ్ఛావ్యాపారముగలవారుగాక, సదసద్వివేకమార్గాను వర్తులయి, నియమితకృత్యులగు, కులక్రమాగతసంప్రదాయకులయి యుందురేని, యిహలోకమున శుద్ధచారిత్రసంపద యెట్లొనగూడునో పరలోక సంపాదనార్హమగుసాధనములును నట్లొనఁగూడఁ గలవు. ఇహాపరము లన్యోన్యాశ్రయములయి, కార్య కారణములం బోలె, నవినాభావసంబంధములయి యుండును. ఇంతయెఱుంగక, సహజమగు రాజపదమున నిమిషియున్న యీసుగొనముసఁ గలిగిన

మాత్సర్యాది విరోధివర్గముచే నాఁచబడిన మన సుయోధనుఁడు, సూతసుతాది మంత్రివర్గముచేఁ, బ్రోత్సహింపఁబడి, పాండుపుత్త్రులపై నెల్లప్పుడును గాలు ద్రవ్వుచునేయుండును. ఇదియెంతయు తగనిపని.

పోనీయని మనమందఱమిపుడున్నట్లే యుండుమాయని తలంతు మన్న, నిమ్మహీచక్రంబును బరిపాలించినమహారాజు లెవరుమాత్రము గజతురగాది సంపదలును, గాంతలతోడి విహారలీలలును, విస్ఫురితాభరణానులేపవస్త్రజనితవైభవములును బొందియుండలేదు! ఎవరుమాత్రమునిలిచిరి? ఇపుడీకానవచ్చునదంతయు నిట్టులే కలకాలము నుండు నని తలంతువా? ప్రకృతికి మార్పుసహజనుసుమా! అదికాదందువేని, యేరీ నీ పితృపితామహులు? హస్తిశంతనాదులేరీ? హస్తి నిర్మించిన హస్తిపురముమాత్రము మిగిలినది. శంతనుఁడు గంగనువరియించుట చేత, తజ్జ్యేష్ఠపుత్త్రుండగు భీష్ముఁడు రాజ్యముత్యజించుటను నీవును బాండుండును మీమూలమున దుర్యోధనాదులును, ధర్మజాదులును, నీసునురోసమునుబూని యింతలుదెచ్చిపెట్టుకొనుటలు మిగిలినవేకాని —నిమిత్తమాత్రులెయగుదురుగాక—కారకులగువారుమఱిలేరే! కాని వారు కారకులనువార్తమాత్రము మిగిలినది. అట్లగుటఁ బరిణామస్వభావముగలయీప్రకృతిలో మెలఁగుచు, లోకకంటకులమనిపించుకొనుట కులమునకుఁ బాడియగునా? కులమునకు వన్నెదెచ్చిన వారందఱును గతింపఁ గులమునకుఁ గళంకము నాపాదించువారు తుదకుద్భవించిరను నపయశమా మనము గడించుకొనునది? మన పెద్దలూర్జితవంతులై యెంతశ్రమపడి విఖ్యాతపురుషులై నెగడిరో, తుంటరులమై దుర్యశమును నపఖ్యాతియు నార్జించుకొనుట కంత కష్టమును బొందుచున్నారము. మనకు దుష్కీర్తి వచ్చుటతో నాగక, భారతభూమినున్న రాజచక్రమున కంతకును సంఘాతవినాశము దేఁగల ప్రయత్నమునకే మనము సాయపడుట, జరుగుచున్నది కదా యని దుఃఖింపక తప్పదు.

మీయాదరణకుఁ బాత్రులగు పాండవేయులఁ బిలువఁబంపి, "మాతోడఁగూడి కుడిచి మనుఁ" డని మీయంత నుంచుకొనుటయె సర్వవిధమ్ముల శ్రేయోదాయకమును, దేజోలాభకారియు, నయి యున్నది.—కాదందువేని, నీవు దుర్యోధనాదుల నెల్లని నోడం బఱచి, పాండవేయుల జీవనంబునకగు కొన్ని యలంతి పల్లియలనైన నేర్పఱచి, యిచ్చి తెలువుఁజేసెదేని, యదియులెస్స. ఇదియుఁగాదేని, సుతునెడ గ్రుడ్డిప్రేమందొరిసిపుచ్చి, యిఁక నీకడకాలము బరిశాంతముగఁ బోనిమ్ము. ఇట్లునట్లునుంగాక, పాండవ్యులతోడి పెనకువకే దిగఁదలంచితేని, యద్దానంబ్రతీకారంబులేని పశ్చాత్తాపంబు పుట్టుట యందేమాత్రమును సంశయములేదు. కావున నెన్నివిధాలఁ జూచినను, బాండవేయులతోడి సంధిసేతయ మేలు. కాని యీనయములు నీకంతగ రుచింపవు. కాఁదగినది భిన్నరూపమునొంది, పర్యవసానము ప్రత్యేక ముఖమున సిద్ధమయియే యున్నదేమో! నీకు నిద్దురరామి నన్నుఁ గథలఁజెప్పుమన్నట్టులే తోఁచుచున్నది గాని, కార్యకారిస్వప్రకారము మాత్రము దోఁపకున్నది.

— ధృతరాష్ట్రుఁడు —

విదురా! నీనుడులు సమంజసములును ననుసరణీయంబులును నయియున్నవి. కాని సుయోధనాదులు, పాండుసుతులతో సంబంధము లేకుండఁగనే, జీవింపగలమను ధైర్యమున నున్నట్లు తోఁచుచున్నది. లేకున్నచో, వీరికింత మొండితనమెక్కడనుండి వచ్చినది?

— విదురుఁడు —

పాండవులసాహాయ్య మక్కఱలేకుండిన లేకుండకపోవచ్చును గాని, సంపదకు సాహాయ్యంబువలయు; సాహాయ్యంబునకు సంపద వలయు; నట్లగుట సాహాయ్యసంపద లన్యోన్యసహాయంబులపేక్షించు స్వభావంబుకలయవి. కావున మీసంపదకు సాహాయ్యంబువలదనుట భావిసౌఖ్యంగఁగోరని గ్రుడ్డితనఁపుఁజిహ్నము. మీసంపదపైనాధారపడఁ

దగిన పాండవేయుల నీయంకేనుండ నియమించినచో, వారి సాహాయ్యంబు నీకుం బ్రియంబొనఁగూర్చును. కావున నటుసేయుటే భీష్మబాహ్లికాదులకును, నాకును నభిమతము. వారల నెడసేయుట మన లావును వెలిసేసికొనుటయె యగును.

మఱొక్కమాట: కురువంశ నిస్తారులగు భీష్మయుధిష్ఠిరులును నిర్వక్రవిక్రములగు కర్ణార్జునులును, ప్రతాపధాములగు భీమ దుర్యోధనాదులును, శస్త్రాస్త్రపండితులగు నభిమన్యులక్ష్మణ కుమారులును, శాపానుగ్రహసమర్థులగు ద్రోణద్రుపదాది పరమాప్తులును, వారి వారి బంధుమిత్ర గణంబులును, నీవారై నీకుఁ గైదండలిడఁగ, నీవు పృథ్విని శాసింప, నొరులకుఁ గన్నెత్తియైనఁజూడవశంబగునే! పాండవులేకారణముననైన వైరముండలంపక యడవుల నాకు లలములం దినుచుఁ గాలముబుచ్చనెంచినను, నీ నందనునందుమాత్రము వసుంధరాపరిపాలనభారంబు నిర్వహింపఁబడనేరదు సుమా! నీసామ్రాజ్యంబుననున్న సామంతరాజులు శంతనునాటివలెగాక,—మాయంత వారము మేము- మేమీ యిభపుర సామ్రాట్పదవినేల యంగీకరింపవలె--నను నూహాలతోఁదత్తదుచితప్రయత్నములనున్నారని, నీకును నీకొడుకు గమికిని నెఱుక లేకున్నది. కురుసామ్రాట్పదవినంగీకరింపని యాంతరంగికభావముననేచుమా జరాసంధుఁడు ప్రళయప్రయత్నములఁ జేయుచుండ, భీముం డాతని మన్నిగొనెను. ఈసందర్భమునఁ గృష్ణుని సన్నాహము లప్రమేయములు. అవియన్నియును భీష్మని కెఱుక. సుసమయమున భీష్ముఁడు నీకవి తెలియఁజేయఁగలఁడు. ఏది యెట్లున్నను రాజ్యాంగదశఁ జూచినచో, శంతనునాఁటి రాజ్యగౌరవమును, గౌరవకులగౌరవమును నానాటికి క్షీణించిక్షీణించి, తుదకు ప్రబలదౌర్బల్యమునొంది, నామమాత్రావశిష్టమైపోవుచున్నదిచుమీ!

—ధృతరాష్ట్రుఁడు—

నీవుచెప్పినయంశములలో నేదికాదనఁగలను? నీపలుకులన్నియు

నిర్మలములై నిపుణజనసమ్మతములై, రాజనీతిబోధకములెయయ్యును గొడుకును విడువనోపమి ధర్మోజయతియని యూరకుంటిని. పాండవులయశమువినఁగోరుదునేగాని,దుర్యోధనాదులచెడుగోర్వలేను. ధార్తరాష్ట్రవినాశమూలమునఁ బాండవులభివృద్ధిఁగాంచిన నేసహింపలేను. దుర్యోధనాదులతోఁబాటు పాండవుల యభ్యుదయము నాకభిలషితమె కాని నాకొడుకు పాండవులమనికియే యొల్లకున్నను, అతని వినాశము మీరందఱును కోరినటుల నేఁ గోరఁజాలకయేకద, ధర్మోజయతియని మిన్నకుండుటకుఁ గతంబైనది. నాయైహిక జీవనవ్యవసాయ మిట్లింత దుష్ఫలమిచ్చినది. కావున నిఁక నైహికజీవనవిశ్రేణి మూలమున పరమార్థము గ్రహించెద ననునాస మఱిలేదు. కనుక, పరమార్థదృష్టి నాకుఁ గలుగు తెన్నేర్పఱచి, పారలౌకిక చింతందగులు గుప్తార్థముల నాకు బోధించి నను ధరింపఁజేయుము.

— విదురుఁడు —

అగ్రజా! నీకోరిక కాదనలేనుగాని వేదాంత వేద్యంబులగు నర్థములు నా కగోచరంబులగుట సనత్సుజాతునివలన నీవెఱుంగఁ దగును.

అనిచెప్పి విదురుండును ధృతరాష్ట్రునానతి నాసనత్సుజాతుని దలంచికొనిన నాతఁడు ప్రత్యక్షుమై యెదుటఁగన్పట్టి యేమికావలెనని యడిగిన, నామహాత్మునాతడిట్లు ప్రార్థించెను.

"మీరును గారుణ్యాతిశయంబున విజయంచేసితిరి. గురుసమాశ్రితులగు వారెద్దానివలన సుఖదుఃఖంబులు, లాభాలాభంబులుఁ బ్రియద్వేషంబులు నాదిఁగాగల ద్వంద్వంబులంబడక బ్రదుకుదురట్టి పరమార్థోపదేశంబున నితనిం గృతార్థునింజేసి రక్షింపవలయు."

అని ప్రార్థించిన ధృతరాష్ట్రుండును దదనురూపంబగు నాలాపంబుల సనత్సుజాతుని నారాధింప నాతండును బ్రసన్నుండయి, అధ్యాత్మ విషయంబులగు వివిధవాక్యంబుల సోపానప్రకారంబున నంతకంతకు

సూక్ష్మంబులగు నర్థంబుల సమర్థించుచు, బార్థివుం డడగిన దానికెల్ల సమ్యక్ జ్ఞాన సంకలితంబగు తెఱంగున బలుకుచుండఁ దనకులంబున జనియించిన ధార్తరాష్ట్రు లన్నదమ్ములతోఁ గలహించుటకు దుఃఖించి, వివర్ణతనొందినట్లు చంద్రురుండును వెలవెలవోవుచుండెను. అట్లు ప్రభాతంబగుటయు ధృతరాష్ట్రు విదురుల నామంత్రణంబు సేసి యద్దేవముని యంతర్ధానంబునందె.

అనంతరము విదురుండును నాంబికేయునికడ సెలవుగైకొని నిజనివాసంబున కేగెను.

# ఎనిమిదవ ప్రకరణము

## నాల్గవ ఖండము

సంజయుఁడు మఱల ధృతరాష్ట్రునిఁగలసికొనఁ గురుసభ కేఁగునప్పటి స్వగతవిచారము-తన్నుఁ బిలువ వచ్చిన దౌవారికునితోఁ దా నెఱపిన సంభాషణము-నైసర్గికవిషయనిరూపణము-ప్రాంతపరిస్థితుల రాజకీయ విషయచర్చ.

"కొందఱు వ్యక్తిత్వముచేతనే యుచితానుచితజ్ఞతఁ గలిగియుందురు. మఱి కొందఱు విద్యాధిక్యముచే నౌచితి నెఱుంగఁజాలి యుందురు. ఇంకం గొందఱౌచితి నెంత యెఱింగియున్నను, తదౌచితి నాచరించుటకుఁ దేఁజాలక, దీర్ఘసూత్రుని విధమునఁ గార్యదిశ స్థిరపఱచుకొనఁజాలక, యేమియుందోపమిఁ దుదకు బ్రహ్మా పంబునం బసులువడియెదరు. వేఱొక కొంద ఱనుభవముచే నాపద నొందుచున్నను, దత్కారణము తమ ప్రవర్తనమందె యిమిడియున్నదని యెఱుంగమిఁ దమ ప్రవర్తనను సరిపెట్టుకొనఁజాలక దుఃఖముఁబొందుచునుం గూడఁ దమ ప్రవర్తనను సరిపెట్టుట కెవరేని జఱిఁగిన ఘట్టముల కార్య కారణ సూత్రములతో నెత్తి చూపుటయె దటస్థించినచో, నదియెంతవఱకు సమన్వయయోగ్యమని తమలోఁ దామాలోచించుకొనన్నైన నొల్లక, మఱింత దుస్సహనమునఁ జూపుచు, మఱియు మఱియు దురితంబులు వొరయుకార్యంబుల నాచరించుచుందురు. మనుజునకును మృగమునకునుగల ప్రధాన భేద మొక్కవిషయమున మాత్రమె గోచరమగుచున్నది. సంఘటిల్లిన దానిని గేవల మూకీభావముతో మృగ మనుభవించుచుండ, మానవుండు తత్కారణ మరయఁ బ్రయత్నించుచుండును. తనకు లోకముఁ దెలిసికొను వయస్సువచ్చినదాదిగఁ దన ప్రవర్తనను దిద్దుకొనుటయె ప్రధానముగ నెంచుకొని, తనయంత్యకాలము వఱకును,

గా నేసంఘమునఁ బ్రవర్తించుచుండునో, యా సంఘసంప్రదాయముల ననుసరించి తన పెద్దలు చన్న తెన్ను ననే తాననుగమించుచు, ధర్మాధర్మములను నీత్యవినీతులను గమనించుచు దేశకాలపాత్రలను గుర్తించుచు, కులాచారము వీడక, తన నడవడి దిద్దుకొనుచు మఱియుఁ గాలము బుచ్చుటే ప్రధానకార్యముగా నెంచవలసియున్నది. పొరపాటొందుటే మానవునకుఁ బరిపాటియగుట, గడచుకాలముదాఁక దిద్దుబాటు నొందుటే తన ప్రవర్తనకుఁ బ్రధాన లక్షణమై యున్నది.

మానవుని ప్రవర్తనయందు దోషములుండక పోవు; తద్దోషము లింకొకనిచేఁ బరిశీలింపఁబడి సవరింపఁబడవలెను. అట్లే సంఘమున దురాచారము లుండక పోవు. సంఘమే దేశాచారములను, కులాచారములను సంప్రదించి, సదాచారముల నేర్పఱచును. అట్టి సంఘమున నివసించుచుఁ, దత్సంప్రదాయములనధిగమించి, ప్రవర్తించువానినే యసాంప్రదాయకుండని యందురు. సంఘము మొల్లనికార్య మకార్యము. సంఘశాసనము లనుల్లంఘనీయములు.

తానిష్టపడిన మార్గమున స్వజనము లామోదించి యనుసరింపవలెనని నిర్బంధించు వ్యక్తులందుఁ గలదోషములు కేవలము స్వార్థమఖండముగఁ బెఱిఁగి యుండుటచే గలుగు దోషములే యగుచున్నవి. ఈ స్వార్థాభివృద్ధియైన కొలఁదిని, నిర్బంధాధికారమును నభివృద్ధిఁజెందుచునే యుండును. నిర్బంధాధికారము చిరాయుష్మంతము కానేరదనిఁ గూడ నపుడా నిర్బంధాధికారులెఱుంగకయెగదా, తమ దుర్మానము విచ్చలవిడిగా నుండుకొఱకుఁ, దమ యసహనమె స్వేచ్ఛగాఁ దిరుగాడుకొఱకుఁ, దమ యహంకారమునకంతరాయము కలుగకుండ నుండుకొఱకుఁ, దమ నిరంకుశాధికారమె పెల్లఁబడి యుండుకొఱకుఁ, దమ దురభిమానమె యెల్లకాలమును సాగుచుండుకొఱకు, ధర్మాధర్మ విచక్షణగాని, నీత్యవినీతివిభేదముగాని, గమ్యాగమ్యవ్యత్యాసముగాని, తమకుఁగాఁ దోఁచకున్నమానెఁగాని, యొరులు చూపిననైనఁ బరిగ్రహింప నొల్లకుందురు!

శంతనుకాలాంతముపర్యంతము నీ ధార్తరాష్ట్రికుల మేమాత్రము గడించినదో కాని, యాసౌశీల్యము మఱేమాత్రము నిపుడు కానరాకున్నది. అహంకారము కన్నులు గప్పుచున్నది. దుర్మానము విశేషించినది. అసహనము ప్రబలమైనది. దురభిమానము విజృంభించినది. హేయములౌ నిన్నింటిచే నిండియుండి, సంస్కార

మన్నిదెశల నావశ్యకమయి యుండినతఱి నీ కాపవు లధికారముకూడ వంచనమెయి నొందిరి; కావున నది నిరంకుశాధికారము కాక సామ్యాధికార మెట్లగును?

రాజ్యపాలనార్హులగు రాజుల నడిగికొని మనుమనుటయు, భర్తచేఁ బ్రహోషణార్హయగు నాఁడు దాని నొకకడ నూడిగముఁ జేసికొని జీవింపు మనుటయు, సమానధర్మములై యయి నెగడుచున్నవి. ఇట్టి పట్టుల నుపదేశకుల స్వార్థపరతయో, చూపోపమియో, ప్రధానకారణములయి పరిణమిల్లునేగాని జగత్కల్యాణ మెఱిఁగి సర్వదేశములందును, సర్వకాలములయందును ననుసరణీయంబులగు నుపదిష్టమార్గంబులయి నెగడఁజాలవు. కావున నుపదేశకుఁ డెంతవఱకు స్వార్థము త్యజించి ప్రవర్తింపఁగలఁడో, యాతఁ డంతవఱకును నాత్మోపదిష్టవిషయమును వ్యాపనము సేయఁగలుగువాఁడగును"

* * *

అని యింకేమేమియో తనమనమున ననుకొనుచు నాఁటికేయుం దర్శింపఁ గురుపతిసభఁ గూర్చి, సంజయుం డరుదెంచుచుండ, రారాజునాన సంజయుం దోడ్కొనిరా నొకదౌవారికుం డెదురువడి,—"దేవా! చక్రవర్తి నిండుకొలువుండి, మిముఁ దోడ్కొని రమ్మని ననుమీకడకనుప వచ్చితి" నని యనియెను.

—సంజయుఁడు—

నేను ప్రభువర్యునార్థినయి మే వడివడి నడచుచు వచ్చుచున్నాను. నిండుకొలువని యంటివే: ఎవరెవరు విచ్చేసియున్నారు?

—ప్రతీహారి—

దేవా, ఎవరని చెప్పఁగలను? ఇపుడా సభను తమరుతప్ప మఱి లేనివారే లేరు. కొలువంతబలిసియున్నది.

—సంజయుఁడు—

పరియేకాని నీవుచూచినవారిలోఁ గొంత మందియైనను నీకు జ్ఞాపకముండక పోరు. కావున నీవు గురుతించినంతవఱకు నచటనున్నవారి పేరులు చెప్పుము.

—ప్రతీహారి—

ఇపుడా కొలువుననున్న వారిలో, నా యెఱిఁగినంతవట్టు ద్రోణకృపాశ్వత్థా

మొదలగు గురుజనంబులును, గర్గకృతవర్మాదులగు దొరలును, భీష్మ విదుర బాహ్లీక సోమదత్త భూరిశ్రవ ప్రభృతులగు బంధుజనంబులును, దుర్యోధన దుశ్శాసన ప్రముఖులగు కుమార వర్గంబును వేంచేసి యున్నారు.

—సంజయుఁడు—

సరియె-వీరందఱును మనవారే. మనరాజునకు యుద్ధమున సాయమొనర్ప వచ్చినరాజులలో నెవరెవరిపుడా సభనున్నారు?

—ప్రతీహారి—

వందల కొలఁది- వేలకొలఁది- తమతమ సైన్యములతో వచ్చియున్నారు.

ఉలూకదేశాధీశుఁడౌ క్షేమధన్వియు
కాంభోజజననాథుఁడౌ సుదక్షిణుఁడును
అంబష్ఠదేశాధిపతియౌ శ్రుతాయువును
ప్రాగ్జ్యోతిషాధినాథుఁడౌ భగదత్తుఁడును
ఉత్తరకోసలఁ (అయోధ్య) రాజగు బృహద్బలుండును
హైహయదేశ [మాహిష్మతి] ప్రభువగు నలుఁడును
దశార్ణదేశపు ధరణీశుండగు హిరణ్యవర్మయును
త్రిగర్తక్ష్మాపతియగు సుశర్మయు
అవంతీ కాంతులగు విందానువిందులును
సింధువిషయేశుఁడౌ జయద్రథుండును,
మద్రనాథుండగు శల్యుండును,
గాంధారాధినాథుండగు శకునియును,

మఱియు నింకెందఱెందఱో వచ్చియున్నారు. ఇంకెందఱు ప్రభువులు తాముదయచేయఁ జాలమి, తమతమ సైన్యముల మాత్ర మంపియున్నారు.

—సంజయుఁడు—

అయిన గొప్పసభ జరిగియున్నదే!

—ప్రతీహారి—

దేవా, సభమాటకేమిగాని, పోరులేకుండఁజేయుత్రోవ మఱిలేదా?

—సంజయుఁడు—

మనరాజిష్టపడెనపో లేకేమి!

—ప్రతీహారి—

మనరాజనఁగా:- పెద్దరాజా, చిన్నరాజా?

—సంజయుఁడు—

ప్రత్యేకప్రత్యేకముగ మనకన్నులకు 'పెద్దరాజు' 'చిన్నరాజు' అనియిరువురు కానవచ్చుచున్నారు: కాని వీరిరువురుఁ నొకటియే.

—ప్రతీహారి—

అదియట్టుల?

—సంజయుఁడు—

ధర్మాధర్మవిచారశూన్యుఁడై, మాత్సర్యవశుఁడై, దురాత్మనాంధుఁడై, పాండవులను నిలువనీడయైన నుంచనొల్లఁడు చిన్నరాజు; అధర్మమనియు, ససాంపరాయికమనియు నెఱిఁగియు, ధర్మమార్గమున బుద్ధులు సెప్పి, పుత్రుని మనోగతిని మార్పసమర్థుఁడుకాఁడు పెద్దరాజు. అట్లగుటఁ, గంటికిఁ గానవచ్చువ్యక్తులిరువురే యైనను, వీరియభిమతమొక్కటియేయగుటను, వీరి నొకరుగనే భావించి, మనరాజని యంటిని. సన్నద్ధమయిన యుద్ధమును మాన్ప నెవరితరము!

ఇట్లు సంభాషించుకొనుచు వీరిరువురును నగరుసమీపించిరి. ప్రతీహారి మున్ముందుఁగ నగరుప్రవేశించి, సంజయురాకరాజునకెఱింగించి, రాజుశాసనము సంజయుని, దోడ్కొని సభాభవనముఁ బ్రవేశించెను.

# ఎనిమిదవ ప్రకరణము

## అ యి ద వ ఖ ం డ ము

బాహ్లీక సోమదత్తులు కురుసభకుఁబోవుచు నెఱపిన సంభాషణము. కురుపాండవుల స్వభావ నిరూపణము. రాజ్యము జ్యేష్ఠక్రమానుగతమెగాక, తక్కటి భ్రాతృవర్గము కూడఁ బాల్గొన నర్హులని, పూర్వపు టనుభవములంగూర్చి ప్రసంగించుట—

—సోమదత్తుఁడు—

స్వామిపుడెచటికి దయచేయుచున్నారు?

—బాహ్లీకుఁడు—

కురుపతి కబురంపినాఁడు.

—సోమదత్తుఁడు—

రమ్మనువార్త నాకునుఁ జేరినది. కాని కారణముమాత్రము తెలియలేదు.

—బాహ్లీకుఁడు—

కారణమునకేమున్నది—ద్రుపదపురోహితురాయబారపు కథనము వినివిని మనరాజు సంజయునిమూలమునఁ బాండవులకడ కేమని సందేశమంపినాఁడో— సంజయుండు మరలివచ్చి నిన్నటిరేయి రాజునకేమని నివేదించినాఁడో—కాని యాంబికేయుఁడు, తనకుఁగూర్కురామి, విదురుంగబురంపిపిలిపించుకొని, తెల్లవాఱు నందాఁక నేమేమియో ప్రసంగించుచునే యుండెనఁట! విదురుండొనర్చిన నైతిక ప్రసంగ మంధరాజుమానసమునకెక్కమి నిఁక నాధ్యాత్మికప్రసంగమునకుఁగావలయు సనత్సుజాతునింగూడ రావించి, భగవద్విషయములంగూర్చి ప్రసంగములొనర్చి

యుండును. లౌకికపారలౌకిక విషయములు రెండును సమముగానే వైచిత్రవీర్యునకు మాన సోత్సాహము గలిగించియుండును. ఇపుడు సంజయుండేమి సందేశముం గొనివచ్చెనో, సానుకూలము గ నుడువఁగలఁడనియు, నది వినవలసియున్నదనియు ననుగన్నని రాజు కబురంపెను. శుభావహమై లోకకళ్యాణప్రదమైనవార్త సంజయుముఖమున వినఁ గలుగుదుమో, లేక పట్టువిడుపులు లేని మనధార్తరాష్ట్రవంశవినాశహేతుభూతమౌ పాండుపుత్రులప్రయత్నమే వినవలసియుండునో, తెలియదుగదా! దశదిశలఁ జూచు కొని ప్రవర్తింపఁ బ్రక్రియాయోజుంగని దుర్యోధనాదులం దలంచి చింతింపవలయునో, లేక సమయోచితప్రవర్తనమునకుఁ బో యెదుటివారిపై నేరముమోపెడి తెన్నెఱింగిన ధర్మజుని సహాయస్ఫూర్తికి మదిం దలంకవలయునో తెలియకున్నది. పరమలౌకికుండగు ధర్మజుని శీలమునకుఁ బరీక్షాసమయములయందు ధర్మసూక్ష్మములనెన్నుచు నిరూపించు నిరుపమానశక్తిగల శ్రీకృష్ణుని నేర్పులో నగుట దుర్యోధనాదులొకింత తమపట్టు డుగుటో, లేక తమపట్టుసడలించుకో, రాజనీతిపరముగ కర్తవ్యమె యాయుయ్యను, గర్హాలస్పృథప్రతిజ్ఞలచే మోహితులయి, సౌబలాదుల కృత్రిమపటాలోచనములచే, దృఢీకృతమనస్కులయి యెదిరిబలముగాని, కృష్ణుని వివిధోపాయపరాయణతంగాని పరికింపఁజాలక, దీపపుకాంతింగాంచి భ్రమియించి, తునకసుఱులం బాయు శలభము లట్లు చుప్పద్గదురాకా యని తోచుచున్నది-ఇంతకును నేమికానయియుండి యింతలు పుట్టుచున్నవో యెవనికెఱుక!

తాను చక్రవర్తియయినను నేనును రాజకుటుంబములోని వాఁడనగుటయే గాక, విశేషించి తనతమ్ముండనగుట, మాయన్న శంతనుఁడు బాహ్లికదేశము నా కొసంగి నన్ను బహూకరింపలేదా! దానిని మన మనుభవించుచుండుట లేదా!

పాండవులు తమయయ్యభాగమిమ్మనిరి. తాము రాజసూయమ్మున నలవఱచి కొనిన భాగమిమ్మనిరి. వంచనచే నన్యాయాక్రమణ మొనర్చినభాగ మిమ్మనిరి. ఏ పేరిడిన నేమి-ఏదియైన నేమి-ఏమిచ్చిన నేమి-వారు వలవందురా? ఆంబికేయునిచేతి కడ్డము పెట్టువారెవరు? మాయన్న శంతను డిట్లేచేసెనా? రాజ్యలుబ్ధత యెంతెంత లానర్చుచున్నది-ఔరా, ఎంత దారుణము!"

* *

ఇట్లుప్రసంగించుకొనుచు నా బాహ్లిక సోమదత్తులు కురుసభాభవనముఁ జేరిరి.

# రా య బా ర ము

చంద్రవంశము నేలిన రాజులలోఁ గడపటి రాజగు ప్రతీపుని రెండవ కుమారుఁడు శంతనుడు. అతని వంశములోనివారు ధృతరాష్ట్రపాండు భూపతులు-ప్రతీపుని మూఁడవకుమారుఁడు బాహ్లికుఁడు. ప్రతీపుని జ్యేష్ఠకుమారుఁడగు దేవాపి రాజ్యమేల ననర్హుఁడగుటచే నాతని బ్రజలు రాజ్యభ్రష్టునిఁ గావింప రెండవవాఁడగు శంతనుఁడే రాజయ్యెను. కురురాజ్యములోనొకటనుకయగు బాహ్లికదేశమా ప్రతీపుని మూఁడవ కుమారుండగు బాహ్లికునకొసంగఁబడుటచేత, నాతని పుత్రుఁడగు సోమదత్తునితో బాహ్లికదేశము పాలించుకొనుచుండెను. కారణము లేవియైననేమి, ప్రతీపుని జ్యేష్ఠపుత్రునకు రాజ్యము రాక, రెండవవాఁడగు శంతనునకు దక్కినది; శంతనుని జ్యేష్ఠపుత్రుఁడగు భీష్మునకుఁ గాక ద్వితీయపుత్రుఁడగు చిత్రాంగదునకు దక్కియుఁ నాతఁడచిరకాలమునను గతించుటను దునకు విచిత్రవీర్యునకుఁ దక్కినది. పిదప, జాత్యంధుండగుటను, ధృతరాష్ట్రునకు రాజ్యార్హత లేమిఁ బాండునకుం గురుసామ్రాజ్య పట్టాభిషేకమొనర్పఁబడియెను. అట్లగుట నిటు మూఁడుతరములు దాఁక, జ్యేష్ఠునకు రాజ్యము దక్కకుంటఁ గురుసామ్రాజ్యవంశమునఁ జూడము.

మఱియు శంతనుఁడు రాజ్యాధిపత్యము వహించిన వెంటనె తనతమ్ముఁడగు బాహ్లికునకు బాహ్లిక [బాల్ఖ్] దేశమొసంగెను. తద్రాజ్యాధిపత్యము వహించుటచేతనె గదా యాతని బాహ్లికుండందురు. బాహ్లికుండు నిజపుత్రుండగు సోమదత్తుండును భారతయుద్ధములో తాము దివికేగుదాఁక స్వరాజ్యము పరిపాలించుకొనుచునే యుండిరి, భీష్మునట్టుల బాహ్లికుఁడు రాజ్యము త్యజింపలేదు.

## ఎనిమిదవ ప్రకరణము

### ఆ ర వ ఖ ం డ ము.

సంజయ ధృతరాష్ట్రుల ద్వితీయసమావేశము-పాండవుల తలఁపులను దనయభిప్రాయములను జోడించి, పాండవులను, వారికి సాయమొనర్ప వచ్చినవారిని, వేర్వేరెంచి, వారివారి బలాబలముల నిరూపణముసేయుట-పూరుని కాలమునుండియు హస్తి శంతనచిత్రాంగదుల కాలములవఱకునుఁగల రాజ్యాంగపరిస్థితుల విమర్శించుట, ధృతరాష్ట్రకాలమునఁగల రాచరికపులోపముల నెత్తిచూపుట, భీష్ముఁడు చేసిన మహోపన్యాసము- పాండవ కౌరవబలములలోఁ బ్రతిభా మహత్త్వముల ననుసరించిన వ్యక్తివిభజనము-భౌతికముగఁ గానవచ్చు మానవశత్రుత్వము-పరస్పరవిరుద్ధ గుణశత్రుత్వము-వీనినిగూర్చిన గుణ విభాగచర్చ-భీష్ముఁడు చూపిన కురుకాలమునాఁటి హస్తిపురరాజ్య వ్యవస్థ-శంతను కాలమునాఁటి సమృద్ధిమ-ధృతరాష్ట్రకాలము నాఁటి ప్రభుత్వమహత్త్వపటుత్వము- యుద్ధకాలమునాఁటి రాజ్య వ్యవస్థ-అప్పటిరాజకీయ పరిస్థితులలో శ్రీకృష్ణునిపురస్సరణమునకుఁ గల సహజమగు కారణాన్వేషణము-శ్రీకృష్ణుం డంతకు పూర్వమే జరాసంధాదిమహారాజుల వధించుటయందును, కురుపాండవకలహము నందును, దాను సంబంధము గలిగించుకొనుటకుఁగల కారణములు- దుర్యోధను వంశవినిర్మూలనమొనర్ప శకుని నిశ్చయించినాఁడనుటకుఁ గల పూర్వకారణవిమర్శ-కర్ణార్జునుల పరాక్రమ విచక్షణలు-పాం డవులకు ధరణీభాగమొసంగవలసిన యవసరమునందుఁగల రాజకీయ కారణచర్చ-భీష్మద్రోణసంజయవిదురాదుల హితబోధనము-దుర్యో

ధనుని మనోనిశ్చయము-తన్నిశ్చయ కారణాన్వేషణము, సకారణ సమాధానము, స్వప్రయత్న కారణ సమర్థనము-కర్ణభీష్ముల సంభాషణము-భీష్ముఁడు కర్ణుని బాహ్యముగ నీచపఱచుచుఁ బలికినకటూక్తులు కర్ణుని యస్త్రసన్యాసము- కర్ణునిఁగూర్చి భీష్ముని యాంతరంగిక భావము.

రాజబంధువు లొకవంకను, అమాత్యవర్గ మొకచాయను, పురోహిత హితజన మొకచక్కిని, సహాయసంపద నొసంగవచ్చిన రాజచక్ర మొకదిక్కునను, బారులుదీర్చియున్న సమయమున, తారాగణపరివృతుండగు రేఱేనివడువున నక్కురుపతి చెలువొందియుండ సభం బ్రవేశించిన సంజయుండు ధృతరాష్ట్రు సమీపించి తనరాకఁ దెలిపికొని, ఱేనికి మ్రొక్కి యాశీఃపరంపరలొంది, తత్సమీపస్థలంబునఁ గూరుచుండెను.

—ధృతరాష్ట్రుఁడు—

అమాత్యులారా, కురువృద్ధులారా, కురుకుమారులారా, మనసంజయుండు పాండవులకడకుం జని, వారిశుభోదర్కంబులం గాంచి వచ్చుట నిపుడీతఁడు మనకు వారింగూర్చి తెలుపఁగలాఁడు. మనము సావధానులమై విందుముగాక!

సంజయుండును లేచి నిలిచి సభవారికి నమస్కారమని సభం గలయంగనుంగొని, యిట్లనియెను—

"మనమహారాజు నన్నాతురమున ధర్మరాజుపాలికనుప, నేనుపప్లావ్యమున కేగి పాండవ్యులదర్శించితిని. ధర్మపుత్రుండును నన్నెంతేనాదరించి, మీయందఱ సేమమును వేర్వేఱ నడిగి తెలిసికొని యానందమునందెను. కురుకులనాథుండు నాకుఁ గఱపిన తెఱంగున నేకొఱంతయు లేకుండ నేనును బంధుత్వంబునకుం దగినమాట లాడితిని. పిదప నామాట

లకు సార్థకనాముండగు ధర్మజుండు పలికినచందంబదెల్ల పరమ ధర్మమార్గంబు ననుసరించి, నీతిపథంబు దప్పకయుండుట, నెవ్వరము మాత్ర మేమని యనఁగలము! ఆపరేంగిత జ్ఞానము, నా లోకజ్ఞానము, నా వినయవివేకజ్ఞానములును మఱే నరేంద్రనందనునందైనఁ దిలకింపఁ గలమే!

నే నుపప్లావ్యంబుఁ జేరిన యంతన తొలుదొల్త మాధవు దర్శింప నెంచి, తన్మందిరముం గూర్చి చని నారాక యమ్మహామహు నకుం దెలుప — నా నందనందనునకు మన రాజు నెడఁగల ప్రేమయు గౌరవమును నెంతఁగలవో కాని, — తానును, సత్యభామయును ద్రౌపదియును, నర్జునుండును, రహస్యగోష్ఠీనిరతాత్ములయియుండియు, ప్రద్యుమ్నాది కుమారవర్గమైనఁ దమ్ముఁ జేరని చెందనియట్టిచోటఁ, గాంతాజనమ్ములచేఁ దాసేవలుగొనుచు నెంతేనివిలాసమ్మున బ్రమదస్థితి నుండియుఁ, ఫణిహారిచే నాకుఁ గబురంపెను. నేనును వినీతవేషుండనై కౌస్తుభలాంఛనుని దర్శింప సమీపించునరికి నరుం డన్నారాయణుని పాదములొత్తుచుండెను. అదివఱ కే ప్రధానవిషయముం గూర్చి చర్చించుకొనుచుండిరో కాని, యా దేవకీనందనుని మోమునఁ జిఱునగవును, ద్రౌపదివదనమున రౌద్రమును, సత్యభామముఖమున నిశ్చితార్థమును, నర్జును నాస్యమున విన్నదనంబును మాత్రము వెల్లివిరియుచుండెను. చూచినయంతన కృష్ణుఁ డెంతయో యానందముతో, ననుఁ జేరఁదీసి, మనప్రభుసహితంబుగఁ గురుకుమారవర్గముతో నాగక కురువృద్ధామాత్యబంధుసుహృజ్జనంబుల సేమమారసి మనకురుపతి నెంతేని ప్రస్తుతించి, తా నుపయోగించునట్టి యన్నపానంబులును, దాఁగట్టఁదగిన యమూల్యవస్త్రాదులును, దా ధరించునట్టి యలంకారములును నా కొసంగి, నను నెంతేని సంభావించెను.

[ధృతరాష్ట్రుంజూచుచు] అంబికేయా, ఇన్ని మర్యాదలును, ఇన్ని గౌరవములును, నీకొనర్చినవిగనే భావించుచు, నీయనుమతి నని

నే ననుభవించితిని.

—ధృతరాష్ట్రుఁడు—

సంజయా, నిను సంభావనఁ జేసెననుమాట కేమిగాని, నీపోయిన కర్జ మయ్యర్జునసఖునకు నివేదింపనే లేదు కావలయు?

—సంజయుఁడు—

ననుఁబంపిన కార్యం బాయదుకులభూషణునితో మనవిమొనర్చుటయు నైనది; నాపలుకులు విని పాండవమధ్యముండలిగి బలు మొగంబు సేసికొని నాపలికిన పలుకుల కుత్తరంబొసంగఁదొడంగినంతన వారిజోదరుం డాతనిఁ దనకనుసన్నల నపవారించుటయు నైనది. అందేమియు మఱి మిగుల లేదు.

—ధృతరాష్ట్రుఁడు—

అంతలు వుట్టెనేమి? అన్నా, కార్యము మించిరాదుగద! అర్జునుం డేమనియె? కృష్ణుం డేమని యపవారించె?

—దుర్యోధనుఁడు—

(తనలో) ఈసంజయుఁడు కృష్ణునితోఁ బలుకుచుండఁ బాండవ మధ్యముండు చోరఁబడనేల?

(కర్ణునితో రహస్యముగా)

అంగరాజా! వింటివా యర్జునుని ప్రుల్లిపాటు?

—కర్ణుఁడు—

' ఆత్రుళ్లిప్పుడడంగునా? ఎన్నియేడులరణ్యావాసముఁ జేసినను, తిండికెన్ని తిప్పలువడినను, నింకను నాతని మెయివడి సడలలేదు; మేను దొలంగినఁగదా మెయివడి వీడుట!

—సంజయుఁడు—

కృష్ణుఁడు నాతోనసిన పలుకులు వినుము—

"ధృతరాష్ట్రుని నిండుకొలువున నాతని పుత్రగణమును, భీష్మ ద్రోణ కృపాచార్యాదులును, గురుమిత్రబృందంబును వినుచుండ నీవు పలుకుము"

అని నాకుఁ గట్టడిచేసి పనిచిన పలుకులు:—

'ఏమి కారణమయియున్నను గాఁడగనఁగాని, యుధిష్ఠిరునకు గినుక జనించుట మాత్ర మగ్ని నార్పసమర్థమగు నీరుల నగ్నియుప్పతిల్లుటవంటిదైనది, మఱియాయగ్నిఁ జల్లార్చుటెట్టిది కేవలమగును? కావున నీకతైన, నాలస్యమొనర్పక, నేర్పునఁ ద్వరితగతి నమునఁ గార్యములొనరిచ్చికొని, వారిఁ బిలిపించియు వారికొసంగి కృతకృత్యులగుట కలదు నను పిలయముర నీయకుండుటయ మేలుమాటయగును. కానిచో, నాలుబిడ్డల చేయేవిధాల నాదరింపవలయును నద్యా యిచ్ఛలఁబల నానంద మొందఁజేసియు, సత్పాత్రంబులెఱింగి తమకుఁగల సంపదలెల్ల దానంబు సేసియు, బంధుమిత్రాశ్రితజనంబుల సంతుష్టిపఱచియు, మఱి యాలేమవు లంచవ్రుగదా యని, శైలము తమ తమ యిచ్ఛానుగుణంబుగ నింద్రియభోగంబుల ననుభవించియు, వనవిహారి కేళ్లుపలయు నట్టలవిహారించియు, మఱియును నసుములఁ బొగించియు, మఱియుటుఁజూచ్చతే మను నిశ్చయముతో, నడిచేతఁ బ్రాణంబు విడికొని, రణభూమింబడుండు. ఇట్టులసటకె కానోపు నానాఁడు మీ కౌరవరాజులంపజును గలసి విలాసమునఁ బడిసియున్న సమయానఁ బాపము, పాండునిభుకోడని మీరంపబునుఁ బలచినపాటున కాలేమ దిక్కులకు బాహువులొడ్డి, మొంపవేసినను మీలోనెవరునుంగూడఁ గరుణింపమి, నాసతీలలామ నిస్పృహఁ జెంది, దవ్వులనున్న నన్ను—గోవిందుఁడా! కావుమందు బలవించుట, మఱినేఁ దీర్ఘంగజాలని బుణమయి ననువేధించుట, లెండుదోసలునుఁబూని గాండీవ మెక్కువెట్టి నేటరేపట నని కత్తివచ్చు కిరీటితే లేనుగడువుమండ మీరెందుఁబోఁ గలరని యుపుడసుగ నవకాశము చిక్కినది.'

అని ముకుందుం డనెను.

వైచిత్ర్యవీర్యా! అచ్యుతుని యప్పలుకులువినియు, పాండవుల యెత్తివచ్చు సన్నాహములంజూచియు, నీకొడుకుల విడుపోవమియుఁ బట్టుసడలమియుం దెలిసికొనియు, నామదిం దలంకితిని.

(దుర్యోధనుం జూపుచు-సభం దిలకించి)

ఈతండు వారల నెఱుంగఁడు. భీష్మద్రోణులపాలిపున, కర్ణ

గర్వంబును, శకుని దుర్మంత్రంబును, తనయనుజుఁడు దుశ్శాసనుని యవివేకంబును, దనదుర్మానంబును దన్నుఁ గెలిపించునని పొంగరెక్కి యున్నాఁడు. ఇట్టిపట్టుల నీతని పట్టుడిపించు టెట్టుల?

అని మఱియు సంజయుం డింకేమి చెప్పఁదలంచెనో కాని ధృతరాష్ట్రుండందుకొని "అర్జునుం డేమనియెనో?" యని యడిగెను.

—సంజయుఁడు— ( సా శ్చ ర్య ము గ )

అర్జునుఁడా—ఆతఁడు కనులెఱ్ఱజేసి యిట్లనియెను.

(దుర్యోధను నుపలక్షించుచు) ఈదుర్యోధనుండును, నీతనికి సాయమొనర్ప నెంచివచ్చిన రాజలోకంబును నాలకించుచు నుండ, నిట్టు లనుమనియెను—

"—మే మిన్నిపాట్లు బడియున్నను, మాయన్న పాలిమ్మని యడుగుటయు నాసుయోధనుఁడీకుంటయు, నింకనుపటస్థించెనేని, దుర్యోధనుఁ డింతదాఁక మా కొనర్చిన యపకృతులకును, వాకొనినకటూక్తులకును, మెఱుంగువెట్టుటయె యగును. నేనును మాయన్న భీమసేనుండును అమందానందమందునట్లు కార్యపశ తిరిగినదిగదా యని పరితృప్తులమగుదుము. ఇఁకనట్టి పట్టుల నేము నోట ననుట కేమున్నది! మాయి య్యర నాదుర్యోధనుతోఁ బోరండలకొననిచ్చుకంటెఁ, దన యహింసాధర్మను చివరవఱకును బాలించి, జనక్షయము కాకుండు మార్గముల నెంచి యెంచి, తానును దనతోఁబాటు మేమును పడరానిపాట్లంబడి, యెంత వేచియుండినను మఱి సామ్యమునఁ బ్రయోజనములేని యిట్టిగుట్టముల ధార్తరాష్ట్రులను హతాశులనుఁ జేయ సంసిద్ధులమయియున్న మమ్మింక ముంపటివలె వారింపక, మాకు ననుజ్ఞయొసంగుట కంటె నలధర్మజునకుమాత్రి మిప్పట్టున నుచితధర్మ మింకేమికలదు? దుర్యోధనుఁడు యుద్ధావని నంపశయ్యపైఁ బన్నుండకున్న మాయన్నయా ధర్మజుఁడు వనవాసమున ధూళిత్యాంబవలించిన యాయాసము దొలంగఁగలదా? తానుసమయధర్మమునకుంగట్టువడి కౌరవ్యులెంతకాలమునకైనఁగాని నైతికవృత్తింబూని, మా కిడిన యిడుమాలం గూర్చి పశ్చాత్తప్తులగుదురో కాయని మాధర్మజుం డెంతకాలము నైరణచేసినను, ధార్తరాష్ట్రులాతమతమోవృత్తి నిఁగల్గినమౌర్ఖ్యమువీడమి నింతవట్టునుఁదనలోన నడంచికొనిన

యుధిష్ఠిరకోపదవానలము శత్రుజనాటవిపైఁబడి దహనమొనర్చుచున్న పుడుగదా, ధర్మపుత్రుని సైరణ నసమర్థతగా నన్వయించుచుండిన ధృతరాష్ట్రనందనులు యమనందనుని నిజసమర్థత నెఱుంగఁగలుగుట! అంత్యకాలకాలుంబోలె భీమసేనుఁడు గదఁ ద్రిప్పుకొంచు మదించినయేనుంగల గుముల, హయసందోహముల, రథవ్రాతములఁ బొడిపొడిగాఁ జేయుచున్న సమయానఁగదా, దుర్యోధనుఁడు మాకు భాగంబిచ్చుటకుఁ బరువెత్తివచ్చుట! సాత్యకి నకుల సహదేవాభిమన్యులు శత్రుసైన్యముల నెల్లఁ జెల్లాచెదరుగఁ గొట్టి, పేరుగలవారి నెల్ల మంటఁగల్పుచుండ మీ కౌరవులు సంధి సేయఁ దలంతురుగాని, యిపుడెట్లగును? అప్రతీహతప్రతాపవంతులగు నైదుగురు ద్రౌపదీతనయులును, కౌదమసింగములు మదోన్మత్తగజానీకంబొదివిపట్టినరీతి నరాతిబలంబుల నెల్ల నెత్తుటి నీటఁ దేల్ప, నదిచూచికాని మీ రాజుమాయెడ నలుక దీరఁడుగా! తమ చెలులును జుట్టాలును స్వసైన్యంబులుగా బ్రాణాలపైఁదీపులువీడి, రణావనిం బర్విల్ల విరాటపాంచాలుర సేనలయుద్రేకమతిఘోరాకారము దాల్చి, సమరావనిని వ్యాహారము సేయుచుంటఁ జూడక కాని, గాంధారీనందనులు పట్టినమాటలసుర్రిక్కుదురనుకొంట వెర్రితనము కాదె! అదిత్కృన నున్న శిఖండియు ధృష్టద్యుమ్నుండును భీష్మద్రోణులపై గల తమ ప్రాఁబగలఁ దీర్చుకొన వారి నెదిరించి, వారిపై కులుకుటఁ గాంచి గాని మీరూరక రాజ్యమిత్తురే! గాండీవగుణనిక్వాణమునఁ జెవులు చిల్లులువోవ, శరపరంపరలు గగనవీథిఁ గప్పుచుండ, ప్రతివీరులశిరములు ఖండఖండములుగ నేల రాల, మీ గజతురగాదిబలంబులెల్ల జర్ఝరితంబులై, యథాయథలైన యవయవములు నేలఁగూల, నెత్తురు, నెనడు, నెమ్ములు, సమరతలమెల్లఁ గప్పు, నంపవానలచే నెత్తురుటేరులు ప్రవహించుచుండ భీభత్సంబుగ గన్పడుసమరావనిం గపిధ్వజమును, ధవళాశ్వములును, శోభిలుచుండ, నొగలపై నచ్యుతుండలర, దేవదత్తధ్వానంబు నింగిముట్టుచుండఁ దా నెందు దాగుందునన్నను దనకొఱకు వెన్నంటి దశదిశలును బన్వెత్తుచుండెడి మద్దివ్యరథంబవలోకించినఁగాని మాపాలుమాకిచ్చుటంగూర్చి యాలోచింపఁడు రాజరాజు!

పితామహ గురు కృపాచార్యాదులకు మేము మొ్రక్కి మఱియు, మా రాజ్యభాగంబుకై సమరంబు సేయుదుము. కౌరవులపక్షముంబూని, యెవ్వరుమాతో సమరము సేసినను, వారి శస్త్రాస్త్రంబులు, ధర్మముచేఁ బ్రతిహతంబులు కాక తప్పవని తలంతుము.

వనవాసాద్యాయాసంబులు పడిపడి వచ్చి, మాతండ్రిపాలు మాకిమ్మని పోరనున్న మేము వాసుదేవునిముందిడుకొని, మఱియు నడతుముగావున మాకు జయశ్రీ లభియింపక తప్పదు. ఇఁకనటుకాక యన్యాయంబునకుఁ జోరనొల్లనిదేవతలసైతము తమపక్షము సేసికొనివచ్చి మముమార్కొని, ధార్తరాష్ట్రులే మముఁగెల్చిరేని, ధర్మంబుకంటె నధర్మంబె బలవత్తరంబగు కాలంబువచ్చె ననియెన మంతెకాని, మాచేయునది మఱి యిప్పట్టున నకార్యంబని యననోపము. మఱియింకను జూపుడుమన్నను సైరణయను నది యిఁకలేనేలే దనునంత యైపోవుటను, నేమాత్రము సత్సంప్రదాయికచిహ్నము లున్నను నీవఱకే పశ్చాత్తాప ముపయింపవలసిన కాలముగూడఁ గడచేరుటను, దుస్సంకల్ప మా గాంధారీనందనుల దెస ప్రబలమై యోర్వలేమి ప్రకోపించుటను, మేమిపు డేమాత్రమును విలంబము సేయక, యుద్యోగించితిమేని, కర్ణసహితమా గాంధారీనందనస్కంధావారములఁ దునిమి, పుడమిగైకొనుటయో, సిద్ధించుట కెన్నేని నిమిత్తంబులు దోచుచున్నవి. కాకున్న గాండివమెక్కువెట్టకయె గుడుసువడుటయును, బాణంబులు తూణీరంబులనుండి తమయంతటన పైవెడలుటయును, బొర విడిచిన మహానాగంబువోలె, కరవాలంబు తనకుఁదాన యొఱవెళికి నిగుడుటయును, దేవదత్తంబు తనకుఁదాన మ్రోగుటయుఁ దటస్థింపఁజాలవు. పరిసరప్రాంతపరిస్థితులను, వాతావరణస్థితియును, జనసామాన్యపుటభిప్రాయమును, గార్యకారణసమన్వయమును బరికించినచో, సమరమే సర్వవిధముల సంసిద్ధమయియున్నది.

సంజయా, నీవుమరవక యీపలుకులెల్లఁ గురువృద్ధులును, నాచార్యవర్గంబును, విదురాది మంత్రివర్గంబును వినునట్లు కౌరవేంద్రుని నిండుకొలువునఁబలుకుము. పిదప వారేమినిశ్చయించిన నయ్యదియ కాఁగలదని కొంకేమియునులేక, యుచ్చైస్స్వనంబున ధనంజయుండు వలికె.''

ధృతరాష్ట్రుం డాపలుకుల కదరిపడి, మనసుకలఁతనొందుటచే నోటమాటలేక మిన్నకుండెను.

సంజయుపలుకులన్నియు వినివిని,

దుర్యోధనుదిక్కు మొగంబయి నిలిచి భీష్ముఁడు—

“సుయోధనా! ఇపుడు బావమఱఁదులును, సారథియు రథి

యును, నగు కృష్ణార్జునులు, వెనుకటికాలపు నరనారాయణులే యనియు, వారిరువురును జీవాత్మపరమాత్మలకుఁగల సంబంధముకలవా రనియుఁ బెద్దలాడుమాటలు నీకుఁ బొచ్చెములై నచ్చవుకావున వాని నటులుండనిచ్చి యిటువినుము:—

మన వంశమునకు మూలపురుషుఁడగు కురువునాఁటి కుల గౌరవములును, హస్తినాటి ప్రభుత్వపటుత్వమును, మాతండ్రియగు శంతనుమహారాజుకాలముననే కొంతతగ్గినది. అది మొదలిప్పటివఱకును మనసామంతులలో నొక్కండును హస్తిపురసామ్రాట్పదవి నంగీకరించి నట్టులు కానరాదు. వాణిజ్యమందే లక్ష్మివసియించుచుండును. లక్ష్మికి ఆగమన హేతుభూతములై ఆర్యావర్తముననున్న భిన్నభిన్న వణిజ్మార్గములెల్ల మనచిన్నచిన్న రాజ్యముల నుండియే నడచుచు మన స్వాధీనములోనున్నవి. స్వాతంత్ర్యసంస్థాపనమునకా వణిజ్మార్గములు స్వాధీనపఱచికొననెంచి, యేకకార్యార్థులగు కొందఱు రాజులు కట్టు కట్టుట తటస్థించినది. ఇది మనసామంతరాజుల ప్రయత్నముల పరిస్థితి.

ఇఁక వణిజ్మార్గములెట్లున్నవో చూచితివా: కళింగమగధచేది సాళ్వశూరసేనదేశములమార్గమున నొకవణిజ్మార్గమును, మగధనుండి ప్రాగ్జ్యోతిషమువఱకు నొకవణిజ్మార్గమును, మనహస్తిరాజ్యమునుండి పాంచాలమార్గమునఁ గాలయవనునిరాజ్యముమీఁదుగాఁ గుశస్థలము వఱకునుగల ప్రదేశములమీఁదుగా నొక వణిజ్మార్గమును, నిట్లనేక మార్గములు మనసామ్రాజ్యముమీఁదుగనే పోవుచున్నవి. ఇన్నిమార్గములను బరిరక్షించుటయు నిరోధించుటయు మన పనియైయున్నది. మాతండ్రిగతించినపిదప మనసామ్రాజ్యమునుఁ బొందుని యనంతరము మఱిసమర్థుఁడగునాథుఁడు పరిపాలించుటకాని, శాంతి నెలకొల్పనెంచుట కాని, జరిపియుండమి, నెందఱెందఱురాజులో మనపైఁదిరుగఁబడుటకు సంసిద్ధులగుచున్నారు. అది నీవుగుర్తించి యట్టి ప్రమాదమునుండి,

నినునీవు రక్షణ మొనర్చుకొనుటకంటెం బాండుపుత్రులపై దాడివెడ లుటయే ప్రపథమ కార్యముగా నెంచుచున్నావు. ఇది యెంతయు శోచనీయము కాదా!

తొలి నీచే భంగపఱుపఁబడి దేశాలంబడి ద్రౌపదీస్వయంవర సమయమున బయల్పడిన పాండవేయులు, పదంపడి కురుసామ్రాజ్యమున కేనాఁటనుండియో ప్రక్కబల్లెమనఁదగిన పాంచాలముతో మైత్రి నెఱపికొనిన నాఁటనె, కురుసామ్రాజ్యపతన హేతువు లేర్పడినవి. ఆ యుదంతమంతయు నీతండ్రికిఁ దెలిపితిని.

కారణాంతరమున నేను రాజ్యముఁ జేకొనమి, నా జనకుని యనంతరము కొలఁదికాలమె రాజ్యమేలిన నాసవతితమ్ములలో జ్యేష్ఠుం డగు చిత్రాంగదుఁడు బాల్యముననే గతించుట నాతని తమ్ముఁడగు విచిత్రవీర్యునకు రాజ్యము సుప్రతిష్ఠితమైనది. ఆతండును నపుత్రకుఁడై దివికేగుట, నాతనిసతులగు అంబికాంబాలికలయందు వ్యాసు కరుణను దేవరన్యాయమున నీతండ్రియుఁ బాండుండును జన్మించిరి. నాతండ్రియగు శంతనుననంతరము, నీతండ్రియుఁ బినతండ్రియు జన్మించువఱకును నేనును, నాసవతితల్లి యగుసత్యవతియు వ్యాసుననుమతిని సామ్రాజ్యరక్షకవర్గముగా నేర్పడి రాజ్యవ్యవహారములు నడిపించితిమి. అట్లగుట నీరాజ్యంపుసంప్రదాయమును, ప్రజల యభిమతములును, సామంతరాజులమంతనములును నేను బూర్తిగ నెఱుఁగుదును. దేవరన్యాయమున వ్యాసుప్రసాదమున జన్మించినవారిలో జ్యేష్ఠుండగు నీతండ్రి జాత్యంధుఁడగుటను రాజ్యపాలన కనర్హుండగుట, సత్యవతియు, అప్పటిపెద్దలును, రాష్ట్రమునంగల సామంతులును నొక సభజేసి జాత్యంధుఁడగువాఁడు ధర్మశాస్త్రములు చెప్పినచొప్పున రాజ్యాధిపతి కారాదని తీర్మానించి, దేశకాలపాత్రల ననుసరించి పాండునకే రాజ్యాభిషేక మొనరించి పట్టంబుఁగట్టి యాతనినె చక్రవర్తిగ జేసిరి. విమలచరిత్రుండగు పాండుఁడు తాఁ దఱచుగ

శత్రురాజులనదిమి, కప్పములు గొనుటకు రాష్ట్రమునఁ దిరుగుచుండ వలసియుండుటను, దనయన్నయందలిభక్తిపెంపునను, నీతండ్రినిసింహాసనముపైనిడి పోవుచుండెడివాఁడు. అట్లగుట నీతండ్రి సింహాసనముపైఁ గూరుచుండుట తటస్థమైనది. పాండుఁడు తఱచుగ దేశాలంబడి తిరుగుచుండుటను, నేనును విదురుండును నీతిధర్మముల ననుసరించి రాజ్యపాలనవిధుల సక్రమముగ నిర్వర్తించుచు వచ్చితిమి. అనంతరము కొంతకాలమునకుఁ బాండుఁడు గతించుటయు, నాతనిపుత్రులేవురను, నాతనిసతిని మునులు దోడ్కొనివచ్చి నీతండ్రి కప్పగించుటయుఁ బరిపూర్ణముగ నెల్లఱకును దెలియవచ్చుటచే, నయ్యేవురును బాండుపుత్రులుగ నంగీకరింపఁబడుటయు, నీతండ్రి పాండునియందుఁగల యభిమానముపెంపునను, ప్రజల యభీష్టము చొప్పునను, బాండవుల యందు జ్యేష్ఠుండగు ధర్మజునిసత్త్వవిఖ్యాతికిఁ దోడగు నట్లాతనికి యావరాజ్యపట్టాభిషేకం బొనఁగూర్చుటయుఁ దటస్థించినవి. ఇదియు నప్పటి పెద్దలతీర్మానము ననుసరించియే జరిగినది సుమా!

ఇంకను రాజ్యమునఁ బాండవేయులకు భాగము లేదందువేని, పితృపితామహాంబయిన రాజ్యంబునకు మీయట్లనెవారును అర్హులు గావున, వారల కర్ధరాజ్యంబిచ్చిన నీకును, నీబాంధవులకును లోకంబులకును బ్రియంబగు. అట్లుకానినాఁ డపకీర్తియగు.

దుర్యోధనా, ఇది మాతండ్రితాతల రాజ్యమని నీవెట్లు చూచెదవో, వారును అట్లే వారితండ్రితాతల రాజ్యమని తలంతురు. రాజ్యాభిషిక్తుఁడైన వానిపుత్రులే రాజ్యార్హులు కానియెడల నీకుమాత్రము రాజ్యార్హత యెట్లుకలుగఁగలదు? అజ్యేష్ఠసంతతివారగుపాండవులు రాజ్యానర్హులని యందువేని, యంధునిసంతతివారగు మీ రెట్లు రాజ్యార్హులు కాఁగలరు? అట్లగుట నుభయపక్షములవారును రాజ్యానర్హులే యగుచున్నారు. అనా డింతదూరమాలోచింపక కాదు మా సవతితల్లి సత్యవతి ధృతరాష్ట్ర పాండుభూపతులలోఁ బాండునకే

యీసకలకౌరవరాజ్య మభిషేకముఁ జేయుటయు మీతండ్రిధర్మజునకు యౌవరాజ్య పట్టాభిషేకముఁ జేయుటయును. సంప్రదాయగరిమను పురముననున్న పెద్దలును, మనవంశముననున్న వృద్ధులును, పురోహిత హితామాత్య బృందంబును నెదినిశ్చయింతు రదియె కార్యరూపము నొందుచుండెడిది. అట్టికార్యక్రమమునకు భంగమురానిచ్చుట యక్రమముకాదా? నీవు ధర్మముచేత రాజ్యమునుబొంద నర్హుండనంటివేని, నీవు రాజ్యము నెఱుంగకముందే యౌవరాజ్య పట్టాభిషేకధర్మము చేతఁ బాండవులు రాజ్యమును నీకన్నమున్నుగనే పొందియున్నారు. ఇఁక నెటుజూచినను మిగిలినది నీమేనమామయొక్క దుస్తంత్ర మిళితమా కౌతుకము, నీవంచనయును: ఇంతియేగద! ఇఁకవీనిఫలమో: స్వబంధునాశము, జనవినాశము, స్వవినాశమును!

సుయోధనా! ధర్మరాజాదులయెడనీవుఁజూపోపమిని వారలదవ్వల కనుపనిచో, బ్రాయోపవిష్టుండ నగుదు నన, నీ నిర్బంధోక్తుల కడలి నీతండ్రి ధర్మజున కర్ధరాజ్యమిచ్చితి ననెను. అట్లనియు నింత విశాల కురుసామ్రాజ్యమందును వారికొసంగఁదగుతావు వేరొండులేనటుల నెంచియెంచి ఖాండవము నొసంగి వారి నందుండ నియమించెను. అట్లు నియమించుటలో నొక ప్రత్యేకపు దురుద్దేశము మీకు లేకపోలేదు సుమా! అయినను వా రానాఁటనుండి మఱియు మఱియు విజృంభితతేజులై, విశిష్టకృతవీర్యులై నానాఁటను విశ్వవిఖ్యాతులై నెగడుచున్నారనుట నిర్వివాదాంశముకాదా! ఇట్టిపాండవులను మీయండ నుండనీయకుండ దొదవ్వులకుం బనిపి, వారియెడ వంచనలువన్ని వారితోడి వైరమున కీయకొనియున్నావు. స్వాతంత్ర్య సంస్థాపనమునకై చిరకాలమునుండి తఱి వేచివేచి యిదియె యదనని పాండవుల యండఁజేరియున్న మనసామంతరాజులతోఁగూడ నీ విపుడు శత్రుత్వ మభ్యర్థించుచున్నావు. ఇట్లగుట పాండవులను నీవే చేఁజేతుల ద్విగుణీకృతబలసంపన్నులుగ జేయువాఁడ వగుచున్నావు.

మనకుఁ జిరశత్రువులగు పాంచాలురసహాయము పాంచాలీ వివాహానంతరమునను, విరటునిసహాయ్యము నుత్తరావివాహానంతరమునను, పాండవులు పొందియుంటుట లోకసంగ్రహావృత్తము నెఱుంగని నీకెట్లు తెలియఁగలదు! ఇంతతోఁ బాండవపాంచాలము, పాండవపాంచాలమాత్స్యముగా నేర్పడినదికదా! ఇట్టి పరిస్థితులలో నీత్రివర్గసమ్మేళన మిపుడు యాదుకులశేఖరుండగు శ్రీకృష్ణుని సాహాయ్యముంగూడ నందుటను బాండవపాంచాలయాదవమాత్స్యముగా మారినది. ఇట్లు ద్వివర్గసమ్మేళనము త్రివర్గసమ్మేళనముగను, అత్రివర్గ సమ్మేళనమిపుడు చతుర్వర్గసమ్మేళనముగను దేలినదికదా! మఱియు నింతతో నాగక యాచతుర్వర్గసమ్మేళన మిఁక విశ్వైకసమ్మేళనముగా మారిపోవును జుమ! అపుడు నిను దేర్చువా రుండరు!

తన ప్రత్యేకకార్యక్రమమునకు దారులుతీసి, తనబుద్ధికుశలత ప్రబలముగఁ జూపినకృష్ణుఁడు పాండవోద్యమరథమునకు సారథియై యున్నాఁడని యెఱుంగకున్నావు.

ఈ పరిస్థితులిట్లుండ యదువృష్ణిభోజాంధకాదుల యౌజ్జ్వల్యమునకుఁ బాటుపడుచుఁ దనకు జ్ఞానమువచ్చినాదాదిగ యదువంశోద్ధరణమే ప్రధానకార్యముగఁ దనదృక్పథము నిడికొని, కంసవధతో నారంభించి, జరాసంధవధతోఁ బరిపక్వతనొందఁజేసి, తనరాజనీతిజ్ఞతచే, లోకహితకార్యములచే, భగవదవతారమునాఁ బఱఁగుచుఁ దనచింతితకార్యక్రమమునకుఁ దోడ్పడ్డికొనుచు, భారతభూమి నుండఁదగరని తనకుఁదోఁచినవారిని, దనయుద్యోగమున కంతరాయముఁ గల్పించువారిని, కురుపాండవ కలహమను నెపమున నిర్మూలన మొనర్ప నెంచిన కృష్ణుఁడు ఇపుడు—"జయ మొసంగెద రావోయి" యని యరదంబుపయి నర్జునుం గూరుచుండఁజేసి, తాఁ దేరుగడపుచు నతురావని విహారలీలఁ దిరుగుచు, జరుగుచుండెడి ప్రతిఘట్టమును దన ధర్మసూత్రబలమ్మునఁ బరిరక్షణ మ్మొనర్చుచుఁ గదనరంగమునకు

సూత్రధారివై కార్యకలాపము నడపించుచుండ దైవ పౌరుష ప్రభాసముజ్జ్వలిత పరాక్రముండగు నా విజయుం గన్నెత్తిచూడ నా హరునకైన వశముకాదుసుమ! ఇదికార్య మిదియకార్య మని యైన యోచించుకొనఁజాలని నీవు కర్ణశకునిదుశ్శాసనుల దుర్మంత్ర దుస్తంత్రదుష్కర్మములచే నాడింపఁబడుచుండుకీలుబొమ్మవయితివేగాని, తుదకీముప్పుఁయును ఆహవరంగంబున వెల్వెలఁబోయి నిలిచియున్న సమయాన నీవుమతి కానరాకుండ నెందేనిఁ దలఁదాచికొనఁ బరువెత్తవలసి వచ్చునేమోయను మాభీతికిమాత్రము తావులేకపోలేదు సుమీ! దుష్టనికృష్టాత్ములగు నీకర్ణాదులు పాండవులఁ బరిభవించుటకును, పాండవులను భండనమున నోడించుటకును నినుఁ బురికొల్పుచుండుటయు, నీచింతితకార్యముగడ దేర్తురని నీవునమ్ముటయుం జూడఁ దుదకు నిన్నే కడతేర్తురేమో యని కురువృద్ధులమగుమేము దుఃఖింపవలసి వచ్చుచున్నది.

— కర్ణుఁడు

(భీష్ముని పలుకులకుం గనలి)

గంగానందనా, వయసునవృద్ధుండవును, రాజకుటుంబమునకుఁ బెద్దవును, పాలితపాలకసంబంధమునుఁ రాజభృత్య సంప్రదాయమును బాగుగ గుర్తెఱింగినవాఁడవును నగునీకుంగూడ, రాజునకును బుత్రులకును మనుమలకును రాష్ట్రమునకును, సంప్రీతియు క్షేమమునొనఁగూర్చు తెఱంగున నేఁబలుకుచుఁ బ్రవర్తించుట, భృత్యునకుఁ దగని పనియని దోఁచెనుగా? నే నాతనిమన్ననలకును నను్గ్రహమునకును దగనని నీకుఁదోఁచినదే కాని, రాజు నన్నింతవానిగఁ జేసియుండుటకుఁ గతంబేమో తెలిసికొనఁజాలక యీ నిండినసభలో నోరికి వచ్చిన ట్లెల్ల నెఱిదప్పిన మాటలచే ననుదూరిన నీ కిది సత్సంప్రదాయకపు రాకొమరునకుం దగనిపని యనియైన నెట్లెఱుంగ నగును?

— భీష్ముఁడు —

(కర్ణునిపలుకులు విని దుర్యోధను నుద్దేశించి) పాండవులలో నొక్క చిఱుతవానినైనఁ బోలం డీకర్ణుఁడు. మదిఁగొంకులేక, పాండవేయుల గెల్తునని పలుకసాహసించు నీ రాధేయురజ్జులు, తులువలు మాత్రమె వినఁగుతూహలపడుదురు.

[కొలువుఁ గలయం జూచి]

సర్వసుగుణాఢ్యులును, బలవంతులును, పలుకుఁబడి నెనలేని వారలునునగు పాండుసుతులమగఁటిమి కీసూతపుత్త్రుఁడె తగినయెదిరి యని పొరపడి పాండుపుత్త్రుల నీసుయోధనుఁడు విరోధముంగొని యవమానించెను. పాండుపుత్త్రులపై నీతనికిఁ జిన్ననాఁటనుండియు మాత్సర్యము పెరుగుచున్నను, సూతసుతుని కానిమాటలును, ఉల్లికుట్టుపలుకులును లేవేని, ఈసుయోధనుని మాత్సర్యమీతని సజీవునిగ దహింపఁగలదే కాని, యింతింతదుస్సాహసపుఁ గార్యము లొనర్పఁజేయఁ గలుగునా? పాండుతనయులలో నొక్కొక్కరుండె యనేకవిధయుద్ధములం జయంబులఁగొని చేవలుదేరి, యుక్కెక్కియున్నారు. పసులమందల మరల్చుకొని పోవుసమయాన (కర్ణునిఁ జూపుచు) నర్జునుం డీకర్ణునితమ్మునిఁ గూలనేసినపు డీతండట లేనని యనఁగలఁడా?

(కర్ణునుద్దేశించి ధృతరాష్ట్రునితో)

దుర్యోధనునకు మేలొనఁగూర్తునని బాసఁజేసి ధైర్యముఁ గొలిపిన యీరాధేయుఁడు గోగ్రహణమున నర్జునుండాగ్రహంబున మనమూకలనెల్లఁ జిందరవందరఁ జేసినపుడును, మమ్మందఱ మూర్ఛితులఁజేసి వీరివీరి శిరోవేష్టంబులనెల్లఁ దెగఁగోసికొని యర్జునుం డేగునపుడును, ఏమి సేయఁగలిగె? తానపుడట లేఁడో! ఎందేనిఁ దిరుగాడుచుండెనో! అర్జునిచే మూర్ఛితుఁడై యుండెనో! వేయేల? పలుకులు వేరు—పనులు వేరు!

ఆంబికేయా, ఘోషయాత్రకను వంకను మన సుయోధనుని గొంచుఁబోవునపుడు వలదువల దని యెన్నివిధాల మొఱవెట్టినను వినక, నీకొడుకీ రాధేయునిరజ్జులువిని, పోయి, తుదకటగంధర్వులచేతఁ జిక్కి పొక్కి 'వెక్కిరింపఁబోయి వెల్లకిలఁబడి' ప్రాణముల్వోయునంత యయినపిదప నాభీమార్జునులేకద మనసుయోధనుని రక్షించిరి? అపుడీ యంగరా జేమయ్యెనో!

వేయేల! వైచిత్రవీర్యా, తాను పోటరినని, యర్జునునకుఁ దానే సరియని, తగిన యెదిరినని, దుర్యోధనునిచే ననిచేయింపనున్న యీ సూతజునిచే, భ్రమచే, మనగాంధారీనందనుండె మోసగిలుటకాక, భరతవంశపు బ్రతుకెల్ల నీసూతసుతుని వశమైనది. ఈతఁడెట్లుద్దిప్పిన నటుదిరిగెడిగతి పట్టిన దీధార్తరాష్ట్రకులమునకు! తన దుర్మానమే ప్రధానముగఁ జేసికొని వివేకవిహీనుండయి, నీతివిరహితములగు నీ రాధేయుని పలుకులె హితము లనుకొని లోకసంగ్రహవృత్తి నెఱుంగక, అని కని తత్తఱపడుచుండినయీదుర్యోధనునకు బ్రతీకారము లేని పశ్చాత్తాపమునకు సైతము సమయములేకుండఁబోవు పరిస్థితు లమరునేమోయనిమాయట్టివారు దలంకుటకన్న వేఱేమిచేయఁగలరు?

[కర్ణు నుపలక్షించుచు] ఈదుర్జాతుండు కార్యాకార్యము లెఱుంగక, గమ్యాగమ్యములు గమనింపక, నీచకులోత్పన్నుండగుట సంత్సంప్రదాయదూరుండై, రాజభక్తియనుమిషచే దుర్యోధనునకు నచ్చిన యిచ్చకములే ప్రధానములనుకొని, నీతివిరహితుఁడై తనకర్జునుదెసఁగల ప్రత్యేకపుటీర్ష్యను దీర్చుకొనుటకుఁ, దనపగ సాధించుకొనుటకు, నోరికివచ్చినట్లెల్లఁ బ్రేలుచుండ, (దుర్యోధను నీక్షించుచు) ఔననుకొనుచు పీనికారుల నీసుయోధనుండు గైకొని వినుచుండును. భరతకులమునకంతకును సుడిపట్టినది. రాజులకు నీచసంపర్కము కలిగినపు డింతకన్న నేమి కాఁగలదు? ఇందులకు దుఃఖించుచు మే మూరకుండవలసిన దేనా! ఔరా, కాలమహిమ!

— ద్రోణుడు —

(దుర్యోధనునీక్షించుచు) సర్వకురుకుమార సర్గంబునకుం గూడ మేరువుపూసయట్టి గంగాసుతుండిపుడు పలికినదెల్ల నీ క్షేమము గోరియు, భరతవంశమును వినాశమునుండి తొలఁగఁజేయ నభిమతించియుఁగదా! దేశకాలపరిస్థితుల ననుసరించియు, నీ పరిసర ప్రాంతముల రాజకీయపరిస్థితులఁ బరిశీలించియుఁ గురుకులమిప్పుడుఁ గల కాలమంతయు మనుటనభిలషించి పలికినపలుకులు విన ననునంత పంతము నీకుఁగలుగుట కురుకులాన కంతకును నంతమున దీర రానివంతఁ దెచ్చిపెట్టుటకేయగును. రాజకీయవాతావరణమిపుడు మనము కయ్యమునకుఁ దగమనుచున్నది. సంజయునితో సగ్గునుం డపుడెంతాడనో యంతయుఁజేయునంతటి దిట్టరియని మనకుఁదోఁపఁ జేయ సమర్థంబులగు ఘట్టంబులెన్ని లేవు! ఒక్కమాట యోచింపుము. ఎవరుమాత్రము బాణతూణీరములను బట్టలేరు? ఎవరుమాత్రము జయములఁ బడయలేదు? కాని, విజయుండను నామధేయమొక్క యర్జునకుమాత్రమే రాఁగతంబేమని యోచింప వలదా?

(ధృతరాష్ట్రి నుద్దేశించి)

మనవారందఱును నడిపించిన యుద్ధములెన్ని లేవు? ఓటమి సమకూడని పోటాక్కటియైన మనవారికిఁ జిక్కలేదని యనఁగలమా? ఇఁక నటు అర్జునుం డలంతుమన్న, నాతఁడోడినవార్త నేయెడనైన నెన్నఁగలమా! వేయేల? అర్జును నిర్జించువాని నొక్కని మనవీఁటనె కా దీపదునాలుగుభువనములం దేకడనయునంగాని జూపఁగలమా? విజయు విజయముంగూర్చియు, రాధేయునోటమింగూర్చియు సందియముపీడియుండుము. ఇఁక మఱి చెప్పుటకేమున్నది?

ఇటుల భీష్మద్రోణు లిరువురును దుర్యోధనునితోఁ గొంతతడవును, దుర్యోధను నుద్దేశించిధృతరాష్ట్రునితోఁగొంతతడవునుహితోప దేశపూర్ణ సంభాషణములఁ జేయుచునే యుండిరి. కాని, వీరి హితోప

దేశంబుల నేమాత్రమును గైకొనకయే పాండవులవార్తలనడుగుటకుం బూనిన ధృతరాష్ట్రుండు సంజయుం బిలిచి, "సంజయా, మనకు సమకూడిన సహాయసంపత్తి విని నీతో యుధిష్ఠిరుం డేమనియెను? తన భ్రాతృపుత్రాదులలో నెవ్వ రాతనియాజ్ఞ ననువర్తింతురు? మనవారి వలనకె వారికొనర్చిన నిష్కృతింజేసి, చేసినదాని కీసునడెడు నవ్వారి కెవ్వారు శాంతితత్త్వమును బోధించుచుందురు? అటుకాదేని బాండవేయుల కోపాగ్ని కింధనసంపాదన మెవ్వరొనర్చుచుందురు? వారు మనపైఁ గవియుటే తటస్థించెనేని ధృష్టద్యుమ్నుం గాని రారుకద! మనపై ధర్మనందనుండెత్తివచ్చినచో నెవరినిదోడ్కొని రాఁగలఁడు?"

ధృతరాష్ట్రుండట్లు ప్రశ్నించుచుండ సంజయుఁడు ప్రాప్పడి మూర్ఛిల్లెను.

## విష్కంభము

### — సభలో గుసగుసలు —

"హోరా! యెంతమౌఢ్యము! అంతయు వినియు సంజయు నెట్టిప్రశ్నము లడుగుచున్నాఁ డీ కురువిభుఁడు!"

"కొడుకును దండ్రియు నొక్కరూపయగుట వస్తుతత్త్వములో భేదములేదు; భిన్న భిన్న ముఖములు మాత్రమెయగును. తండ్రి కపటియగుట బయల్పడఁడు. కొడుకు దురాత్మునియు దురహంకారియు నగుట బయల్పడును. ఇదియే భేదము."

"ఏది యెట్లయినను, మనమందఱమును ప్రాణాలపై నిఁకఁ దీపులువిడవలసినదే గద! ఏమో, యేమాత్రమైనను బౌర్వాపర్యవిచారణపేయునేమో యూ పెద్దరాజని మన మనుకొనియుంటిమి. అట్లనుకొనుట మన పొరపాటేయగును. ఇప్పటికి

మన చూచినవారిలో నింతమూర్ఖతవహించిన రాజు నెఱుంగము. చెట్టునప్పుకాలానఁ గుక్కమూతిపిందెలు పుట్టునన్నట్టు లీనాటికి శంతనువంశమున నిట్టి తండ్రికొడుకులు పొడమిరి. హితము చెప్పువారి నోటిచేదే కాని, కార్యమేమున్నది?"

"సంభవించిన దేశారిష్టమును, కానయియున్న జనక్షయమును, దొలఁగింపఁగల మహామహిమాన్వితుఁడౌ నొక్క మహాపురుషుఁడీ సమయాన బొడమినఁ గాక పరిస్థితులు మాఱుటో, మానుటో, జరుగఁజాలదు."

"ఏమీ, అట్లనుటేమి? ఇపుడీరంగమున జరుగుచున్నదంతయు, భగవంతుని సంకల్పమే యయినచో, మూర్తీభవించిన మాత్సర్యదేవతయే ప్రధానపాత్రధారిణియై ప్రవర్తిల్లఁగలదు; అటుగాక, దౌరాత్మ్యదుర్వృక్షజాతవిషఫలంబులఁ దెగఁగోయు సంకల్పమె భగవంతునిదైనచో, నింతతో నీకౌరవశాఖ నంతరింపఁజేయఁగల కార్యకలాపంబిట్టె పన్నఁబడి శీఘ్రముగనె ఫలోన్ముఖము కాఁగలదు. కావున నీశ్వరసంకల్పముననే యింతదనుక నంతయు జరిగిననియు నిఁక ముందుజరుగనయియున్నదనియు నని మనము సమన్వయించుకొనినచో, మఱి మనోవిచారమునకును బాహ్యక్లేశములకును దావులేదే.

"మనము ప్రమాణము చెప్పలేక యీశ్వరసంకల్పమని యనుటయే కాని, ధార్తరాష్ట్రులలో నింతింత విద్ద్వారముల నా యీశ్వరుండు సంకల్పించుటేల? మఱి యిపుడు వాని నడుప నీవిశ్వప్రయత్నములేల? ఇదియా భగవంతుని విలాసము! చేయుటయును జెఱచుటయునా? ఏమి విలాసము! విలపింపఁదగిన విలాసము!!"

."ఇపుడు మన కీశ్వరవిలాసముఁ గూర్చి యాతగవేల? అదిగో ధృతరాష్ట్రుఁ డడిగిన ప్రశ్నములకు ప్రత్యుత్తరంబొసంగఁజాలక సంజయుఁడు మూర్ఛిల్లినాఁడు."

"ఆమూర్ఛిల్లుటకుఁ గారణమేమి? ఒకరడిగిన ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరంబొసంగఁ జాలనివాఁడు మూర్ఛిల్లునా?"

"ఆడిగిన ప్రశ్నకుఁ బ్రత్యుత్తర మొసంగఁజాలమి కాదా మూర్ఛిల్లుటకు గారణము. తానంతమారము పాండవబలముఁ దెలియఁబఱచినను, దనకొడుకు పట్లనున్న లోపము లుగ్గడించినను, రాజకీయపరిస్థితుల ననుసరించి పాండవుల తోడి ఖండనమెంతయును గండమె యగునని తెలియఁజేసినను, నింకను ధృత

రాష్ట్రుఁడు వాయోడక, పాండవబలనిశ్చయ విశేషాదులంగూర్చియడుగుచున్నాఁడే యనియు, ధృతరాష్ట్రు హృదయ పరిమాణమును, హృద్భావనైర్మల్యపరిణామమును సంజయుండు తెలిసికొని గుండియ లవియ విషణ్ణుఁడై, యుల్లమున నొల్లవోయి మూర్ఛిల్లెంగాని, యాతండడిగిన ప్రశ్నమునకుఁ బ్రత్యుత్తరమొసంగఁజాలక కాదు. అంబికేయుండడిగిన ప్రశ్నయందలి భావమును, తత్సంకల్పమును సంజయుని మూర్ఛ వోఁజేయుటేమి!

“సంజయునిమూర్ఛ కేమికాని— చూచితివా, సభనున్నవారందఱు నేమనుకొనుచున్నారో! ఈసంజయుఁడు తనరాయబార నివేదన మా ధర్మజుమోత్రిల నెఱపు నపుడే పర్యవసాన మొనఁగూర్చెనో కాని, ధర్మజుసందేశ మీ ధార్తరాష్ట్రుల సమక్షమున నీసంజయుండు తెలుపుటలో మాత్రము తేలిన యితర పర్యవసానములలో ముఖ్యమైనది వీరికి సాయమొనర్ప నెంచి వచ్చిన రాజలోకమునకుఁ బాండవుల దెసఁ గనికరమును, వారిపరాక్రమము వలనిభయమును జనింపఁజేయుట. ఈతఁడెంత దూరము ప్రసంగము చేసినను, బాండవులఁ గొండాడుటయును ధార్తరాష్ట్రులఁ దెగడుటయును జేయుచున్నాఁడు.

మన మాటలకేమికాని, అదిగో సంజయుఁడు లేచి నిలిచి వేఁడినిట్టూర్పు పుచ్చి సాశ్చర్యముగఁ జూచుచున్నాఁడు.”

అని సభలో నున్నవారు తమలోఁ దామనుకొనిరి.

—సంజయుఁడు—

[వేఁడి నిట్టూర్పు విడిచి తనలో]

అక్కటా! ఈతఁడెంత మూర్ఖుఁడు! ఎంత తెలియఁజెప్పినను, ‘ధర్మజుండెవరిని దోడుసేసికొని, మనపైకెత్తి రాగలఁడని యడుగుచున్నాఁడు! ఇంతమాత్రమెఱుంగఁజాలని వాని కేమిచెప్పిన నేమిలాభము! వయోవృద్ధుఁడయి లోకపుఁదెన్నెఱింగిన యీతఁడే యిట్లనిన, నిఁక నీతని పుత్రులమాటఁ దలంపనేల? వీరి యవివేకమును, మౌర్ఖ్యమును, నహంకారమును రానయియున్న విప్లవమునకుఁ గతంబులగుచున్నవని దుఃఖించుటకన్న మముబోంట్ల కింకేమికలదు! దేశకాలపాత్రంబుల నెఱుంగక, పట్టువిడుపులు లేక ప్రవర్తించునీతని నవివేకిగా నెఱింగి—“అయ్యో”యని, “మా పెద్దరాజును, జిన్న

రాజును, నెంతటి యవివేకు" లని జాలిఁదలఁచుచుండుటయా, దురాత్మనమునంగలిగిన యహంకారమును, బుత్రవ్యామోహమును, రాజ్యలుబ్ధతయునుంగలిసి, యింతలు చేయుచున్నవిగా యని ప్రతీకారముఁజేయబూనుటయా? హితబోధఁజేసి యీతని మూర్ఖ్యము మాన్పఁబ్రయత్నించుటయా? అట్లయ్యును శాపమా యుధిష్ఠిరుం డింత కాలము సైరణసైయుటయేకాక, మాటిమాటికిని, యుద్ధసన్నద్ధులగుచున్న తనతమ్ముల నెంతేని, నడిమిపట్టుచున్నాఁడు. నాఁడయు నాగర్భపుత్రు సైరణయువిసివిపోయినది. ఇఁక నాతఁడేమి యొనర్చినను సమంజసమేకానోపు. కురువిభుఁ డడిగినయర్థమదెట్టిది యైనను బ్రత్యుత్తరమొసంగక తప్పదుకదా!"

అని తనమనమునఁ బరిగణించుకొని, తనను ధృతరాష్ట్రు నుపలక్షించుచు సంజయుం డిట్లనియెను.

—సంజయుఁడు—

రాజకంఠీరవా, ధర్మజుఁడుసంధియేకావలెననికోరుచున్నాఁడు. ఆతనితండ్రికి రాఁదగిన సగంబును నీవొసంగఁ గోరుచున్నాఁడు. అది కాదందువేని, రాజసూయంబునఁ దాఁగొనితెచ్చిన భాగంబయిన నీ వొసంగఁదగు ననుచున్నాఁడు. అదియు నిదియుఁ గావందువేని, వారి యైదుగురకును, జుట్టాలకును దినిమనఁదగినంతదియగు నైదూళుల పట్టునైన నిమ్మని కడువేఁడుచున్నాఁడు.

ఇందేమియు నెఱపఁజాలమని మీరనసాహసించినచో, ధర్మజుండింకఁ జేయునదిలేదని యెంచి, మన పదునొకండక్షౌహిణులను లక్ష్యముఁజేయక సమరము నెఱపియైనను నేలనేలు తలంపొంది యున్నాఁడు. వారియయ్య సగమో, వారి రాజసూయపుఁ బుడమియో, మీరీయక తప్పినపుడుగాని ముందఱ సఁగరముఁ జేయ నొల్లఁడు. పాండవ శిబిరమునఁ జేరినయందఱును అట్లేయభిప్రాయము నొందియున్నారు. ఇందేమి తప్పు గలదు?

ఇఁక నీవడిగిన ప్రశ్నలఁ దలంచినచో నన్నియును భిన్నరూపముల నొందియున్నను, నేకముఖము నే పొందియున్నవి. నీవెఱుఁ

గని వారెవ్వరటఁ గలరని చెప్పఁగలను? మనవలె వారెక్కడినుండియో పెక్కండ్రసాయము వేడి, తోడ్కొని రానక్కరలేదు. ధర్మజు ననుజన్మలే చాలు మనలోనున్న పెద్దలఁ గడ తేర్చుటకు! అయినను కోరితివి కావున నా కనినకొలంది నీకుఁ దెలియఁబలికెద వినుము.

బక జట హిడింబాద్యసురుల యసువులఁ దానొక్కఁడె కూలనేసి, కీచకుఁ జంపి, గంధర్వునిఁ బీచమడంచి, ఘోషయాత్రా తరుణమున మానముఁ గోల్పోవు గంధర్వులచేఁ బ్రాణంబులఁ బాయనుండిన మన దుర్యోధనను నరసి రక్షించి, నీకు పుత్రభిక్షఁ బెట్టిన భీమసేనుని గొనిరాకమానునా ధర్మజుఁడు!

అల ఫాలాక్షుని చెక్కటికయ్యంబున గడగడలాడం జేసి, యాతని మెప్పులందిన ఘనుండును, ఘనతర దుర్జయులగు పాంచాలుర పీచమడంచి ద్రుపదు నోడించి పట్టి కట్టి తెచ్చి గురుకట్నముగా నొసంగి మనకర్ణునిఁ గడతేర్పజననమందిన ఫల్గుణుని గొనిరా మఱచునా యనునందనుండు!

కొదమసింగంబులంబోలు నకులసహదేవులు మన బలంబులం జట్టినచో మన మెందుఁబోఁగలమని కవల వెంటనిడుకొని రాక యేమరునా ధర్మసుతుఁడు!

ఉక్కుముక్కలవంటి యల ద్రౌపదేయులను, వజ్రపుందునకబోలు సుభద్రా తనయుని మన కురుకుమార వర్గముపాలింటికిఁ దోడ్కొని యేమఱఁజూమా యయ్యుధిష్ఠిరుండు.

వృష్ణికుమారవీరులలో సత్తమోత్తముండును శ్రీకృష్ణుని తమ్ముండును శత్రువనదవానలుండును నగు సాత్యకిని ఆధర్మజుండేలఁ దోడ్కొనిరాకుండును?

ఇకఁ బాండవులకు సాయమొనర్ప వచ్చినవారిని, ధర్మజుఁడు దోడ్కొని రాఁగలిగినవారిని వేర్వేఱ వర్ణించి చెప్పుటకంటె, నీవు కురుసమ్రాట్టువగుట కెవరెవరంగీకరింపకున్నారో వారెల్లఱును నీకుఁ దెలిసినవారే. కాని, నీకు పరాకుఁ దెల్ప నుడువుచున్నాను వినుము.

ఉజ్జ్వలశౌర్యధైర్యాన్వితుఁడగు పాంచాలభూనాథుని, మహావిక్రమ యుతుండగు మత్స్యవిభుని, పరితాపోన్నతులగు నేవురు కేకయపతులను, మగధసామ్రాజ్య

ధురంధురుండగు సహదేవుని, జయత్సేననాథుని, వీరఘనుండగు ధృష్టకేతుని, వృషభుని, చేకితానుని, శైబ్యనృపాలుని, వారివారి భ్రాతృ సుత బంధు మిత్రగణంబుల తోడ, సైన్యంబులతోడ మనపైనర్తిఁదాం డెత్తి రాఁగలఁడు.

వీరిలో, పాండుపుత్రులదుస్థితికి వగఁగుంది యొతిసినమనంబులతో వారివారి ప్రాఁబగలఁ దీర్చుకొనఁ నెంచినవారు కాక, పెరవారు లేరే! ఇదియటుకు భీమసేనుఁడే మహాబలశాలియని మన మనుకొనుచుంటిమి. కాని యాతని మనుమఁడు ఘటోత్కచుఁడు తండ్రియంతయు నయి, మనలో నెరికిని లేని మాయాబలంబుల నసమాన ప్రజ్ఞావంతుండగుటను తండ్రినిమించిన కుమారుండు. తూర్పుననున్న రాజులును, ఉత్తరముననున్న త్రివిష్టపాధిపతులును, మనపైఁ దొలినుండియు రోషముగలిగి యున్నవారగుటచే తమతమ సేనలతో నగ్గిసైనను బిడికిలింతు మనియును, మన నెత్తుటేటు నెదు రీదుదు మనియును ముందున కురుకుచున్నారు. ఇంకతెం దోడ్కొనిరాక మానునా యాపాండుని యగ్రనందనుఁడు!

వీరింతఱును నీవు కురుసామ్రాజ్య సింహాసనాధిష్ఠితుఁడ వగుట సైరింపకున్న వారేసుమ!

మఱొక్కమాట: ఇందఱు నరనాథుల వెంటనిడుకొని రాఁగల పాండుని యగ్రనందనుఁడు, పదునాలుగు భువనముల దన యఱచేత నిడికొని, యిట్టె త్రిప్పఁచుఁ దాఱుమాఱొనర్చు మంత్రరక్షణ కళాకౌశలమున ననుపమానధీమంతుండగు దేవకీకొడుకుం దోడ్కొని మనపైకెత్తి రాకమానునా?

అని సంజయుం డూరకుండెను.

— ధృతరాష్ట్రుఁడు —

సంజయా, నీవిపుడు చెప్పినదంతయు నిక్కువము. నీ నుడివిన వారందఱును ప్రబలబలవంతులెయగుదురు; కానిబలప్రమాణములఁ బరికించినచో, వారందఱు నొకయెత్తును, భీమసేనుండొక్కరుండ యొక్కయెత్తును. ఆభీముఁడు తలఁపునకు వచ్చినపుడెల్లమనమున నెన

లేని భీతికలుగుచుండును. ఆతఁడుతలఁపునకు వచ్చినవేళఁ గంటికినిదుర రాదు. పగళ్లు నన్నము నోటికిఁబోదు. ఆతని మార్కొనంజాలునట్టి మొనగాఁడీ మొనలేఁడు. ఆతఁడెప్పుడుఁగిన్కతో నెత్తినగద నిక్కముగఁ గాలదండమై విలసిల్లుచుండును. మన కురుకదంబములో నాతఁడు తనగదాదండముతో విహరించెనేని, మదమాతంగము సరసీరుహసమన్వితంబగు కొలనింజొచ్చి, తామరతూండ్లఁగూఁకటి వ్రేళ్లతోఁ దుల్చినరీతి, కురువంశాంకురమైన మిగులనీకుండఁ బెకలించి వైచునుగదా యనునడరు గలుగుచుండును. కురువీరాధివీరు లీమాత్ర మెఱుంగలేకున్నారు. పిన్నటనాఁటనుండియు భీముఁడు నామాటవినఁడు; నన్నుసరకుసేయండు. నాశిక్షఁ బెరుఁగలేదు. వానితో విరోధపడియు, వానిచేఁ బీడవడియు, నింకను వానిపైఁ గసిదీర్చికొన నెంచుట మానరైరి. ఇంత వైరమునకును నిదియకదా కారణము! సమరావని నాతని దేవదానవులైన నెదుర్కొనఁ జాలరు. ఇఁక నాతని భుజాబలము నెన్నుదుమన్న, కౌరవసామ్రాజ్యమున కెదిరిగ స్థాపించెనా తనసామ్రాజ్యమని యనిపించుకొనిన యామగధ సామ్రాజ్యాధినాథుండగు జరాసంధు నెదుర్కొని యొక్కరుండెకదా యాతని నంత మొందించెను! నిబ్బరమైనకోపముతో, ముడివడినకనుబొమలతో, రౌద్రరసావిస్ఫూర్తి నెగురుచుండిన భుజాగ్రములతో, నా కెదురెవ్వరను శౌర్యస్ఫూర్తితో శోభిలుచు గదాదండము నెత్తి, సమరావని న్విహారముసేయు నాభీమసేనుంజూచి, కురుసేనలెల్ల యథయథలై పాఱుచుండుటయే, జాత్యంధుండనగు నాకుంగూడఁ గన్నులకుఁ గట్టినట్లులయి నా గుండియలఁబగులఁజేయుచుండును. ప్రళయకాల సముద్రముభంగి పొంగి పొరలివచ్చు నాభీమవీరవిహార సముద్రముఁగడవనీఁదఁ దలంపునొందుట వృథయని మందులగు మనవారు తలంపఁజాలకుండుట కేమందును!

సంజయా! నీ యెదుట నాధనంజయుం డెంతాడెనో,

యంతయుఁ జేయఁగలండు. రిత్తలు పలుకుట సుయోధనుని యుష్టమంత్రికివలె ఫల్గుణున కభిమతముకాదు. అక్కజమైనది కేశవుని తేజము. దానినాసింపకయే దనంతదానొక్కండ వైరిసేనలఁగొడ్డిన ఘంట యఁగువాఁ డర్జునుండు. నుఱికెక్కి వెలింగినది గాండీవము. ఇట్లొక్కెడనగూడిన ప్రతాపమూర్తుల మహోగ్రపు వేడిమికోర్వ వచ్చునే! విజయుచే నిర్జింపఁబడినవారె మనవారిలోఁ గలరుగాని, యిల యర్జునుని నిర్జించిన వాఁ డొక్కండును మనసేనంగాదు సరి కదా, మఱి యెచ్చటంగూడ నిప్పటికి గానరాఁడు.

సంజయా, భీమార్జునుల బలాబలంబులు భీష్మద్రోణు లెఱింగి నంతకంటె నితరు లెవ రెఱుంగఁగలరు? గురుగాంగేయులకు ధార్తరాష్ట్రులును, పాండవులును, నొక్కరూపయగు శిష్యబృందంబును, బంధుకదంబంబును నగుట, వారి కీరెండు కుటుంబంబులును సామాన్యంబులయ్యును, వారు 'మనలనంటియుంట' యను తప్పిదమునకుఁ దగిన ప్రాయశ్చిత్త 'మెఱిఁగి యెఱిఁగి మనకొఱకుఁ బాండవులతోఁ బోరఁదలపడుటే' కదా! ఇంతమాత్రపుఁ గారణమునఁ గురుభీష్ముల కింతవలసెనే! విధివశంబున నేనును, నాసుతుల నొప్పింపను, శాసింపను, జేయఁజాలకున్నాను.

ధర్మజునకు యౌవరాజ్యపట్టాభిషేకమొనర్చిన నాఁటికంటె, అనంతర మర్ధరాజ్యమున నాతని నభిషిక్తుంజేసిన నాఁటికంటె, అర్ధరాజ్యంబిది యని ఖాండవంబొసంగి దవ్వులకనుపక తప్పనినాఁటికంటె, జూదమున దుర్యోధనునిమిత్తము సౌబలుఁ డోడింప ధరణియు రాజ్యమును పాండవులు గోల్పోయినపిదప ద్రోవదికి వరముల మూలమున ధర్మజుం డెప్పటి యట్లనుభవించు కొఱకు, వారిరాజ్యసంపద వారికొసంగిననాటికంటె, నానాఁటికి నాకు ముదిమికతంబున, మనోదార్ఢ్యము సడలి, వాక్పటిమతగ్గి, హృదయదౌర్బల్య మధికమగుట నిపుడేమియుఁ జేయంజాలకున్నాను. విదురుం డానాఁడా ద్యూ

ప్రారంభమున నేమనియె నంతయుఁ బాటిలుచున్నది. అతఁ డప్పుడు
చాటి చెప్పినచొప్పునఁ గురుజాతికిఁ జేటొదవుట జూదముతోడన
బుట్టె. భీష్ముండెంత చెప్పినను వినక యీ సౌబలుం జేరఁదీయుటయు,
ద్రోణుండెంతవలదన్నను నాకర్ణుం దరిజేర్చుటయు, నీ యవినీతుండు
మానఁడయ్యె. వానివంశమంతయు మనసుయోధనుండంత మొందిం
చిన పిదప నిఁక నీ సౌబలుఁడు మనవంశము మాత్ర మంతరించు
పన్నాగముల నొనర్పఁ దలంపఁడా! అవియెంతమాయదారిపాచికలో
కాని, నిర్జీవ పదార్థము లయ్యును, 'సౌబలుం డెంత సెప్పిన నంతియ
చేయుచుండుట ! యీ పాచికలకెతగును. ఆ పాచికలయందును
సౌబలుని హృదయమందును గలట్టి మాయాబలసాంకర్య మదె
ట్టిదో కాని యద్దానిం గనుఁగొన నెంచినవారిలో నెరికిని ఇప్పటికిని
హృద్గోచరమయినది కాదు. 'సౌబలుం జేరఁదీయుటయు, నాతని
మంత్రాంగమును విశ్వసించుటయు, మన భారతవంశమునకె కళంక
మాపాదించుట యగును—' అని మనశ్శాంతనవుండు తఱచుగ
నాతోననుచుండుట మాత్రము సత్యము. ఏదియెట్లున్నను, మా
భరతవంశంపుఁ బ్రదుకు కర్ణసౌబలులపాలఁబడియెఁగా యని మాత్రము
నేను దుఃఖించుటేకాక యియ్యెలఁగలకాలమంతయు జనులాడుకొనక
మానరు. ఏమికానయియున్నదో కాని, యీ గాంగేయుండును
కుంభసంభవుండును ఎంత వాక్రుచ్చిరో, యంతయు సంభవమె
యగుచున్నది. పాండవులపై ధ్వజమెత్తవలదని, లౌకికముగను, పార
లౌకికముగను, బాంధవపరముగను, రాజనీతిపరముగను, నీతిపరము
గను, భూతదయాపరముగనుంగూడ నెవరెన్నివిధాల బోధించినను
జెవినిడక యీ మందబుద్ధి (సుయోధనుండడవుచు) లోభోపహతుం
డయి, ప్రజ్వలితదురభిలాషంబున నింతలు సేయుచున్నాఁడు.

— విదురుఁడు —

అంబికేయా, నీ విపుడు నుడివినయట్లు విధివశంబునఁ బుత్ర

వ్యామోహదోషంబు కతంబున నీ వలచిన పుత్రుని నింకను మందబుద్ధి యనియనుచున్నావు. తండ్రియనందగినపాటి మాటయె యంటివి. కాని నీవుగాక యితరులెవరును నీతని మందబుద్ధి యనరు. రజస్తమో గుణముల సాంకర్యముచే నుద్భవించిన మహాత్మ్యమని లోకులందురు. నీ వనిన మందబుద్ధి లేక బుద్ధిమాంద్య మొరులను బాధించుదో మాత్సర్యమనియు, నహంకారమనియు నందురు. అంతియ కాని నీ కొడుకును మందబుద్ధియని నీ వనినంత మాత్రమున నాతని యందున్నదోషము లేశమును తగ్గఁబోదు.

— ధృతరాష్ట్రుఁడు —

సంజయా! పుత్రప్రేమచే నే నేమనినను, వ్యక్తిసంబంధమగు ప్రకృతిగుణాన్వేషణ మొనర్చి నే నేమనినను దుర్యోధనుమూలమునఁ గారణము సడలిపోవుట కాక, మా వంశమునకుఁ గడవరాని యవస్థ మాత్రము వచ్చినది. ఇంకేమి చేయఁగలను? ఎందుఁ బోఁగలను? ఇంకెందు దాఁగుదును? ఏవిధమునైనను భీమార్జునులఁ దప్పించుకొందమన్న, వారి తమ్ములును నట్టివారె కదా! ఇంకేది తెన్ను? పాంచాలురును, తదవనీశుండగు ద్రుపదుండును అంతకంటెను బలవంతులు. సద్వినయమును, వివేకమును, ప్రశాంతతయు, లౌకిక పారలౌకికోన్మేషములు శీలముగాఁగల యయ్యుధిష్ఠిరుం డెక్క- డెక్కడి వారలనుంగూడఁ దనవశము జేసికొని, బంధు సుహృజ్జనంబుల నిట్టె చేరఁదీసికొని మనపైనెత్తివచ్చు. మనమాతని నాక్రమింపఁ దలంచుట మంటనార్చు ప్రయత్నమున మిడుతలా యగ్నిం దూకుటయె యగును. పాండవులతోడి భండనం బెల్లవిధంబులఁ గులక్షయ కారణంబగుట నిశ్చయము. శాంతిం బొందిన యునికియె యెల్లవిధంబుల మేలని యెఱుంగుదుము. మన కుట్రల కది యొప్పిద మయ్యోనేని, బాండవుల నిటకిపుడే రప్పించి, యందుకుఁ దగిన ప్రయత్నంబులు సేయుదము.

—సంజయుఁడు—

"దేవా, నీవిపుడు తలంచినదియె యుత్తమమార్గము. ఆ నాఁడు నీ వుపేక్ష సేయకుంటి వేని, యింతలు పుట్టియుండకపోవును. ఇంతింతలయ్యును, వారింకను, నీకు లోనయియే యుందురు. వారికిఁ దిన నింతయన్న మిడిన నీవెట్లనిన నట్లె సేయుదురు. వారు ధార్తరాష్ట్ర వంశవినాశము నొల్లరు. ఇంతకును వారిది వారికొసంగుటకు మన కేమి కష్టము? మఱియు వారు తుదిజూదమున వారి సంపదాధిజ్యము లోడ లేదే! దిక్కులం బట్టిపోలేదే! మనయానతి నేకద, మన నియమించిన కాలపరిమితి నేకద, పాపమువారలరణ్యావాసమును, గూఢచర్యయును సక్రమంబుగ సమయంబున నెఱపి మరలివచ్చికదా, తమరాజ్యము తమ కిమ్మని యనుచున్నారు. వారడవుల కేగునాఁడు, వారు రాజ్యము మన కప్పగించి యుండకపోయినను, తమ యధికారబలంబునతంబుననకదా, వారి సంపదాధిజ్యంబులు దుర్యోధనాదికురుకుమారవర్గము స్వాధీన పఱచుకొనుట జరిగినది. వారడవులనున్న కాలాన నెంతెంతలగు పీడల నైన, మనవలనఁబడియు, నోగిలియుఁ బ్రత్యపకృతిం దలంపక తుదకు గంధర్వనిర్మితంబైన చెఱనున్న మనవారాజును బంధవిముక్తుంజేసి తన్మానప్రాణంబులు వారు రక్షింపలేదే! పాప మట్టి పాండవుల రావించి సంభావన సేయరాదే! మీరెటుల వారిని రావించినను వారలుక వీడ రని తలఁచెదే! నీమాటకు మిగులనాడుదురనుకొన్నదే! ఏదీ-పిలువఁ బంపుము: మాత మేమగునో!"

నాఁడు భీష్మాదుల మాటలువిని రాజ్యమొసంగినయట్లు నేడు సంజయుని బెదరింపుమాటలకుఁ జెదరి ధృతరాష్ట్రుఁడు పాండవుల కర్థరాజ్యమిచ్చివేయునను భీతిచేఁగావలయు దుర్యోధనుఁడు [తత్తర పాటుతో] "సంజయా! చాలదూరము నుడువితివి. కాని, యడవులను, గొండలనుబట్టి మహాపదనొంది, మనచే నెన్నోవిధముల వంచింపఁ బడి, యసమర్థులయి, మనల నేనాఁడును నెదిరింపలేక యూరును

పేరును లేక, యెండో పడియున్నవారి నిప్పుడు కృష్ణుఁడు సమకూర్చి,
కొండకోయవారల నందఱఁ బ్రోవుసేసి—వీరే వీరపురుషులౌ పాం
డవు—లనినంతమాత్రమున మే మడలుగొందుమె? ఏమి, సంజయా
నీ పిచ్చితనము!" అనియనెను.

(ధృతరాష్ట్రునుద్దేశించి మరల దుర్యోధనుఁడు)

ఏదోయొక సహాయసంపదచే వారిందనుక నిలిచియున్నారే
కాని, యరణ్యవాసమున సంఘటిలిన యాపదల కీవఱకే సమయుట
యో, లేక యజ్ఞాతంబుననైన నెఱుంగఁబడుటయో నైయుండెడిని
కదా! మఱియు గోగ్రహణఘట్టమున మన భీష్ముఁడడ్డుపడి యసంబద్ధ
మగు నొక కాలమానమునుదీసిచూపి వారి మానముగాపాడకున్నచో
వారు మరల మరల నరణ్యాజ్ఞాతవాసములు చేయుచు నిఁక నట్లే
జీవితకాలమంతయుఁ గడపవలసినవారలేకద! ఇంతదూరము కార్య
కలాపము నడచియుండునా? ఇంతకును వారొకరిఁ గెలువ జన్మింపలేదు.
గెలువఁబడుటయే వారిధర్మము. నాయనా! నీ వింత భయమందనక్క
ఱలేదు. మముఁ గెల్చుట వారి కలవికానిపని. మాపరాక్రమము నీవలు
సుఁగాఁదలంచుటయే నీకింతవగపునకుఁగతంబు. భృగురాముని గెల్చిన
పోటుమానిసియగు భీష్ము నెఱుంగవె! ఈతనిపేరు విన్నమాత్రాన
పోటరి యనువాఁడెల్ల బాఱుచుండ, నిఁక నీపాండుపుత్రులన నీతని
కొక్క లెక్కయగునె? అపరిమిత బలాఢ్యులును, సంగరకేళీనిపుణు
లును, అజేయులును, అయోనిజులునునగు గురుకృపాచార్య
వర్గము వారచ్ఛముగఁ గినిసిరయేని హరుఁడైన వారి నెదుర్కొనఁ
గలాఁడె! ఈశ్వర వరప్రసాదజుఁడగు నశ్వత్థామ మనపక్షమున నుండ
మన మని కడలనేల? ఇందఱికన్న మిన్నయనందగువాఁడును, సహజ
కుండలమండితుండును, శౌర్యధైర్యశీలుండును, అసమాన బాహుబ
లుండునునగు, కర్ణుండుమనపక్షమువనున్నాఁడు. ఈతనికిఁగుదురగు నెదిరి
నొక్కని నాధర్మపుత్రుపాలఁజూపఁగలమే! తన నిర్వక్రవిక్రమమునకుఁ

ధోఁడుగ, నీకర్ణుదానశౌచాది కళ్యాణగుణములు నెంతుమేని, మహేం ద్రుండు తన యర్థాంగి కొఱకీతని నర్థింపఁ దన సహజకుండలము లొసంగిననాఁడు "దానసంపాదితకీర్తిధాముఁడు కర్ణుం" డనిలోకము తెలియఁగకపోలేదే! వీరలేకాక బాహ్లికసోమదత్తాదులకుఁదోడు, మన తోఁబాటు సుఖదుఃఖములు సమానముగ ననుభవింపనెంచి వచ్చిన తక్కుటి రాజలోకంబుగూడ నగ్నినైన నుఱుకఁదలంచియు సంద్రి న నైనఁ బడఁదలంచియు వేచియున్నది.

—సంజయుఁడు—

(తనలో) అయ్యో, రానున్న చెడు గెంతపంతమున నీతనినోట నిటు లశ్లీల ములు వచించుచున్నది! అగ్నినైనఁ బిడికిలింతమని పాండవు లుర్వీశులూగుచుండ, వీరలగ్నినుఱుక సంసిద్ధులయియున్నారట! తుద కగ్గిలోనుఱుకుటయే యగునేమో పాప మీ కౌరవులకు!

అనుకొనుచు సుయోధనుపలుకులు వినుచునేయుండెను.

—దుర్యోధనుఁడు—

ఇఁకనాపాండవులకు మనకంటెఁ బ్రజానురాగంబుగలదంటేని మనకుఁ బదునొకండును, వారికి నేఁడును నక్షౌహిణులు సమకూడు టయే, నీమానసముననున్న యనుమానమును బాపగలదు. ఇట్లయ్యు మాకు సాయమొనర్ప నెంచివచ్చిన వారందఱును, మమువీడిపోయి నపుడు, మాబలంబులన్నియు విచ్చిపోయినపుడు, మనవారందఱుం గలసి, వారికె గెలుపొసంగినయపుడు, పాపిష్ఠకాలం బిట్టిదియ యను కొనవలసినదేకాని, మా కితరలోపములవలన నట్టులయ్యె ననుకొనఁ దగదు. అంతియకాని, పాండవులను మాతో సమానులుగ నెంచి యాదరించుటకాని, వారితోడన గలసినయునికికాని, వారికి వెఱచి యేమే నొసంగుటకాని, వారి నెఱఁగి యొఱఁగ్గి పారుటకాని, చేయం జాలము. సమరంబ సర్వవిధముల కార్యనిశ్చయము. ఇఁక నా నిశ్చ

యమొ, యలవాసుదేవు నిశ్చయమొ, జరిగితీరవలె. రాచకులము
లోఁ దలవంపుఁదెచ్చు పాలుపంపక మొక్క విధర్మమిది నాయనా! జ్యే
ష్ఠానుక్రమంబగు రాజ్యం బవిభాజ్యంబుగద యనినైనం దలంపనేమి!
వేయేల, యింతయైనపిదప నిప్పుడు పాలొసంగుట మన కెంతయు
ధృతిచేటుగాక మఱేమగును? తుదకు ధార్తరాష్ట్రులు ధృతిఁదూలి,
పాండవులం బిలిచి, పాలిచ్చి వారి యుచ్చకముంగోరి, వారికినచ్చిన
తెఱంగున గార్యగతిం ద్రిప్పికొనిరని లోకమువారలు మము నోనా
డుట నీకుమాత్రము యశస్సును దేకమానునా? ఇంతయైనఁ దలంప
వా? నాయనా నీవు నను నొప్పించి యొప్పింపను, బ్రతిమాలి నను మఱి
మాలునట్లొనరింపను, నివియెల్ల నీకొడుకులచావునకును, జేటునకును,
సహాయింపజాలకయ యగుఁగాక కాని, యీరీతి నోరువిడిచి నీవు
చెప్పుట నెవరు వినిన నేవపడుదురుకదా! నిన్నేమనఁగలను? మాన
ధనుఁడనగు నేనెట్లు క్రిందుకాఁగలను?

ఇఁక నీకున్నభయమెల్ల భీమసేనుని గదావిహారమున కేకద!
గదావిహారమున నీమూఁడులోకముల నాకెదు లేఁడని నీకెఱుక లేమినిం
తలు వాటిలుచున్నవి. ఎప్పుడైననాభీమునితో గదాయుద్ధముఁదొరకునా
యను వేదనంబొదలుచుండు, నాకింత కాలానకుఁ దనకుఁదాసమకూడిన
యీ గదాకదనమున వజ్రప్రహారమున నింద్రుండు గుబ్బలిని కుంభినిం
గూలునట్లు భీముంగూలనేసినఁగదా నాజన్మమునకు సార్థకత! పాండవ
సేనలకెల్లనాతఁడేకదా మొనగాఁడు! అట్టి యాతఁడే పడుటతటస్థించెనేని
మఱివారిసేన ననిమొననిల్చి పోరుసల్పఁగల మగటిమి గలాడింకొక్కఁ
డేడీ? పాపమాధర్మజుఁ డైదూళులనైననీఁగోరుచు మనకు వార్తనంపు
టకుఁ గతంబైన దీవెఱపేకద! ఇఁక నర్జునుఁడు లేఁడాయని యందు
వేమో; నాగదాప్రహారమునకు భీముంగూర్చి యెదురుచూచుచుండు
నా వలెనే, భృగురాము కరుణనువడసిన యేకవీరాస్త్రశక్తి కెపుడు
బలిపెట్టుదునాయని యర్జునుకొఱకె దురుతెన్నులు చూచుచుండు

కర్ణుఁడు లేఁడా! ఇంతమాత్రానికే యింతవంత యేల? నీకొడుకు లొక్కళ్లొక్కళ్లే జగంబుల నెల్లం జయింపంగల జగజెట్లు. అట్లగు వీరందఱు నొక్క మొగంబయి త్రోచికొని నడచిరేని, ఒక్క ఫల్గుణునే కాదు, ఒక్క భీమునే కాదు, కౌంతేయుల నెల్లర నొక్క మొత్తున వైచికొన నోపుదురు. ఇక మా సైన్యంబున సారమ్ముల ప్రోవు. వారి సైన్యంబున నిస్సారంపుఁ దావు. ఇట్లెన్ని విధముల నీ యెక్కువ తక్కువ లెంచి చూచినను వారు మముఁ గెలువ నలవి కాదనుటయే నిశ్చయమగుచున్నది. ఇది యిట్లుండ, మాకు నలవి కానిపని యొక్కటి లేకపోలేదు. అది నీ వగపు నుడుపంజాలకుండుటయె. మము మిగులుపని యింకొకటి లేదు. నాయనా, యిఁక నీవు ధైర్యము పూని, మాకు జయంబె కోరుచు, నందులకు వలయు ప్రసంగంబుల నుండుటదక్క నింకేదియు వలదు."

ఇంతదూరము తనతండ్రితో స్వవిషయముం గూర్చి ప్రశంసించియుఁ బరవిషయముం గూర్చి ప్రసంగించియు నంతతోఁ దనివి దీరకయు కావలయు, దుర్యోధనుఁడు, సంజయుదిక్కు మొగంబయి "సంజయా, ధర్మనందనుం డెక్కడెక్కడి కొండకోయ జాతులవారి నెల్లఁ బ్రోవు సేసికొని, యేమి సేయ నాలోచించుచున్నాఁడు?" అని యడిగెను.

—సంజయుఁడు—

ధర్మజుఁడా! హేతువాదమునగాని, భీతివలనగాని, లోభము చేతఁగాని, రోషవశమునగాని, సత్యమును ధర్మమును విడువజాలని ధర్మభృద్వరిష్ఠుండగు ధర్మసుతుఁడు యుద్ధము జీవహింసాకరమగుట మనవంచన కార్యము లెంతదూరము నడువనీయవలె, మనగర్వము నెంతకాలము చెల్లనీయవలె, నంతదూరమును, అంతకాలమును, నడువనిచ్చియుఁ జెల్లనిచ్చియుఁ జూచి, యిట్లెంతకాలమూరకున్నను ప్రయోజనము లేదని యెంచియు, సంగరము కాని తెఱువున మరి కార్యము

చక్కఁబడదని తుట్టతుదకు స్థిరపఱచినాఁడు అతనితమ్ములొక్క పెండ్లికిఁ బోయెడువారింబోలియున్నారు. ఇఁక నందున్న నాయకులమాటఁ దలం తుమన్న — నింకెన్నఁడోకదా, మాచేతుల తీఁటఁబుచ్చుట — యని యున్నవారు. ఆచుఱుకు కింకేరియుంగును గానరాదు. అర్జునుని పాశుప తాది దివ్యాస్త్రములపెంపును భీముగదసొంపును నింపునింపు చుండ, వానిని నమ్మి, యక్కడి వారందఱును ముసుగు గవిసినట్లయి, యెల్లపుడును, గయ్యమున కె కాలు ద్రవ్వుచున్నారు.

—ధృతరాష్ట్రుఁడు—

సంజయా, మన దక్కునంగల బలమూనిసు లెవ్వరికింగూడ నసాధ్యులును, నజేయులునుగదా! వీరినందఱను సాధించు మార్గము వా రూహించిరే?

—సంజయుఁడు—(తనలో)

అన్నా! ఈధృతరాష్ట్రుఁడింకను జయమొందఁగల యట్టులే తలంచుచు "పాండవపక్షముననున్నవారు మనబలంబులఁదలంచిరే" యని యడుగుచున్నాఁడు. ఇంత లోభగుణప్రధాను నిప్పటి కింకొకనిఁజూచి యెఱుంగను. నిజపక్షముననున్న వీరుల గొంతాడునుఁ దనకొఱుకు బలికిన పలుకులనెల్ల వినివిని నమ్మి, తనవా రజేయులనియు, నసాధ్యులనియు, నిర్ధారణమొనర్చికొని, యట్టివారిని సాధించునట్టి మార్గము పాండవులూహించిరేయని యడుగుచున్నాఁడు. ఆశాపాశము లెంతబలవత్తరములైనవి! ఇంతకును ధృతరాష్ట్రుని సంశయముం బాపుకొఱకును, ఇటఁజేరి యున్న వారినందఱు సాహసప్రయత్నపరాఙ్ముఖులుగ నొనర్పను, నాకుఁదోచినరీతి నీతనికి జెప్పిచూచెదఁగాక!

(ప్రకాశముగా)

అంబికేయా! "ప్రథమమున దానిని నిర్ణయించుకొనియే కార్య క్రమమున కుపక్రమించి యున్నా"మని వారనిరి.

మనము వారికిఁ బాలియమి, మనశాంతనవుఁడు వారి శిఖండి పాలనియు, మనద్రోణుఁడు వారి ధృష్టద్యుమ్ను పాలనియు, మన

రారాజును దమ్ముళ్లెల్లరును వారి భీముపాలనియుఁ, గురుకుమార వర్గమంతయు వారియభిమన్యుపాలనియు, మనయశ్వత్థామకర్ణులును ఇతరులచేఁ జెగని తక్కిన దండిమగలందఱును, వారిసవ్యసాచి పాలనియు, మనకృతవర్మ వారిసాత్యకిపాలనియు, మన సోమదత్తుఁడు వారి చేకితానుని పాలనియు, మనశకుని వారి నకులుపాలనియు. మన యులూకాది సుతులందఱును వారి సహదేవుని పాలనియు, నిట్లు మన వారి నందఱు వారివారి వంతుల వరుసను బంచికొని మిక్కుటముగా వేడ్కతోనున్నారు.

—ధృతరాష్ట్రుఁడు—

(సాశ్చర్యంబుగ) అట్లయిన నిక ధర్మజుండు సేయున దేమున్నది?

—సంజయుఁడు—

ఏమున్నదా—శల్యసంహారము!

ఈమాటయునుఅక్కడఁబడకపోలేదుసుమా! అపుడక్కడికొందఱు 'ధర్మనందనునకు శల్యుండొక లెక్కయా' యనిరి. ఆపలుకులకు ఆహా! ధర్మజుండు-ఆనిర్గర్వచూడామణి-మనమునన్నైన నుబ్బక, శల్యుని శౌర్య ధైర్య సాహసాది వీరజనోచిత గుణగణము నభివర్ణించి, చెప్పి మఱియు "శల్యుంబొడుచుట సామాన్యంబుగా దది హృదయశల్యంబును నెమకఁబోవుటవంటిది" యనికూడ నొక్కి చెప్పి మద్రేశునకు నమస్కరించెను.

వైచిత్రవీర్యా! చూచితె, ధర్మజుని యౌదార్యము! తుదకుఁ దనపై కెత్తివచ్చువారిని మాత్రమే కాక తా నెదుర్పఁబోవువారినైనను అగౌరవముగ జూడఁజాలని యౌదార్యవంతుం డగుటనే కదా మన మిపు డూహింపఁజాలని తెన్నున జయలక్ష్మి తనకుఁదానుగాఁబోయి యాతనినే వరించునని దలంచుటకుఁ గారణం బగుచున్నది! వారికి దోడ్పొసంగవచ్చిన రాజులందఱును, వారివారియెదుట మనలో నెవ్వ రెవ్వరు పడిన వారివారి నక్కడక్కడనె మడియింతు మని యు

న్నారు. చిచ్చొడిం గట్టుకొని యోర్చి అసిధారావ్రత మిన్ని యేడులు వారు నడపినను, మీహృదయములు మృదులత వడయమిం దాము పోరొనర్చినను, జరుగనైయున్న యాలమున నౌచితి తప్పినను, ధర్మచ్యుతి లేదనిగూడ వారలు నిర్ణయించిరి.

ఇఁక నీవును నీకొడుకుగమియుఁ గర్ణసౌబలులును ఏది నిర్ణయింతురో యయ్యదియె యూర్జితంబగు కార్యంబగును.

ఇంచుకతడవు నీరవుఁడై వేడినిట్టూర్పువిడిచి, ధృతరాష్ట్రుఁడు "సంజయా! ఇఁక నాకొడుకులకు బ్రదుకుఁ దెఱ వెక్కడ? ఏమియుం దోఁపకున్నదే: ఇపు డిటఁగూడియున్న వారందఱకు, నీ విపుడెన్నిన యచ్చటి వీరానీకము నోర్వవచ్చునే! అది వట్టిమాట. అటు యుధిష్ఠిరుని రాజుంజేయ హరి నమకట్టియుండ, దానిని మన సుయోధనుండు సరకుసేయకుండుట తన బ్రదుకును దుఃఖభాజనమ్ముగఁ జేసికొనుటయు కాదే! ఈ కురువంశమున కెకాక, నిరపరాధులగు నీ కూడియున్న రాచవారికింగూడ గాల మాసన్నమగుట, వీరిని వారింప నాకెట్లు సాధ్యమగును! ఇఁక వగపుఁదక్కి గుండెఱాయి చేసికొని రానున్న ముప్పున కెదురుసూచుచు నూరకుండవలసినదే కదా!

—దుర్యోధనుఁడు—

నాయనా! యేమి నీ వెఱ్ఱితనము! మేమును ధర్మజాదులు నొక్కశికుంబెరిగి పెద్దవారమయి యుండ మాపై నెత్తివచ్చు పాండవులె జయమందుదు రనునొక్కనిశ్చయం బది యెక్కడ! ఇంతకును నీ మనోదౌర్బల్యమే కారణము.

(అని సంజయుదిక్కు మొగంబయి)

సంజయా, నీనోట నేమాట బయలువడినను నయ్యది వారిని, వారివారిని వర్ణఁ సేయుటయె యగుచున్నది. కాని మమ్మును మా వారిని దలంపనైన నొల్లకున్నావు; ఈ రాజ్యలక్ష్మి వారిని సంపూర్ణముగ శాశ్వతముగఁ బాయను దృఢముగ సోత్సాహముగ మముఁ

జేరను, విధిసృజియించియే యుంచుట సిద్ధము. దీనిని మాన్పను మార్పను, నెవ్వనికిని వశముకానిపని.

[కనుసైగఁజేసి దుర్యోధనుఁడు సంజయునికిఁ సూచుచుండెను.]

—ధృతరాష్ట్రుఁడు—

నాకొడు కున్మత్తప్రలాపంబు లాడుచున్నాఁడు. సత్య ధర్మ నయ పరాక్రమసహాయ సంపన్నులౌ పాండవులను భండనంబున మడియింపఁ దనకగునని తలంచుట తన యహంకారమునకుఁ బ్రధానచిహ్నము. తానొక తెన్నునఁ బ్రబలబలుండై యుండుంగాక కాని, పెనఁకువ యెల్లెని మేలగునె!

సంజయా! ఇంకను నాకొక్క సంశయమున్నది.

—ఇపు డీయాహవమునకుఁ బురికొల్పుచు మామాట యాట వచ్చినపుడెల్ల నుల్లికుట్టు మాటలచే వారల నుడికించుచుఁ బాండవులకు ధైర్యముగొలుపు వారెవ రచ్చటఁగలరు?—

—సంజయుఁడు—

అంబికేయా, పాండవసాహసాగ్నికి ధృష్టద్యుమ్నాజ్యమె సహాయము. మఱేమికావలయు? కౌరవసేనాసముద్రంబునకుఁ దానొక చెలియలికట్టయై నిలతునని, వారికిఁ జేయూతనొసంగె.

—ధృతరాష్ట్రుఁడు— (అధైర్యముతో)

కుమారా! నీకును, నీపరిజనమునకును, మనధరణిలో సగము చాలు; తక్కినసగమును ధర్మనందనునకొసంగి నెమ్మదిగ బ్రదుకుట కంటెఁ గురుసంతతికి శాంతిమార్గము మఱిలేదు.

సుయోధనా, మది నరమరలేక పలికెదవినుము. ఇపుడీ యుద్ధము నాకెకాదు. మనపెద్దల కెవ్వరికిని నుచితముగఁ దోఁపలేదు. ఇంతియకాక గురుగాంగేయాదులు తెంపునఁ బోరికింజోరరు. కావున నీ పోర గెలుపొందుట మనకుఁ బొందని కత యగునొకొ యని తోఁచెడిని. తనకుఁ బ్రత్యేకవైరియగు నర్జునుపైఁ బగసాధించుకొను

టకుఁ గర్తుండును, మనవంశము నిరంకురము సేయఁగృతనిశ్చయుండయి తద్విధాన మలజూదమునాఁటనే తనపాచికలతో నుపక్రమించిన సౌబలుండును, సంఘనియమములనైనఁ బాటింపనొల్లని మూర్ఖచిత్తుండును దుంటరియునగు దుశ్శాసనుండును, నీకెందాఁక మంత్రోగము సేయుచుందురో యందాఁక మనకు కులక్షయముతప్ప నీకనేయొకటి యెటులఁ జరుగఁగలదు? భీష్మాదులు మనసిచ్చి యనిచిచ్చుం జొచ్చువారు కారుసుమీ!

—దుర్యోధనుఁడు—

భీష్మద్రోణులు యుద్ధమొల్లరనికదా యంటివి. కాని వారి సాయముననె జయశ్రీ గొనిరాఁగలను. కర్ణశకుని దుశ్శాసనులు నీకంతచుల్కనగఁ దోఁచినను, వారే ప్రధానులు. వీరునాయండనుండ, నా కార్యదశ మఱితిరుగదు. నాయనా, నన్నింకను మోమోటమి వెట్టకు. దాయాదకమేల, వాఁడిసూదిమొనమోపినయంత నేలనైన నేను వారికీయఁజాలను.

—ధృతరాష్ట్రుఁడు—

సుయోధనా! నీకిపుడు నాపలుకులంత పథ్యములుకాఁజాలవు. నాకు వయోధికత కతమునఁ బుత్రవ్యామోహ మెంత యధికమగుచున్నదో, నీకు నహమికకతాన మౌర్ఖ్యము నంతవిజృంభించుటఁ బాండవేయులకేమియునీయ ననుచున్నావు. నావార్ధక్యమును, దన్మూలమున నాకుఁగలిగిన మానవసహజ హృదయదౌర్బల్యమును, నీవు స్వపక్షబలముగా నెన్నుకొనుచున్నావు; కానివజ్రఘాతంబువలనఁగొండలు పిండియగునటుల భీమగదాదండ ప్రహారంబువలన నీసేనయు, నేనుంగుల గములును, నేలఁగూలఁ దద్రక్తధారలు సెలయేటి కాలువలై పాఱుచున్నపుడుగాని, నామాటలు నీ [illegible]నకు రాఁజాలవు. విజయుని బాణపరంపరలచే సైనికులెల్లరు నేలఁ[illegible]ల, సమరావని ఘోరవనప్రదేశమునం దలపించుచుండు సమయానఁగాని నాసూక్తులయాఁదరి

గ్రహింపఁజాలవు. వేయేల! పాండవస్కంధావారమును, తనమంత్ర రక్షణ కళాకౌశలమునఁ గాపాడుచు, కౌరవసేనలనెల్లఁ బుకళింపఁబడఁ జేయుచుఁ గృష్ణుండతి సమ్మోదంబునఁ బాండవులయెడఁ బరమాప్తుండయి ప్రవర్తించుచుండ, నీవుద్రోవయుఁదెన్నును గానలేక, యాక సముదెసం జూచునపుడు కాక యంతముఁజూచినంతఁగాని పరితృప్తిం జెందని మూర్ఖుంబోలె, నీవు మతిమంతుండవుకాఁజాలవు.

ధృతరాష్ట్రుం డిట్లుపన్యసించుచుండ, దుర్యోధనుండు మార్మొగము పెట్టుకొని నిలిచియుండెను.

—ధృతరాష్ట్రుఁడు—(తనలో)

నేనింతఁదలంచుచుంటినేకాని, యేమో, నాకొడుకులె జయమందుదురేమో! జయాపజయంబులు దైవాధీనంబు లందురే! కాని, జయశ్రీకాంతుండగు నా శ్రీకృష్ణుఁడె యాదిక్కునసుంట మాజయమునుగూర్చి సందియమునకుఁగారణమగుచున్నది. 'నిరస్త్రపాణినైయుందు'నని యర్జునసుయోధనులతో ననియె నాయదు శేఖరుండని యెంతునన్నను, ధర్మసూక్ష్మాన్వేషియగు నైతికుఁడుగదాయని కుందవలసి వచ్చుచున్నదికాని, కానిచో, నాకొడుకున్నలికిని, అతని చతురంగబలసమ్మేళనమునకును పోలుది వానినోరులు కన్నెత్తిచూడనైనఁ జాలుదురే! బలరామునొద్ద గదా రహస్యము నెఱింగిన మాసుయోధనులతో సరిగదా గదాశేవనము; భీముఁడీతనితోఁదుల యగునా! సుయోధను ధనమెల్లఁ గదయేగద! కర్ణుఁడార్జించిన యేకవీరాస్త్ర ప్రదీప్తి కాయర్జునుండు నిలువఁగలఁడా? ఇట్లు భీమార్జును లిరువురును నిర్జింపఁబడిరేని, యిఁకపాండుపుత్రులఁగలవీరుఁడేఁడీ? పాండవుల పంచగ్రామసంధి వార్త కిదియేగద కారణము! ఇకమిగిలినది ధర్మజునికోపదవానలము. అది తొలుత నేమియు లేనటులనేయుండి, యంతయు నైరణమే యని స్థూలదృష్టికిఁ దోఁపఁజేయుచున్నను, తుదకేమిగాఁబరిణమించునోయనుశంకమాత్రము మాకున్ సద్దృష్టికి సదాకలిగించుచునేయుండును. ఏదియెట్లున్నను పాండవులకెక్కుఁ దైవశక్తిగానెయుంగకతప్పదు. మనవారిది కేవలము మానవశక్తి.

(ప్రకాశముగా) సంజయా! ఏకాలమందైనను మానవశక్తికి దైవశక్తిలోఁబడియెతీ

అనిరుద్ధుండు దుర్యోధనుం దవశ్యేతం బడవుచు:—

పుత్రకా, అగ్నిదేవు నుపాసించి కేతుస్ఫురణాదికంబులగు సంగరపరికరంబులనర్జునుండు వరంబులుగాఁగొనియున్నాఁడు. ఇంతియ కాదు; ధర్మదేవతయు వసుదేవుండును వాసవుండును ఆశ్వినేయులును పాండురాజుతోడిరాజులును వారికొకకీడునుం బొరయకుండఁగా పాడు చుందురు. కావున భీష్మద్రోణప్రముఖులకునైనఁ బాండవులం బరిభ వింపరాదు. ఇది తథ్యము. దైవబలసంపన్నులగు పాండవులననిం గెలు చుట యసాధ్యము.—అని యుచ్చైస్స్వరంబునఁబలికి మిన్నకుండెను.

—దుర్యోధనుఁడు—

నాయనా, పెద్దవాఁడవగు నీతో నేనేమి చెప్పఁగలను! దేవతలు వారికే సాయము సేయువారనియు, మాకు సాయముకారనియు నను చుంటివికదా! రాగద్వేషావేశమున పక్షపాతవృత్తినొందిన వారేటి దేవతలు? అట్లగుట దేవతలు కానివారిసహాయము మాకును వారికిని సమానమెయగును. కావున దైవసహాయము, విధివిధానము, మొద లగు నీముసలితనంపుఁబిచ్చి పలుకుల కేమిలే !

పెచ్చుపెఱిగివచ్చు కార్చిచ్చునార్పను, బాషాణవర్షంబు వా పను, మహాసముద్రముపై నీళులనభిమంత్రించి తత్ప్రదేశము భూభా గముగమార్చిదానిపై సేనను నడిపింపను,వలసినచోట నభిమంత్రించి జలంబులనుత్పన్నంబగునట్లొనర్చను, నానాకూరతతత్వసంరంభంబుల నిర్జిస్తంభనంబొనర్పను మిత్రశత్రు విషయంబులైన శుభాశుభం బులు వలయుభంగి నావహింపను, నే నేర్తు. నానావిధకార్యసిద్ధి ప్రదంబులగు మంత్రాద్యనుష్ఠానంబుల సకలవిధదేవతల నారాధించి యున్న నాకుంబోలె వారికిని మహామహిమంబులె కలవేని, వారన్ని యేఁడు లడవులఁ గడునిడుమలు వడనేల? ఇంతమాత్రమూహింపవా; ఇంతయేల! పిపీలకాదిబ్రహ్మపర్యంతముంగల జగదీశుని యనంతలీలా

విశేషంబులు మొదలు పాటకజనముల సమక్షంబున నెఱపు మాంత్రికుని కనికట్టువిద్దెలవఱకును గల విశేషంబు లశేషంబుగ నెఱింగిన ననుగూర్చి, నావిజయముంగూర్చి, జంకును, సంశయమును వలదు. నేనేయలిగితినేని వారినిసురలైనను రక్షింపఁజాలరు. మఱియు దేవతలలిగి వారికపాయము వాటిలఁజేయదలంచినను, నేవారింపనేర్తు.

ఇట్లాదుర్యోధనుఁడు తనతంత్రితో నాడుచుండ, గర్ణుఁడు ధృతరాష్ట్రుని సరకుసేయక, దుర్యోధనునకుఁ బ్రియంబుదోఁపఁజేయనెంచి, స్వసామర్థ్యముంగూర్చి కావలయు, దుర్యోధనుం జూచుచు చెప్పఁబూనినాఁడు.

—కర్ణుఁడు—

ప్రభూ, నానేర్చినయస్త్రవిద్యగురునాగ్రహమున నాస్ఫురణందప్పి ననుకొనుచున్నారేకాని మద్గురునారాధించి, యాతనికరుణను మగుడవడయుట పీరెవ్వరు నెఱుంగరు. ఇఁక నిక్కముగ నేనలిగితినేని దేవతలేని ననుగన్నెత్తి చూడఁగలరె! కర్ణుని దూలనాడబుట్టిన యీగురుగాంగేయాదులు నీకడనె నిలచి చూచుచుండ విజయమ్ము నీకుంగరతలామలకమ్ము సేయుదును. నీకాసంశయమువలదు.

విదు:-(తనలో) విజయుం డాదెసయట: విజయం బీదెసయట! ఎంతయసంబద్ధము!

—భీష్ముఁడు—

రాధేయా, నీవెక్కడ? అర్జునుండెక్కడ? ఏకవీరాస్త్రమును సర్పముఖశరమును, గలవనిగర్వించుచున్నావేకాని, నరునకు బాసటయైన నారాయణునిచే నయ్యవిద్యలయి తునియలై, బూడిపొడియై నేలరాలగలవని యెఱుఁగకున్నావు. పసులంబెట్టించునాఁటి యవ్వివ్వమ్ము మచ్చునింతలోనన మరచితే! ఇంతకును సూతసూతివిగదా!

(తనలో) ఈతనినూఁతనేచేకొనియేకదా యీసుయోధనుడింతవడి నడచుచున్నాఁడు—ఎన్నైనను దేశారిష్టమువాన్పను, జనక్షయమునుడుపను, జ్ఞాతివర్గమును చేతోమోదమున నంపను, కౌరవసామ్రాజ్యమున నిప్పుడు నెలకొనియున్న దౌర్బల్యము వాపను, పాండవసహాయము కౌరవసంపదకుం దోడుసేయను, కురుసమాఖ్యపదము

నంగీకరింపక స్వాతంత్ర్యము స్థాపించుకొననెంచి కట్టుగట్టియున్న సామంత రాజులనందఱ నడంపను, నేనెన్నియుపాయము లాలోచించి చూచినను, ప్రయోజనము లేకున్నది. పరాక్రమమున శరవిద్యాపాటవమున భండనపాండితీ ప్రభావమునఁ బార్థునకేమాత్రమును ఈకర్ణుఁడు దీసిపోఁడని నేనెఱింగియు, ప్రభుభక్తి తత్పరతచే లోకకళ్యాణ ప్రణాళిక నీతఁడు మరచుచున్నాఁడుకదా యని యీతనిఁ దనప్రయత్నమునుండి విముఖుం జేయ నేనెంతెంతమాటలాడినను ఈతనిహృత్పటిమ మఱింత కలదోకాని, సుంతయు దలంకకున్నాఁడు. తుద కేమిమూడనయి యున్నదో కద! అయినను ధృతరాష్ట్రుం గదల్చిచూచెదఁగాక!

అని భీష్ముండనుకొని ధృతరాష్ట్రుంజూచుచు మరలనందుకొనెను.

భీష్మః:-ఆంబికేయా, జ్ఞాతులు తమలోఁదాము పొందికతో జీవింప నెంతురేని సంఘీభావంబునఁ గలుగు సంపదతోఁ జెలంగుదు రట్లు కానిచో పేరుమాసిపోవుదురుసుమా. మఱియు జ్ఞాతులతోఁ గలసి సంభాషణయును, సహజీవన సహభోజనాది సత్కారంబులును సవినయ వర్తనంబులును, ఇహపరసాధనంబులనికూడ పెద్దలు చెప్పుచున్నారు. ఇంత దెలియక సమరంబున మీ రర్జును నిర్జింపఁ దలంచుచున్నారు. కానియాతనితోఁ బోరి మానప్రాణంబులఁ దక్కించుకొనఁ గలవాని నొక్కనినైనం జూపఁగలమే! యుద్ధము సేయఁగోరికదా-వారు కలరు: వీరుకలరు; వారాదురు వీరాదురు;-అని మీరూహించుటలు! ఇంతయేల: ధర్మజునే నీలోనికిందెచ్చికొనినచో, నాతఁడే మనకన్నింటికింగాఁగలఁడే! ఇంతయెఱుంగవే!

బాహ్లి:-వైచిత్రవీర్యా, ఇదియంతయుంజూడ, నీసామ్రాజ్యపతన హేతుభూతమొనాఁ దోఁచుచున్నది. ఇపుడీ సుయోధనుపట్టుడిపింప జాలమేని, కురుసంపదయు, శంతనుసామ్రాజ్యగౌరవమును, కరినగర రాజరాజేంద్ర బిరుదమును, నశించిపోవునుగదాయనియెంచి, యీతని నెంతవారించినను, వెనుకకుతగ్గకున్నాఁడు. కానయియున్న కురువంశ వినాశ మంతబలవత్తరమయి యుండనోపు! ఓపినంతవట్టు మనము

చెప్పి చూచియు కురుసంతతిని వినాశమునుండి తొలగింపఁజాలమి, మన కార్యములకైనను మనము కర్తలము కామని స్పష్టపడుచునే యున్నది. ఇఁక నైన మనము విచారము తొలంగియుందుముగాక!

ధృత:- నందనా, నీకు నే నెటులనో, యీ బాహ్లీకుండును నట్లే కదా! నీయెడ వాత్సల్యమున నే కదా యీ భీష్ముండింకను నినువీడంజాలక నీకు హితములుగఁ జెపుచున్నాఁడు. నీవలన మన్ననల నందఁదగిన భీష్మ బాహ్లీకులును, నేనునుంగూడ నిను బ్రార్థింపవలసివచ్చుచున్నది. ధర్మజునకుఁ బాలీకున్నమాటేఁగాని నీకుఁదోఁచినదియైన నోసంగుము. రాజులిచ్చువారేకాని పుచ్చుకొనువారు కాకపోయినను పాండవుల యీ యడిగికోల్తనమునందే నీచేయిమీఁదగుట సువ్యక్తమగుచుండ లేదా! "జ్ఞాతులకుఁ బాలీక వారినడవులంబట్టించె సుయోధనుం" డనుమాట కలకాల మియ్యిల నిలఁగలదు సుమీ! నీ వెందఱకీయలేదు! ఎందఱు నీచేఁ దనియలేదు! మఱియింకను నాలోచనకుఁదావులేదు. తరుణము మించనీయకుము—ఔ ననుము.

మితిలేనియుద్వేగము నందినాఁడు ధృతరాష్ట్రుఁడు; జేవురించిన మొగముతో నిలచియున్నాఁడు దుర్యోధనుఁడు; కర్ణునిదెస మొగంబయి అదె, యేమో పలుక చున్నాఁడు ధృతరాష్ట్రుఁడు.

"కర్ణా, నీ బీరములు కార్యరంగమున కక్కఱకువచ్చునవి యే యైనచో, నాఁటిగోగ్రహణఘట్టమున నర్జునుచే నిహతుండు కాకుండ నీతమ్ముని గాపాడుకొనకుందువే! నాఁడు నీకాలు సేతులాడకుండఁ జేసిన వాఁ డొక్కఁ నరుండె: ఇపుడో! అతనికిఁదోడుగ నరదంపు మొగల పైనున్న వాఁడాదినారాయణుండు; ముందునడచువాఁడు గదాధారి యా భీముండు; అంగరక్షకమైవచ్చునది యనుజతనుజవర్గము; నాఁ డొక్కఁడైవచ్చు నర్జును నిర్జింపఁజాలని నీ విపు డీట్లువచ్చువానిని గెల్తుననుట నోరుచేటుకాదే! నీమత్సరపుమాటలు మాసుయోధ నుఁడెంతయు నమ్ముకొని యింతలు సేయుచున్నాఁడు. ప్రభుభక్తియను

పేర భృత్యుఁడాడుపాటిమాటలచేతనే, మా వంశమునకు మచ్చ తెచ్చి నావు. ఓరీ! కాలమహిమ! భరతవంశపు బ్రదుకెల్ల తుదకు నీ పాలనా పడియెను! ఇఁక నీ వీరాలాపములు గట్టిపెట్టుము.

గాంగేయాంబికేయుల కటూక్తులచే సంక్షుభితమనస్కుఁడై కర్ణుండు భీష్ముంజూచుచు:

కర్ణు:—నాపరాక్రమసహాయము నీకు లేకుండుఁగాక! సమరావని నీవు పడుటఁ జూచినఁగాని నేనాయుధములఁ ధరియింపను. కార్యదశ నెఱిఁగి నావిక్రమముఁజూపెదఁగాక—ఇదె యస్త్రసన్న్యాస మొనర్చుచున్నాను.

అని తన బాణతూణీరమ్ముల నేలఁదిగిచి అప్పటు వీడి దుర్యానమ్మున శరవేగమ్మున వెడలెను.

భీష్ముఁడు:-సుయోధనా, కర్ణుండాడినంతయుఁ జేయంగలాఁడు ఇందనుక జరిగినఘట్టములఁ దాఁ జేసినయంత లేసి బాసలలో నేదేని వీటిఁబుచ్చెనే! ఆడినంతయుఁ జేయంగల కర్ణుఁడే యలిగిన నాహవమ్మున బాప మా కౌంతేయుల కెట్లు బ్రదుకనగును!

ఏదియెట్లు కానున్నను, నీవుభృత్యునాతగాఁగొని, పెద్దలన్ విశ్వసింపక క్షత్రసామాన్యధర్మము ననుసరించి యుద్ధము సేయక మానవు. ఇది నే నెఱుంగుదును.

పౌరుషమునకెట్టి లోపమును రానీయక కర్తవ్యాకర్తవ్యముల నెఱింగి మెలంగుచున్నవాఁడను నేను; పరాక్రమప్రధానుఁడై, కార్య పరిణామము నూహింపలేక, భృత్యుజనార్హమనుకొని వీరాలాపము లచే నిన్ను బ్రేరేపింపజేయుచున్నవాఁడు రాధేయుఁడు. నీ వీభిన్నప్రకృతుల విభేదమునించుకయు నెఱుంగఁజాలకున్నావు. నాసమరవిధానంబు నీవును, ఈబాహ్లికాదులును ముందెఱుంగఁగలరు. సూతసూతింబోలె వాగ్రణమున నీకుజయంబు నేజూపంజాలను. ఎదిరిచందంబును జయాపజయంబుల పోడిమియు నెఱింగినవాఁ డెవ్వండును జయలక్ష్మి తన యరచేతనున్నట్లు వలుకంజాలఁడు. ఊరక యలుకయేల? ఇపుడీ వ్యాజమున బాణతూణీరములువీడి, తనకురాఁదగునోటమిఁ దప్పించు

కొనఁజూచు నీకర్ణునిమగఁటిమి మనకు విదితంబయ్యెగఁదా!

బాహ్లి:—(తనలో) అవినీతుండును కర్ణపక్షపాతియునగు నీదుర్యోధనుఁడపథ్యాను రాగియగు రోగిలాగున స్వవినాశహేతుభూతములగు కర్ణుపలుకులె యమృతోప మానములుగ నెంచి కావలయు నేమోపలుకుటకు మఱలఁ దలపడుచున్నాఁడు.

—దుర్యోధనుఁడు—

పితామహా, తెలిసియొ తెలియకయొ నీవు తొలినుండియుఁ బాండునందనులె యుద్ధమున గెలువఁగలరని నిశ్చయించుచున్నావు. కాని నేనుమాత్రమునిన్నును, బాహ్లికుని, గురుని, ఇంకఁదక్కినవారిని, నమ్మి యుద్ధమునకు సిద్ధపడుచున్నాను. జయమువడయుట కీబలంబులు చాలునని నేను తృప్తినొందకపోలేదు. కాని యిపుడీగతి మీరును మీరునుంగలసి వాగ్వాదంబులఁ బెంచుకొనుటచే నేనొక నిశ్చయమును నొందవలసివచ్చినది.

కర్ణుఁడును, దుస్ససేనుఁడును, రణరంగమున విరోధిసైన్యములఁ దునుమాడుచుండ, సౌబలుండు మంత్రరక్షణ మొనర్చుచుండ నింకను నాకొరులేల? మాతండ్రి రాజ్యపాలనారంభ కాలమునాఁటి కంటె, కురుకాలమునాఁటికంటె, శంతనుకాలమునాఁటికంటె, బహుయోజన విస్తీర్ణమగు నేలమాకు దక్కఁగలదు. ఇపుడీయుద్ధమువలన జ్ఞాతిచ్ఛేదమగుటయెకాక, వారికి సాయమొనర్ప నెంచివచ్చిన రాజులెల్లరుంగూడ రణమునఁ గూలుటతోనాఁగక, కురుసమ్రాట్పదము నంగీకరింపక, కట్టుకట్టి స్వాతంత్ర్యము నెలకొల్ప నెంచిన రాజలోకముంగూడఁ దెగఁగలదు. కనుక, వారివారి రాష్ట్రములెల్లమముఁ జెందుటను కురుసామ్రాజ్యము ద్విగుణీకృత సామర్థ్యముతోఁ బునః ప్రతిష్ఠితము కాఁగలదు. ఇట్టి మా నిర్ణయము నీతియొ, యవినీతియొ తుట్టతుదకుఁగాని యెఱుఁకపడదు. ఏదియెట్లున్నను మానిర్ణయమునకు భిన్నముగా మాత్రము మేము నడచువారము కాము.

ధృతరాష్ట్రుఁడు–"నాబ్రతుకెంత దుఃఖభాజనమైపోయినది!" అనియనెను

## —విదురుఁడు—

వైచిత్రవీర్యా, మనవారు తమలోఁదామే అభిప్రాయభేదము లొంది విరసంపు వచనములచే మనోవైకల్యము నొందుచుండుట మనకు దౌర్బల్యము నాపాదించుటతో నాగక, మన పగఱకది మార్బల మగుచున్నదని గుర్తింపఁ జాలకున్నారు.

కొడుకునోడంబఱుపుమనియు, పాండుసుతులకు రాజ్యమున నొకభాగమిమ్మని యుం ఒకతెన్నున బాహాటముగా ధృతరాష్ట్రుఁడు చెప్పుమనేయున్నాఁడు. యుద్ధము మహాజనక్షయకారణ మగునుజుమాయని కుమారుని దురూహల వారింపఁబ్రయత్నించు చునే యున్నాడు. ఒకవంక తనకొడుకులేల గెలుపొందరాదనుఆశనుగూడఁబొందుచు నే యున్నాఁడు. అది కాదందుమేని, మరల నాంబికేయుండు సంజయునికు మొగంబయి- "సంజయా, నిను వీడ్కొలుపుసమయాన అర్జునుం డేమనియెనో తెలిపితివి కావు"-అని సంజయు నడుగనేల?

సంజ:—(తనలో) ఔరా, ఎంతయవివేకి యీతఁడు! ఇంకను "అర్జునుండే మనియె" నని యడుగుచున్నాఁడు!

(ప్రకాశముగా) తన తండ్రిపాలిమ్మని ధర్మజుఁడు కోరినను, ధార్తరాష్ట్రులు లోభమదక్రోధాన్వితులై దర్పమున నీయరేని, తన బాణాగ్నిజ్వాలలను వారలనెల్ల వరుసంబెట్టియె యాహుతిచేసెదనని యర్జునుండు పలికి కడకు నీకుఁబ్రణామంబొనర్చితి నని, నాయెదుట నినునమస్కరించి, ననుఁగౌఁగిలించుకొని, నాకునమూల్యాలంకారాది కమనీయవస్తువులొసంగ, నేనును బాండవులకడను, వాసుదేవు సమ్ముఖముననను, సవినయంబుగ సెలవుగైకొని దేవరకిదియెల్ల విన్న వింప వడివడి వచ్చితిని.

'అర్జునుండేమనియె' నను ప్రశ్నము ధృతరాష్ట్రుముఖమునుండి వెడలిన యంత నాసభనున్నవారంపఱును మొగమొగాలఁ జూచుకొనుచు మఱియట నుండనొల్లక యొకరొకరే లేచి వెడలిపోవుచుండిరి. దుర్యోధనునకుఁ దో డొసంగవచ్చిన వారం దఱును నసంతుష్టినొందుటయు నాతనియెడ ననాదరము నొందుటకుఁదోడుగ సేవ

నొంది, సభలో నుటితడయఁజాలకుండుటయే, సంజయోపన్యాసఫలసిద్ధి కావలయు!

'అర్జుననిశ్చయము' సవివరముగ సంజయుండు దెల్పుచున్నంతసేపును దుర్యోధనుఁడు సంజయునెడ ననాదరంబును ఫల్గుణునిపట్లఁ దూష్ణీంభావమును జూపుచు వినుచుండ, ధృతరాష్ట్రుండును జెప్పవడి కొండొకవడి యూరకుండియుఁ దనకొడుకే జయించునోకోయని తనమనమున ననయము ననుకొనుటను కావలయు మఱల సంజయుం బిలిచి:—

“కౌరవపాండవశిబిరంబుల రెండింటినింగూడ నీవెఱుంగుదువు. వీని తారతమ్యంబులఁగూడ గుర్తించి యున్నావుకదా; ఇందెవరు గెలువఁగలరో మాతము చెపుము—”

అని యడిగెనుగదా! ఇందు నిస్సంశయముగ దురాశాపిశాచావేశము దక్క నింకేముండగలదని యూహింపఁగలము! ధృతరాష్ట్రహృదయముఁ బరిశోధింప నీతనిప్రశ్నములందిమిడియున్న భావములకన్న పాఠకుల కింకేమి యాధారము?

—సంజయుఁడు—

(విసుగుఁదలతో) అంబికేయా, అది నన్నడుగఁదగిన ప్రశ్న కాదు. నేనుచూచినది చెప్పితిని. నేను గ్రహించినది నీకుఁ దెల్పితిని. పాండవులు నీసముఖమునఁ జెప్పుమనినది చెప్పితిని. అంతియేకాని, యుద్ధమున నెవరోర్తురు; ఎవరుగెల్తురు; అనునీప్రశ్నముల కుత్తరము చెప్పవాఁడు మీయయ్య సాత్యవతేయుఁడు. ఆతనిసద్భక్తి నారాధింపుము. ఆతఁడు ప్రత్యక్షంబుకాఁగలఁడు. ఇంతకును నేనక్కడ వడిన మాటలు చెప్పుచున్నంతవడియు, నీవును, నీమానసంబున వారివారి బలంబులనెల్ల లెక్కలువెట్టుచు జోడించుచు బోలించుచు బలాబలంబులనెల్ల సరిచూచుకొనుచునేయున్నావు. ఈమాత్రము దెలియకున్నా ననుకొనుచున్నావా? గాంధారియు మీయయ్యయు నిశ్చయవిదులు; వినీతిరతులు. నీసంశయములఁ బాపసమర్థులు. నాకంతపట్టు పట్టువడదు.

## ఎనిమిదవ ప్రకరణము

గాంధారి సభకువచ్చి కూరుచున్నది. వ్యాసమహర్షి యుం బ్రత్యక్షమైనాఁడు.

వ్యాసు:-సంజయా, మీామీా ప్రసంగవిషయము నాతపోబలంబున నెఱింగితిని. నీవు సమస్తంబు నెఱుంగవలంతివి. రాజడిగినదానికి నీయెఱింగినంతవట్టుఁ దెలియఁజెప్పుము.

సంజయుఁడు:—మహాప్రసాదము—

(ధృతరాష్ట్రుని దిక్కు మొగంబయి) సేనలవాసికేమిగాని జగమ్ములనన్నింటిం దనవశముచేసికొని ఆవలనున్న శ్రీకృష్ణునకు సముండగువానిని, సారథియైయగుఁగాక, నిరస్త్రపాణియైయగుఁగాక, మన పక్షమున నొక్కనింజూపుము-చూతము. ఎంతచెప్పినను మిగిలిపోవుచుండు చరిత్రముగల నావాసుదేవుండు, నరునకుబాసటయై, యాతని సర్వసమరసాధనంబులయందును సూక్ష్మరూపంబునం బ్రవేశించియైన సర్వవిధముల విజయునకే విజయంబు సమకూర్చు; ఇదియెంతయు నిక్కవము. ఇఁకవారికిఁగల మానవబలం బెంతుమన్న భీమార్జునుల బలముచాలదా మూఁడులోకములఁ బూదిచేయుటకు! వారి యాధారసర్వస్వమును దైవబలమే. ఇంకొకదానిని వా రపేక్షింపరు. వారికేకాదు. ఎవ్వరికైనను దైవబలమే బలము. అట్టి దైవబలమెట్టిదో దేవుండననెట్టిఁడో తెలిసికొననెంచెదేని, యదుగు మదె కృష్ణద్వైపాయనుండిందె కలఁడుగదా!

అని సంజయుండూరకుండెను. సాత్యవతేయుండును గొంతతడవు శ్రీకృష్ణుని మహత్వంబును, వాసుదేవశబ్దార్థంబును, మహాపురుషులజీవితములయందలి స్వార్థపరత లోకకళ్యాణ ప్రణాళికగాఁ బరివర్తనమునొందుచందంబును, విద్య-అవిద్యల లక్ష్య లక్షణంబులును గౌరవపాండవ గుణాగుణ విభాగంబును ధృతరాష్ట్రునకెరుకపఱచి, తుట్టతుదకు సుయోధనునుపలక్షించి,—"కుమారా, మనకీసంజయుండు పరమాప్తుండు. సమ్యగ్జ్ఞానముగల యీసంజయునుపదేశంబుచొప్పున శ్రీకృష్ణునివఁజుఁగుఁ జొచ్చెదేని నీకిహమున సంపల్లాభంబును, బరమునసుగతియు సమగతిం జానొందఁ గలవు" అనియెను.

—సుయోధనుఁడు—

పాపమా కృష్ణుఁడుజగములనన్నిటిం దిగమ్రింగఁ జాలువాఁడె యగుఁగాక! సృష్టినంతయు రక్షింప దక్షుండెయగుఁగాక! అతఁడర్జునుని చెలిమిఁకాఁడని చెవులారవినుచుండియు, మనసార నెఱింగియు, నా కొకప్రమాదము ప్రభవించునో కా యను శంకామాత్రమునఁ గృష్ణు నాశ్రయింతు ననుమాట వట్టిమాట! నా కీజడిపింపులేల?

—గాంధారి—

నాయనా, లోకము మనలను గర్వులనియు, నసత్యవాదులనియు సాధుబాధకులనియు నిందించుచు, బ్రివ్వదిట్టుచుండ మనకాయువును, శ్రీవిభవంబునుదొలంగును. స్వజనంబులెడ వెట్టుదురు. నిష్కంటకమగు నీచంద్రవంశమ్మున, నీవెట్లుబుట్టితివిరా! ఆర్జవశీలురగునీతాతలనాటి యీసామ్రాజ్యము నేలగోలుపోయెదురా! పూరుని కాలమునుండియు లేని యీమార్గ్యము నీకెట్టులబుట్టెనురా? మీకును పాండుతనూజులకును సమాన విద్యాశిక్షలే ప్రసాదింపఁబడినను, వివేకాదిసద్గుణములును సమయజ్ఞతయు వారికలవడె,అవివేకమును, అసమయకార్యచింతయు, అనుచితకార్యదీక్షయు నీకెట్టులలవడెనురా, తండ్రీ! శిక్షనొసంగిన గురుజనంబును, ప్రసాదించినవిద్యయు, ధార్తరాష్ట్రులకును పాండవేయులకును సమానమె యయ్యెను, మింటినుండి పడియెడు వర్ష బిందువు శుక్తియందును, తప్తతైలమందును, నొక్కటియెయయ్యెను, భిన్నభిన్న పరిణామములు చెందినట్లు లయ్యెను గద! శిక్షితుల సహజశక్తుల నభివృద్ధిపఱిచి వారి నైసర్గిక గుణములంబలపఱిచి, వెలికిదీయుశక్తిగల విద్య ధార్తరాష్ట్రులయెడ నిట్లు ప్రమాదకరమును, పాండవులయెడ సంస్తుత్యమానమును అయ్యెనే! ద్రోణాచార్యుని శరవిద్యాశిక్షయును, బలరాముని గదాపాండితీశిక్షయు మనవినాశమునకే యయ్యెనా? ఎవరిమనోవాసనల ననుసరించి వారి కాయావిద్యలయ్యాయిశక్తుల నిచ్చినవి; కాని నీకుఁగర్ణుని మంత్రాంగమును వారికిఁ గృష్ణుని మంత్రరక్షణయు లేకుండినచో నింతయలమట కలుగకుండునోటు! ఇపుడీయని మొన నిలనలంచినవారికిఁగల ప్రత్యేక ప్రత్యేకస్వలాభచింత లనేటివైనను, మన భరతవంశము నిర్మూలనమగుటయు, భారతభూమి నిర్వీర్యమును నిస్తేజమును నగుటయు, ధార్తరాష్ట్రుల కపకీర్తి

యుఁ బాండవేయులకుఁ గీర్తియుఁ గల్గుటయే పర్యవసానముగఁ దోఁచుచున్నది. నాయనా, వారిపై నీకెంతమాత్సర్య మున్నను, నీపయి రానయియున్న ముప్పు చొప్పు నూహించియైన నొకింత నీ పట్టుసడలఁజాలవా? జనులందఱు నైకకంఠ్యముగ 'వలదు వల' దన్న కార్యముమాత్ర మెన్నంటికిని సఫలతఁ జెంపనేరదుసుమా! జనబాహుళ్యపుటూహయే భగవన్నియామకముగ గుర్తింపుము.

*　　　*　　　*　　　*

దుర్యోధనుఁడు తల్లిమాటలను గంటుపెట్టుకొనిన మార్గోన్గమున మార్పలుకకనుండెను.

*　　　*　　　*　　　*

—వ్యాసుఁడు—

ఆంబికేయా, నీవు చెప్పఁదగినంతపట్టు నీ సుతునకుఁజెప్పియే యుందువు. గాంధారియుఁ దనకుఁ జేతనైనంతసమాచారము వాయోసెక చెప్పిచూచినది. సంజయుండును బ్రయత్నలోపముఁ జేసియుండఁడు. ఇఁక కార్యదశననుసరించియే దుర్యోధనుఁడు తనకార్యక్రమము నడిపించుకొనఁగలఁడు.

*　　　*　　　*

ఈవరకే యేర్పడియున్న కార్యదశనే జను లనుసరింపగలరుగాని దానిని మాన్పను, మార్పను, మానవుల కలవికానిపని: కావున నీ వింక చింతం దక్కియుండుము. వాసుదేవునందు నీచిత్తంబు బొత్తుసేసికొనుము. తరణోపాయంబుజూచుకొనుము.”

*　　　*　　　*　　　*

వ్యాసుం డంతర్హితుండయ్యెను..

గాంధారియుఁ దనయభ్యంతరమందిరమున కేగినది.

సంజయుండును దక్కటివారును దమతమ నెలవులకుంజనిరి.

## ఉపసంహారము

ప్రభువనదగినవాఁడో, రాజకుటుంబములోనివాఁడో, జగమున బలుపలుకుబడిగలాఁడో క్లిష్టతరకార్యములు పొక్తుపఱుప బంపబడినచో నాతని రాయబారియనుచున్నారు. వార్త చెప్పవచ్చునాతని దూతయనుచున్నారు. సంజయా, ఇందనుక నీవొనర్చినది దౌత్యమా? రాయబారమా? పాండవులు వనవాసాయాసము నిస్తరించి అభ్యుదయమునొంది యుపప్లావ్యముఁ జేరియుంట, ద్రుపదపురోహితుముఖమున నెఱిఁగిన ధృతరాష్ట్రుండనుప దూతవై, నీవు పాండవులం జూడ నేగినావు.

—నెయ్యము వాటించి కడుదియ్యమెసఁగఁ బాండవుల యలుకదీఱునట్టుల, యమనందనుఁడు కయ్యమనుతలఁపే మనమున మానునట్టుల శాంతిప్రకారంబునఁ గార్యంబునడిపి యొక్కటియై మనుట యొడఁగూర్చి, రమ్ము—

అని చెప్పికదా నిను ధృతరాష్ట్రుండనిపినాఁడు. ఆతనిపలుకులఁ బాండవులకేమేని యత్తుసనుటయే లేదు. కాని కూడి మనునట్లు సేయుమని నినుగోరకపోలేదు. పాండవులిచ్చగించి, కరిపురిం జేరిరేని వారికింత యోగిరమిడఁ దలంచినాఁడాంబికేయుండు. అదినీవు చక్కఁగ గుర్తించినవాఁడవగుటచే ధర్మజుందర్శించినంతనే "నీవును, అనుజులును ద్రోవదియును బుత్రచయంబు నున్న యోగక్షేమంబున తెఱఁగారయ సస్నేహంబున మీయయ్య నను బుత్తెంచెను" అనియుంటివి. అదివిని ధార్తరాష్ట్రులక్షేమము నరయునెపంబున నెఱపిన ధర్మజుధోరణి నడచి నడచి, తుదకు 'ఇంద్రప్రస్థంబో, వెఱొకపట్టణంబో మాకిచ్చి మనుచుటుచితముకాదా!' యని యనువఱకును బెరిఁగినది. అట్లగుటఁ బాండవులయోగక్షేమముల నరయవచ్చిన దూతుండవగునో సంజయా, నీముఖమున ధర్మజుఁడే తనకొకటియో, అయిదో పట్టణములో, గ్రామములో, యిమ్మని రాయబారము నడపినాఁడు. కావున కౌరవదూతవయిననీవు, పాండవరాయబారిగ మారినావు! ధార్తరాష్ట్రుల సేమమడిగి తెలిసికొనుఘట్టముననే ధర్మజునోట నెన్నియో యెత్తిపొడుపులు పుట్టుటనేకద కురువీరులలావులు దెలు

పుటకు నీకు వలసెను! ఆ ప్రసంగమట్లు బహుముఖముల నడచినడచి తుదకు, తమయయ్యాపాలు తారు పడయనినాఁ డెల్లని ధర్మజుఁడు యుద్ధముసేయక మానండని నీకుఁ దోఁపఁజేయుటను అంబికేయుని పలుకుబడి నెల్లని సమరము కాకుండు తెఱం గేర్పడవలయుఁగదా యనియెంచి, "కందమూలములం దినుచు, నాటవిక జీవన మొందు భిక్షాటన మొందు శాంతస్వభావులకుం దగు" ననియు, "రక్తపుఁ గూడు తగ" దనియు పాండవాగ్రజునకు బోధించి చూచితివి. నీవు బ్రాహ్మణ ధర్మము నూతగాఁ గొని, నృపధర్మము నవలింపఁ బోవుచున్నావే యని ధర్మజుఁడు కృష్ణపురస్సరణము గోరుట, నాతఁ డా ప్రసంగమున బ్రసక్తిఁ గొని ధర్మజుచే నుపపాదింపఁబడిన సన్నద్ధ యుద్ధవిధి సిద్ధపఱచి నాఁడు. కృష్ణుం డా ధర్మజు పక్షము వహింపక పోయినను, ధర్మజు స్వైరణాయే విసువు చెందుటను, అతఁడు క్షాత్రధర్మ మావలంబింప నంసిద్ధుం డగుటను, తమయయ్యాపాలెల్లని వదయ నిశ్చయించుకొనుటను, యమనందనుఁ డనుజ తనూజయుతుండయి సమరము సేయక మానం డని నీవును నెఱుంగుదువు. "మీ సంపద రాజ్యంబుల సధర్మంబుగ గైకొనియుంట చెడఁదలంచిరేని, వారే చెడుదురు: అంతియకాని, యుద్ధము జనక్షయకార్యమగుటను, మీరు మాత్రము యుద్ధమునకు గడంగవల" దని ధర్మజునితో ననుటకు నీ వేమాత్రమును సంశయింపలేదు. ఇంతకును దూత కేమిసిగ్గు! అనంతరము ధర్మజాదుల పలుకులు విని సమరము సేయ మానరని నీ వెఱింగి, పాండవుల వీరాలాపములకు వన్నె పెట్టియు, వారి సన్నాహంబులకు మఱింత మెఱుంగు పెట్టియు, ధృతరాష్ట్రు సమ్ముఖమ్మునఁ బలికి, పాండవులకు వారిభాగమో, అయిదూళులపట్టో, యెట్టిలేని యొసంగకున్న దోసంగు పోనంగక తప్పదని యెంతదూరము పొరలవతె నంతదూరమును బొరలిచూచినావు. నిజపుత్ర విజయేచ్ఛ యొకవంకను, భీముపలని భయ మొకప్రక్కను, తన్ను బాధించుచుండ

నాశతెన్నునఁ బోఁజాలక, తనదెసఁ దోసంబులేకునికిని లోకులకుఁ దెలియఁబ్రకటించుటయు, మానసమున గుటిలంపుటూహలు పరిభవిల్లఁ దావిచ్చుటయు, నను నీరెండును దనప్రవర్తనకుఁ బ్రధాన చిహ్నములైయుండఁ దన ముదిమికతమున, నందను నదుమంజాలక ఖిన్నుఁడున్న వైచిత్ర్యవీర్యునకును, స్వపక్షవీరులపై నాధారపడి, పాండవుల ఖండనమునఁ బరిమార్పఁగలనని గర్వించియున్న సుయోధనునకును; పాండవేయుల స్వబలమును, సాయముసేయనెంచి వచ్చిన వారిలావును దెలిపి, వారినెల్ల నిర్జించుట కౌరవుల కలవికాని పని యని స్థిరీకరింపదలంచియే కదా,—గంగాసుతుండు శిఖండిపాలనియు, కుంభసంభవుండు ధృష్టద్యుమ్ను పాలనియు—నిట్లు పాఁబగలఁ దీర్చి కొనఁ దరుణముకొఱకు వేచియున్న ప్రతిపక్షుల పేర్వరుసను నీవే యుర్జీలువైచి యెవరి నెవ రెదుర్కొనంగలారో, యెంచియెంచి చూపించినావు. నీవిపు డీకురుసభనాడినమాటలలో నన్నియును పాండవులపలుకులే కానక్కఱలేదని, పాండుసుతులసంకల్పములఛాయలయియుండినజాలునని యనుకొంటివి. పాండవులబలంబులును వారి సమరసన్నాహములును దెలియఁజేసినచో, ధార్తరాష్ట్రులలపాండుభూపాలుపుత్రులతో కేమేని యొసంగుదురేమో యని భ్రమించితివి. భీమార్జునాదుల దోస్సామర్థ్యములు వినుచున్నంతసేపును. వారివలని భయమును, తనకొడుకుల వీర్యాతిరేకములువినుచున్నంతకాలమును దనకొడుకులకే జయముకలుగఁ గలదనియుఁ దలంచుచు, ఎత్తువారి చేతిబిడ్డయయి ప్రవర్తించుచుండిన వాఁ డగుట ధృతరాష్ట్రుం డేమియు నీయఁజాలకున్నాఁడనికూడ గ్రహించితివి; కాని, శత్రుజనుల వీర్యాతిరేకములు నీవలనవినుటచే, దుర్యోధనున కీవఱకే పాండవులయెడఁగల యీసునకుఁదో డిపుడు నీయెడంగూడ రోసముజనించుటను మఱియాతనివలనంగూడ కార్యముపొత్తువడినది కాదని నీవు పోల్చుకొంటివా? శత్రుజనములబలములనుగ్గడించి, తమ్మాలమున

నీవు దుర్యోధనుని భయపెట్టి కార్యము పొత్తువడఁజేయఁ దలంచుటనే యియ్యది భగ్నమయ్యెనని పోల్చికొంటివా? కాకుండిన మూర్ఖుండగుటను దుర్యోధనుఁడు మేల్నుడుల నూకొనఁడయ్యె నని యందువేమో గాని, నీపలుకులంగల శత్రుజనపరాక్రమోద్ఘాటన మాతని యలుకను మఱింత రేపెట్టినదని చెప్పకతప్పదు.

ఇట్లు ప్రసంగింపవలదనియేకద అలనాఁడు బలరాముం డుపపాదించెను! అది యెవరుమాత్రము పాటించిరి! తానుగా బయల్పడు నలవాటులేని కృష్ణుఁడు, తనయన్నకదా యని ఆనాఁడు బలరాముని పలుకులకప్పటి కెదురాడక మిన్నకుండెను. మాటదురుసరియగు సాత్యకియుఁ నుద్రేకముఁజూపినాఁడు. కరినగరసామ్రాజ్యబిరుదము మాపనో, తానిదివరకే గోల్పోయిన ఉత్తరపాంచాలము నెట్లేని మగుడ బడయ నిదియె యదనని యెంచియో, కాని ద్రుపదుండు బలరాముపలుకుల నవలఁద్రోసి తనపురోహితుమూలమునఁ దొలిరాయబార మనుపుటతోడన బరుసములాడు బీజముల వెదఁ జల్లినాఁడు.

అర్జునునెడఁ దనకుఁగల మాత్సర్యముం దీర్చుకొనఁ గర్ణుం డీవలను, యాదవపరిరక్షణమును యాదవోద్ధరణమును అను కారణమున లోకకల్యాణమొనర్చు పట్టుదలగల కృష్ణుం డావలను, బనిసేయకున్న బాండుసుతులకు ధార్తరాష్ట్రు లేదేని కొంతభాగం బొసంగుటయు, ధార్తరాష్ట్రులయెడ నపవాదము పొసంగమియు జరిగియుండును. కాని కార్యదశ ననుసరించియే కావలయుఁ బరిస్థితులన్నియు నట్టి విషమపరిణామము నొందుచున్నవి.

* * * * *

పాపము కౌరవదూతయై తమయోగక్షేమము నరయవచ్చిన సంజయుని దనరాయబారిగ మార్చుకొని ధర్మజుం డాతనిముఖమున తమయయ్యసగముకాకున్నను ఇంద్రప్రస్థమొండె వేరొకపట్టణమొండె అయిదుగురకు నైదూళులొండె యీకున్న యుద్ధముసిద్ధమని యిపుడు

దనకడపటివార్త నంపినపిదప దా నింకేమి సేయనున్నాఁడో చూడవలసి యున్నది. కురుసభం బ్రభవించినవి కాంచినాము. ఇపు డుపప్లావ్యమునకు బోతిమేని ధర్మజుని ముందుచేత లేక చూతుము.

సంజయుపలుకులఁ గృష్ణుఁడు పురస్కరించుకొని:

'పాండవేయులం బ్రేరించి కురుసభ కేనైన బోయి కౌరవులకు బుద్ధిగాఁ జెప్పెదను—రాజ్యంబు పాలు సేయకున్న మృత్యుముఖంబున బడుదు—రని ధార్తరాష్ట్రులకుఁ దెలియఁ జెప్పెదు' నని యనియే యున్నాఁడుగదా!

కృష్ణుని యీపలుకుల నూతగాఁగొన ధర్మజుం డేలమానును?

ద్రుపదపురోహితుఁడొనర్చినదికూడ దౌత్యమో, రాయబారమో కాని, ఆతఁడు కురుసభ నొనర్చిన న్యాయనిష్ఠురయుతమైన యుపన్యాసమువలన కురుసభనున్న వారిమనసులు నొచ్చుటేయయినది కాని, కార్యముమాత్రము సౌమ్యమున నొకత్రోవకు వచ్చినది కాదు. ద్రుపదపురోహితుముఖమున వార్త వచ్చినదికదా యని సంజయుముఖమున ధృతరాష్ట్రుఁడు పాండవేయుల సేమ మరయు నెపమున దౌత్యమొనర్పఁజేసెను. కాని, పాండవ్యులకు తన్మూలమున జీవనసౌకర్యములైన నేర్పడమి, ధర్మజాదులు వేగిరంపడి యుద్ధమునకే నడుములు బిగియించక, సమరసన్నాహములు మానక, మఱియొకతూరి ఉచితమగు తెఱంగున రాయబారము నడపఁజూచుట పాండవుల శాంతశూరతకు అనుగుణమే కద!

ఇఁక ముం దేమగునో చూచెదముగాక!



( మొదటిభాగము సంపూర్ణము )

## రాయబార మను నీగ్రంథకథావస్తుసేకరణమునకు నాకుఁ దోడ్పడిన కొన్ని గ్రంథనామములు:—

సంస్కృతభారతము.

ఆంధ్రమహాభారతము.

ఆంధ్రీకృతశ్రీకృష్ణభారతము. ... శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

రాజతరంగిణి — కల్హణుఁడు.

కృష్ణగీత, కృష్ణ— & పురాణములు... శ్రీ పండిత సీతానాథ తత్వభూషణ రాయిగారు.

మధ్యమవ్యాయోగము, పంచరాత్రము, దూతవాక్యము, దూతఘటోత్కచము, కర్ణభారము, ఊరుభంగము. } భాసమహాకవి.

హరివంశము.

విష్ణుపురాణము.

బ్రహ్మాండపురాణము.

చాణక్యుఁడు- వ్రాతప్రతి ... జయంతి వెంకట కృష్ణారావుగారు.

భీష్ముఁడు- అచ్చుప్రతి ... డిటో

శ్రీకృష్ణుఁడు- వ్రాతప్రతి ... జయంతి వెంకట జగన్నాథరావుగారు.

భాగవతము.

బ్రహ్మాండపురాణము.

కర్పూరమంజరి.

మహాభారతచరిత్రము పరీక్షిత్తు 1932, 1933 ముద్రణములు శ్రీ పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

భారతవిమర్శనము- భారతీపత్రికలోని వివిధప్రచురములు.

భారతనాటకములు: ... శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు.

విక్రమాంకదేవచరిత్ర. ... (బిల్హణకవి) శ్రీతిరుపతి వెంకటేశ్వరకవులు.

కర్ణచరిత్రము. ... వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రులవారు.

శ్రీకృష్ణుఁడు. (1, 2 వాల్యములు) ... బంకించంద్రుడు.

శ్రీకృష్ణావతారతత్వము (అన్ని వాల్యములు)

జయంతిపత్రికలు, భారతవిమర్శములు,

ఆంధ్రభారతిపత్రికలు, గ్రంథాలయసంచికలు.

శ్రీకృష్ణుని జీవితచారిత్రము ... లాలా లజపతిరాయిగారి ఉర్దూనుండి కొణకంచి చక్రధరరావుగారి తెనుగుఅనువాదము.

కురుపాండవదాయభాగ విమర్శములు, ఖండనములు.

కురురాజ్యమునందు పాండవులకుగల స్వత్వవిమర్శ. ఆంధ్రపత్రిక 1927-28. — శ్రీ పింగళి లక్ష్మీకాంత కవిగారు.

దుర్యోధన విజయము, సుయోధనవిజయము.

Papers & Articles on Mahabharatha. ... — Bhandarkar's Oriental Research Institute, Calcutta.

The History of Panchalas.
The Asuras.
వ్యాస గీతలు & its Intro: — శ్రీమాన్ పరవస్తు లక్ష్మీనృసింహస్వామి అయ్యవార్లంగారు. ఐతిహాసికకులపతి

The Age of the Maha-Bharatha War. — Pro: N. Jagannadha Rao.

# కళాప్రచారక సమితి,

బరంపురము, (గంజాంజిల్లా)

## ఆశయము

సాహిత్య విషయముల కేవల ప్రాచీనపద్ధతులు యువజనుల యుత్సాహమునకు భంగము కలిగించుచుండగా, కేవల నవీన మార్గములు యువజనుల యుత్సాహమును వ్యర్థముచేయు చున్నవి. సాహిత్యపరిషత్తువారి ఛందోవ్యాకరణాది నియమములు యువజనుల యుత్సాహమును జంపివైచుచున్నవి; ఛందోవ్యాకరణాదులందు ఆధునికుల స్వచ్ఛందవిహారము లోకమునకు శుభోదర్కము కాకున్నది.

మహాప్రవాహమును గట్టుకట్టి యాపివైచినచో, నది గట్టుత్రెంపుకొని పారుటయేకాక, ప్రక్కనున్న పల్లెలపైబడి పాడుచేయుచున్నది. అటులనని, స్వేచ్ఛగా పోనిచ్చుచున్నచో, లోకమునకు పనికిరాక, అది వ్యర్థముగా సముద్రములో గలసి పోవుచున్నది. కావున, ప్రవాహము పారుచుండుట కడ్డులేకుండ ఆనకట్టు కట్టినచో నీరు కావలసిన కాలువలలో ప్రవహించి, తనకార్యమును తాను నిర్వర్తించుకొనుచు, లోకము నుద్ధరించుచున్నది. వాఙ్మయప్రవాహము నవసరమైనంత వరకు మాత్రమే యరికట్టి, దాని పారుదలకు కావలసినంత యవకాశమిచ్చి లోకకళ్యాణమునకై యా ప్రవాహము వినియోగించునట్లు చేయు నుద్దేశమున నీ కళాప్రచారక సమితి యేర్పాటైనది.

జూన్ దేవరాజు వేంకట కృష్ణారావు,

"వేగుంజుక్క" ముద్రాలయమునకును
వేగుంజుక్క "గ్రంథమాల" కును
లేశమును సంబంధము లేదు.
వేగుంజుక్క "గ్రంథమాల" కును నాకును
1925 నుండియు
ఎట్టి సంబంధమును లేదు.
దేవరాజు వేంకట కృష్ణారావు,
కార్యదర్శి,
కళాప్రచారక సమితి
బరంపురం,
గంజాం.

ముద్రాపకుఁడును
ప్రకాశకుఁడును
గ్రంథకర్తయే.

వేగుంజుక్క ముద్రాలయము
బరంపురం (గంజాం)
1934 జూన్.

# పీఠిక

గ్రంథరచనా విధానము మున్నగు విశేషాంశములంగూర్చి చెప్పుకొనదగిన విషయములన్నియును రాయబారము మొదటి సంపుటము అనగా సంజయ రాయబారముననే విన్నవించు కొంటిని. మఱల నా విషయములిందు బొందుపరుప నవసరములేదు.

ఈ రెండవ సంపుటముకూడ నానాడే (1—6—33) ముద్రించియు శ్రీ లక్ష్మీకాంతముగారి ఉపోద్ఘాతము నాకందక పోవుట నియ్యది యింతవరకును బ్రచురింప ననువు పడినదకాదు. అనివార్యమగు నిట్టి విలంబమునకు సహృదయులు మన్నింప వేడు కొనుచున్నాను.

గ్రంథప్రాశస్త్యముంగూర్చి పాఠకులు గ్రంథావలోకనానంత రము మిన్నకుండరనియు, పత్రికాముఖమున బలుకరించుచుందు రనియు నే నెఱుంగుదును గనుక మఱియిపుడు కథావస్తువును విన్నవింప నక్కరలేదు.

తానొక గ్రంథము రచించి సర్వవిధములం నది యుత్కృష్ట మగు గ్రంథమని దలంచి యింకేరికింజూప నొల్లక, బ్రకటించు పండిత మ్మన్యులట్లుగాక, దా రచియించిన "......గావ్యంబు సరసులైన। కవుల చెవులకు నెక్కనంగాని నమ్మం। డెందు బరిణతి గలుగు కవీశ్వరుండు॥" అని తిక్కనకవివరుండు నుడివినటుల, నారచియించిన రాయబారము మూడేడులు సుప్రసిద్ధులగు పండితకవులకు జూపుచు గురుజనంబుల నాజ్ఞలమేరకు సవరణలందీర్చికొని ప్రకటించుట యొక లోపము కాంజాలదుకదా! ఏది యెట్లైనను తినబోవు కూరలకు వంటల నేర్పును, తద్రుచులును దెలుపనేల యని దలంతును.

గ్రంథము రచియించుటయు, సరిచూచుకొనుటయు, ప్రూఫు లు చూచుకొనుటయు ముద్రించుటయు బ్రకటించుటయు మున్నగు

నన్ని కార్యములును నాయందే యుండుటను, ఎంత చక్కఁజూచి యున్నను పెక్కుతావులఁ దప్పులు దొరలుచునేయుండును. అట్లగుట సహృదయులగు పాఠకులు చూపెడు తప్పులు రెండవ ముద్రణమున నైనఁ జక్కజేసికొనుటకు సంసిద్ధుఁడను.

బరంపురం,
జూన్ 1934.

ఇట్లు విన్నవించు విద్వజ్జన విధేయుఁడు,
దేవరాజు వేంకట కృష్ణారావు.

# పరిచయము

ఉద్యోగపర్వమున సంజయు రాయబారముతో నొక ప్రధానఘట్టము పరిసమాప్తి నొందును.

ధృతరాష్ట్రునిచే ధర్మజునికడ కనుపఁబడిన సంజయుఁడు ధర్మజునకు ధృతరాష్ట్రు హృదయంబెఱింగించుటయు, అనంతర మా ధర్మజుఁడు ధృతరాష్ట్రు సమ్ముఖమున నివేదింపుమని నుడివినదెల్ల సంజయుఁడు ధృతరాష్ట్రు సమక్షమ్మునఁ బలుకుటయు నదివిని కౌరవులా ముచ్చటనెల్లఁ దర్కించుకొనుటతో సంజయురాయబారము ముగియును.

తిక్కన మతమున నే పర్వమున కాపర్వమే యొక కృతి; ఏ యాశ్వాసమున కాయాశ్వాసమే యొక కావ్యము; ఏ ఘట్టమున కాఘట్టమేయొక స్వయంసంపూర్ణమగు ప్రబంధము. కనుకనే, శ్రీకృష్ణ రాయబారము నొక ప్రత్యేక గ్రంథముగ వేఱుపఱచి ప్రచురించితిని. ఇందు ధర్మజాదులు శ్రీకృష్ణుని కౌరవసభ కనుపుటయు, శ్రీకృష్ణుని రాయబారమును, తదనంతర కథాసంవిధానమునుపరిశీలింపఁబడినవి.

కృతికర్త.

# ఉపోద్ఘాతము

ఈ రాయబారమునకు వస్తువిమర్శపూర్వకమైన ఉపోద్ఘాతమును వ్రాయుదునని యేడాదినాడు ఈ గ్రంథకర్తకు మాటయిచ్చి దానిని మొదటి భాగపుపీఠికలో నుదాహరించితిని. గ్రంథమునెన్నడో పూర్తిచేసియు, అచ్చొత్తించియు, నామాట నేను దక్కించుకొనునంతవరకు దానిని ప్రచురింపక వేచి యుండిన శ్రీకృష్ణారావుగారి సహనమెంతో కొనియాడదగియున్నది. నేను వ్రాయు నీ నాల్గు పంక్తులు లేకున్నను ఆ గ్రంథమునకు వచ్చు కొఱత లేదని ఆయనయు నేనును ఎఱుగుదుము. లోకముకూడ నెఱుంగును. వస్తుగౌరవము, రచనా విశేషముగల గ్రంథములపట్ల ఉపోద్ఘాతములు కేవల లాంఛనములేగాని ఆవశ్యకములుగావు. ఆ గుణములులేని గ్రంథములకు ఎట్టి యుపోద్ఘాతములును కొఱత దీర్పజాలవు. ఈ న్యాయమును బట్టి చూచినచో, సర్వథా మేలిగుణములుకల యీ రాయబారమునకు నాయుపోద్ఘాతము లోకాచారమునను సరించిన లాంఛనము మాత్రమే యగును. ఇట్టి లాంఛనము కొఱకు వేచియుండను గావుననే గ్రంథకర్త సహనము కొనియాడదగియున్నది యని యంటిని.

ఈ గ్రంథమునందలి ప్రధాన విషయము కౌరవ పాండవ రాజ్యదాయభాగనిర్ణయము. ఈ ధర్మరహస్యమును తఱచి చూచిన పండితులు కొందఱు పాండవులకు రాజ్యార్హత లేనే లేదనిరి. మఱికొందఱు అర్ధరాజ్యార్హత మాత్రమే కలదనిరి. రాజ్యమంతయు వారిదేయని ఇంక కొందఱనిరి. ఏ సిద్ధాంతమునకు తగినట్లు దానికే ఉపపత్తులు ఆ మహాగ్రంథమున కానవచ్చుటయే ఈ భిన్నపక్షములకు మూలమైనది. ఈ గ్రంథకర్త

పైని పేర్కొన్న మువ్వురిలో తుదివర్గములోనివారు. ఈయన మతమున స్వాత్వమంతయు పాండవులదే. ఈ నిర్ణయము చేయుటలో ఈయన రెండుపక్షములలో నేపక్షపువాదమును కప్పిపుచ్చక రెంటికిని సమప్రాధాన్యమునే యిచ్చి తాను మధ్యస్థుడై సారము దేల్చి లోకమునకు చూపుట కొనియాడ దగిన సరణిగనున్నది. కౌరవ వాదము దుర్యోధనాదుల ముఖ ముగ నెంత సాకల్యముగా నుదాహృతమైనదో అంత సమగ్ర ముగనే కృష్ణాదుల ముఖమున పాండవ వాదమును ఉదాహృత మైనది. ఒక్కొక్కయెడ రెండును తుల్యబల విరోధములుగనే కానవచ్చుచుండును. చదువరులకు నా భ్రమను నివారించుట కయియే గ్రంథకర్త సింహావలోకన వ్యాజమున తత్తర తమ భావమును వ్యాఖ్యానము చేయుచుండును. ఈ సింహావలోకన కథాభాగము మన పూర్వపు వీథినాటకములలో సూత్రధార పాఠమువంటిది. ప్రాచీన 'గ్రీకు' నాటకములలోగూడ 'కోరసు' **(Chorus)** అను నొక తటస్థవర్గము ప్రదర్శితమగు కథాభాగ ములను వ్యాఖ్యానమొనర్చుచు దురవగాహములైన పాత్ర ప్రవృత్తి రహస్యములను విప్పి చెప్పుచు సామాజికుల కథార్థ గ్రహణమును సుకరముచేయుచుండెడిది. సింహావలోకనము చేయు నీ గ్రంథకర్తయు నట్లే కథార్థగ్రహణవిషయమున పాఠకుల పనిని సుకరముచేసెను. అట్లే కొంతమంది కథా పురుషుల గంభీర ప్రవృత్తులగుట్టెఱుంగుటను సుకరము చేసెను.

రాయబారియగు కృష్ణుడును కౌరవ మంత్రివర్గమగు భీష్మాదులును ధర్మపక్షపాతులేగాని అవిచారముగా లోకు లను కొనునట్లు పాండవ పక్షపాతులు కారను రహస్యము ఈ గ్రం థమున సర్వత్ర ఉద్ఘాటితమైనది. ఆ మహాపురుషులు లక్షించిన ధర్మము రాజనీతిశాస్త్రమున కలితమైన యొకానొక పర

మార్గము. దుర్యోధనాదులు లక్షించిన ధర్మము రాజనీతిని మాత్రమే ఆశ్రయించినది. దానినిబట్టి చూచినను వారి వాదమునకు బలమేలేదు. ఇక ధర్మపక్షావలంబులవాదము ఎదిరి దానిని పరాస్తము చేయుటయేగాక ఎన్నటికిని ఎవ్వరిచేతను తిరస్కరింపబడని మహోదార మూర్తియై ధర్మ్యమైన రాజ్యపరిపాలనకు మూలసూత్రమువలె వెలుగొందుచున్నయది. అనగా నది అపరిమితమై కేవలమైన మహాధర్మము. తదపేక్షచే ధర్మములుగానే కానవచ్చు కొన్ని రాజనీతులు నిర్జీవములే కాని సారవంతములుకావు. అవికూడ నీ మహాధర్మము ననుసరించి వచ్చినంతవరకే లోకకళ్యాణ దాయకములగును గాని లేని యెడ నశుభప్రతిపాదకములే యగును. ఈ రెంటికిని అనుకూల్యము సంఘటించుటం బట్టియే భారతము ధర్మాద్వైత మూర్తియయ్యెను. ఈ ధర్మాద్వైతస్థితి నెలకొల్పిన వాడగుటనే శ్రీకృష్ణుడు ధర్మాద్వైత ప్రతిష్ఠాపకుడయ్యెను. భారతాంతర్గతమైన యీ రహస్యమును కవిబ్రహ్మ తిక్కన యేనాడో పేర్కొనెను. అలసులమగుటచే తరచిచూచి యా రహస్యమును గ్రహింపలేక అలవోకగా మనము కౌరవపక్షమునో, పాండవపక్షమునో, పట్టి పెనగులాడు చుంటిమి. ఇయ్యెడ నీ గ్రంథకర్త చేసిన పరిశ్రమ మెచ్చదగియున్నది. ఈ రహస్యముల నన్నిటి నీయన శక్తివంచన లేకుండ చక్కగా విప్పిచెప్పెను. భారతమునందలి ఐతిహాసిక భాగమును బాగుగా గ్రహింపగోరువారికీ గ్రంథను ఉత్తమమైన మార్గదర్శక మనుటకు సందియములేదు.

పింగళి లక్ష్మీకాంతం.

———————



# రెండవ భాగము

## మొదటి ప్రకరణము

(i)

— ఉపప్లావ్యము —

కరినగరమున కేగుమని శ్రీకృష్ణుని గోరుచుఁ బాండవులు తమలోఁ దామాలోచించుకొని, యాతని మందిరమున కరుగుట.

మూలిక

సంజయుండు సగౌరవంబుగఁ గరిపురికి మరలి ధర్మనందనుని నిశ్చయముఁ గౌరవసభను దెలుపుటయు, ధార్తరాష్ట్రాదులావిషయముఁ జర్చించుటయు మనము తెలిసికొంటిమికదా!

సంజయుం డుపప్లావ్యమువీడి చనినమఱునాఁటియుదయమున ధర్మరాజుం డనుజన్ములతోఁ బరివేష్టితుండై వారినవలోకించియిట్లనియెను.

"సోదరులారా, మనము ద్రుపదపురోహితునంపితిమికదా యని వారు శుష్కప్రియోక్తులతో, శూన్యహస్తములతో సంజయునిమన పాలికనిపిరి. సంజయు సంభాషణ పరమార్థ మెంతదూర మాలోచించినను, అహింసయే పరమధర్మంబుగా నెంచిన నాకు రక్తపుఁగూడు కన్న బికిరపుటన్నమే మిన్నయని బోధించుటకంటె వేఱేమియుఁ గానరాదు. పలువిధముల ననుదూఱుటయె యాతని కార్యమై నెగడినది. అహింస పరమధర్మముగనుక ప్రాణిహింసాకరమగుయుద్ధము జరుగ రాదు: మన కర్థసిద్ధి కావలయును. కావున నిట్టిరూపమునఁ గార్యము

నడుప సమర్థుండగు మాధవుకడకు మనమందఱమును బోయి కౌరవ సభకు మనయనుపరిగా నాతని జనుతుము మన మైకకంఠ్యముగఁ బ్రార్థించినచో, బంధుమిత్రగురుజనంబులతో యుద్ధముగాక, సంప్రీతికరముగఁ గార్యము నాతఁడు నడుపఁగలఁ డను నాసకలదు. కావున మన మిపుడు మాధవుమందిరమునకుఁ బోవుదము”

అర్జు:—మీకు యుక్తమనితోఁచిన తెఱంగునఁ జేయఁదగును.

ద్రౌపది:—ఇఁక మాధవునకుఁగూడ మంగళహారతి వా రొసంగినఁ
గాని మీరు తృప్తులుకాఁజాలరు కావలయు!

భీము:-ఇంకను దీనాలాపములు రాచబిడ్డలకుఁదగునని మీ రెంతురో!

నకు:-గురుభీష్మాదులు ధార్త్తరాష్ట్రుల కింతవఱకు నీమాత్రము బుద్ధులు చెప్పియుండరని మీ రెంచుచున్నచోఁ, గృష్ణునటకనుపవలసిన దే!

సహ:-ఈనైచ్యానుసంధానములవలన మననీచోపజీవనము స్థిరపఱుచుకొనుటయు, మనయసమర్థత మాధవు మూలమునఁగూడ నా కురుపతికి నివేదించుటయు, సాటిమన్నీంద్రనడుమ మనము పరిహాసాస్పదుల మగుటయుసిద్ధము. కాని సంధిమాత్రము వైకల్పికము.

అర్జు:-అటుగా దటుగాదు. ఎంతదూరము కార్యము సౌమ్యముగ నడచునో యంతదూరమును సౌమ్యముగ నడువనిచ్చి, యింకను మిగిలినదానిని విహితమార్గము ననుసంధింపఁజేయుటే పరమధర్మమని యెంచి, అన్నగా రిట్టికార్యక్రమమున కుపక్రమింప నెంచియున్నారు. కావున నిదియుఁగూడఁ జూతముగాక!

అని వీ రిట్లుసంభాషించుకొనుచు, బంధుమిత్రామాత్యసహితంబుగ నుపప్లావ్యమున నెయున్న మాధవుమందిరమునకు వెడలిరి.

## ఇవ్వలి కత (ii)

ఉపప్లావ్యమున నున్న మాధవు మందిరమునకుం బాండవు లేగి, కృష్ణుని గరిపురి కనుపుమ నెఱపిన సంభాషణములు. ధర్మ రాజాదుల స్వభావ పరిశోధనములు: గుణభావ పరిశీలనములు: నీతిధర్మముల ప్రత్యేకప్రత్యేకవ్యవస్థలు.

మాధవుమందిరముం జేరినవీరిని గృష్ణుఁడు సగౌరవంబుగఁ బ్రత్యుత్థానంబొనర్చి వారి నుచితరీతి గౌరవించి, యుచితాసనముల నలంకరింపఁజేసి వారి వచ్చిన కార్యం బడుగ ధర్మజుండు తనవచ్చినపని నిట్లు నివేదించెను.

ధర్మ:—మాధవా, ఆపన్నుల నుద్ధరింప నీకంటెవేఱెవ్వరున్నారు? మేమిపుడాపన్నులము. యాదవులువోలెఁ బాండవులు నీకు నొకమందగువారు. మమ్ముఁ బదనుండి గడుపం బెట్టుము. ప్రద్యుమ్నాదికుమారులతోడివారమగుమమ్ము దురితంబులు వొరయకుండ నరసి రక్షింపుము. ఆవినీతుండగుసుయోధనుతోడి పోరాటదక్కి నీకతంబున మా భాగంబు మే మనుభవింతుము.

"నీకలం పెఱింగితిని: నీపంచినయట్లు చేయుట కేనిదె సంసిద్ధుండ" నని మాధవుండనెను.

ధర్మ:—నందనందనా, మా పెదతండ్రి తలంపును, ఆతనినందనులచందమును, నిన్న నా సంజయుఁ పలుకుల నీకెఱుకపడియెఁగదా! యుద్ధమువలనఁగలుగు రక్తాన్నముకన్న భిక్షాన్నమె మేలనినాఁడు. సకలజనసంహారణంబొనరించి చేకొనుసామ్రాజ్యపాలనము కంటె విపినావాసమె శ్రేయంబనినాఁడు. శాంతినె సతంబును గోరునాయట్టివానికి బిచ్చపుఁగూడె కూడునఁట! ఔరా, ఏమిసాహసము! అప్పటివనాతండు దూతుండ గుటనె బ్రతికిపోయినాఁడు! ఆ వేదాంతోపన్యాసమంతయు సంజయు స్వకల్పనమే యగును. కాని ధార్తరాష్ట్రులకంతసవయమ్మూర్తియెక్కడ? మధుర మధుర ప్రసంగములమ మ్ములుకతీర్చి, మా పాలు మాకీయక, శాంతియ సర్వశ్రేయంబని మాకు నీతులు గఱప నాసంజయుం బంపిన యావృద్ధరాజు నేమనవలయు? మాజననియు సమస్త బాంధవజనంబులును సంతసింపను, వారిని శాంతాత్ములఁ జేయను, ఏమును వారును ఒక్కటిరై యాననుంగోరి మీరందఱును వినుచుండఁగ నేననలేదా—మాయైదుగురకు నైదూళు లైన నిచ్చినఁజాలు—నని! ఆ దుర్యోధనుఁడింతమాత్రమును జేయంజాలఁడో! ఔరా!

ఎంతటిక్రౌర్యము! పెంపుఁదూలఁ గ్రూరతకే నోర్వఁజాల. నాయరయు నీచుట్టాలకు గ్రాసవాసోదైన్యంబులురాకుండ సిరిఁగోరకుండ నుండఁజాల. శత్రుసంహననంబొనరించి, సామ్రాజ్యలాభంబునొందుటే క్షత్రధర్మంబని యెఱుంగనివాఁడనుగాను. అట్లని రక్తపుఁగూడే దినఁజాల. అట్లగుట రక్తసిక్తముకానియన్నమె మన్ననయు. కడు హేయమగుదారిద్ర్య మింకననుభవింపఁజాలను. పరస్పరవిరుద్ధపరిస్థితులలో నేమి సేయునుం దోఁపకున్నది.

శస్త్రజీవికయె క్షత్రధర్మముకదా యని, గుండెఱాయిచేసికొని వంశనాశనకరమ్మగుయుద్ధమ్మునకెసిద్ధపడినను, జయమందఁగలమనునిశ్చయమొందులేదు. సమరంబునఁ బరాజయంబుకంటె మరణంబ శ్రేయంబు. కావునఁ జెనఁకువకాని యుపాయంబునఁ బగఱఁగడ తేర్చుటయు, అర్థసిద్ధిఁబడయుటయు, మనకిపుడుశ్లాఘ్యావహంబు. పగచేఁబగ యెన్నండడంగనేరదు. పూర్తిగఁబగఁదీర్పకయుండినచో నదిక్రౌర్యముగాఁబరిణమించు పాముున్నయింటఁగాఁపురముసేయంజాలనట్లు పగఁగొన్నతఱిమార్కొనకయు, బలుకకయు నుండరాదు. ఎన్నివిధాలఁజూచినను బగవలన మేలిమికానరాదు. కావున సమరంబులేకయె, కులక్షయంబుకాకయె, మాసంపద మే మొందుచందంబునఁ గార్యము చక్కఁబడుటయె వాంఛితము. నీవు మాదెసఁ బక్షపాతగతివీడి ధర్మనీతివర్తనముల నిరుదెగలను హితంబును బెంపును దనరుచందాన, విదురాదిసజ్జనుల చిత్తములకెక్కునట్లు, సౌమ్యంబుగ సంభాషింపుము. అట రాజుపలికెడు బెడిదఁపునుడులకోర్చి తగవునఁబోక కార్యదశనేర్పఱుపుము. గురుత్వమును బ్రభుత్వమునుంగల పెద్దలమాట వినకుండుట యాసుయోధనునకె చెల్లనిమ్ము. ఆటనాంబికేయుపలుకులును, దలంపులును విచ్చలవిడి నింకను జననిచ్చిన నిచ్చలు జనంబులు మనలనుమెచ్చరే! సుతువాఁడగు ధృతరాష్ట్రుండు వినయంబులేక యేచొప్పునుంజెప్పలేక యవినీతుండయి ప్రవర్తించినను, నీవుమాత్రము కార్యసంధానవిధానంబును దటాలునఁ దెగంజేయకుమా! నీవటఁ దెంపుసేయకతప్పనిసరియైనచో, లోకమువారలు నినుమెచ్చునట్లు, ధర్మంబెదీపించునట్లు, మామనంబులు చింతారహితంబులగునట్లొనరింపుము. ఇన్నివిధాల వంతలచే నెంతయు నొగులుచున్నమానొవ్వు మాన్ప దక్షుండవగు వెజ్జవీవకావె మాధవా! ఇంతయేల, నీ వేగతి మము నడపింతు వదియె మాకెంతయుఁ బ్రియము. ఎల్లయర్థంబు

ఎఱింగిన నీవు నయతత్త్వకోవిదుండవు; నిశ్చయతత్త్వవేత్తవు. నీయాదేశంబు మాకవశ్య మాచరణీయంబు. కావున నీవ కౌరవసభకు పోవలయు. అన్యులకిది దుర్ఘటంబు.

“ధర్మనందనా, మీకును ధార్తరాష్ట్రులకును సంధియొనఁగూడుటె నాకును వాంఛితమగుట నీయాదేశంబు చొప్పున గరిష్ఠ నీకై ధార్తరాష్ట్రులకు పేరోలగంబునఁ జెప్పవలసినదంతయుఁ జెప్పివచ్చెదను. కాని దుర్యోధనుఁడును నామాటలు లాలింతురా యను సందియము లేకపోలేదు. నా పలుకుల కియ్యకొనరేని యిందు సందుగలవారెల్లరును మృత్యువువశం గాకయుండరు; లోకంబునకుఁ గల్యాణంబగు; నేనునుఁ బ్రముదితచిత్తుండనై వచ్చెదను.” అని కృష్ణుండు నుడివెను.

ధర్మజుఁడు దీర్ఘముగ నాలోచించి యిట్లనుకొనసాగె “ముకుందా, నీవు సుయోధను పాలికిం బోఁగూడదనియు నొక్క బుద్ధి పొడముచున్నది; సుయోధనుండును, వాని మంత్రులును, కావరులగుట నీకార్యభంగమొనర్చి నిన్ను వంచింపఁజాలగు కుటిలమతులును, అవినీతులును, క్రూరకర్ములును, అగుటచే నిన్నంపఁ బుద్ధి పొడమకున్నది. నీకెగ్గుగలుగ నాకొరవు సురరాజ్యసౌఖ్యమైన నే నంగీకరింపఁజాలను. నీవొంటిగ నంపకుండుటయే యుచితము.” అని తనయూహాల నొక్కెను.

కృష్ణుఁడు మందహాసమొనర్చి—“ధర్మతనయా, నీపలుకు లాలించితిని: నీవనినది నిక్కము. ఒక్క సుయోధనుండె యననేల! ఆతనితండ్రియు నట్టివాఁడే. వారట్టివారైనను నన్నేమి సేయఁగలరు! నిక్కముగ నేనలిగిన నట నను మార్కొనఁగలవాఁడొక్కండైన గలఁడె! నేను కౌరవసభకుపోవుట యెట్లయిన మనకు మేలె యగును. అర్థసంసిద్ధియొండె, మనకు పాపంబు రాకునికికి గతంబగు మంచిమాటలొండె కలుగును. తుంటరియైన సుయోధనుఁడు నామాటవినఁడని నే నెఱుంగనివాఁడను గాను. ‘మాధవుఁడేటికి సంధి సేయఁదలంపఁడు!’ అని జగంబు నను నోసాఁడును. దాన మీకును నిందగలుగును. మనలోప మిసుమంతయు లేకుండఁ గురుసభలో సంధికార్యంబొనరింతును. వారు మన నెంతురేని, నామాటలు విననెంతురు. అటుగాక నా కెగ్గేమాత్రమొనరింపఁ దలంచిరయేని, వారినెల్ల నొక్క త్రుటిలో నిర్వీర్యులఁ గావింపకుందునే! మన కెట్లయినను మేలె. సంధిపొసఁగకున్న, వారియత్నంబులకొలందులును, వారిసహాయసంపత్తియు, వారి సేనల లావును, ఎఱింగి వచ్చెదగాక.” అని సమాధానము చెప్పెను.

"నీకుఁ బోలినయట్లయిన నందరికి యేమును వారును వర్ధిం బొంది పొసఁగియుండు నట్లొడఁబాటు గావింపుము. అది మనకు శ్రేయస్కరంబు. ఇఁక నీ వాకురుపతికడ నడువందగినచంద మేమని నీకుఁ దెలుపవలయు? మమ్మెఱుఁగుదువు: మాయెదిరి నెఱుంగుదువు: కర్తవ్యము నెఱుంగుదువు: అర్థసిద్ధిక్రమం బెఱుంగుదువు: మాటనేర్పెఱుంగుదువు: నీ కే నేమి చెప్పగలను! నీవు మాటలాడునట్లు నేర్చి యింకొకండు మాటలాడలేనిమాట నిజము: కావున అర్థసిద్ధికనుకూలంబగుచందంబున దుర్యోధనుపొంతఁ బ్రవర్తింపుము: నీకు శుభంబగును." అనిధర్మజుండనెను.

కృష్ణు:—యమనందనా, నిన్నటిసంజయుపలుకులును, నీపలుకులును, నేఁటి నీ సందేశవాక్యములును, విన్నవాఁడ. భీష్మద్రోణాదులుగలరని బిరుదులైయున్న ధార్తరాష్ట్రులు వైరంబువీడరు. మీవలన వారేమియిక్కట్టులంబడిరని, యిపుడు నీపలుకులకులోఁగి మీపాలు మీ కొసంగఁదలంతురు! ధార్తరాష్ట్రు లధర్మమునకును లోకపుసడికిని వెఱచువారుకారు. రాజుల కడిగికొని తినిమనుట ధర్మేతరంబు. సంగరమున నరివర్గమును జయించి మేదినియేలుకొనుట యిహపరములఁ జిరకీర్తియు సుగతియు సమగతింబొనపడును. నాఁడు గురుభీష్మాదులు చూచుచుండగనే గద, నిండుసభ నట్లు మీకుఁ గీడొనరించియు పశ్చాత్తప్తులుకాక మూర్ఖులయి యింకను తమ గర్వమునే చెల్లించుకొనుచున్నారు. అట్టిరుపట్లఁ గృపయును బంధుత్వమును ని న్నెట్లువీడకున్నవో కద! ఆదురాత్ములగర్వకార్యములంగాంచి నీవు కాక యింకెవ్వరేని సైపంజాలుదురే! కపటపునెత్తమ్ము నెపమ్ముగ మిమ్ము దేశమ్ము విడలనడచునప్పుడు దుర్యోధన దుశ్శాసన శకునిసూతనందనులు పురిలోటనక్కి కలకలనవ్వుచుం బల్కినపలుకుల నాలించిన సమస్తజనంబులును ధార్తరాష్ట్రులనిందించుచు, మీరుబలవంతులరయి యుండియు, సత్యంబుపాటించి, యూరకపోవుటఁజూచి, యచ్చెరువాటున నుమ్మలించుచుండిరి. లోకదూషితులగువారు దైవోపహతులయి మున్న చెడియుందురు; కావున వారిని జయించుట మిక్కిలి చులకనిపని. క్రూరులును, గర్వులును, లోకైకదూషణులునగు కౌరవులెల్లవారికిని వధ్యులయియుండ, నీకేలయీవన్న్యలో! పాపాత్ములగు కులపాంసకుల పాములనువలె నిర్విచారంబుగ వధియించుట కర్తవ్యంబు.

కురుసభను నీవినయవివేకాది గుణగణం బభివర్ణించెదను. బంధుగులును,

మిత్రులును, పరిజనులును, నానాదేశరాజవరేణ్యులును, విన నీబుద్ధ్యాచరిత్రంబును, నీధర్మమార్గాభిలాషంబును, దెలియఁజెప్పెద. దానికి దుర్యోధనుం డియ్యకొనక తెంపుగమాలినమాటలాడుటయు, తండ్రి వానివారింపనేరమికిందోడుపేక్షకుండగుటయుం జూచి, మీ తొల్లింటిపాట్లను దలఁచి, యెల్లవారును, వారినే గర్హింతురు. మన కింకేమి కావలయును? నాయోపినంతయుఁ జేసి పృథ్వింగల సంధియ కావింపఁజూచెద. అవ్విధంబుసిద్ధించిన మేలయగు: కాకనిక్కమైన యాచ్చేటియు నుత్సాహంబు వదంబును, అందుచేయంగలవారికర్తనంబులును సెఱింగి నీకువిజయంబగు విధంబునఁ జనుదెంచెద.

ధర్మ:— దేవకీనందనా, నీ వెట్లొనర్చినను సహజంబుగానిసంధంబున కార్యంబు సాధించి మా కర్థసిద్ధినొనఁగూర్చుకొని వత్తువుగాక!

కృష్ణ:— (మందహాసంబు సేసి) పాండవాగ్రజా, నియ్యంబు కాని తెలుంగున కార్యంబుసాధించి అర్థసిద్ధి నొడఁగూర్పవలయునే! కుటిలబుద్ధియుఁ డగు ధృతరాష్ట్రుండును క్రూరకర్ముఁడగు దుర్యోధనుండును ధాత్రీభాగము నొసంగువారు కారంటివి; కొడుకు వలచినవాఁడగుట నావృద్ధరాజు ప్రకృతిగర్వితుఁడగు కొడుకుపక్రకత మాన్పఁజాలఁడంటివి; జనవినాశకరంబగుట సంగ్రామంబునకుఁ బనియ్యకొనఁజాలనంటివి; నను నొంటరిగ గురుసభకనిపిన వారు నాకేమి యొగ్గొనర్తురో యని సందియ పలంకుచుంటి నంటివి; నాయొనర్చునయాసంభాషణముల వారూకొనరంటివి; నను బొమ్మంటివి; నావలనఁగార్యసిద్ధి కావలె నంటివి—ఇవియన్నియు ననన్వయములు. ఇంతయేల! అవినీతులయి కౌరవులు పాలీయక పెనంగునపుడు, వృద్ధరాజు సుతువాఁడై మాఱాడకున్నపుడు, అర్థసిద్ధికావలెనని యపేక్షించుచున్న నీవు వారితోఁ బెనఁగులాడకతప్పునే! క్షత్రధర్మము దారుణమని, పరధర్మమాచరించుట పాపమని, యంటివి. కష్టములకోర్చియైనను పాపకార్యము లాచరింపకుండుటే కదా పరమ ధర్మము! నీవు కార్యరంగమున కలుకఁజాలనివాఁడవని తెలుంగుటనెకావలయు సంజయుం డపుడు నీకు భిక్షాన్నమె మేలని యనినాఁడు! వన్యమృగములకేతి నాటవిక జీవనమునకె, శత్రుజనపీడితుండవగుటకె, నీవు తగుదువనియు, రాజ్యము లేలుటకె, అరాతివీరజనపీడనమునకె, ధార్తరాష్ట్రులు తగుదు రనియు, నెఱింగినసంజయుపై నీవూరకఁగనలితివిగాని, పాపమాతని దేమితప్పు! సమరమునకె వారు గాలుద్రవ్వుచుండ

జనక్షయమున కియ్యకొనకుండుటకు నీ కేమియుత్తరవాదముకలదు? ఇంతకాదని అర్థసిద్ధి యక్కఱలే దనవాయెను!

గోగ్రహణఘట్టమున భీష్ముఁ డజ్ఞాతవాసవత్సరవ్యాప్తి నిష్కర్షించుసమయాన సుయోధనుం డాతనితో—"మనకును పాండురాజతనయవర్గమునకును పొం దెట్లుగలుగును? నేనయి వారికి రాజ్యభాగ మీను. సమరభంగిక విక్రమనిరతిఁ బూనుటె నిశ్చయంబు" అని యొత్తిపలికియుంట నింతలోనె మఱచితే! అట్లగుట సమరమె సర్వవిధముల సంసిద్ధము. సమరంబున జనక్షయము లేకునికి యెట్లు సంభవంబగును? పరాజయంబు సహింపఁజాలని నీకు, దారిద్ర్యమున కోర్వఁజాలని నీకు, విజయాభిలాషుండవగు నీకు, అర్థసిద్ధివశ యగోరుచున్న నీకు, అరిజనసంహారం బొనర్పక తప్పునే! సదా కదనమునకె గాలుద్రవ్వుచున్న ముష్కరులతో కయ్యము లేని నెయ్యంపు దెన్నన కార్యసిద్ధి వడయనగునె! ఆసుయోధనుని ముక్కున నావిగలుగు నందనుక బుడమి నీ కీయఁడని నీకెఱుక లేదే! యుద్ధమె సిద్ధము. కయ్యంపు శేకునంబు లెన్నేని నే గంటిని: నీ వనుత్సాహివి కావలదు. చతురంగబలంబుల నాయితంబు గావించుకొని దొరలం బురికొల్పుకొనుచు, నాలస్యంబు లేక, సమరంబునకె సన్నాహంబు సేయుచుండుము.

ధర్మ:—చాలక కాదు నేనుసమగపరాఙ్ముఖుండ నగుట: రక్తపు కూడు తినఁ జాలక—

"నేనదియు నిదియు నెఱుంగుదును. ఏది యెటువచ్చినను సంధియొనర్పఁ బోవుచున్న నాప్రయత్నము లన్నియు ధార్తరాష్ట్రిలు వీటిఁబుచ్చిరేని, నీవు క్షత్రధర్మము నిలువంబెట్టెదవో, సంజయప్రోక్త బ్రాహ్మణధర్మమునవలంబింతువో! అనుత్సాహివిమాత్రము కావలదు." అని కృష్ణుం డనియెను.

భీమ:—మాధవా, సమరంబు సమకూడు నని మాటిమాటికిని మమువెఱపింపవలదు. నిను గురుపతికడకు మాయన్న పంపుటయు, నీవు తగుదువని పోవుటయు, నీ రెండును మాకేదగును. కావున నీ వేర్పన 'నా కుమతియాదుర్యోధనుండు శాంతించు తెఱంగున కార్యంబు చక్కఁజేసికొనిరమ్ము.' ఆపాపాత్ముండు—అమదాంధుఁడు—అతులువ—నీయాదేశంబు ననుసరించువాఁడుకాఁడు. కురుసభనొక్కండును వాని వారింపంజాలఁడు. అహంకారోద్రేకమును, గర్వంబును, కోపంబును, వానినెటుద్రిప్పిన నటుబోనిచ్చు

వారే వానియాప్తజనంబులు. కావున నాతఁడు నిను వినకుండుటకేమిగాని, నిను బాధింపకుండనుండనైననోపఁడు. నేనెటుబోయిన నటువచ్చి, నాచే పీడపడియును, బాహుగర్వమున నను మెచ్చక, ననుగడతేర్పఁగడంగుచుండు. అంతనీమందుఁడగు నాసుయోధనుతో నరమరలేక కూడిమనుటనాకువలసెనే! నడచినదంతయు నీవిన్నవచ్చుండును (ధర్మరాజుంజూపుచు) యీరాచవారును కురువంశవినాశమునకొప్పని కారణము ననేగదా! దురాత్ముండగుదుర్యోధనుఁ డింతలుపుట్టించెగాని, కానిచో, మున్ను పాండవులును కౌరవులును గలసి క్షీరనీరంబులంబోలె నెమ్మిమై నున్నవారుకారె! ఆతండె కులక్షయంబునకు గారకుండను పెద్దలపలుకులు మాయన్నగారు కావనిపింపనుండ నీవేల కాదనవలె? ఓపినయంతవట్టు నీ వాఁడిగురుగనిని-సుయోధనుని-నీసామర్థ్యముచేఁ ద్రిప్పఁజూడుము. తనబలం బుడివోనియంతకును ఆధృతరాష్ట్రసూనుండు కపటంబు నడుగంజాలండు విశాలయశోభరితంబగు భారతాన్వయమున కొకమచ్చవచ్చు ననిపైన యాదురాత్ముండు తలంపఁడు. తనకార్యమున దనకే హానివచ్చునని యెఱుంగనివాని ననుసరింపఁగోరుటకు మేమెంతటినీచులమొ నీవెయోచించుకొనుము. మాకును వారికిని పితామహుండగు భీష్ముండు వినుచుండ సుయోధనుతోడఁ గురుకులేశ్వరునాస్థానంబున నాపలుకులుగా నిట్లనుము:

——అన్నదమ్ములమైయున్న మనలనొరులుచూచి పరిహసించునట్లు
మనలో మనమె యేల నిట్లు పెనఁగులాడుకొనవలెను? పెద్దలమాట
పాటించి యీనేలపంచికొని తిని మనుట మన కుచితముకాదె!——

కంసమర్దనా, ఏవిధముననైన నీవు సంధియ సమకూర్పవలయు. అదియే మాకును, వారికిని, లోకమువారికిని, సౌఖ్యావహమగుట హితమగును.

భీమసేనునిపలుకు లాలించియాలించి, యశోదానందనుండు మందహాసం బొనరించి ధర్మజాదులంజూచుచు: "ఎన్నండును విననిమాటల నేఁడీ భీమసేనునోటనె వింటిమి! ఔరా! అగ్గి చల్లపడినది! అత్యున్నతపర్వతరాజంబు బెండుంబోలె దేలికయై గాలిం దేలినది.

(తనలో) 'తనసహోదరు లాహవమున నాయాసపడవలసివచ్చునుగదా యని యెంచెనా? ధార్తరాష్ట్రులచావున కిచ్చగింపమి కారణమగునా? లేకున్న నిం

తలో నింతకరుణార్ద్రచిత్తత యెట్లలవడును? వీరికి బాలీయనని, వీరిపొందొల్ల నని వీరిమనికి నొల్లనని, యనికి రమ్మని యనుచున్న సుయోధనుకడకు ననుబొమ్మనుచే గాని అట నెటుబోయి యెటువచ్చునో యెవనికెఱుక? యుద్ధమే సిద్ధమయినచో, చల్లారిన భీమదవాగ్నితో నిఁక రిపుజనాటవి దగ్ధమొనర్చు టెటులు? అట్లగుట నీతని కుత్సాహము కలిగింపకతప్పదు.

(ప్రకాశముగా) "కీచకాంతకా, యుద్ధముమీద వేడ్కయు, మహోగ్ర విరోధులఁ జెల్లాచెదరఁ జేయు నీపగ్గోద్ధతియు, సుయోధను నున్నతి సుంతయు సైపని నీరోషమును, ధర్మనందనునకు రాజ్యసంసిద్ధి సేయు నీపట్టుదలయు, నేఁడే మైనవి? వెఱపన నెట్టిదియో యెఱుంగని నీయట్టి జగజ్జెట్టి కిట్టి పిఱికితనం బడిన దెవరోయీ!"

అని యాతండు కలకల నవ్వసాగెను.

భీము:— (నవ్వుచు) వాసుదేవా! నీ బంటుతనంపుపలుకుల నిఁక నాడకు. పాండునృపాలు పాలు గైకొంటయ చాలు నన్ను నృపకుంజరుపలుకుల కే నడ్డమాడరాదని నీ నెఱుంగవో! ఇపుడేల! అనిమొన నా సుయోధనుపాటు నీవు మున్ముందు చూపి నేఁటి నామాట నీవు నిరూపించెదవులే! నా కోలంది సుంతయు నెఱుంగక నను జాలకననేసి పలుకుచున్నావు! మిన్ను విఱిగి మీఁదఁబడినను నాముంజేతులనొడ్డి పైకెగఁద్రోయంగల నని నీకెఱుక లేదు. కానిచో నీవిట్టిపలుకుల నను నాడఁగలవే!

కృష్ణు:— పవనాత్మజా, నవ్వులాలకనిన నామాట కింతనేయుచున్నావేమి! నీవు కేవలయోధమాత్రుండవె కాక సర్వసమర్థుండవని నీతో నింటిపనులవలన నే నెఱుంగని వాఁడనుకాను. ఇంతకాలమును మీశత్రుజనంబులు మీకొనర్చినయపకృతుల మఱచి, నీవు పౌరుషముఁ జూపక, చపల వగుట యుక్తముకా దనియంటిని. ఇంతమాత్రమున నెగ్గయ్యెనే! తనకుఁ బోరం డేరుగడప నన్నానరుండర్థింప, నే ననురాగమ్మున నియ్యకొంటి. యుద్ధార్థులమైనమాకు నీసాయ మాసపడందగదే! విరోధివిజయంబునఁగాక, నన్యమున యశంబును, నానార్థసంపదయు నేకురంగలవే!

భీముఁడు:— ఏమేమి! నీవును బార్థుండును దండిమగలో! యుద్ధార్థులో! మీరేకార వ్యసంగ్రామక్షోభమునంతయు బాహుదర్పమునఁ దీర్పఁగలరో! ఇఁక పిరికిపందల మగు మేమెల్లరమును భీతచేతస్కులమై పెద్దమిట్టెక్కి మీ యాహవకేళీవిక్రమముఁ

జూచుచుండెదము లే! సంధి యనుసంధింతువో!! ఈపాటికి పోయిరమ్ము—సంధియొనగూర్పుము. నీ వెంత నేర్పును ఓర్పును జూపెదో: చూచెదము లే! ఈరిత్త పలుకుల కీ భీముండు గోపింపఁడు లే! నీతో నాకు హాస్యము లేల? కర్తవ్యమె యయ్యెనేని నేనొక్కరుండ గంధగజప్రకరకుంభములు వ్రయ్యలు సేయుచు తురంగపంక్తుల ధరంబాలు సేయుచు, తేరిగములు పొడిసేయుచుండ, నే దయ్యములకీ పబ్బాగము నిందుచుండ, నే గదవంతువు సేయుచున్నప్పుడుగద నా సంకల్పమునకు దైవసహాయము సమకూడెనని యనుట!

“భీమసేనా, నీ వెంత దుడుకువో అంతకుమిగులువంతయు జేయంగలగడిది మగండవు: నే నెఱుంగుదును ఇంతవఱకును బొనుపడిన దుఃఖవార్ధుల నిను దెప్పఁగా గొని పలుమఱు గశువనీదినము నేకొఱంతయు లేకయే సుఖాత్ములను జేసినది నీవ యనియు నెఱుంగుదును. కాని ఎన్నఁడును నిదివఱ కెఱుఁగని నీశాంతముచూచి ఆశ్చర్యమునొందితిమి. రౌద్రరసమొప్పినట్లు నీముఖమండలమునకు శాంతరసమొప్పదు అట్లగుట నట్లంటిని. ధర్మజునానతి సంధి సేత కే నేగెద. కౌరవ్యులఁబనుపునకు రాఁజేసి సంధినాటింపఁ బ్రయత్నింతును. అటుగాక యుద్ధమే సిద్ధమయ్యెనేని యీపత్తుకాన కంతకును నీవే కద ఆధారమవు!—”అని భీమసేనువీపుపై కృష్ణుఁడు తనచేతం దట్టెను.

అర్జునుఁడు:—(ముకుళితహస్తుండయి) ముకుందా, అజాతశత్రుండు నీకుఁ జెప్పఁగల యంతవట్టు చెప్పియేయుండ నే నేమి చెప్పఁగలను! అతిలోభమూషితుండగుట ధృతరాష్ట్రుండు ధాత్రీభాగమీనేరఁడు: సుతువాఁడగుట కొడుకును శపంజాలఁడు. దుర్యోధనుండు సామసాధ్యుండు కామి పెద్దలమాట గైకొనఁడు: కఠినుండగుట మాకేమియు నీయండు. ఇదినీవును లోకమును బాగుగ నెఱింగినవిషయమె. కౌరవ్యులతో సంధి పొసంగదని నీవు సంపూర్ణముగ నెఱింగియు ధర్మజునానతి నతిక్రమింపఁజాలక కౌరవ సభకేగుచున్నావు. గాండీవంబును దివ్యాస్త్రసంతతులును ముట్టవక్కఱ లేకుండగనే మాకర్థసిద్ధియయ్యెనేని, యికమాకు కావలసిన దేమి? ఫలసిద్ధినొసఁగు దైవమవగు నీవే పురుషుండవయి ప్రయత్నమొనర్చుచుండ, కార్యముఫలసిద్ధివడయకుండు టెట్లు? కావనినట్లుండియు, కార్యములు కొన్ని తుదకు ఫలసిద్ధినొందుట యెఱుంగమే! వారు మాకొనర్చిన యపకృతులన్నియు మేముసహించితిమి. వారువధ్యులని మే మెఱుంగుదుము. అట్లయ్యును మేము వారికొకకీడునుం బొరయఁజేయ నొల్లము. మాయందు

నీకున్న పక్షపాతవృత్తిని, మా పొందినపాట్లకు నీ వోర్వజాలమి నట్లంటివిగాని, పొందు సేయుటకు నీకు మాత్రమిష్టము లేదనఁ గలమా? ఆ మోటకుల నేవిధినైన నొడంబఱచి, మాకును వారికిని ధాత్రీభాగము పంపక మొనర్చి పొందొనగూర్చుట నీకును ఖ్యాతికరము కాదా! ఇట్టి తెఱంగు కానిదైన, మము నిట్టులవర్తింపుం డని మాకుఁ గట్టడియొనర్పుము. నీయాదేశంబు ననుసరింపుటయె కదా తొలినుండియు మమునున్నతికి దెచ్చినది! అట్లగుట నీమాట జవదాటువాటము మాకు లేదు.

కృష్ణుఁడు, "మానవుఁ డెంతకష్టపడి ఉద్యోగించినను దైవసహాయము లేని కార్యములు ఫలవంతములు కాఁజాలవు ఉపాయము లెఱింగి ఎంతో సామర్థ్యముతో వ్యవసాయము చేసినను, ఎన్నివిధాలఁ గృషిసల్పినను, సరియగుతఱిని వర్షింపకున్నచో, వ్యవసాయము ఫలింపని పరిస్థితులెన్ని మనము చూచుచుండ లేదు! కావున ప్రయత్నము చేసితీర వలెను. కార్యదశననుసరించియె, దైవసహాయము లభించును అట్లగుట నెకదా, నే సంధికిం బురుషకార మొనర్తుననుట! ఆపైన దైవానుకూల్య మెట్లుండునో, అట్లయగు కార్యపరిణతి! కాని ఆసుయోధనుండు, మీకు పాలీడు పాడియైయున్న, మిమ్ము బాల్యముగ నేవిధినైనం జెఱుప నంతెంతపాపకృత్యము లొనర్చనే! ఇదియటుండ నిచ్చి, విరాటుపసుల కీవువోయిన యప్పుడా దుర్యోధనుండు- 'సమరంబె కర్తవ్యంబు: పాండుతనయులకు భూభాగంబీయ' వని భీష్మాదులతో ననియుండ లేదా ఇట్లెన్నని యాతనిగుణదోషము లెంచుట! కావున నిఁక నాకుఁ గర్తవ్యము ధర్మజు నాజ్ఞ నౌదలవహించి సంధికిం బురుషకార మొనర్చుటయ. నేనచ్చటి తెఱంగెల్ల నెఱింగి వత్తును." అని యనెను.

నకులుఁడు:-యదునందనా, మామనంబు లిప్పుడు తొల్లింటిచందంబున తీవ్రంబులు గావు. ఒకరు గోవునుగొట్టిన, నింకొకరు దూడంగొట్టవలయునే! చెడుతెఱ వాకార వ్యులువట్టినను, మేమును క్రౌర్యము వహింపవలయునా! గోగ్రహణంబునాఁటి చందము నకె వారు మెత్తనడియుండవలదా! గురుజనంబులును కురువృద్ధులును వారికి బుద్ధులు సెప్పి, వారిం జక్కఁ జేయరా? ఇం దేది కాకున్నను రంధికే సిద్ధులయియున్నవారు, సంధికి బోవుచున్న నీపలుకు లాలింపకుందురేని, తత్ఫలము వారలె యనుభవింతురు.

కృష్ణుఁడు-సహదేవా, నీయన్నలందఱును చెప్పఁదలంచినవి చెప్పితి. నీ వేమందువు?

సహదేవుఁడు:—మఱి నే ననుటకేమున్నది! ఈరాచవారందఱును మగఁటిమివీడి నిన్నా వీటి కనుపుచుండ, నిఁక నే నేమనువాఁడను?

కాని, పాలుపంచి యిమ్మనియడుగుటకు నీవుపోవుచున్నావంట కదా: ఏమి పాలది? మాయయ్యపాలన్న దేది? మేముపాలునకే యర్హులమైతిమేని, మాయన్నకు యౌవరాజ్యపట్టాభిషేకము సేయనేల? యాయన్న యువరాజయ్యెనేని, మము వారణావతంబున కనుపనేల? పాంచాలమునన్న మముఁ బిలువఁబంచి మాయన్నను నర్ధరాజ్యంబున కభిషిక్తుంజేయుటేల? క్షీరనీరంబులంబోలె మే మెల్లరమును గలసి జీవించుచుండ ఖాండవమ్మునకుంబొమ్మనుటేల? కురురాజ్యంబున ఖాండవ మర్ధభాగమగునేమి? ఎన్నిటంజూచినను మాకుఁ బిత్రుపైతామహంబగునది యనుపాలు లేనే లేదు. ఇఁక రాజసూయంబున నలవఱుచుకొన్నదియు, వారు వంచనమెయిఁ గయికొన్నదియు వను నీ సంపదిరలవాసము కలదు. జూదమున సమస్తము నోడితిమి. అట్లయ్యును మరలఁ గురుపతిగరుణించి యొసంగెఁగదా యనియందురేమో! ఔను—ఒసంగెను: ఎవరి కొసంగెను? ఏమని యొసంగెను? ద్రౌపది పరిభవమొందిన యనంతరమా యంధనృపాలుఁడామెను గరుణించి యామెకా సంపదయెల్ల నొసంగెనేకాని గాండీవమును గదయును ధరించువారలకొసంగలేదే. అది దానియార్జిత మధమాధమము కాదా! దాని నాసించువారు రాచవారో! మాయజూదమని మఱియిపుడన వాటముకాదు. అట్లని తెలిసికొనియుండిరేని అపుడే యాయాట నాపియుందురే! ఇవన్నియు నేటిమాటలు! మాయన్న నిన్నా కురుపతికడకుఁ బొమ్మన, నీ వౌనని పోవుచుండ, నేఁ గాదన నేల? నీవువచ్చితివిగదా యని నిను వారు గౌరవించెదరే!

ఇంతకును దుర్యోధనుని యాచింపఁబోవుటయే యుక్తమని నీకును దోఁచినది కదా! మాధవా, రక్కసమాటలాడుట కలవాటుపడినరాజును దమ్ములును నినుఁగష్టపెట్టుచుండ, నీవు వారిమాటలకుఁ గాదన కూర్కొనుచుండుట అంతకన్నను మేలు. ఇంత లేసిదొరలయ్యు నింత దైన్యవృత్తి నవలంబించుచుంటయా! ధర్మజుండు వేడుకొనుటయుఁ, గృష్ణుండడుగఁబోవుటయు, ధార్తరాష్ట్రులు పాలీయమని బెసంగుటయునా! ఔరా! మాడెంత తీపయ్యెను! మన వేఁడికోలును, వారి ధర్మసంభావితమైనబుద్ధియుం గలసి సంధియొనగునేని, అట్టిసంధి యెంత కాలము నిలువఁగలదు! ఎంతయోచించిన

విపుడు రాచవారి కుచితమైనది యుద్ధమే కాని వేఱుకాదు. వంకమాటలే వచియింప నేర. సక్రమంబుగ సమయానుసారంబుగ నరణ్యాజ్ఞాతవాసంబులు నిర్వర్తించుకొని వచ్చిన మాకు మా రాజ్యంబొసంగక యింకను మాయలు పన్ను నేర్పు జూపఁ దలంచెనేనిఁ యయ్యది యిఁకఁ జెల్లనీయము. ఆతండును బదుమూఁడేడులుఁ దిరిగివచ్చి మముఁ బాలడుగ వలయుఁ బేకాని, మాకుఁ దాను పాలొసంగవలసిన యవసరము లే దని సుయోధను గుండెలు బ్రద్దలగునట్లు పలుకుము.

"చక్కఁగాఁ జెప్పితివి." అని కృష్ణుండనెను.

సాత్యకి:- ఎంతయొప్పిదముగఁ బలికినాఁడీ సహదేవుఁడు! దుష్టుండగు సుయోధనుండేమి! సుబోధనలు వినుటయేమి! ఇదివట్టికల్ల. మన మానము చెడును; కౌరవపక్షమున నున్న వారికా మనయెడ నశక్తి దోఁచు; ఇంకేమి కావలె మన కపజయము సేకురుటకు!—

అటఁ జేరియున్న రథికవరులలోఁ గొందఱిట్లనుకొనిరి.

ఏమిది! యుద్ధమున కేర్పడియున్న పరిస్థితులలో, సంధికని కృష్ణునంపుచున్నాఁడే ధర్మజుం డను వలుకను గావలయు సహదేవుండిట్లనుచున్నాఁడు! దుర్యోధనునివాదములో, ప్రజలనుకులో, ధర్మసందేహములో, కుతర్కములో, మఱే యవి యేమియయియుండునో కాని, క్షత్రియోచితధర్మమగు సమరము మాని సంధియనుమిష నీదీనాలాపములేల యనుపగటున గావలయు నిట్లు పలుకుచున్నాఁడు. కాకుండినచో దుర్యోధనునిఁగూడఁ దవావలెనే పదుమూఁడేడులును దిరిగి రమ్మనుటేమి! తమకు రాజ్యమునందు స్వత్వములంగూర్చి యున్నికళంక లేల! సుయోధను పైఁగల క్రోధమును, సంధి ననుసంధింపుమనుచున్న ధర్మజుని మితిమీఱిన శాంతికిఁ దానొందిన యసంతృప్తియు, నిట్టి పలుకులఁ బలికించి యుండనోపు!

* * * *

ద్రౌపది కృష్ణుని సమీపించినది.

సహదేవునడ లోకింత చేయూఁతనొసంగినను ధర్మజునందనుపలుకులు తనకు హృదయతాప మొనరింప భీముని ప్రసంగము తనయాస సమూలముగ నశింపఁజేయ, పార్థుని మాటలు తన కేవజనింపఁ జేయ నిజహృదయావేగ మాగమి మోహమున దీనత్వము దోఁచుచుండఁ, బాపము పాంచాలి గద్గదకంఠియగుచు శౌరి దెసం జూచుచు నిట్లనియె:-

"ఆదురాత్ములంతంతకీడులు మనకొనర్చియుఁ బ్రయోజనములేనిపలుకులు సంజయుచేఁ బుత్తెంతురే! ఇట్టియాట కొంతయు మదిం బ్రియమంది యీయుధిష్ఠిరుండు తనంతన దాయాదుసరకునైదూళులనైన నిచ్చినం జాలునని వార్తనంపిన నంపుఁగాక: కాని, కృపావిహీనమతిని జెక్కుడుమలమముఁ గుడువఁజేసినసుయోధనుండీ మనుజపతి వేఁడికోలున కియ్యకొనునే! మును దాఁబడ్డబన్నములన్నియు నీధర్మసుతుఁడు తనతమ్ములపైఁగలకూర్మిసైఁచుట యొంతయు నొప్పిన నొప్పుఁగాక: కాని రాజ్యముపాలులేని సంధి కా సుయోధనుఁడియ్యకొనెనేని, మనవారి యవివేకమునకును, నసమర్థతకును, సిగ్గులేమికిని లోకమువారాడిపోయకుందురే! వీరాలాపములై కాని, కార్యములపట్ల బలాతిరేకములఁజూపఁజాలని మనము సంధననుసంధింపఁ ద్వరపడుటె బాగు. కాని, వీరికికానివో సుయోధనుం డేలయొసంగఁడు. వీరుయాచించుచున్న యూళ్ళైదులలంతిపల్లియలైన! అదియును ధార్తరాష్ట్రులకెకవా లాభకరము! ఇంతలేసిదొరలు, మహాపురుషుండవగునినుఁ గురుసభను యానకునిఁజేయఁబంపుమండ్రు, లోకానకెల్ల వధ్యులమన్న ధార్తరాష్ట్రులీపాండుతనయుల కనుజలతియయియుండ, నీవుమాత్ర మేమిసేయఁగలవు? ఇంతకును నెన్నివంచనలొనర్చినను గౌరవ్యులు బ్రాహ్మణులుగనుక నా మనము సైరింపవలెననుటకైనను! సంగరమున జయాపజయంబులంగూర్చిన శంకయొకవంకను, జనక్షయమువలననగు పాపభీతియింకొకవంకను, నిర్వీర్యులకుంబలెఁ దన్నుబాధించుచుంట సంధియొనర్ప నిన్నీ ధరణిపతి కురుపతికడ కనుపుచున్నాఁడు; కాని వీరపురుషోచిత ధర్మమున మెలంగు నా సుయోధనుచిత్తమునం దోటమి యనుమాటయె లేమి నాతఁడావంతయుఁ జలియింపఁడు. ఆత్మీయతకలవారి దురభిమానము నీపలుకులను మఱింత యెక్కుడగుటె కాని మనకు ఫలదాయకము కాఁజాలదు. అటుగాక, నీపోయినచోట నీయెదుటనె సంగరంబగుచొప్పులెపుట్టినను, ఈపాండు కుమారులు పోటునకిచ్చగింతురో: మఱలఁ గందమూలఫలంబులఁగుడువ నడవులకు నడచెదరో! మాధవా, రాజును దమ్ములును నీవునుంగలిసి యోచించి, యుచితంబునారసి, మన కార్యంబును, మీసౌజన్యంబును జెడకుండ మీకనుకూలమగు తెఱంగున మీమీనేర్పుదేర్పడ నాకురురాజుతో సంధి గావింపుఁడు: కాదనువారెవరు?

కాని ________ మేము పడరాని పాట్లెల్లఁబడియు ఫలమంత లేకుండుటయు, లజ్జాకరములగు నక్రమకార్యములొనర్చుచును వారు సుఫలము లందుటయుఁ జూచి మఱి నోటమాటరామి, మాపడినపాటులు మనమున నింకను నిముడఁదావు లేమి మంచి చెడ్డలనరయఁజాలక, మనంబుడుకుటను, వెఱ్ఱెత్తి, వివేకముదూలుటను గార్యఁపు సాకర్యమును ముప్పుచొప్పునుంజూచుకొనలేక కాలుఁద్రేపలనే నాకుమనసుకల్గుచున్నది. వరమున యజ్ఞకుండమున జన్మించితిని; భరతవంశమునఁగాలువెట్టితిని; పాండుభూపాలునకుఁగోడలనైతిని; లోకస్తుతిఁ గన్నవారికి భార్యనై, సుస్థిరనీతివిక్రమాఢ్యులగు పుత్రులఁగాంచి, యెంతయుఁబ్రసిద్ధివహించితిని; నీచే సుభద్రకంటెను గడు నెయ్యమునఁగారవింపఁబడునన్ను, కృష్ణా, రాజసూయావభృథంబున శుచియై నెగడిన నా యీవేణినొకండుపట్టి యీనాయేవురుపతులును జూచుచుండఁగనే సభకీడ్చి పరాభవమొందఁజేసెను. ఇట్టియవమానము నేకులాంగనయైన నోర్వఁగల్గునే? మఱియు నాసభ కేకవస్త్రనగు ననుఁగొనివచ్చి యాతులువ దుశ్శాసనుఁడు ననునొవ్వఁజేయుచుండ, నా భర్తలు ననుఁజూచుమనసంభ్రమములై నాయాసలువమాని, చిత్తరువులయట్లుండఁ దుడకు మూకుండ, నీవలనివిశ్వాసమునఁగదా, నినుఁగొల్వమనసుపుట్టినది! ఇదియైనఁ బరికింపవే సంఘమర్యాదలనైనఁ బాటింపక నన్నాకాలమునఁగోడలను మాటయుపేక్షి దాసిగఁజేసి యాడికములనెఱుపఁజేసినయామహాపురుషుపాలికి మరలఁబోఁబోవుచోఁగోడఱికము నేయవలెనో, మఱల యథారీతిని దాసినై మెలఁగవలయునో నీవేధరపఱుపుము.”

అనుచుఁ గనలి యార్తయై, బంధురమై యున్న తనకొప్పుముడి గ్రమ్మనవిడ్చి మనమునఁబొంగు గాఢరోషవిషాదవేదనల వేగమున ద్రోవది దిగ్గనలేచి కృష్ణసర్పమొనా విలసిల్లుచుఁ దన వలపలచేత ద్రేలు కురులను గృష్ణునకుంజూపి యశ్రుపూరితలోచనయై “అన్నా, చూచితివికద, దురాత్ముండగు దుస్ససేనునిద్రేళులను సగము దెగిపోయినయీకురులు! ఇపుడు నీమూలమునఁ గౌరవుల కడఁదీఱుమాటలఁగాని మిగిలిన సగమునుగూర్చి తలఁపలేము. ఈకురులువట్టి నను నీడ్చిన యాతనిచేయియుఁ దనువును నింతలింతలుగాఁ దునియలై చెదరి రూపుమాయనంతాఁకను, నాసభ కేకవస్త్రనౌనను దులువతనాన నీడ్చుటను సగముసచ్చిరయే నేనటనిలచియుండ, ‘రా రమ్మిటురమ్ము కూరుచుండు’ మని తన యొడిఁజూపిన దుర్యోధనునితొడలు విఱుఁగునందాఁకను, జగద్విఖ్యాతిఁగాంచిన నాపతులేవురునుండియుఁ దమ సహధర్మచారిణి

మానము గోల్పడు సమయమునన్నైనను, నాదిక్కునకు రారేమని దుర్భరవిషాదవేదనానల పరితప్తచిత్తనయి పతులదెసఁ జూచుచుండ 'నీకిటఁ బతులు లేరు: ఇందు నీవు నచ్చిన వాని నింకొకనిఁ బతిగా నెన్నుకొను' మని యనార్యములును అమానుషములును నగు కర్ణకఠోర వాక్యముల ననునిందించిన కర్ణుని శిరంబును భూపతితమునొందుదాఁక నారని యీచిచ్చు, అలుపాలఁ బోనుపని యీచిచ్చు, సమరముకొఱ కెదురు నూచుచు నాయొడిం గట్టికొనిన యీచిచ్చు, అన్యమున జల్లారునే! నేనును, ధర్మ వంశవమహీపతియును, రాజరాజు పెనుంపును గన్నారఁ జూచితినైతినేని, ననయుంగ దాక్షిణ్యతకును, గదాగరిమత్వమునకును, బాహుబలంబునకును భీమసేనుండొందియున్న గర్వంబును, దివ్యాస్త్రంబులను దీర్ఘంబగు గాండీవమనునొకవిల్లును ననకుఁ గలవని గాయరి గర్వించు కృష్ణనిగ్రహంబును నేలఁ గూల్పనే! దుష్టనిగ్రహమునర్చును జగంబులఁ గాచునీయట్టితోఁ బుట్టువును, బరాక్రమ సంపన్నులగు భర్తలును గలిగిన నాకే యీయాయము కాఁగినవాఁడు, ఎవతెకింకెన్న రెక్కడు తోడుండఁగలరు!" అని ద్రౌపది యెలుంగు రాలుపడ నేడ్చుచుండెను—

కృపాసారంగితాత్ముండగు ముకుందుండామె నోదార్చి కూర్చుండఁజేసి, దామెకనుకూలురును, ప్రెమ్మేష్వేణియుడువనుం దగినవారిని నియోగించి, యమ్మానిని నూఱడిలఁజేసెను.

—కృష్ణుఁడు:—

అమ్మా, యాజ్ఞసేనీ, నీకింతవంత యేల? సంధి సుకురుననుకొంటివా? కౌరవ్యు లర్ధభాగం బూరకయిత్తురనుకొంటివా? ధర్మజునానతిఁ జివరవఱకును సంధియను సంధించు ప్రయత్నమొనర్చితిమను మాటకు లోపము రాకుండ, లోకమున నొకనింద మనకంటకుండ, నుండుకొఱకు నేఁ గౌరవసభకుఁ బోనుంటిని.

దుర్మానమును, లోభమును, అసహనమును, వ్యామోహమును నెచ్చటెచ్చట మితిమీరించి తమస్సులోఁజేరుచున్నవో యచ్చటచ్చటఁ గాఁపగినదియెల్ల వినిర్మూలనమును బునర్నిర్మాణమును మాత్రము నైయున్నవి. కనుక నిర్దోషులును ధర్మరతులును నీతిపరులునునగు మిము, వారు రాజ్యలోభమునను, విషయవ్యామోహమునను దుస్సహముగ వేధించిన కారణమున, నీయిప్పటియేడ్పుకొలఁదియె యికముందు కురునృపాలపుత్రకళత్రంబుల యేడ్పులుగా మాఱఁగలదు. వారియేడ్పులువిని

నీవు కలకలనవ్వునట్టి కాలమాసన్నము కాకమానదు. ఇందు సందియము లేదు. సౌమ్యమున నెంతమాత్రము మనము ప్రయత్నించినను యమమహిషఘంటికానినాదము వినఁ గుతూహలపడుచున్న కౌరవులు, సంధికార్యమున కిచ్చగింపఁగలరే? అట్లని సంధి ప్రయత్నములు మానవగునే! సంపూర్ణమగు బాధ్యతతో నొక్కమాట చెప్పెద వినుము. సమూలముగ రిపుజనక్షయమును గాఁగలదు; ఉజ్జ్వలపుణ్యలక్ష్మీసమేతులగు పాండుకుమారులధికవిభవమును బొందెదరు. ఇది నీవు చూచెదవు. ఇందులకుఁ దడవును లేదు.

కృష్ణుని యీపలుకులు వినినంతనె యాకృష్ణయుఁ గలఁతఁదేఱి యేడ్పుడిగె. వాసుదేవు మొగంబు చూచుచుండి నర్జునున కేమితోఁచినదో కాని మాధవుం జూచుచు "మహానుభావా! పాండవులును, ధార్తరాష్ట్రులును జుట్టఱికమున నీకు సమానమగుట మాయుభయపక్షములవారికిని నుచితమును హితమును నగు తెఱంగున, ధర్మార్థసంగతంబుగ మాయన్న బల్కిన కార్యము నుచితగతిఁ దెఱవుపఱచికొని రాఁగోరెదము. అంతకును గౌరవులు నీమాటలు చెవినిడక, సత్కార్యమునకుఁ జేర నొల్లరేని యుత్తరక్రియలు దైవమెఱిఁగియుండును. అంతతో ధర్మనందనుండు నీయందిడిన కార్యభారమును దీఱఁగలదు." అనియె.

కృష్ణుఁ డదివఱకు నుడివిన ధర్మవచనములు వినిన యజాతశత్రుం డలరి— "కృష్ణా! మమ్మెఱిఁగి మాయెదిరినెఱిఁగి, మంచిచెడ్డల నెఱిఁగి, యర్థసిద్ధిమార్గమెఱిఁగి, సంభాషణక్రమమెఱిఁగి యున్న నీకు బుద్ధులు చెప్పుటకు నే నేపాటివాఁడను! జనక్షయమొల్లని నాయభిమతమెఱిఁగితివి గావున, నయ్యది మఱవక కార్యదశ స్థిరపఱచికొని రమ్ము" అని దినశుద్ధి నిరూపించి శ్రీకృష్ణుని జన్మనక్షత్రంబునకు గార్యసిద్ధికనువగు నక్షత్రంబును, బయనంబున కనువగు నక్షత్రంబును, సమన్వయపఱచి చంద్రతారాబలంబులుగల రేవతీనక్షత్రంబు నిర్ణయించి, శ్రీకృష్ణుని ప్రయాణమునకు సన్నాహపఱచి, యుధిష్ఠిరుండు తనవారితోఁ దనయావాసంబున కేగెను.

శ్రీకృష్ణుండును ప్రయాణసన్నాహంబొనర్చికొని, మఱుదినంబున సాత్యకిసమేతుండై శంఖ,చక్రగదాద్యాయుధంబులు రథంబుననునిచికొని యుచితగతిం బయలుదేరి సుశకునంబుల నవలోకించుచు ధర్మజునావాసంబు తెన్నునఁ దనయరదంబు వోనిచ్చుచుండెను. మాధవు రాక కెదురు చూచుచుండిన యజాతశత్రుం డాతనిం గని యలరి యాతని రథంబు నాపి యిట్లనియెను.

"కృష్ణా, నీవువచ్చుచున్నావనుమాట చెవింబడుటయేతడవుగ మాతల్లికిఁ బ్రాణములు లేచివచ్చును. ఆమందానందము నొందును. మాపనుపున ననుపరికై వచ్చితివి కదా యనియును, వచ్చిననీవు తన మేనల్లుండవుగదా యనియు, నొకసద్దెలియనియా నందముననుండఁగలదు. మెకుమాయందలి సేమము సెప్పి మా మొఱ్ఱకుఁ దెల్పి నీసాంత్వ నాలాపములచే నామె మనమ్మునను న్న యుమ్మలికమ్ము నివర్తిలనొనర్పుము.

"మేము నానావిపత్తుల కేగుచెంబు మనుసంపకమునెట్టెంతయో దూరము మానెను బడివచ్చినప్పుడామె మోమున దైన్యరేఖయును, కనుదామరలనుండి జలజలరాలుచుండిన యశ్రుకణంబులును జూచియు మేమేమియుఁ జేయంజాలక యామెను విడిపోవలసివచ్చి నది. మేమేపురము ప్రతుక్రిల ముండియు లాక్షాగృహాఘుష్టము నాఁటనుండియు నామె దిక్కులేనిదానివలె నెన్నియేని యిక్కట్టులంబడుచు నేయున్నది. దుఃఖకారణములైన నన్నియు నంతమగుసమయ మాసన్నమైనదియని నామాటగాఁ జెప్పి, నీవామె నూఱ డిలఁజేయుము. నీవ తనకుఁ గలవని యాయమయు ననుచుండును.

"గురువృద్ధులును, సుహృద్బాంధవులును, ఇతరసగరణిపతులును బ్రీతినొందు తెన్నునఁ బ్రణామాదవిధులనొనర్చి మఱియు నాపలుకుల నెఱుకసేయుము.

"మధ్యస్థుండును బరమహితుండునునగు విదురుంగాంచి నాకైయాతనిఁ బరిరంభణముసేసి బాంధవసాంద్రపరమున సంభాషింపుము. ఇంకేమి సెప్పుదును"

అర్జు:—కురుసభంగలనారంపలు వినునట్లు: ధర్మభూపాలుఁడు సగమురాజ్య ము గైకొనంగలవాఁడని జనపతికార్యనిశ్చయము, నిశ్చయవాక్యముల నీవు దెల్పినవిని, యనుజసమేతుఁడౌ సుయోధనుఁడు సామ్యమునఁ బాలొసంగనేని మేమెంతయు నీయ కొఁదుము. అటుగాక నీమాటకొకింతయెమరాడెనేని యాపక్షముననున్న యందఱను సపుత్రమిత్రముగ నేనొక్కఁడ నిట్టె పాలిపెట్టెద.— ఇదియె నామాట.

భీముఁడు:—మేలు-ఫల్గునా! ఎంతయానందదాయకముగఁ బలికితివి!. ఎంత జరుగఁదగినదియో, యంతయు జంకక చక్కఁగఁబల్కితివి. ఎల్లవేళల నొకరి నను సరించిపలుకుచుండు యలవాటైన నీ విపుడింతస్వతంత్రముగ నింతటియుద్రేకమునఁ బలికితివి గావున నీకఁగాఁదగినకార్యమిపుడె నిశ్చయమైనదని స్థిరపఱుపవచ్చును.

నకులుఁ:-కృష్ణా! సెయ్యమొనర్చికొనివచ్చినఁగదా నినునంపినందులకు సార్థకత!

సహా:—సంజయునట్లుకాక నెయ్యమొ కయ్యమొ తేల్చికొని రమ్ము.

ద్రౌపదీసహితులగుపాండవులు కృష్ణున కిదివఱకే నివేదించిన తమతమ సందేశపుఁబలుకులు చాలకయో యనునటుల నిపుడతఁ డరదంబునఁగాలుపెట్టి పోఁ బోవుచున్నసమయానఁగూడ మఱలఁజెప్పఁదగిన తుదిపలుకులుసయితము చెప్పి కృష్ణు నుచిత ప్రకారంబునవీడ్కొలిపి వారలు తమతమమందిరములకేగిరి.

సాత్యకి సహితుండగు కృష్ణుండు దారుకుంజూచి "కరి నగరంబుపెంపెరుపుం గైకొని, నీచతురత్వంబునఁ దురంగంబుల పటుత్వంబున నత్యంతసమీచీనంబైన యానంబున, నరదంబు పోని" మ్మని కట్టడియొనర్ప నతం డతిరయంబున రథంబు గడపుచుండెను. మార్గంబునంబడిపోవంబోవ నొక్కెడ నారదజమదగ్నికణ్వాది మహామునులం గని శ్రీకృష్ణుండును రథంబుడిగ్గి వారలకు నమస్కరించి సస్నేహ తాత్పర్యంబులఁ గుశలమడిగి వారియాగమనకారణమునడుగ నారదుండిట్లనియె.

"పుణ్యచరితుండవగు నినుఁజూచి, నీవు కౌరవసభను జెప్పుమహోపన్యా సంపుభంగి నాకర్ణింప, విదురభీష్మాదులు నీ పలుకులువిను తెఱంగును, అందుకు గౌరవ్యు లొసంగు ప్రత్యుత్తరంబులరీతియు, నెఱుంగువేడ్కన్ నాహస్తినకరుదెంతుము." అనుటయు నారాయణుండు హర్షమంది యట్లు సేయుండనియెను.

ఆమునీంద్రులును శ్రీకృష్ణుని దీవించి—"అనఘాత్మ, నీవుకరిపురికరుగుము—ఏము నటకేగుదెంతుము". అని వీడ్కొలిపిరి.

అరదంబు వడివడిఁ గడచుచుండెను. సాయంసమయ మగుసరికిఁ గుశస్థలిం జేరెను. అచ్చటి విప్రజనంబు లెదురుసని యదునందనునకు నర్ఘ్యపాద్యాదులొసంగిన తమతమగృహంబులకు రానాహ్వానింప నతండును బ్రసన్నవదనంబున నంగీకరించుచుఁ దగినవారల గేహంబులకుంజని వారొసంగు నాతిథేయసత్కారంబులకలరి మఱలివచ్చి విశాలరమణీయప్రదేశంబునఁ బటకుటీరంబు నెత్తించి విడిసి నిజోచితప్రవర్తనలనుండెను.

మఱునటి దినంబునఁ బయానంబుసాగించి శౌరి కరినగరమ్ముజేరఁగలఁడు.

# రెండవ ప్రకరణము

## ( i )

కరిపురికరుదేరనున్నాఁడు కృష్ణుఁడని వినినధృతరాష్ట్రునితలఁపులు: కృష్ణునకు స్వాగత మొసంగు సన్నాహములు: దుర్యోధనుని యూహలు: ధృతరాష్ట్రదుర్యోధనుల సంభాషణము. కృష్ణునిబంధించుటకు దుర్యోధనుని ప్రయత్నములు: పెద్దలు దానినివారించుట.

అన్వయి కథ.

శ్రీకృష్ణుఁడు పాండవపక్షమునుండి రాయబారియై యేతెంచుచుఁ గుశస్థలంబున విడిసెననియు, మఱుదినమునఁ గరినగరముం జేరుననియువిని ధృతరాష్ట్రుండు తనసభకు నిజతనుజపతిని బురోహితహితామాత్యవర్గంబును రావించి, శ్రీకృష్ణునియాగమనముం గూర్చి ప్రసంగించి "సర్వలోకాభిగమ్యుండగు నమ్మహానుభావునకు మనమభిగమ్యుల మైతిమి. మనకింతకంటెను జెంపెయ్యది! అట్లగుట మన మాతని కింపునింపు తెఱం గేర్పఱింపవలయు" ననియెను.

ఆపలుకులువిని దుర్యోధనుఁడు నగరెల్లను శోభనశిల్పముల నలంకారంబు సేయను, బురమలంకరింపను, నేర్పరుల నియమించి, వాసుదేవునకు విడిపట్టుగాఁ దగియెడు వృకస్థలమందుఁ జప్పరములిడ నాజ్ఞల నొసంగి పురంబున నుత్సవంబుసాట నియోగించి, కృష్ణునకెదుర్కోలుగాఁ దగిన యుత్సవములు సేయఁ గట్టడియొనర్చెను.

—ధృతరాష్ట్రుఁడు—

విదురా, వృష్ణివంశశ్రేష్ఠుండగు నాకృష్ణుండెవరిదైన సంతుష్టుండగు, వారికె శుభంబగు: ఎవరిదైన నాతం డనాదరంబుసేయు, వారి కశుభంబగుట తప్పదు; అట్లగుట నాతనికి వలయు పూజ లాచరించి, యాతని కమూల్యరత్నంబులు గానుకలొసంగియు నాతనిమాడ్కి కింపునింపువానినెల్ల నాతనికిచ్చియు సంతృప్తుం జేయవలయు.

—విదురుఁడు—

అంబికేయా, నీవు జెప్పినదియెల్ల మేలయగుంగాని పాండునందనులకు నైదూళ్లులైన నిచ్చుటకొప్పని నీయునికియు, నిచ్చుటకోపని నీకలిమియు, నవేల? ఎల్లోని లంచమిచ్చి శౌరినివశపఱచుకొని కార్యగతిమార్పఁ దలంచుచున్నావే కాని యాతనికి మేరుసదృశార్థము నొసంగినను, తనభక్తుండగు పార్థు నాతం డెడఁబాయునే! అట్లగుట నిట్టి యీవు లాతనిసంతృప్తు నొనర్పఁజాలవు. ఆతం డేపనికని మన కడకువచ్చు నద్దానిని వంచింపక చేయుటకంటె నాతనిఁ బ్రముదితాత్ముం జేయఁజాలిన దింకొకటి లేదు.

—దుర్యోధనుఁడు—

నాయనా! కృష్ణుని పదునెఱుఁగక మన మే మొసంగినను ఆతఁడు పాండుసుతులనుండి వేఱగునే! మన మిప్పుడేమిచ్చినను ధార్తరాష్ట్రులు బెదరిరని మసల నగరే నాగరకులెల్లరును! ఆతఁడుప్రాజ్ఞుఁడే యగు: నే నెఱుంగుదు. కానుకలొసంగిన మనయెడ నగతు లెంతయు ననదతన మాపాదింతురు. కావుననీఁగిమాటఁ దలపెట్టకుము.

—భీష్ముఁడు—

వైచిత్రవీర్యా, నీవును నీకొడుకును ఆతనికేమే నిచ్చిన నొకటియు నీయకున్న వేఱొక్కటియుఁగాదు. అతఁడు సేయఁబూనిన పనిఁ దప్పింప నేరికింగాని కానిపని. ధర్మార్థాబాధమగు నాతనిపలుకుఁ గైకొని మీరలు తీర్చితిరేని యంతయు సానుకూలమగును.

—దుర్యోధనుఁడు—

కృష్ణుం డేమన్నను విననొప్పుదు: ఆతని పను పేమఱక నెఱవేర్తు: కాని, పాండుసుతులకు రాజ్యంబున నగపాలిఁ దగు ననకున్న నాతని కాతిథ్యం బొసంగి సగౌరవంబుగ నర్చించువాఁడను. అటుఁగాక తనపట్టిన కుంతిబొట్టెలకు రాజ్యంబు పాలుసేసి యీ్యాయుక

తప్పదని నిర్బంధించెనేని వేఱొకపనిఁగూడఁ జేయఁదలంచితిని. వారి కేడుగడయగు నాజనార్దనునిఁబట్టి బంధించి వైచినచో ధర్మజాదులు ఱెక్కలు దెగినపులుఁగులై, మఱిదిక్కులేక. నాకువశంవదులై, విధేయులై, మెలఁగుటయె కాక, వారిపక్షమున వచ్చియున్న పాంచాల యాదవమాత్యాదులును వారిబంధుమిత్రులును నాకువశవర్తు లగుదురు. నేన సమస్తదేశముల నేలుదు. ఇందులకుఁ దగిన యుపాయ సహాయ్యంబుల ననువుసేసెద. ఇటుపైని నీకేమి చెప్పెదవో చెప్పుము.

— ధృతరాష్ట్రుఁడు —

జగద్ద్రోహమురా నాయన! ఇంతటిదారుణపుటూహ నీ కెటు దోఁచెను! మహామహుఁడగు వాసుదేవుని రాక మన కురు వంశమున కెటులోఁగీడయ్యెను! మధ్యవర్తియైవచ్చుచున్న మాధవుఁడు నీకేమిచేటొనర్చెనురా! ఇంతకును నాతఁడు దూతకార్యము నిర్వర్తింపవచ్చుచున్నాఁడేకాని మన కెట్టికీడునుందలఁచివచ్చుచున్నటులఁ గోచరింపలేదే! ఆతనిమాహాత్మ్యంబును, ధర్మోత్సాహంబును, దూతత్వమును నీవలన నంతటి కఠోరకర్మనొందింపఁ జేయఁదగినవి కావు. ఇట్టిప్రయత్నము ముడుఁగుము. దూతను హింసించుట ధర్మ విరుద్ధము. ఇపుడు నీవిట్లాచరించినచో లోకమంతయు నొక్కపెట్టున మనపైఁ దిరుగఁబడఁగలదుసుమా. అన్నింటికంటె—నాతనిని వాసుదేవునిఁగా నెన్నుచున్నదీజగ—మనినీవుగుర్తింపఁజాలకున్నావు. ఇట్టి దురాలోచనము నిపుడైనఁ గట్టిపెట్టుము.

— భీష్ముఁడు —

వైచిత్రవీర్యా! నీకొడుకు మిగుల మూర్ఖుఁడయి ప్రాణ గొడ్డంబైన కార్యముసేయఁ దలంచి యకారణ వినాశమభ్యర్థించుచున్నాఁడు. ఆచక్రియెడ వీఁడింతలుసేయ నుంకించెనేని, దానును బ్రధానులును సహాయులును దప్పక వినాశంబునొందుదురు. వీరికార్యము సేయుదురుకాక-సేయకుందురుకాక. సంకల్పించి రంతియచాలు.

కార్యములకెల్ల సంకల్పముమూలము. ఇంతటిఘోరకార్యమీమహా మహులనెడ విచారించిన దుష్టాత్ములు నష్టాత్ములుకాక తక్కుదురే! నే నిట్టికౄరవాక్యములు విని సహింపఁజాల.

అనుచు నంబికానందనునితో నైనను జెప్పకయ గంటునెట్టికొనిన మొగాన దిగ్గనలేచి నిండుకొలువునుండి వెడలెను.

— ధృతరాష్ట్రుఁడు —

సుయోధనా! కొఱగాని కార్యంబులెప్పుడు మనంబునందలం చితివో యప్పుడె చేయంగలాఁడవు: నే నెఱుంగుదు. అట్టిది వలవ దుడుగుము: దీనం జేటుమూఁడునుజుమ మనకొలానకు. నీకింత మంద బుద్ధి యెట్లు లలవడెనురా!

అని యాంబికేయుం డనుచుండ దుడుకుఁదనాన దుర్యోధనుఁడు కొలువుచావడివీడి వడివడి వెడలిపోయెను. ధృతరాష్ట్రుఁడును పుత్రసుయోచితవర్తనంబుల నుండెను.



# రెండవ ప్రకరణము
## (ii)

కుశస్థలమునుండి కరిపురింజేరుచున్న కృష్ణునెదుర్కోలు: కృష్ణుని హస్తిపురప్రవేశము: కృష్ణుఁడు ధృతరాష్ట్రుని సంబోధించి ప్రసంగించుచుఁ జంద్రవంశపురాజుల నుతిసేయుచు భీష్మద్రోణ కర్ణాదులతో నుపలాలనము సేయుట: విదురునింటికి మరలుట: కుంతిని దర్శించుట: కుంతీకృష్ణులు సంభాషించుట: దుర్యోధనుని నికేతనమునకుఁ గృష్ణుఁ డేగుట: కృష్ణుని దనయింట విందారగింప దుర్యోధనుఁడు కోరుట: కృష్ణుఁడు నిరాకరించి పిదప విదురునింటికి మరలుట.

### హస్తిపురమున శ్రీకృష్ణుఁడు.

మఱునాటి వేకువసమయానఁ గుశస్థలవాసులనుపఁ గృష్ణుండు పయనంబుసాగించి వృకస్థలంబుచేరి తనరాక కెదురుసూచుచున్న దుర్యోధనపరివారంబును గాంచి తనకనియనిపిన మధురాహారంబుల ననుభవింపనొల్లక, పరిగ్రహణమాత్రమ్మున ననుభవించిన విధంబు దెల్పి యందునిలువక పయనంబు నెఱపి హస్తినాపురంబుసమీపించి తనకు స్వాగతంబొసంగవచ్చిన భీష్మాదికురువృద్ధులను, ద్రోణాచార్యాద్యాచార్యవర్గమును, దుశ్శాసనాదికుమారగణంబును గాంచి, దుర్యోధనుం డప్పు డటకు రామి నెఱింగి, వారల నయ్యయి విధంబుల గౌరవించి తనవాఁడగు కృతవర్మకు పరిశేషస్నేహంబుసేసి, యతం డా సేరువకురా సమస్తజనంబులు బరివేష్టింపం దన రాకకు సర్వవిధమ్ముల నలంకృతమ్మైన కరిపురమ్మునఁ బ్రవేశించెను. శ్రీకృష్ణుని రథంబు రాజవీథిని నడచుచున్న సమయాన హస్తిపుర వాసు లాబాలవృద్ధముగ శ్రీకృష్ణసందర్శనలాలసులై మ్రొక్కుచు, వినుతించుచు, రథంబు సమీపించుచున్నారు. వారి సందడినివారించువేత్రహస్తులనపవారించి, కేశవుఁడు తనయరదంబుమందగమనంబునం బోనిచ్చుచు, ముందట మణితోరణాలంకృత సుందరమందిరద్వారంబుఁ బ్రవేశించి, కక్ష్యాంతరంబులు గడచి చనిచని సింగంబువాకిలిఁ జొచ్చి యటఁ దనయరదంబు డిగ్గి సానురాగవీక్షణముల నెల్లరం జూచుచుఁ దనప్రమోదమును బ్రకటితం బొనరించెను. తనకని తెచ్చిన యున్నతాసనంబునఁ నుపవిష్టుండై సాత్యకిం దగినవారితో యోగక్షేమాది కుశలవార్తలం నడుపం బనిచె.

ఆ రాజు ననుమతిని విహితప్రకారంబుగ నుచితమర్యాదలు శ్రీకృష్ణసాత్యకులకు నడచినవి. మహీపాలుండును దక్కటి దొరలును సామంతులును దత్తదుచితాసనోపవిష్టులయి ప్రఫుల్లవదనులయి యుండిరి. అపుడానిండు కొలువు సూర్యోదయసమయమునందలి కమలాకరంబుచందంబున విరాజిలుచుండెను. కృష్ణుఁడు ధర్మనందను పలుకులుగా నాంబికేయునకుం దగువారలకుం బ్రణామపరిరంభణ ప్రముఖసముచితసంభావనంబులువలికి సౌహార్ద్రభాషణంబుల సంభాషించుచు నెల్లరకుం బ్రమోద మొనఁగూర్చుచుండెను.

—కృష్ణుఁడు—

వైచిత్రవీర్యా, మరల నెంతకాలమునకీ కరినగరిం జేరితిని! ఆ నాఁడు—పాండవులను ద్రుపదపురమునుండి నీయిచ్ఛమెయిఁ దెప్పించి, సకలలోకకర్మసాక్షియు, నేనును, ఈకురువృద్ధులును సాక్షులై యుండఁ బాండురాజవిభవ మంతయుఁ గొనుండని ధర్మజు నర్థరాజ్యంబున కభిషిక్తుం జేసిన నాఁడీనగరమునకు వచ్చితిని; మరల నీనాఁడు ధర్మజుధర్మమున రాఁగలిగితిని. ఈనడుమ నెంత ప్రయత్నించినను రాఁజాలనైతిని. మిమ్మునందఱ నిపు డిటఁ గాంచి, కృతార్థుండనైతి. ప్రతిష్ఠగాంచిన పౌరరాజ్యరమనుగాంచిన నాదృక్కులు చరితార్థములు.

శశాంకునితోఁ బ్రారంభింపఁబడిన మీచంద్రవంశమున నాలవ తరపురాజగు యయాతి, శర్మిష్ఠయందుఁ బూరునిం గనెను. ఈపూరుని కాలమునుండియు మీవంశము పౌరవంశమయ్యెను. ఆతని కేడవతరపు మనుమండును రాజును నగు దుష్యంతునకును శకుంతలకును జన్మించిన భరతుని కాలమునుండియు భారతాన్వయమనిపించుకొనిన మీ వంశ మాతని కెనిమిదవ రాజగు కురువునాఁటనుండియుఁ గురువంశమనిపించుకొనినది. ఈకురువునకుఁ బినతాతయగు నజమీఢునివంశమున నాఱవవాఁడగు పృషదునిపుత్రుఁడే యిపుడు పాంచాలరాజగు ద్రుపదుఁడు. కురువంశమున నాఱవవాఁడగు ప్రతీపుని కుమారుఁడగు శంతనుని మనుమలు మీరు. కావునఁ గురువంశమునుండి చీలి వేఱయి

పాంచాలమను స్వతంత్ర రాజ్యమేర్పఱిచి కొనిన పాంచాలురును మీరును 'తాతాసహోదర' వర్గములోనివారె. ఇప్పటి పాంచాలమును మీపౌరరాజ్యములోనిదె. శంతనుపిన తండ్రియు రాజునగు హస్తిచే నిర్మింపఁబడుట నీనగరమునకు హస్తిపురిమను కీర్తి నామముగల్గె.

శంతను ననంతర మాతనిమనుమలగు నీవును విమలచరిత్రుండౌ పాండుఁడును ప్రజాభిప్రాయానుగుణ్యముగఁ బ్రవర్తించితిరి. నీతమ్ముండగు పాండుఁడు హస్తిసామ్రాజ్యమునకభిషిక్తుండయ్యు నీవలని ప్రీతి ముడికతమున, నినుఁబితృతుల్యుంగాఁదలంచి నిను రాజ్యంబుననిల్పి, తాను దేశాలంబడి తిరుగుచు శత్రుజనభయంకరుడై పరరాష్ట్రములఁగెల్చి కురురాజ్యము నభివృద్ధిపఱిచి ప్రజాసౌఖ్యమునకె పాటుపడుచుండుటను, నందఱప్రేమమునకును నాతఁడు పాత్రుఁడయియుండెను. నీకును, నీతమ్మునకును భేదములేమి మీరిరువురును సమానబాధ్యతఁగలిగియే రాజ్యవ్యవహారములు చక్కఁజూచుకొనుచుండిరి. మీానంశానుక్రమణికయు, మీరాజ్యవ్యవస్థయుఁ, జూచినచో, నీభాతృవర్గములోనివారగు పాంచాలు రిపుడేలుచున్న పాంచాలరాజ్యము కూడ నీహస్తిసామ్రాజ్యమున నొకభాగమయియుండెను. వర్ణనాతీతమగు నింతటివైశాల్యముగల కురుసామ్రాజ్యమ్మున కేకఛత్రాధిపత్యమునవహించినమీయన్వయముమిగులఁబవిత్రమై సంస్తుత్యమైనది. మిమ్మును మీరాజ్యమును మరలనింతకాలమునకుఁ జూడఁగంటిని.

(భీష్ముదెసఁజూచుచు) నీకతమున రాజ్యప్రతిష్ఠాపనవహించిన వీరిచే రాజ్యభారము సక్రమముగ నిర్వహింపంజేయుచున్నావుకద! నీకుఁగా సంసారములేకున్నను నీతమ్ములబిడ్డలనె నీబిడ్డలుగనెంచి వారిలోవారికిఁ గయ్యములురాకుండఁ గుటుంబకలహములు పెరుగకుండ రాజకార్యములు నిర్వహించుటకు నీకే సరి! నీవలననె యింతదూర మీయన్వయ మిట్లునడచినది బ్రహ్మవిద్యాధురంధరుండవై, రాజ్యపాలనాధూర్వహుండవై, బ్రహ్మచర్యవ్రతనిష్ఠాగరిష్ఠుండవై నెగడిననీసచ్చరిత్ర మాకల్పముగ నీయిలాతలమున వెలయఁగలదు.

(ద్రోణుంజూచుచు) కుంభసంభవా, నీచేనస్త్రవిద్య పునఃప్రతిష్ఠితమైనది: నీకతనఁగాదె కోదండపాండితీమహిమాన్వితులగుభారత వీరవరేణ్యులెల్లరును వెలయఁగలుగుట!

(కర్ణాదుల నుపలక్షించి, సుయోధనునిసాదరదృక్కులనవలోకించుచు) గాంధారీనందనా, జాతిరత్నములలో నొప్పుదురత్నముల నిట్లేర్చికూర్చి నీకడనె యుంచుకొనిన నీనేర్పరితన మెంతని నుతింతును!

(ధృతరాష్ట్రునుద్దేశించి) అంబికేయా, వేళయతిక్రమించుచున్నది. నేనిఁక విదురునింటికిఁబోవలయు: నింకనుజూడఁదగినవారి నెల్లఁ జూచి మరలివత్తు: ననుజ్ఞ నొసంగుము.

అనికృష్ణుఁడు ధృతరాష్ట్రుననుమతిఁగొని విదురుసదనంబునకుం జనియెను. విదురుం డాపలుకు లాలించినతోడన సంభ్రమోత్సాహంబులు మనమునఁ బెనఁగొన నిజగృహంబునకు మున్ముందుగఁబోయి వలయువాని నయ్యెడ నాయితంబు చేసి మంగళాచారప్రకారంబులఁ గృష్ణునెదుర్కొని భయభక్తివినయస్నేహానందంబుల శ్రీకృష్ణునకు దేవోపచారంబుల నర్చనల నెఱవేర్చి, పాండవేయుల సేమంబరసి తెలిసికొని యుచితసంభాషణంబు లొనర్చుచుండెను.

కృష్ణుఁడు, "విదుర, నేనిపుడు కుంతినిదర్శింపవలయు." ననియెను.

—విదురుఁడు—

చిత్త మట్లసేయందగును: నాయొసంగునాతిథేయసత్కారంబుల స్వీకరించి నేఁటికినాయింట నారగించి నన్నుధన్యుంజేయఁ బ్రార్థించుచున్నాను. ఏతత్ప్రయత్నములనుండ నాకనుజ్ఞ నొసంగుఁడు.

కృష్ణుఁడు, "అట్లనె కావింపుము." అనెను.

అంతం దనవెంటనంటి వచ్చుచుండిన సాత్యకికృతవర్మలఁ దోడ్కొని కుంతీమందిరంబున కేగి, కృష్ణుం డామెను దర్శించెను.

కుంతియుఁ గృష్ణుం గాంచినంతనె తనసుతులను సాక్షాత్తుగఁజూచినట్లు వేగమొంది యడలుపుట్టుట నవ్వాసుదేవుమెడఁ గట్టిగఁబట్టుకొని పేరెలుంగున నేడ్వఁ దొడంగెను నా మొనూరార్ప, నట్టికలకయ్యవ్వయు నేడ్పుడిగి యాతని కానవవిశ్వాస

వాద్యుపచారంబులు చేయించి, తత్సమీపంబున నుచితాసనంబునం దాఁగూరుచుండి గద్గదకంఠియగుచు నిట్లనియెను.

— కుంతి —

కృష్ణా, నీవెఱుంగనివారగుటఁ బాండుపుత్రులు పుణ్యచరిత్రులై శూరులై నెగడినారు. పెక్కండ్రుమన్నింపఁగొలువ రాజ్యము లేలఁగలవారు భీకరంబులైనయడవుల కేగి నల్లటనించిరో కద! నాహృదయము గైకొనిపోయినవారు నాశరీరమునుగూడ వెంటనిడికొనిపోక పోయిరి! వారుపడినయిడుములం దలంతుమన్న నిప్పటికిని భారము గాంచఁజాలకున్నాను. జనకవిహీనులై, జననింబాసి బానిసటికమున విరటుపాలంబడి, భంగపాటును, దుఃఖపాటును, సంకటపాటును, నెట్లుసైరించిరో కదా!

ఆనాఁడాజూదఁపుసభం బుట్టినవిడ్డూరంబులు దలంపునకువచ్చినపుడెల్ల నాహృదయంబున నుల్కాముఖీజ్వాల లుద్భవిల్లి నట్లగుచుండును. సుగుణములకెల్లఁ గుదురనఁదగిన మావిదురుఁడుదక్క దక్కొరులా యనయముఁ జూచియు నేమియు ననఁజాలకుండిరి.

అని తొల్లింటివేదనల మరలమరలఁ గృష్ణునిమ్రోలఁ గిరశించుచు నావేదనాపూర్ణహృదయయై అశ్రుకణపూర్ణలోచనయై విషణ్ణచిత్తయగుచుఁ గుంతి మరలనిట్లనియె.

ఈకష్టములన్నియు నొకయెత్తును, బావగారికొడుకులచే నదయమగుపట్టాన్నము గుడుచుటయొకయెత్తునై నను వేధించుచుండ భర్తచావుకన్న, కన్నకడుపునకుదూరమగుటకన్న, నింకను నైచ్యమున్నదే! ఆదుర్యోధనుఁడు వీరి కీనొప్పఁడనియుఁ, దండ్రి కుమారు నదల్పఁజాలఁడనియు నిందింపనేల? కురువృద్ధుఁడౌ బాహ్లికునిఁ బాడింపనేల? విదురుని వేధింపనేల? ఇట్టిక్రూరకుటుంబమునకు, ఇట్టియసురసాంప్రదాయకులకు, ఇంతతమోగుణప్రధానులకు, నను నిచ్చివేసినమనవారి ననవలె నంతేకాని, యొరులనన నేమిప్రయోజనము? ఇంతకును నానొసటివ్రాలిట్లుండ, నీయంతలైన నేమిసేయంగలారు!

వచ్చినదాని ననుభవించుటకంటె, సంఘటనలఁ బ్రతిఘటింపఁ బ్రయ
త్నించుటగాని, ధిక్కరించిపలుకుటగాని పలుగాకితనమెయగుం గాని
కాకున్న నేమిచేసినను ఏమనినను దగినవిషయమెయగును.

రాచకూఁతు లేకాఁకయి కొడుకులఁ గాంతురో యట్టిస్వధ
ర్మోచిత కార్యములకుం దగినయదనిదియయని, ఇఁకఁ దడయఁదగదని,
భీమార్జునులతో నామాటలుగాఁ జెప్పుము.

రాచపుట్టువుబుట్టినవారికి వేడికోలును, దైన్యమును గలుగుట
నిష్ఫకలు వేఁడిమి సెడుటయెయగు: రాచబిడ్డలకు స్వభుజబలమున జీవిం
చుటయె ధర్మము: మెత్తపడుట నింద్యము.

అని యమనందనుతో ననుము. 'ఇఁకఁ గార్యము నడిపింపందగు
నీవిప్పట్టునమానస ముడుగరా' దనిద్రౌపదాత్మజులతోఁ గొంతుకుంచక
వచియింపుము.

అప్పుడుఁగిన్క వహించిరయేని, భీమార్జునులకు నష్టము
లేమి నేనెఱుంగనిదానను గాను. అంతంతలునయి, యహితనులు
వడియు వాని నీగవలదా మనకు? అట్టియాపనికెల్లఁ బాండుపుత్రులె
తగినవారు: వారు నీవెటులనడిపించిననటులనడతురు. నీవిఁకఁ దడయక
నాదుఃఖానలముఁ జల్లార్చి నాయలంతఁ దీర్చి మముఁ దరిఁ జేర్పుము.
ఇంతకన్న నేనేమనఁగలను!

— కృష్ణుఁడు —

క్షాత్రధర్మముఁ జూపునీపలుకులు నాకే యడలుపుట్టించుచున్నవి.
నీపుట్టినయింటికిని మెట్టినయింటికిని వన్నెపెట్టినపట్టిగట్టినడవడిగలనీహృ
దయతాప మడంగుసుసమయము వచ్చినది. నీతనయులును గోడ
లును సేమముననున్నారు. వారికై నీవావంతయు వంతనందఁదగదు.
నీకొడుకులును గోడండ్రును నీకు సమస్కారములుపెట్టి తమయుల్ల
ముల నినుఁగౌఁగలించినారు. వీరజనోచితసౌఖ్యమాకాంక్షించునీసూను
లన్యసుఖాభిలాషులగుట కంతయల్పబుద్ధులె! శత్రుకులోత్పాటనవిధి

యాచరించి యున్నత రాజ్యాభిషేకోత్సవమందు వారి ననతికాలము
ననె మీరాజిన కుతుకమ్మునఁ జూతువుగాక!

కుంతి: —నాయనా! ముందేమిజరుగనైయున్నదియు నీకుఁ దక్క నొరు లకుఁ దెలియకుండుట లోకాన కెంతయుఁ దెలిసిన: ప్రద్యుమ్నాదికుమారుల నెట్టులఁ జూతువో యట్టులఁ జూతువు పాండుపుత్రులనందఱ; అల్లయ్యును నీకుఁ గడుంగూర్మి సఖ్యభావనఁ జెలరసి పరిరక్షణ మొనర్తువు. నామానసపుటారాటము నోఁదోలుదువు. మాకన్న రక్షకులు నీకును నీకన్న రక్షకులుమాకును వేఱుగ నేనును లేను. నిరూపింపవును గురుం డవునను నీవు హితమును ధర్మంబును మదనెంచి విరించుననెల్ల పాండవులు ప్రవర్తింతురు ఇంతకును నినుఁ జేరినవారి నాపద లొందవం జాలునుకదా! వారలకె యాసనే నీ శౌరివలెనును, జగంబులన్నింటికిని, నీవ చేయుగదా. నీపలుకన నిఖిలభువనంబులకును వేదప్రమాణముకదా?

కుంతిపలుకులు ఆలించి ప్రసన్నవదనుండై యామె, నమస్కరించి యాశీర్వచనము నడసి, సెలవుగైకొని, యచ్చటి వీడి, దుర్యోధనునింటి కేగు ముఖుండై "సాత్యకీ, రావోయి—చనము కృతవర్మాదిమిత్రులమై సుయోధనుసదనమున కేగుద" మని గోవిందుండు వారితోఁ బురంబోడ్గొని, రత్నకిరీటాలంకృతమైయున్న గాంధారీనందను మందిరముం బ్రవేశింపఁబోవుచుండ నచ్చటిద్వారపాలకులు ససంభ్రములై రారాజునకెఱుక పఱచిరి. అంతటను దుశ్శాసనకర్ణశకునిప్రభృతులతో నెదురువచ్చి ప్రత్యుత్థానంబు గావించి యుచితమర్యాదల వారివారి కాసనంగ నాద్యుపచారంబులఁ దానుండి మిత్రులు నాదరించి సమయోచితవాక్యములనడుగుచు మధుపర్కాద్యుపచారంబులు గావించినారు. అంతనమ్మురాంతకుండు సుయోధనాదులతో లోకవ్యవహారములం గూర్చి ముచ్చటింప గాంధారీసుతుండు బంధుప్రీతి నెఱపుచుండెను.

—దుర్యోధనుఁడు—

వాసుదేవా, నీ రాక రాకయుంబోలె మాలోచనచకోరంబులకుఁ జెన్నుపండువయొనర్చుచున్నది. అప్రయత్నముగ సమకూడిన నీయాగమనము కతమున మాయింటఁ బండువు సేయనెంచి, తదనుకూలప్రయత్నములఁ జేయుచున్నాను. నీకుఁ బ్రీతికరములగు వంటకములు సేయింపఁ దలంచితిని. మానికేతనమున నినుఁగలసికొను భాగ్య మబ్బినందున,

నేను భాగ్యవంతుండ నైతినని గర్వించుచున్నాను. నేడు మాకతిథివై మముం గృతార్థులం జేయుము.

కృష్ణుఁడు:—నేఁడిందుల కియ్యకొనంజాల.

'వింటివికదా—అంగరాజా: తొలుతనే యీతనిపలుకెంత యెరుసుగ నున్నదో! ఇఁక నీపెనుపరినందమెల్ల మున్ముందు విందువుకద.' అనుభావమును విస్పష్టమొనరించు చూపుల దుర్యోధనుఁడు కర్ణునిజెస రహస్యముగఁ బలికెను.

దుర్యో:—(కృష్ణునిదిక్కు మొగంబయి) బావా, నీయాతిథ్యభాగ్యంబు గోరి నిన్నుఁ బ్రార్థింప నీవిట్లందువని నేననుకొనలేదుసుమా: నీవు కౌరవ పాండవులకు నారయనొక్క రూపగుబంధుగుండవును, అసదృశధర్మాచారపరుండవును, మాతండ్రికిఁ గడుంగూర్చు ప్రియుండవును, అగుట నినుసంప్రీతునొనర్చుటయ నాకుఁగర్తవ్యంబనియెంచి, యెంతయునినుఁ గోర, నీవిట్లంటకుఁ గతం బెఱుంగఁజాలకున్నాను. ఈనీవర్తనము మాకాలమున కెంతయు మచ్చఁదెచ్చుంజుమ; ఇది నీతికిని, బాంధవంబునకును బాహిరంబనియైనఁ దలంపవలదా?

కృష్ణు:—సుయోధనా, నేనిపుడుదూతను: దూతకార్యభారవహుండై వరికడకువచ్చునో, వారియింటభుజింపరాదు: వారిచ్చుబట్టఁగట్టరాదు: వారిదు కానికలం గైకొనరాదు. ఇది ధర్మశాస్త్ర విహితము. కార్యము దీఱినపిదప మీసత్కారంబుల నేనందుకొనఁదగును.

—దుర్యోధనుఁడు—

మాయూరరుఁదెంచితివి: మముఁజూడవచ్చితివి. నినుసగౌరవంబుగఁ బ్రత్యుత్థానంబొనరించి యర్ఘ్యపాద్యాదివిధులఁబూజించి మా తండ్రి మధుపర్కాద్యుపచారంబులొనర్చెను. నాకుఁజేతనైనంతవట్టు నేనునుఉత్తమభంగినర్చించితిని. నీవు వచ్చితివికదాయని నాయింటఁ బెనుపండువు నేసికొననెంచి యింతదూరము ప్రయత్నించితిని. నీవుమా యింటఁగుడువనొల్లక యిట్టె వేగపడితివి. ఇట్టిది నీయట్టిచుట్టమునకుఁ బొందనిది. నీవువచ్చినకార్యముదీఱుఁగాక: తీఱకుండుఁగాక. కార్యంబు

తెలుంగువచ్చినయపుడు దానితెలుంగునకుఁ దగినపోలిక యప్పుడాడు కొనవచ్చు. ఇపుడె నీవిటుల ముక్కుఁద్రాటఁ గాలుఁద్రువ్వనేల? వచ్చిన వాఁడవు నాహ్వానపూర్వకంబగు ప్రార్థనం బంగీకరించి మాయింట మాతోఁగలసిమెలసియుండి భోజనముసేసినయనంతర మన్నిపనులుం జెప్పుట యొప్పుఁగాని యిపుడె యిట్లనుట నీకు భావ్యమగునె? నాయెఱింగినంతవట్టు దీనికిఁ గారణ మరియఁ జాలకున్నాను.

కృష్ణు:—ఇట్టిపట్టులఁ గారణంబు నీ వడుగరానిదయ్యును గ్రుచ్చి గ్రుచ్చినను నడుగుచుంటివి: కాన నీసందియంబుఁ దీర్చెద నాలింపుము.

అని రారాజుకరంబును, గజరాజుహస్తంబున్నఁబట్టు లీలఁ బ్రీతింబట్టి యందున్నవారినెల్లఁగలయంజూచి, మందస్మితంబున 'సుయోధనా, నేఁడోలుదొల్త మీయయ్యందర్శించి యాతనితోఁ జాలసేపు ప్రసంగించి పిదప విదురాదులయిండ్లకుఁబోయి వచ్చుచు నినుఁజూడరా నీకిపుడేమి తోఁచినదో కాని, నను నీయింటఁ గుడువ రమ్మంటివి. నీతండ్రినిజూఁడ వచ్చిననన్ను, నాతఁడాహ్వానింపకుండఁగనే నీవు నీయింట ననుభుజింపు మనుటయనుచితము. ఇంతకును బ్రేమతోఁ బిలిచి పెట్టెడు పట్టెడు కూడైనను నెంతయు నాదరణీయము. నే నిపుడార్తుఁడఁగాను. నాకు లేమిడియులేదు. నీ విపు డిడునది యదయమగు కూడుకదా! అదయ మగునది పక్వాన్నమైనను నాకు విసర్జనీయము కాదా! నీవు మాకుఁ బగతుండవు. పగవారియింటఁ గుడిచిన నది యనుమానమునకు హేతువుకాదా? ఒడళుల కెపు డేవిధాన నేమి వాటిలుచుండునో యెవనికెఱుక? కావున పగతుర కమృతమైనను గుడువంబెట్టుట యెటు లైనను నీకును సమంజసముకాదు.

నేను పగతుండనగుదునె యనియందువేని పాండవుల నంత మొందింప నెన్నియెన్నిప్రయత్నము లొనరించినవాఁడ వీవు. వారనుప వచ్చినవాఁడను నేను. కావున నేనును బగతుండనయగుదు. ఆపాం డవేయుల కాబాల్యముగఁ గీడె యాచరింతువు. పుణ్యపరులుమ

ఆర్యులనునగుత్తోఁబుట్టినవారితో నింత వైర మెత్తుటదాష్యంబుకాదె! ఇట్లున్న మీయందఱియన్నంబు దుష్టాన్నంబు. ఇంతకును నన్నెవరు మీకడకు దూతగనంపిరో యట్టిపాండవులు కూటికై దేవులాడు చుండ వారిచే ననుపఁబడినైననేను మీయింట విందులారగించుచు సుఖించుట నైతికమునుగాఁజాలదు గావున విదురునియన్నంబు భోక్త వ్యంబని నిశ్చయించితి.

అనిచెప్పి దుర్యోధనుమందిరమువీడి చనుచెడ బాహ్లికభీష్మాదులు "మా యిండ్లఁ గానికలాయితంబుసేసికొని నీరాక కెదుర్లుచూచుచున్నారు" మనిప్రార్థింప దామోదరుండును—నేనెల్లచోట్లకును వచ్చినవాఁడన; అందఱియర్చనలం గైకొనిన వాఁడనని భావింపుఁడు. తత్ఫలంబును మీసంకల్పములందె యిమిడియున్నది. ఇఁక మీరింటనిలుండు—అనిసాత్యకిసహితుండయి విదురుగృహంబునకుం బోవుచుఁ గృత వర్మంజూచుచు, "సాత్యకీ, మనవాఁడగు కృతవర్మయింట నీవు గుడువంబొమ్ము". అని సాత్యకికృతవర్మలఁ దోడుసేసి యనిపి, తాను విదురుగృహోన్ముఖుండయ్యెను.

———————

— దుర్యోధనుఁడు —

"ఔరా! ఎంతవిరసముగఁ బ్రవర్తించినాఁడీకృష్ణుఁడు! బంధుగుఁడుగదాయని మాయయ్యకుఁగడుఁగూర్చువాఁడుగదాయని, ప్రత్యేకముగనిలుసేసికొని యున్ననాయింటికివచ్చినాఁడుగదాయని వానినా యింటఁగుడువరమ్మనినేఁగోర నేమేమియో శాస్త్రమర్యాదలంజెప్పి ధర్మసూత్రములనుటంకించినామాటనిరాకరించినాఁడు. అందఱియెదుట నన్నుఁజిన్నఁగఁజూచుటే తనఘనతనుబెంపుసేసికొనుటయనిమెంచికా నోపు నిట్లుప్రవర్తించినాఁడు. ఈతఁ డెంతటికుటిలపుటూహలతో మాయూరుజేరెనోకాని తొలుదొలుత నె మాతండ్రియెదుట నెక్కడెక్కడిగొడవల నెత్తిపెట్టుట కారంభించినాఁడు.

మాతండ్రి, ధర్మజున కర్ధరాజ్య మొసంగినపుడుతానును ఒక సాక్షిగానుంటిసని మాటలధోరణిలోసూచించినాఁడు. ఈతనిసాత్య

మెవరికిఁగావలయు? ఈతని మాటయెవనికిఁ గావలయు? బేలతనాన మాతండ్రిమాత్రమె యీతనియుబుసుపోని పలుకులనాలింపవలయు. తనవాఙ్నైపుణిఁబెట్టుకొని తానుదినములు గడపుకొన వలసినదే! తాతలనాఁటిపాత్రికతల నాలింప మాతండ్రికే చెల్లినది: వృద్ధజనుల యొద్ద గాథలఁజెప్పుటకీతనికే చెల్లినది. సభకువచ్చినది మొదలెవ రెవరితో నెట్లెట్లు బలుకవలయునో యెవరెవరి నేయే ప్రసంగంబుల నలరఁ జేయవలయునో వెదకికొనుచు నెంతేఁగా ప్రసంగించినాఁడు!

మాతండ్రిని మెప్పించురీతి, పితామహాదుల నలరఁజేయుతెన్ను, ఆచార్యాదులఁబొంగించుఘనరీతియుఁ జూచికొనిచూచికొనిపలికెడుదకు నను మెప్పించు నెపమున నేమేమియో పలికినాఁడు. ఈమాత్ర మెఱుంగఁ జాలననుకొనినాఁడుగావలయు! తనకంటె వేయింతలు మాయలు సేయు నేర్పుగలాఁడనని యెఱుంగక, తనపలుకుల కలరువాఁడనని యెంచి యట్లారంభించినాఁడు. తనవచ్చినపనికిఁ దొలినుండియు బీజములు వేయుటపనిఁగాఁజూచినాఁడు ప్రతివాదమే ప్రధానముజేసి అందు కనువగు నుపపత్తుల నన్వేషించుకొనఁదొడఁగినాఁడు. ఈహేతువాదములు నీ గూఢార్థప్రతిపత్తులు నెవనికిఁగావలయు! నా బాల్యమున నాతండ్రి యిచ్చవచ్చినట్లిచ్చివేసిన రాజ్యం బేమార్గముననైన నేమి మరలసంపాదించి కాపాడుకొనుటయే నాకర్తవ్యము. నమయోచితపథముఁ దొక్కి యెట్టెటో నష్టద్రవ్యమును మరల గ్రహించితి. క్షత్రధర్మము ననుసరించి నన్ను గెలిచి ధరణీభాగము గైకొనవలసినదే కాని యిన్ని కుతంత్రములేల? ఇన్నివార్తలేల? ఇందఱువార్తావహులేల? రాజ్యము వీరభోజ్య మనియెఱింగియు నిట్టివ్యాపారములేల? ఎట్లయిన నీ మాయదారిని నేర్పుమెయిఁ బరికింపవలసినదే. ఈతనిప్రతిపదమును బరిశీలింపవలసినదే. నాయింటికివచ్చి నాయాహ్వానమంగీకరింపకున్న మానెఁగాని నను నెంతచిన్నఁబుచ్చినాఁడు! ఇంకేమేమి సేయునో!

ఇట్లెంచుకొనుచు దుర్యోధనుఁ డెంతయు సంక్షుభిత చిత్తుండయ్యెను.

## రెండవ ప్రకరణము

## ( iii )

విదురునింటఁ గృష్ణుఁడు. కృష్ణవిదురులసంభాషణము. కృష్ణుని రాయబారపుఁబ్రయోజనము. తత్పరమార్థము.

విదురునియాతిథ్యంబునఁ బ్రముదితచిత్తుండగుకృష్ణుండు రాత్రిభోజనానంతరము మృదుశయ్యం బరుండి తనసమీపముననే వేఱొకయాసనముపైఁగూర్చున్న విదురునితో సముచితసంభాషణంబుల నెఱపుచుండెను.

విదురుఁడు:—వాసుదేవా, ఇప్పటినీరాకకేమిప్రయోజన ముండఁగలదా?

కృష్ణుఁడు:—ప్రయోజనమే లేకుండునా?

విదురుఁడు:—నాస్వల్పబుద్ధికిఁ బ్రయోజనము యోజనమాత్రమునైనఁ లేదు.

కృష్ణుఁడు:—అనఁగా?

విదురుఁడు:—దుష్టుండగుదుర్యోధనుండు నీకఱపుహిత మావంతయు విననొల్లని దురభిమానఘనుఁడు.

కృష్ణుఁడు:—ఆతనిప్రకృతి కనురూపంబుగ గుణ మదియే కదా.

విదురుఁడు:—ఇంతయెఱింగియు నేలవచ్చితివి? నీవు నమ్ముమని చెవింబెట్టినంతనె ధార్తరాష్ట్రులందఱుంగూడి నీశాసనముల్లంఘింపనిశ్చయించినారు. పాండవుల కేమాత్ర మీయకుండ నరసినంతయును నీగువోవనుండఁ దార యేలుదురఁట!

కృష్ణుఁడు:—అయిన నేమాయె! ధార్తరాష్ట్రులు పాండవులకు నేల నేల యొసంగుదురని నే ననలేదె!

విదురుఁడు:—ధార్తరాష్ట్రులకు సాయముసేయవచ్చినవారు గూడ వారింబోలినవారలేయఁట వారేమియు న్యాయములు పలుకఁదలంపరు. ధర్మజుదిగ్విజయంబునాఁడు పాండవేయులచేభంగపడి పగసాధింపఁ దలఁచియున్నవారును, ఒకప్పుడు నీయెడ శత్రుత్వంబుపాటించినవారును, ఈవలఁ బ్రాగ్జ్యోతిషము మొదలావల నాభీరమునకునుగలభూపతులందఱును, రారాజుపక్షమున నిపుడువచ్చినిలచి కర్ణునితో నేకార్థసముపేతులై సంగరమొనర్చి గెలుతుమొండె: చత్తుమొండె: వేఱొండు లేదనునిశ్చయమనస్కులైయున్నవారు. పెచ్చుపెరిగివచ్చుసైన్యంబుజూచికొనియును, భీష్మద్రోణులలావునమ్మియుఁ గర్ణువిక్రమంబువిశ్వసించియు, దుర్యోధనుండు గండుమిగిలియున్నవాఁడు. కావున సంధియెంతమాత్రముఁగాఁజాలదు. తమ్మెఱిఁగి యెవ్వరి నెఱుంగఁజాలని మూఢులనడుమ నీవు రేపటిదినమ్మునఁ గూరుచుండుటయు

మునువెను లాలోచింపక మూర్ఖతమెయి మృత్యుముఖముం జొచ్చుటకుం తేని యుద్రేకించుచుండ నాయుద్యమమునుండి వీరినిమందలించుట యధికతరధార్మికవృత్తి యని యెంచి వీరికి ధార్మికనైతికసంబంధము నెఱుకపఱచి చూచెదను. వారద్దానియెడ నంగీకారముసూపిరయేని వారికిని వారివారికిని బ్రదుకుఁదెఱు వేర్పడును. నాప్రసంగంబునఁ గౌరవులదుర్వ్యాపారంబునకుఁ గురువృద్ధులమనంబు లెరియవె? పాయమె వర్పవచ్చినరాజలోకముగూడ నాధార్తరాష్ట్రుల దెసననూయం జెందదె! పాండవుల యెడ సానుభూతియుఁ నక్కటికమును బొడమవె! మానవుఁడు పున్నెమొ, పాపమొ యొనర్చుచునే యుండును. అట్లొనర్చుటయుం దాతఁ డొకింత లోఁగిఁ దప్పినను, ఆ పరిణామఫల మాతఁడొందుననియే ధర్మవిధిజ్ఞులు నుడువుచున్నారు. మఱియుఁజుట్టాలలోఁ గలహముపుట్టి వారు చెడనున్నసమయమున వారితోఁ బోరిరియైన వారి జగడము నుడుపఁ బ్రయత్నింపకున్నవాని నెంతయుఁ గ్రూరకర్ముఁడని కర్మకాండవిదులు నిర్వచించుచున్నారు. కావున నీ రెండుతెఱంగులవారికిని సంధి గావింపఁ బ్రయత్నముసేసెద. ధర్మార్థసహితంబైన తెలుఁగుమాటలు మంత్రిజనసహితుండైన సుయోధనునకుం జెప్పెద. తనకును బాంధవజనములకును లోకంబునకును హితంబయినవిధంబు వంచనలేక చెప్పెదునన్ను—పాండవులవాఁ—డనిశంకించి యతఁడు నామాటవినండయ్యెనేని మే లగుఁగాక. ఇట్లువొచ్చిచెప్పకున్న 'నన్నదమ్ములు తమలోనంబోరఁ గృష్ణుండు వారింపక యుపేక్షించె. తనచేతఁ జక్కంబడదా' యని యజ్ఞులైనజనులాడుదురు. సమరంబెయనివార్యంబైనఁ గౌరవ్యులసంగ్రామసంరంభంబులును, సమరసన్నాహంబులును గుర్తించి పోయెద: ఇంతకన్న నింకేమికావలయు!

విదురుఁడు:—నీయూహలును నీ దూరాలోచనములును అప్పదాదులకు దురూహ్యములుకదా! మధుసూదనా, నీ నిద్రించుసమయమైనది. నేఁబనివినియెద.

అని విదురుఁడు కృష్ణునను మతివడసి తనపడకటావుం జేరికొనియెను.

---

## సింహావలోకనము

కృష్ణా, తనకష్టములు నీతోఁ గలియఁబోసికొని, సంగ్రామంబు గాకుండఁ దనకర్థసిద్ధివొడమునట్లు, సంధికార్యంబు కావలయునని ధర్మజుఁడు నీతోఁ బ్రసంగించునపుడు నీ సంధిప్రయత్నపరమార్థముం గూర్చియేమని యాతనితో నాడితో, యావిషయమే మఱింత మెఱుంగువెట్టి యిప్పు డీవిదురునితోఁగూడ నంటివి. నీపలుకులవలన

నొక్కటి విస్పష్టమగుచున్నది. సంధియగుట కెంత పురుషకార
మొనర్పవలె నంతయు నొనర్చను, సంధియొనఁగూడక సమరమే సం
సిద్ధమైన నందుకువలయు తెఱంగులం బట్టినను దలంచినాఁడు. కౌరవపక్ష
మున నడువనచ్చినవారియుల్లములెల్లఁ బాండవపుణ్యమే వాలినట్లుఁ
బల్లవింపఁజేయుచున్నాఁడు. లోకాన కా కౌరవ్యులనుచు నసూయయు
నేనయుఁగలుగఁజేయుచున్నాఁడు. నీవే కార్యమున కెన్నుకొనుగార్యకౌశ
లముగలిగియే తదాచరణమునకుఁ గడంగుచున్నావు. కార్యపర్యవసాన
ముంజూచి, కార్యాచరణమునట్లసంకల్పమునారోపింపఁబోవువారివివేచ
నా పరిజ్ఞాన మెంతయు ననభిమతము. ధర్మజుసముఖమునను, విదురు
నెదుటను, నీనుడివిన పలుకులె నీమనోగతవిషయములకు ముకురఫలక
ములై నెగడుచున్నవి కావా! ఇంకేమినవలయు నీపథముగురుతింప!

ఇంత తెలియక సంధియొనఁగూడఁ దగదనియు, సంధి కారా
దనియు, యుద్ధమే కావలెననియు, నీవు మనసారఁగోరియె యీయాకలిపురి
కరుదెంచితివని యనువారి నేమనవలయు!

---

## రెండవ ప్రకరణము

### iv

విదురునింట మఱునాటియుదయమున శ్రీకృష్ణుండు కృతవర్మతో వివిధ
విషయంబులం బ్రసంగించుట. యదువంశచరిత్రసంగ్రహము. దుర్యోధ
నాదులు శ్రీకృష్ణునిఁదోడ్కొని కురుసభకు వెడలుసన్నాహములు.

కృష్ణుండు సుఖనిద్రం జేసినాఁడు. విదురునింటిముంగల దుర్యోధనునానతి
మాగధమంగళతూర్యారావంబులు చెలంగుచున్నవి. సహానుభావుండును, బరమయోగీం
ద్రుండును నగునవ్వాసుదేవుండు ప్రభాతంబున నెమ్మిన్ మేల్కాంచినాఁడు.

కడచినరేయిఁ గృతవర్మయింట నాతిథ్యసత్కారముల నందినసాత్యకి
యుఁ గృతవర్మతోఁ జెండలకడ విదురుసదనంబునకువచ్చి కృష్ణునకుఁ బొడసూపెను.
తగినయాసనములు దెప్పించి వారినిఁగూరుచుండఁజేసి శ్రీకృష్ణుం డపుడు వివిధవిషయ

ములంగూర్చి ప్రసంగంబులు నెఱపుచుఁ గృతవర్మ నుపలక్షించుచు, నాతనితో నిట్లనియెను. "కృతవర్మా, మరల మన మెన్నిదినంబులకుఁ గలిసికొంటిమోయీ! ధర్మజు ధర్మమున నేనీపురమునకు రాఁ దటస్థించుటం జేసి నినుఁ గలిసికొనఁ గలిగితిని.

"తొల్లి మనవంశకర్త యగు యదువు తన తండ్రియగు యయాతి కోరికఁ దీర్పఁజాలకపోవుటను జ్యేష్ఠుండయ్యును, రాజ్యాభిషేక మొందఁజాలకపోయెను. యయాతి యీ భరతసామ్రాజ్యమునంతయు తనకనిష్ఠపుత్రుఁడగు పూరునకభిషేక మొనరించుట నాతఁడు జాలకాలము దేశములఁ ద్రిమ్మఱవలసివచ్చినది. పూరునకు రాజ్యము లభించుట నాతనివంశమువారె చక్రవర్తులైనారు. అనంతరము కొన్నితరములు గడచినపిదప మన వంశమున నప్పటికిఁ బ్రాముఖ్యత వహించిన మన పెద్దలు కొందఱు యమునాతీరమున నున్న మధురానగరము నాక్రమించుకొని స్వతంత్రరాజ్యస్థాపన మొనర్చి ప్రభుత్వ మహత్వ మొందినారు. అందు ప్రధానుఁడు మాధవుఁడు.

"కృతవర్మా, మనలో యదువృష్ణిభోజాంధకకుకురనల్లమతభేదము లెన్నియున్నను మీభోజకులులే కడ ప్రభుత్వగరిమ నొందినారు. యదువంశోద్ధరణార్థము మామందఱము నేకీకృతమనస్కులమై పాటుపడవలదా? మనలో మన కెన్ని భేదాభిప్రాయములున్నను స్వవంశమునకు దుర్బలము నాపాదింపరాదుకదా! కృతవర్మా, నీయట్టివిలుకాఁడు, మనవంశోద్ధరణమునకు సంబంధములేని యీకురుపాండవసమరమునఁ జోక్యము కలుగఁజేసికొనుట యసమంజసము కాదా! ఇరువాఁగులవారును నాసాయముఁగోరినను, నిరస్త్రపాణినై వచ్చితిఁగాని యొకరిపక్షమున నింకొకరికెదిరిగ నస్త్రముఁబూని నిలువలేదే! అస్త్రపాణినైన నీవుగాక మనలో నింకేరును ఈయన్నదమ్ముల గీసులాటలో జోక్యము కలుగఁజేసికొనలేదే! యదువీరులసంఖ్య నశింపకుండుటకె కదా, యదుప్రముఖులు సురక్షితముగనుండుటకె కదా, యనుజులమును బరిరక్షణ మొనర్చుకొనుటకె కదా, నాయన్న యా బలరాముండును, నాకొమరుఁడా సాంబాదులును, నీకురుపాండవసంగ్రామరంగంబున నేపక్షమునం జేరక, తటస్థులై యుండుట. యదువీరులలోఁ బ్రధానపురుషుండవును, మేటివిలుకాండ్రకెల్ల గండుమగండవును నగు నీవే యిట్టుల నీరంగంబున కుఱుకుట స్వకార్యవినాశహేతుభూతము కాదా! మనకున్న పనియేమి? మనమిపు డొనర్చుచున్నదియేమి? స్వవంశోద్ధరణదీక్షాదక్షుండవగు నీవు, స్వకార్యవిధ్వంస మొనరించి, స్వకులవినాశహేతుభూతమగు యుద్ధమునఁ జొఱఁ దలంచుట యీ సమయమున మన కొప్పనిపని.

ఈ యసురసంప్రదాయకులమూలమున మనకేల యీ బాములు. నీయట్టి

వాని కింతకన్న నే నేమి చెప్పఁగలను! మనబలము నశియింపని విధమునఁ బ్రవర్తింపు టయే మేలు." అనియిట్లు కృష్ణుఁడు భావగర్భితప్రసంగంబుల నెఱపుచుండెను.

అంత వేఱొకచోట జనకునాజ్ఞను దుర్యోధనుం డంపికొనంపనుమందిరమున నంపనంపమునకు స్వాగతంబొసఁగఁగలయను నిస్తులవస్తుసంతానంబు నేకరించు కర్జంబునఁ దగినవారిని నియోగించి కొలువుకూటంబునకుం గృష్ణునిఁ గొనిరాఁ గురువృద్ధులను దన యనుజతనుజమిత్త్రామాత్యవర్గంబును వెంటఁబెట్టుకొని వైభవంబు మీఱ విదురునివసనంబునకు వచ్చెను. కర్ణశకునిదుశ్శాసనసహాయుఁడైయున్న దుర్యోధనుండు శ్రీకృష్ణుని దర్శించి ప్రణామంబొనర్చి యాతని దీవెనలఁ బడసి నిలచియుండెఁ, గృష్ణుండును వారి నెల్లర నుచితాసనంబులఁ గూరుచుండ నియోగించి, యుక్తోచితరీతుల వారి నెల్లర నాదరించెను. దుర్యోధనుం జూచి యాతని బాంధవ్యంబును, వాత్సల్యంబునుం జూపు పలుకులఁ బల్కి— యైకమత్యము నెఱపుచు, హితమును ధర్మమును లోకసంగ్రహాత్మత్త్వమును మేళగింపఁ జేసి, తనసహజమృదుమధురనర్మగర్భప్రశంసంభాషణంబులు నెఱపి వారి నానందభరితులుగ నొనర్చి, తనదెసకు వారియాశయంబులు వ్రాలునట్టి ప్రసంగంబులు సేయుచుండ దుర్యోధనుండు నిలచి చిర్నగవున:

—మధుసూదనా, కురుసామ్రాజ్యపట్టభద్రుండను బంధుమిత్త్రాది
సమస్తపరిజనసమన్వితుండనయి పేరోలగంబుండి నీయాగమనంబున
కెదురుచూచుచున్నవాఁడ నిరామయుని నీసమక్షమున కనిపె – ననిరో.

కృష్ణుఁడు:—అవశ్యము బయలుదేరుదము గాక.

అందఱును లేచి నిలిచి బయలుదేరు సన్నాహములనుండిరి.

# మూఁడవ ప్రకరణము

## ( i )

శ్రీకృష్ణుఁడు కురుసభకేగుట; సభావర్ణనము; మునులరాక; ధృతరాష్ట్రు నుద్దేశించి కృష్ణుఁడు చెప్పిన ఆరంభోపన్యాసము; సభాసదులనుద్దేశించి చేసిన అర్థవాదము; దుర్యోధనునకుఁ జూపిన ఉపపత్తులు; కురువృద్ధులకుఁ జూపిన తనవాదమునందలి అపూర్వత; సభాస్థారులకుఁ జూపిన ఉదాహరణములు: ఉపసంహారము.

మంగళవాద్యములు మిన్నుముట్టుచుండెను. గరుడధ్వజంబు ముంగలఁగాఁ, ఛత్రచామరప్రముఖభద్రచిహ్నంబు లలర, సాత్యకికృతవర్మలరథం బొకప్రక్కను, కర్ణశకునిదుశ్శాసనదుర్యోధనులరథం బొకచక్కిఁ బదనఁ శ్రీకృష్ణునిరథంబు రాజమందిరాభిముఖముగ నడువఁ దొడంగెను. గోపాలసందర్శనలాలసులై నగరిపురజను లాబాలగోపాలమును రాజమార్గమునఁ గిక్కిఱిసి వెల్లివెల్లిగ నడుచుచుండిరి. పౌరులకు నేత్రోత్సవముగ నయ్యరదంబులు సనిసని రాజమందిరము సమీపించి సింగంపుమొగసాలఁ జేరనరిగె. జనార్దనుండు రథావరోహణ మొనర్చెను. అప్పటి యుఁకివునకుం గొలువువారెల్ల నత్యుత్సుకులై యచ్యుతునిరాక కెదురుసూచుచుండిరి. ఎదురు వచ్చినవిదురు నందిచ్చుకరమును, పమ్ముచేయును, తన రెండుచేతులం బట్టి యయ్యశోదానందనుండు కొలువుకూటముం జేరనరుగుచుండ, ముందలగదియుసందడిని కర్ణదుర్యోధనులు దొలఁగఁజేయదలంచియు కృష్ణుఁడేమనుకొనునోయని యట్లొనర్పకుండిరి. కృతవర్మాది యాదవులులోనగాగల యభ్యంతరులైన బలుమానుసులు కృష్ణుని బొదివికొని సభాభవనంబునకు మార్గంబుజూప నయ్యదుకులశేఖరుండును గొలువుకూటమునం బ్రవేశించెను. బాహ్లీకభీష్మాదిరాజబంధువులొకప్రక్కను, ద్రోణాచార్యాద్యాచార్యవర్గ మొకదిక్కునను, కృతవర్మాదియాదవులొకవంకను, బారులుగఁదీర్చియున్నసభామధ్యంబునకు శ్రీకృష్ణుం గొనిరా నాతండును పనకని సిద్ధముగనున్న కనకమణిమయోన్నతపీఠరాజంబునఁ గూరుచుండదలంచి యెదుటం బొడసూపిననారదాదిమునిముఖ్యుల నవలోకించి ముందుగ వారికి నర్ఘ్యపాద్యాదివిధు లొనరింపఁజేసి వారాసనాసీనులగునంతకు వారికిఁ బ్రణమిల్లి తానుపవిష్టుండయ్యె. ధృతరాష్ట్రాదులు నారదాదులకు నమస్కారములుసేసి తమతమయాసనములపైఁ గూరుచుండిరి. దుశ్శాసనవివింశతులు గొనితెచ్చినగద్దియలపై సాత్యకికృతవర్మలు కృష్ణున కిరుదెసలం గదిసి కూరుచుండిరి. చేరువ నొకగద్దెపైఁ గర్ణదుర్యోధనులును, వెన్నునివెనుకదెసఁ గరంబత్తు

మఱియొక మణిమయపీఠంబున విదురుండును, గూరుచుండిరి. ఇట్టి నిండుపేరోలగమ్మున నీలనీరదనిభశ్యామలకోమలగాత్రుండును, కమలదళసదృశవిశాలవిలోచనుండును, శాంతగంభీరసుందరవదనమండలుండును, పీతాంబరధరుండును నగు శ్రీకృష్ణునిఁ జూడఁబడసిన లోచనయుగమ్ముకదా లోచనయుగమ్ము! కొలువునంగలవారందఱును గాఢపుముఖారవిందవీక్షణలోలుపతఁ దన్మయత్వం జెందియుండిరి. శ్రీకృష్ణుండు నిలిచి సభ్యులకు నమస్కరించి జలధరధ్వానగంభీరంబగు నెలుంగున నిట్లు చెప్పనుపక్రమించె.

సామ్రాజ్యవిభూతితో నున్న కురుకులపతీ, నే నిపుడు నీకడకు యాచకుండనై వచ్చితిని. భారతభూమికి వీరభిక్ష నిడుమని ప్రార్థింప వచ్చిన యాచకుఁడను. కురుపాండవపక్షములనున్న వీరాధివీరుల నింక నుగొంత కాలము బ్రదుకనిమ్మని ప్రార్థింపవచ్చిన యాచకుండ. అంతేయకాని యీవచ్చియున్న నారదాదు లనుకొనినట్లు నీతులుగఱప వచ్చినవాఁడనుగాను. హితబోధ కొందఱిపట్ల నుపకరించియు, మఱి కొందఱిపట్ల నుపకరింపకయు, బోధనయధికమైనకొలఁదియు మూర్ఖతయు, నమానుషచర్యయు, నధికమై తుట్టతుదకు బోధకునిబంధింపఁ జేయుటయో, బోధితునే ప్రమాదము నొందింపఁజేయుటయో నే నెఱుంగనివాఁడనుగాను. పుట్టువుతోడనే హితాహితములను నయానయములను బరిశీలింపఁగల సమర్థుండగువాని వివేకము, హితబోధనమున మఱింత మెఱుంగువెట్టఁబడి తేజఃపుంజమై వెలుంగఁగలదు. ఇంతకును హితబోధచేయుదమన్నను రాజేంద్రా, నీవెఱుంగని ధర్మము లేవికలవని నేనూహింపఁగలను! ఒకకుదుటికి చెందియున్న మీరెండుశాఖలవారిలో నెవరు శాపథమువట్టినను దానవచ్చు న్యూనత ననుగూడఁ జెందఁగలదని యెఱుంగనివాఁడనుగాను. పాండుమహీపతియు నీవును సభ్రాతృభావమున, నేయభిమానమున, నేవాత్సల్యమున నుండిరో ఆవిధముననే పాండవేయులును, ధార్త రాష్ట్రులును, నుండుటతగును. చిన్నవాఁడయ్యును పాండుఁడు విధివశముననుగాలవైపరీత్యముననను మున్నె కాలధర్మమునందెను. నీపుత్రులను పాండుపుత్రులను సమముగఁజూచుకొనుస్వభావముకలనీవుంటివికదా

యని లోకులును ఈసామంతరాజులును నేనునుంగూడఁ గొంతయూఱట నొందితిమి. నీపుత్రు లవినీతులనియు ననలేను. పాండుకొమరు లధర్మపరులనియు ననలేను. ఇందెవ రవినీతు లైనను అధర్మపరు లైనను ఆయప్రతిష్ఠ నాకును జెందునదగుట నట్టిది విననైననోప. పుత్రవ్యామోహమున నేదియు నీవునిశ్చయింపఁజాలకున్నావని నేనెఱుంగని వాఁడగాను. మాకెల్లరకును గురుస్థాన మనఁదగిననీవిట్లు నిట్టిపుత్రవ్యామోహదోష మారోపింప నీప్రజలకే కాక, నాకునుమనసురాకున్నది. విపినతుల్యమగుధార్తరాష్ట్రులయండ లేకున్న సింహములవంటిపాండుపుత్రులుబయల్పడి సురక్షితులు కానటులఁ బాండుకుమారసింహపరిరక్షితముకానిధార్తరాష్ట్రవనమును జెడఁగలదు. సహాయమును సంపదయును అన్యోన్యాశ్రయములు కావా! అట్లగుట, నీసంపదననుభవింపందగు నాపాండవులనుగూడ నీయండనుండఁజేసి విడువదగని వారిసహాయము నేల వీడవలయు?

—ధృతరాష్ట్రుఁడు—

యదునందనా, రూపొందినపరమాత్మవగు నీయడుగుదామరలు సోఁకుటను మారాజ్యమును గులమునుం బవిత్రమైనవి.

కాలమంతయుఁజీఁకే, చేయునది లేక, ధర్మజయతి యని దినములు లెక్కించుకొనుచున్న నాకు నీయాజ్ఞ నెరవేర్పఁగలుగునంతటి భాగ్యమా! నాకొడు కవివేకి: భుజబలప్రధానులౌకర్ణదుశ్శాసనులు వానికిఁబ్రధానులు: అహంకారమును దుర్మానమును వానికిఁబ్రధానగుణములు: పశుబలముపై నాధారపడుట వానికిరానైయున్న ప్రమాదమునకుఁ బ్రధానచిహ్నము. ఇట్టిపట్టుల నే నేమియొనర్పఁగలను?

—కృష్ణుఁడు—

నీచేయఁగలయవి పెక్కులున్నను అంబికేయా, నేనేమియొనర్పఁగలననియూ యంటివి! నీయధికారము చెల్లుచుండ, నీప్రజలలోనీకుటుంబములోఁగలఁకపుట్టినపుడు, నీవు కాకున్న నింకెవ్వరు దీర్పవలంతురు?

భరతకులంబు సకలధర్మసంస్థానమని పేరెన్నికఁ గన్నది. అందు నీవును, నీతమ్ముండును సద్గుణోత్తరులరు. నీతనయులు యశోధురంధరశుభశీలురు. నీనాఁడీపావనవంశంబునకుఁ గళంకము కలుగరాదు. ఈవంగడంబున కీవుమూలకందమనగుట నింపెవ్వారి చందంబు లెట్లు వర్తిల్లినను, మంచిచెడ్డలు తుది నిన్నుం జెందును: గావున, మంచి నెంచి, హానిపొత్తును వెలిపృత్తమును జనస్తుత్యములుగావించి కార్యంబు సక్కఁ జేయుము. కౌరవపాండవులొక్క టెఱవొంది శాంతత నొయినుంట నాకును నీకును ఈ వచ్చియున్న నృపకోటికిని సమస్త వసుంధరకును మేలయ్యెడు. ఘోరితమైనచో నిర్ముల్యాతలమ్మువకల్ల మహాపదదాఁపురించును. కావున నీవించుక యోజించి, కరుణించి, సంధియొనరింపుము నీవు చేయఁదలంచితేని వీరినిఁ జేర్చి, వారిం జేర్చి కూర్చిన నేసౌఖ్యముఁ నొందఁగలవు. అట్లుఁగాక ఘోరితఁ పుట్టూహా యే నీకు బలవత్తరమైనచోఁ గీడొక్క కౌరవులకె కాదుసుమా: బాగుగ నాలోచించినచో భారతభూమి నిర్వీర్యమై, కాలకాలములపర్యంతమును దేజోవిహీనమగు; అస్త్రవిద్యయునడుగంటునుజుమ! చివరకు నీవును నీవారును దుఃఖించి, దుఃఖించి, యాకసము దెసఁజూచుటయె తటస్థించినచో, నపుడు మముఁబొంగ్లిమియుఁ జేయుజాలమినె కదా యిపుడె 'యింతదూరము' చెప్పవలసివచ్చుచున్నది. యుద్ధమునకు సిద్ధముయియున్న మీయిరువాఁగులవారిలో నావఱఁగలభీమార్జునులం బోలెడుపోటరుల నొదటనిందుఁ జూపఁగలము? ఇందుఁగల భీష్మద్రోణుల శ్రేణిసేయంగలవారి నెదట నాదెసం జూపఁగలము! భండన పాండితిమహిమాన్వితులును, విక్రమాఢ్యులును, బాహుగర్వదుర్వారులునునగువారిని వీరినింగూడ బవరంబున దిగమ్రింగికొనుటకంటె, వీరందఱును నీబలంబులై నీకడనఁగూడియుండుట నీకు వాంఛనీయము కాదా! ఇంతటిశూరాగ్రేసరులు నీకుఁబాసటలై, అంగరక్షకులై, నీ విడుకూడుఁగుడుచుచు, నీచరణపీఠమునుగొలుచుచుండ, నీవ ధరణీ

చక్రమేలుటనంగీకరింపవే! నీప్రాభవమును నీతియు శాంతియు జగంబులు వొగడునట్లొనరించుకొని, తండ్రినచ్చినబిడ్డలగు పాండవుల నెంతయునరసి బాల్యమునుండియుఁ బ్రోచినవాఁడవు, నడుమ నిష్కారణముగ నీగతి నిపుడు దిగవిడచుట నీకుఁదగునె! నీకుఁబరమభక్తిం బ్రణమిల్లి వారందఱునొక్కమాటగ నీతోఁజెప్పుమని నాతోఁ ననిన పలుకులువినుము:—

తనయాజ్ఞను బన్రెండుసంవత్సరంబులు విపినంబులఁజరియించితిమి: పదమూఁడవయేట జనపదంబున నజ్ఞాతంబుసలిపితిమి మాతండ్రిసమయంబుపరిపాలించి, మే మర్ధరాజ్యం బెట్లునుంబడయుదు మని కృతనిశ్చయులమై యన్నియుంబడితిమి. తల్లియుఁ దండ్రియు, నెల్లచుట్టంబులు నేడుగడయు మాకుఁ దాన. మావలన నేరము గల్గిన నిట్లుగా దట్లని మముఁజక్కఁజేయుభారము తనయది. నేర్చినను నేరకున్నను బుత్రులను జనకులు విడనాడరుకద! ఏదియెట్లయినను దనగలపదివేలేండ్లకుం దన్నుగాని యన్య మెఱుంగము. మే మెట్టివారమైనను మమ్మును దుర్యోధనాదులను ఒక్కరూపున మనుపఁదలఁచినచో, కులధర్మంబు చెడకయుండు. పాపముచే ధర్మమును, బొంకుచే సత్యమును, చెడనున్న సమయానఁ జక్కఁబెట్టఁగల సమర్థులైన పెద్దలుండియు నెఱింగియు నుపేక్షచేసినచో, నదివారికే చేటొదవంజేయునుగాని ధర్మనిస్తారకమై సత్యశుభదాయకమై విజయమూలకమైన దైవమొండు లేకపోలేదు.
——అనికూడ నిందుఁగూడియున్న యెల్లరకుం జెప్పు మనిరి.

కావున నోకౌరవేశ్వరా, యిపు డీపాండుకుమారవరులసందేశముంగూర్చి యీరాజులును పండితులును మునివరేణ్యులును, యేమని యెద రనుందు; ఇంకను గార్యము తీరుటకుఁ దడవు మఱిలేదు.

ఏనుధర్మంబును, నీతియునుముందిడుకొని మనోవాక్కాయంబుల నైక్యరూపంబె సత్యంబనినమ్మి యింతదూరంబుచెప్పితిని. ఇత్తెఱంగె మీకుమేలు. మీరు క్రోధమానమత్సరంబులు వీడి, రాజ్యంబు పంచి, పాండుభూపాలుపాలు వారికిచ్చివేసి మీరందఱును నేమమున బ్రదికియుండుటకంటె ధర్మమైనదియు, సముచితంబైనదియు నగువిధ మింకేదికలదొ యిదుఁగల వాక్యవిదు లానతీయఁదగును. ఇటుఁ

గాక నీవంతును నీతమ్మునివంతును నీవ యాచికొనఁ దలంపుఁగొంటేని రాజ్యలుబ్ధతచే, వంచనమార్గమునఁబోయి; జూదపుసిరి యనుభవించు చున్నదోసమును, అప్రతిష్ఠయు నాచంద్రార్కముగ నిల్చియుండఁగలవు సుమీ! ఇంతకును నయ్యజాతశత్రుని ధర్మపరాయణతయును, నీతిపరత్వమును సత్యనిష్ఠయును నీ వెఱుంగనిదికాదే! ఇఁక నీ కొడుకులమాటఁ దలంచుచున్న (దుర్యోధనాదులఁ జూపుచు) వీరు సమర్థులుగాక, కార్యము లొనర్పక, మనోరథసిద్ధి నొందఁదలంతురు; తమవంశ గౌరవమునకిది తగినవర్తనము కాదనియైన నెఱుఁగక పలుకుప్రల్లదనముచే బంధుకోటిమనములు కలఁతపొందఁ జేయుట కేమాత్రమును దలంకరు; తమయవగుణంబులఁ గుంభములోఁ బెట్టరు. కావున నో రాజేంద్రా! యిది యంతయు, నెంతయు యోచించి మఱియుఁ గార్యమునకుఁ గడంగుము. అప్పుడు బొందొనఁగూర్చుతలంపు నీకు నిక్కముగఁ గలదేని, నీవు చేయలేనిదికలదే! నిన్నడ్డువారును గలరే! నీవశమై నీవాచరింపక తీరనిపని యొకనినీవుపేక్షించినచో, అకార్యాచరణమువలనిదోసము నీకు గలుగుఁ గనియెంచుము. తండ్రివగునీవు సజీవుండవగుట, నీకొడుకులు నీయండనుండి వారికిఁగావలసిన కార్యములు నీకిష్టమున్నను లేకున్నను నీచేఁ జేయించుకొనుచుండ, జనకవిహీనులగుటఁ బాండవులు పరులపాలుకావలసినదే నా? పాండురాజు జీవించియుండెనేని, యింతలు వాటిలునా? నీ కొడుకులకు కొక్క నీసహాయమేకాని, సచ్చరిత్రులగుపాండవులకు సకల లోకసహాయమున్నదసుమా! సంఘసహాయము నెదుట, వ్యక్తిసహాయ మక్కఱకురాజాలదని నీవెఱుంగనివాఁడవే! ఇఁక నయ్యజాతశత్రుం గూర్చి తలంచుచున్న నాతఁడు నీచే ననుపదిష్టుఁడై యింద్రప్రస్థంబుననుండియు, నీకుఁ బేరును బెంపును గూర్చుటకై పరరాజుల నెల్లర నోడించి, వారలు నినుఁ గొల్చునట్లొనర్పఁదలంచి, పూనికతో దిగ్విజయ మొనర్చినాఁడు! అతఁడట్లు మహావిభూతితో నుండుట నీసుతుండును మంత్రివర్గంబునుగని యోర్వఁజాలక, శకునిచే జూదమాడించి పాండుపుత్రుల

సంపదయంతయునాచికొనియు, నంతతోనాఁగక, అమానుషమనియైన దలంకక, ద్రుపదాత్మజనానాఁడుభంగపెట్టుట నీవెఱింగియు నీవారిని వారింపక నివ్వొడంబడుటయు లోకమెఱుంగకపోలేదు. అట్లయ్యును ధర్మరాజుండు సత్యముంబూని నీసభనుబుట్టిన యమానుష కార్యములకు దుఃఖించుచుఁ గన్నీటి నరచేతనొత్తికొనుచు సోదరులతో, భార్యతో, న్యగ్రాటవులకుంజని, కడుఁబడుములువడియు, మరలమీతోఁగూడిమనఁ దలంచినాఁడు. ఇంతకునునయ్యజాతశత్రునిచిత్తశాంతతయు, వినయంపునడవడియు, సహనంపుగౌరవమును, ఔచితినెఱుంగువివేకమును ఇంకేనరపతులందైనను గనఁగలమే! నేనింతాడుట నీమనమునకు వెగటుగఁ దోచినఁ దోఁచుఁగాక! పాండవులయెడ నిదివఱకే తామారోపించినయసమర్థతను అశక్తిసి యీనారాకచే నిపుడునిజముఁగా సమర్థించుకొను నీకొడుకులయవివేకము మఱింత పెరిఁగినఁ బెరుగుఁగాక. నీకు సమానప్రేమాస్పదులగు పాండుపుత్రవర్గమునకును, నీపుత్రచయమునకును హితముకోరియె యింతదూరము చెప్పసాహసించితిని. కావున నీసూనుని యతిలోభమాత్సర్యములను మాన్పి పాండవులం దెచ్చి నీయండనుండఁజేసి నీవుశాశ్వతకీర్తినొందుము. నీపుత్రులకసమానసంపద నొనఁగూర్పుము. ఒక్కత్రుటికాలమున రానున్నవినాశమునుండి భరతభూమిని దొలఁగించి లోకకళ్యాణ మొనఁగూర్పుము. మఱొక్కమాట: —

పరస్పరమైత్రిగల నీతిధర్మములు ప్రత్యేకప్రత్యేకములయ్యును సమముగ నడిపించుకొనఁ దమవివేకముతోఁ జర్చించి చూచుకొను సామర్థ్యముగలపాండవులు, శాంతశూరులగుపాండవులు, నీచరణయుగళముఁ గొలుచుచు నీపదదాసులై యెప్పటియట్ల, నీవలనఁ బుత్రవాత్సల్యతనొందఁ గోరికవడియున్నారు. నేటిదనుక, నీయుపేక్షా కారణమునను, నీకొడుకులమూలమునను, వారికిఁగలిగినయగచాట్లెల్ల మఱచిపోనున్నారు. ప్రీతిమెయి నీవిడుపట్టెడోగిరము నీచరణసన్నిధిం

గుడుచుచు, నీసేవలఁ జేసికొనుచు, నీకనుసన్నల మెలఁగుచు నుండుట కంటెరక్తపాతమువలనఁగలిగినపక్వాన్నమునైననొల్లమనుచున్నారు. అటుగాదని, నీ వలనాఁడు వారల నడవులకనుప నెట్టియనుజ్ఞ నొసంగితివో, యట్టియనుజ్ఞయె నేఁడును నీ వొసంగితేని, తప్పనిసరి యగుటఁ బోరికిం దలఁపడుదురు. కావున నీయిరువెలుంగుల నెయ్యది నీకుఁ గీర్తిప్రదమును, లోకమునకుఁ గల్యాణదాయకమును నగునో యీ నయకోవిదుల నడిగి తెలిసికొని, సువివేకముతో మేళగింపఁజేసి, తగినరీతిని వారల కనుజ్ఞనొసంగుము. ఇంతేలునడిచియును, వారు నీమాటజవదాటు నలవాటు కలవారుకారుసుమా!

అని దేవకకొడుకు మిన్నకుండెను.

---

## సభలో గుసగుసలు

"ధర్మార్థకామముల పరస్పర సమన్వీకరణమే యిహపర సాధనమని నిరూపించుచు నెంత యొప్పముగఁ బల్కెనాఁడీ వాసుదేవుండు!"

"అమృతోపమానములై, కర్ణపేశలములై యెంత యింపునింపుమన్న వీతనిబోధనలు!"

"ఇంతినయకోవిదు నింకొకనిని గని విని యెఱుంగము."

"ఇంతధీరుండయు, యింతచనవరియై యిట్లునలుకఁగలిగినవాఁడింకొకఁడుండునా!"

"ఇపు డీతఁడు చెప్పినచొప్పునఁగాక యన్యమింకేది యనుసరణీయమగును!"

అని సభలోనివా రనుకొనుచుండిరి.

---

## పరిశీలనము

కేశవా, ఏమినీవాక్ప్రణీమహిమము! నీప్రసంగమంతయు మూఁడుభాగములుగ విభజింపఁదగినదిగఁ జేసినావు! నీచెప్పఁదలంచినవిషయమున కుపోద్ఘాతంబుగఁ దొలుదొలుత భారతాన్వయము ధర్మమును గరుణయు బాడియు సత్యమునుగలది యని లక్ష్యములంజూపి గ్రహపఱచినావు.

పాండవులతో సంధిసేసికొనుట న్యాయమును, శ్రేయోదాయకమును, నని నీయభిప్రాయమును వెల్లడించుటయే నీయుపన్యాసములోని ప్రథమభాగపు సారాంశము కాదా!

రెండవభాగములో ధర్మజుని వినయమును, రాజభక్తియు, వెల్లడించి యాతనికి రాజ్యభాగమిచ్చినచో, ధృతరాష్ట్రునకే ముప్పును వాటిల్లకపోవుటే కాక, యాతనియధికారమే సాగఁగలదనియు, పాండుపుత్రులును, ఆతనిపుత్రులును ఆతని కంగరక్షకులై, కైదండయై యుండ, శత్రుసంహారమును సంపల్లాభమును అతనికిఁ గలుగఁగలదనియు నొక్కి పలికినావు.

ఇఁక మూఁడవభాగములో యుద్ధము తప్పదని యుద్ఘాటించిపలికినావు. నీ వెంతసేపు ప్రసంగించినను దుర్యోధనుని నుద్దేశించి యేమియుఁ బలికినావు కావు. కాని సామోపాయము చెవులకెక్కనియెడ దండమాత్రము ఫలదాయకము కాదనియు, లోభియైన గాంధారేయునకుఁ గత్తిని చూపించినను లాభము లేదనియుఁ దోఁచినందున నీతిగలవాఁడవగుటను శీఘ్రముగ ధృతరాష్ట్రుని కార్యోన్ముఖుఁ జేయఁదలంచి సామ దండోపాయంబుల రెంటిని ప్రధానముగఁ జోడించి, ప్రసంగించినావు. ఇంతకంటె నుపాయ మింకొకటియెడఁ గానఁగనే!

---

కృష్ణుఁడు ధృతరాష్ట్రునితోఁ బ్రసంగించి యూరకున్నంత నటఁ జేరి యుండినఋషులు శ్రీకృష్ణునిపలుకులఁ బలపరుప నారంభించినారు.

పరులయుద్ధతికిఁ జూపోపమిం జెడినదంభోద్భవుండను రాజుచరిత్రము నితిహాసరూపంబున జామదగ్న్యమహాముని బోధించినాఁడు.

ఎట్టివారికిని నిర్బంధవిధానము తగదనియు దురభిమానము తుదకు దుర్దశ నాపాదించుననియు యయాతిచరిత్రంబు సోదాహరణంబుగఁ జూపినాఁడు కణ్వమహాముని.

ఇంకను కొందఱు పెద్దలు నీతిధర్మములను బోధించిపలికినారు.

కృష్ణునిపలుకులకు వశంవదుఁడై, మునులమాటలకు వెఱచి, తనతండ్రి యేమే నిచ్చివేయునను సంశయమునఁ గాఁబోలు గాంధారేయుండు రాధేయుం గాంచి, చేయుప్పళించి నవ్వి—"అంగరాజా! యీమును లెంతవెఱ్ఱులు!" అని మునిపుంగవుల నవలోకించి, పెదవివిఱిచి, వికటహాసంబుసేసి "మునులారా, మును వనవిధి

యేమనిశ్చయించెనో," "యట్టులె యయ్యెడు; కావున నిప్పుడీ వినఁజనిగాని పలుకుల వలన నింకను బనియేమి?" అని తూష్ణీంభావముఁ జూపినాఁడు.

ధృతరాష్ట్రుండమ్మహామునులనుద్దేశించి వారికిఁ గినుకజనింపకుండుటకొఱకు: "మునీంద్రులారా, మీహితోపదేశంబుల-నొప్పున కార్యము నడపింపఁగలయంత శక్తిమా నాకు? నామూలమున మఱికార్యమునడుపమి, నేమిసేయువాఁడ ననిచింతిలు చున్నాను." అని వారితోనని శ్రీకృష్ణనుద్దేశించి: "యదునందనా, నా కిహమును బరమును గలుగునట్టివిధమున నిప్పుడీవు తెల్పినను, తద్విధమున నడుపఁబోయినను నాకుఁజనవు లేరవు లేమి నేమియు సేయనేరకున్నాను. నానందనుండు మందబుద్ధి; దయార్ద్రచిత్తుండవును, మహానుభావుండవునునగు నీవు వారానిచ్చుట్టమవు. నాకొడుకు నెట్టులైన నీహితోపదేశములచే ననునయించి, బుద్ధులుచెప్పి, మిత్రకార్యముఁదీర్చు కొనుభారము నీవవహింపుము." అని యనెను.

—కృష్ణుఁడు—(తనలో)

ఔరా యేమిమాటనేర్పరితనముఁ జూపుచున్నాఁడీ కురువిభుఁడు!

— నానందనుఁడు మందబుద్ధి: నీవేవానిని వివేకిగ నొనర్చి, వానిబుద్ధిమరలంపెట్టు— మనుచున్నాఁడే! ఔరా, తనయాత్మజున కొఱుగులు నీతులు గఱపవలెనట! ఈయాంటి కేయుం డెంతటియుపాయశాలి! అయినను మండలించి చూచెదఁగాక!

(ప్రకాశముగా) సుయోధను సంబోధించుచు—

—రాజకంఠీరవా, విమలతరవంశమునం జనియించి, సమస్త గుణంబుల నహీనుండవగు నీకు దురాగ్రహముతగునే! తులువలే కాని నీయట్టిదొరబిడ్డ లిట్టిదుర్ణయవృత్తికిఁ బాల్పడుదురే! నీకుటుంబము వారును, నీహితులును, పరరాజులును నినుమెచ్చునట్టికార్యము లొనరించుటయొప్పును: కాని, అల్పబుద్ధులమాటలు పాటించి యకార్యము లొనరించుట యిహపరముల కెగ్గొనరింపదే? శాంతశూరులగుపాండు సుతుల నీకడ నిడికొని రాజకీయముల నెఱపఁజేసికొనుట నీకునేలొనఁ గూర్చుకొనుటయేకాక నీకుఁగూర్చుహితులును, కురుకులమున నెల్లఁ బెద్దలును నగుభీష్మబాహ్లీకవిదురులేకాక, గురుండును మానసికముగఁ గోరుచున్నదానిం జేసినవాఁడవు నగుదువు. నీవెవరెవరిసహాయ మభ్యర్థించుచున్నావో, వారివారిమనోగతభావములను బరిశీలింపఁ

జాలకున్నావు. అసత్యము, లోభము, వంచనము నగుమార్గమున
సంపాదించినసంపద నీ కెట్లాపోవఁగలదు? ముసిఁడిదినిన దేహమున
కెంతక్రొవ్వును లావును గలుగునో, శకునికర్ణ దుశ్శాసనులమంత్రి
తంబును నంతియె గార్యతంత్ర మగును. నీతోఁబుట్టువులును
పరాక్రమవంతులునునగు భీమపార్థులు నీపఱచిన పాట్లకు మానసమున
నైన నీపైఁ బ్రతిక్రియ నెంచక, యింకను నీమైత్రినె కోరుచున్నవారి
బాంధవమీవొల్లక, దుర్బలులగులాతివారిని బలవంతులుగను స్వజన
ములుగను నెంచుచున్న నిబాల్యంపుఁజేష్టల నేమనవలయును! ఇంద్రా
దులకైనన జేయులగు పాండవులునీతోఁ భ్రాతృభావమున మిగిలిన కాలము
గడపఁదలంచియున్నారు. కావున వారి నెడ వెట్టకుము. దోసమగుం
జుమీ—ఈయున్న రాజులందఱు నొక్కవాయుసుతునకు సరికారు
సుమీ! ఆతండలిగెనేని దేవాసురవ్రాతముగూడ గడగడ వడకును
జుమీ! అమానుషవిక్రముండగు చిత్రసేనుఁడు భీమసేనున కోడిపాఱుట
నీ వెఱుఁగనివాఁడవు కావు. మీసకలసైన్యములలో నర్జును కెదురుగ
నిలువఁదగిన మొనగాని నొక్కనిఁజూపఁగలవా? ఫల్గుణుఁడొంటిపోటు
మానిసియొ స్వానుభవముకల ఫాలాక్షునకె తెలియును. అట్టిభీమార్జు
నులు బాసటయైయుండ, రాజ్యభారమెల్ల నీధృతరాష్ట్రునందవెలుంగు
చుండ, వారు మీపక్షమున మగటిమిం బరరాజులఁ గెల్చి, మీకును
సామ్రాజ్యము నభివృద్ధిసేయుచుండ, వలదని నిరాకరించుట, సిరిరా
మోకాలొడ్డుటయకాదె! వారును మేమునుం గలసియుందు మంటేని,
వారిపుడిట్టియుటవారింగలరు. అట్లునుంగాదందువేని, మఱిచెప్ప కేమి:
నీవును, తమ్ములును, గొమకులును, జెలులును, చుట్టాలును, నొక్క
పెట్టున నడుగుమాలిపోవుదురుసుమ! వంశనాశనుండనువాడు నీయట్టి
రాకొమరునకుందగునే! అప్రతిష్ఠవచ్చునని యైనఁదలంపఁజాలకున్నావు!
ఆపదవాటిలునని యైనఁ దలంకకున్నావు! అంతలెవ్వుటైనేని, ముందు
యుగాలవారుకూడ నిను దూఱుదురుసుమ !

నీతండ్రి పరిపాలనను గౌరవించుచు, నీవును నీ సహోదరులును ఒకవంకను, నీయనుజన్ములగు పాండవు లొకవంకను, అలేని కంగరక్షకులై యుండి, స్వధర్మము వీడక, పరధర్మము గుర్తెఱింగి, రాజ్యాంగ చింతన మొనర్చుచు, పర రాజుల నోడించుచు, రాజ్యము నభివృద్ధిపఱచుకొనుచు, మీరుసుఖముగఁ జీవించుచుండ, మీ కులము తామరతంపరమై విజృంభించునుగదా! అందులకు నీవంగీకరింపవేని యయ్యది నీ కొకదూఱగునని చెప్పకతప్పదు. అట్లగుట వారిది వారికొసంగుట కర్తవ్యము. మీరును మీరునుంగలసి, మీశత్రురాజులపైఁ బడుటధర్మము కాని, మీలో మీ రంతఃకలహములఁ బెంచుకొని రణమునఁ గూలుట నయదూరతయు, స్వవినాశతయు, నని నీ కింకనుఁ దోఁపకున్నదోయి!

నాఁటి యుత్తరగోగ్రహణసమయమునఁ దోమ లేకుండ నొంటరిగఁ గిరీటిచేసినపని నెఱింగియేయుంటివికద! ఇపు డేను తోడువడియుండ, విజయు నాహవమున నెదురుకొనఁ దలంచుట మఱితేర్పఁగరాని కీడగుటయెసుమ నీకు! యుద్ధసన్నాహము లిఁకవలవదుసుమ! గెలుపుమాటఁ జెప్పలేముసుమ! నీవు కేవలము పశుబలముపై నాధారపడుచుండుటను బౌరుషము నిర్ణయింపఁగల దైవమొకటి కలదనియైన గుర్తింపఁజాలకున్నావు. అదియె నీకుఁ బ్రమాదప్రదమై, పరులకుఁ బ్రమోదదాయకమగుంజుమా!

భీష్ముఁడు:— సుయోధన, నీతండ్రి జీవించియుండఁగనే, చేజేతులఁ బ్రాణహానియు సంపన్నాశమును, యశోవినాశమును, ఏలచేసికొనఁ దలఁపడుచున్నావు? నీ జనకునిమాటవిని, రూపొందినపరమాత్మయే యనఁదగిన నీయదుపుంగవుమాటఁ బాటించి, ప్రవర్తింపకుంటేవి, చెడుగొందెదవుసుమ!

ద్రోణుఁడు:— రాకుమారా, పితృపితామహ గురులమై నీకును లోకమునకును గళ్యాణమునుగూర్పఁగోరుచున్న మాహితోపదేశములవిని, దుర్మంత్రంబులవినక, నీబంధుజనంబులతోడను, లోకులతోడను, బొంది, పొసఁగి, మనుటయె యొప్పును. నిర్బంధాధికార మెన్నంటికినిఁ జిరాయువన్తంతము కానేరదుసుమ! ఇంతకన్న నిన్నినిండిన కొల్వున నింకేమనననగును!

రా య బా ర ము

ధృత:— కుమార, యీదామోదరువాక్యము లవశ్యాచరణీయములగుట నాయ జాతశత్రునొకకంటఁ జూడుము. అందువలన మనకార్యము లన్నియుఁ దీరఁగలవు. ఇంత దూరము మనకొఱకు శ్రమింపక, పాండవనిర్దిష్టుఁడై వచ్చిన యీనారాయణు పలుకుల నామోదింపవేని మన మెల్లచేటునకును నిదాన మగుదుముసుమ.

భీష్మ:— యుద్ధమున నీకుసాయమొనర్పవచ్చిన యెల్లరాజులను జందనాది లేపనమర్యాదలతో పక్వాన్నభోజనసత్కారములతో వారి వారి తావుల కనిపితివేని లోకమువార లెంతయుత్సవము నొందెదరో యనియైన నూహింపవలదా!

భీష్మద్రోణాదులపలుకులు వినివిని, దుర్యోధనుండు శ్రీకృష్ణునిదిక్కు-మొగంబయి నిలచి, రూక్షంబగువీక్షణంబు నిగిడ్చి యిట్లనియెను.

—దుర్యోధనుఁడు—

—యదునందనా (భీష్మాదులంజూపుచు) వీరికన్నులయెదుటఁ బుట్టి పెరిఁగినవాఁడనగుట, నీగురుఁడును పితామహుండును, మాజనకునితోఁ బాటు నను నెల్లవేళలఁ దూఱుదురు. నీవును నదేవిధమున నను దూరదొరకొంటివే కాని, తగవొకింతయైనఁ దలంపకున్నావు కదా! పాండవులయెడఁ బ్రేమమున్నదికదా యని, నను నిందించుటే పనిగా నాలోచించితివో! నను నిందించుటవలన నీవారిప్రతిభ మరింత యధికమగునని తలంచితివో! ఇంతకును బాండవుల కీవు మూఁడు తరములనాఁటి చుట్టమవు. నీ తండ్రినాఁడు నీమేనయత్తయగుకుంతిని మాపినతండ్రికిచ్చుట ధర్మజాదుల కీవుమేనబావవైతివి; నీనాఁడు నీచెలియలు సుభద్ర నర్జునునకిచ్చి మఱఁదివైతివి. నీయన్నకూఁతురా శశిరేఖను నీమేనల్లునకిచ్చి వియ్యంకుఁడవైతివి. ఇట్లీవు వారలకు మూఁడుతరములకుం దెగనిచుట్టమవౌటనే కదా, నీసాయముం గోర నీకడ కలనాఁ డేనరుదెంచియు, నీసేననెగోరుకొని, నినువీడితిని. పాండవేయులకుఁ గడుంగూర్చు చుట్టమవైన నీవును, దూతవైవచ్చియు వీరువలెనే, ననుదూఱుచునుంట వింత కాదు కాని, నీవుకూడ, ధర్మమూవంతయుఁ దలంపకుండుట మిగులశోచనీయము కాదా!

ఇపుడు నీవు క్రొత్తగ రాయబారినని మఱి యనవసరలేదు.

ఈరాయబారములు నీచేనటనాటనే ప్రారంభించినావు. నీవైననేమి;
నీ వారైననేమి? నీవుమాకుటుంబకలహములలో నానాఁటిజోక్యము
కలుగఁజేసికొంటివి. మారెండుపక్షములవారిలో, నిపుడుమాదాయాదులు
నీసాయముగోరుట నిటకువచ్చితి నంటివేమో! అట్లయినచోఁ గుంతీ
సహితులైనపాండవులు మాయూరుచేరి, మాయింటనున్న కాలా
ననె, నీవు అనూహ్యనిదూతగా మాకాప్రకటించినుండలేదా!

మాటిమాటికిని—మీ రాఁడుదాని నడ్డలుపెట్టితిరి: మే మడ
వులఁగడుపడుమాఁ బడితిమి—అని తా మకారణముగ మాయెడ నెల్ల
ప్పుడును రోసమూని, తామే యుద్ధవిఘ్నములు మానకొని, మమ్ముఁ జంపు
టకునుఁ జెఱచుటకును పాండవులు సిద్ధపడియున్నారు. నావలన నావంత
యుఁ దప్పులేకుండుటు నీ వెఱుంగవు. ధర్మజుండె జూదమైనను సౌబలు
నిచే నొకపరియోడియు నింకను మూర్ఖుఁడైమఱల నాడినాఁడు. నాకతఁడు
విద్యయందాతురమెకాని, ప్రౌఢిమ లేమి, నాకు మారుగ సౌబలుండె
యాడిధర్మజుంగెలిచి వేఁడనిగైకొనియెంగదా! ఇందుకునేనెట్టియుత్తరవాదని
కాఁగలనో నీవుఁగూడ యోచింపవలదా? ఇందు నాయందేమి తప్పు
న్నదందువు? ఇట్లయ్యును ద్రుపదవిరాటాదుల వెంటనిడికొని, తామె
తొలుతఁ గయ్యంబునకుఁ గాలుద్రవ్వుచు మాపైవిడిసివచ్చి రంతియ
కాని, యిట్టియుగ్రకార్యంబునకేముదొడఁగితిమే! చాలక బలహీనులగతి
నలసురపతికైననెన్నండును మ్రొక్కెడువారము కాము. రాజధర్మము
చొప్పునఁ జేయును బ్రతిష్ఠయు నొంది యీయాయుల నేలఁగలము. క్షాత్ర
ధర్మానుగుణముగ సమిమొననిల్చి జయముపడసి భూలోకమొ, రణ
రంగమునఁజచ్చిస్వర్గలోకమొ, చూరగొందుము. అంతియకాని, నా
చిన్నతనమునఁ దగవును ధర్మమును నేనెఱుంగకున్నకాలాన, మజ్జన
కుండును బితామహుండును, అప్రమేయమును, అవిభాజ్యమునగు
కురుసామ్రాజ్యమునఁ గొంతభాగ మాపాండవులకిచ్చివేసినను, నేరని
వాఁడనౌట నేనప్పుడూరకుంటినే కాని, యికముందు వారిమాటల సాగ

నిత్తునే! మానవరుధిరమును జవిచూచిన శార్దూలమెల్లప్పుడును మనుజ రక్తమే కోరుచుండులాగునఁ దొలిదా ననుభవించిన రాజ్యసుఖముల మఱువఁజాలక నేలయేలుదు మనుకొంట పాండవులదోసము కాకున్న మానెఁగాని, నేనుమాత్ర మానాఁటిమాటలు మఱిముందుకుఁ జెల్లనీను. కృష్ణా, నీవనుకొనినట్లు భీష్మద్రోణాదులు వారలవారు కారు. ఇది నమ్ముము. వేయేల! ఎవరెవరిపక్షమున నున్నను, వారును మేమును బంచికొని తినిమనుట, మఱిపొందనికత. ఇదిగో చెప్పుచున్నాను వినుము: వాడిసూది మొనమోపినయంత నేలనైన నే నీయను. మాలో నెవ్వరమైనను, యుద్ధము చేసి గెలిచి రాజ్యమేలవలసిన దేగాని, యిక భాగములమాట దలపెట్టకుము. నీ నైతికసంభాషణము లిఁకవలదు.

శ్రీకృష్ణుం డీదుర్యోధనునిమాటల కక్కజంపడె "సాంత్వనవచనములచే మృదుభాషణములచే మూర్ఖజనహృదయములు ప్రసన్నతామహిమమునొంప నేరవు. నేనిప్పటివఱ సర్వోపదేశములు సేసిన నేమియు లాభముండదు." అని తలంచియుండెనో ఫు.

— కృష్ణుఁడు —

దుర్యోధనా, నీ పితృపితామహాదులు వెఱఁగులని సూచించితివి; చనువున నిను నెల్లప్పుడును దూరుదురంటివి. తగవు నొకింతయు వారు పరికింపరంటివి. నేనును అట్లే తగవుపరికింపనైతి నంటివి.— నినుదూరుటయే మొదటితప్పు; అందునను దగవు దలంపకుంట తప్పులోఁ దప్పు అట్లగుటఁ దగవే తొలుదొల్త బరిశీలింతుము గాక!

నీవు తగవుమాటఁ దలపెట్టి, యలనాఁటి జూదముమాట నెత్తితివి. ధర్మజుండె బలుజూదరింబోలెఁ దమకించి, సౌబలునిచే నోడి భూమి గోల్పోయియు, ముష్కరుఁడై మఱలనాడ, సౌబలుఁడె గెల్చెననికదా యంటివి. కాని ధర్మజుఁడా జూదమునకుఁ దనకుఁ దా వేగిరంపడియెనా! ఎట్లైననేమి, మీ రా జూదమున గెలిచియుఁ, బాండవేయుల ధన సంపద్రాజ్యంబులఁ గైకొనినను మీతండ్రి వానినెల్ల మరల వారికిచ్చివేయుటకు నీవవరోధము గల్పింపఁజాలక, యిట్లెన్ని మారు

లోడించి వారిరాజ్యముం గైకొనుచున్నను మీ తండ్రి యిచ్చివేయు చునేయుండునుగదా యనియెంచి విస్తారంపైన పణంబులతో నను ద్యూతంబేర్పరించి యిందప్రస్థంబుననున్న పాండవులను మఱలఁ బెప్పించితివి. పెద్దయుండ్గు దేశస్థులుగా నొనర్చినవో, నీ కర్మ జూదాలు ప్రజాభిమానమునకు హానియగునని యెంచి జూదమున నీకే తప్పకజయము లభించు నన్నట్లెంచికొని, యందోడినవారు బ్రహ్మచర్యంబునఁ బండ్రెండేండ్లు అరణ్యవాసము సేయవలయు ననియు, జనసంకులంబున నొక్కయేఁడు అజ్ఞాతవాసంబును జేయవలెననియు నంకెలుంగింపబడిరేని, మరల ద్వాదశవర్షారణ్యవాసంబు లొనర్చుచుండ వలెననియు, సమయానుసారంబుగఁ బదమూఁడేఁడులనుండరిగి వచ్చి యభూరీతి నెవరి ధరణీభాగము వారు గైకొనఁదగుననియు నేర్పఱచితివి. నీతలంచినట్లు వా రరణ్యంబుల వన్యమృగంబులకుం జిక్కకయు, నజ్ఞాతవాసమున వెలుంగంబడకయు, మరలివచ్చులోపల వారి ధన సంపద్రాజ్యంబులను వంచనమొయి నీవశము సేసికొంటివి. ఇపుడు వారు జయప్రదంబుగ సమయంబు నిర్వర్తించుకొని మరలివచ్చి, మాయయ్యసగపాలిండని—మా రాజసూయంపుమేదిని నిండని—నే మూరలేని కాలాన వంచనమొయిమీరాచికొనిన నేల నిండని—యడుగ నీవు జూదంపు సమయముల విడిచి, రాజ్యము వీర భోజ్యముకావున నెవ్వరైనను యుద్ధముచేసి ధరణింగైకొనవలసి నదేకాని భాగముమాటఁ దలపెట్టవలదని, వాడిసూదిమొనమోపిన యంతయైన నేల నేనీయ నని యనసాహసించితివి. మొదటి జూదమున నోడిన ధనసంపద్రాజ్యంబులు ధృతరాష్ట్రుడు మెచ్చి యిచ్చివేసెఁగదా యని మఱివానినోడ్డి క్రీడింపందగదని యుద్ఘాటించిపలికి రాజ్యముతో నేమాత్రమును సంబంధములేని విస్తారంబైనపణంబులగల యనుద్యూతంబున మీరు గెలిచినదేది? మేదిని కాదే! అట్లయ్యు నీవు మేదిని గెలువలేదనుమాట విడిచి 'నాకై

శకుని జూదంబాడి మేదిని గెలిచెనని యంటివి. ఇట్లే నీకర్ణుండుగూడ నా నాఁడా ద్రుపదపురోహితునితో "దుర్యోధనుకొరకు శకుని జూదంబాడి మేదిని గెలిచె" నని నీమెప్పువడయుటకుఁ గావలయు ననియె. ఇది వట్టి కొఱగానిమాట. మీకు మేదినిచిక్కుట వంచన మార్గముననేకాని జూదమునఁ గాదయ్యె. అట్లగుటనెకదా మీరొనర్చినద యన్యాయాక్రమణమని యెక్కుపెట్టిన మిములోకమువారాడిపోయుచున్నారు.

ఇఁక రాజ్యార్హతంగూర్చి యోచింతుమన్న జాత్యంధుండగు మీయయ్య రాజ్యపరిపాలనా నర్హుండగుటయె పాండురాజు జన్మించుటకుఁ గతంబని యుంటెఱుంగనివారెవరు? అనంతరము పాండునకె రాజ్యాభిషేచనము సేయుట నాతనిసంతతికె రాజ్యపాలనార్హత కలదని నీతండ్రియు, పెద్దలును నిశ్చయించినారు. చక్రవర్తియగు పాండుని జ్యేష్ఠపుత్రుండగు ధర్మజునకు మీతండ్రి యౌవరాజ్యాభిషేక మొనర్చినాఁడు. నీతి నవలంబించి ధర్మము పాటించి పాండవులపట్ల నీతండ్రి యెంత నయోచితంబుగ నడునఁబోయినను నీనిర్బంధము కత మున నెకదా ఖచితముగఁ బ్రివర్తింపఁజాలకున్నాఁడు. కావున నిఁక నీకొఱగాని మాటలు గట్టిపెట్టుము.

— దుర్యోధనుఁడు —

ఏమాట యెట్టిదైనను నాయెఱింగిన దొక్కమాటయే. నా చిన్నతనమున నాతండ్రితాతలు నాశక్తిసామర్థ్యము లెఱుంగక యేమిచ్చిననిచ్చిరికాక; మరలనట్లే వారును నీవునుఁగలిసి—వారికి పంచి యిచ్చెదము: రాజ్యము పరులపాలుచేసెదము—అనియనిన నేనెటుల సమ్మతింపఁగలను? ఇపుడీకౌరవరాజ్యలక్ష్మియెట్లైననేమి నావశమైనది; నాస్వాధీనానుభవములనున్నది. పెద్దయుంబొద్దు నాకుఁగల యనుభవమే నాస్వామ్యమును స్థిరపఱచుచున్నది. కావున నిపుడు మఱలఁ బంపకపుటాలోచనము సేయవలదు.

నుద్ఘాటించియె యుంటివి. కావునఁ "బాండవులు దిగ్విజయంబు సేసి యులవరించికొనినదగుట" యనునీమాటకు మఱిప్రయోజనములేదు. అట్లగుటఁ బాండవులకుఁ బైతృకంబగునట్టిది యనియనుట కేదియు నట్లులేదు. దిగ్విజయంబున వారు వడసినది యనియనుట కేదియునిట్లు లేదు. ఇఁక మిగిలినదేది? మేము వారిని పరిభవించినను, వారు సైరణ నొంది మాపైఁ దెగి యింతవరకును, మాకుఁ గీడురోయమి, మేము మెచ్చి, యనుద్యూతమునాఁటికి వారియనుభవముననున్న సంపద వారికొసంగవలయు నన్ననీ సిద్ధాంతమె మిగిలియున్నది. నీవిపుడనిన వారి సైరణ సమర్థులయియుండియుఁ బారమార్థికచింతతోఁ జూపిన సైరణయెమైనచో, నొకింత చింతింపవలసినదే! కాని యటుగాక, అసహాయులై, అసమర్థులై, నేమి సేయుటకును వలనుపడక, అనుద్యూతంబునందెగి దేశాలంబడి పోయి, యిప్పటిదాఁక వారికి సుసమయముచిక్కమి కాలానుగుణముగ నలవడిన సైరణ చూపిచూపి మాకుఁదొలినుండియు శత్రువర్గములోనివారును ముష్కరులును నగుపాంచాలురతో సంబంధబాంధవ్యముల నెఱపికొని, తదనంతరము కొండకోయజాతులవారగుమాత్స్యులతో నిచ్చిపుచ్చికొనుటలుసలిపికొని, యెట్టకేలకు వారివారిసహాయమున మాపైనెత్తివచ్చినంత మాత్రాన సామ్రాడ్ధురంధరులమగుమేము వారికి లొంగుపాటు సూపి, మఱియుఁ గ్రిందుపాటును దన్మూలమున దుఃఖముపాటును బొందునంతటియవసరము మాకులేదు. మాలో నెవరమయినను, యుద్ధమునఁ గెలిచి, రాజ్యమును నిరాఘాటముగఁ బొందవలసినదే కాని, యింకొకమార్గములేదు.

కావున నిఁక నా నేరమేమియు నెన్నండునులేదు.

— కృష్ణుఁడు —

ఏమేమీ! నీనేరమె లేదందువా? నీజన్మించినదాదిగ నీవు చేసినవన్నియును నేరములే-ఒకనాఁడు తప్పుచేసియు, నింకొకనాఁడు

మానియు, నుంటివికనుకనా? ఎన్నియని చెప్పఁబూనుదును! విషా న్నము పెట్టించినావు; పాములచేఁ గఱపించినావు; నీటఁ ద్రోయించినావు; లక్కయింటనుంచి కాల్పించినావు; ఓర్వలేక కపట ద్యూతము గల్పించి, అడవులంబట్టఁ జేసినావు. అంతతో నాగక, జూద ప్రబంధముతో సంబంధములేని రాజ్యమును వంచనమెయి నాక్రమించినావు. ఇపుడు దాని సహపాఠికిఁ జూచుచున్నావు. మీయన్న దమ్ములతగవులలో నిజమువేరొకగాని సమయమునఁ గులాంగనను జుత్తుపట్టి యీడ్పించుటకంటె హైన్యమైన నాగిక. వలువ లొలిపించు నంతటి రాక్షసకృత్యమునకు వెనుకీసినావుకావు. అందువాని బట్టినట్టి యట్టెలుపెట్టుటా యనిమైన నెపద సహింపఁగొనినావుకావు. నీభార్యయగు భానుమతి వలదన్నను నామెమాటలను జెవిఁబెట్టినావు కావు. మానభంగమునకు నిలువెల్లనచ్చి విలపించియున్న యమ్మానినిం గూరుచుండరమ్మని నీతొడఁజూపించినావు. నీమాటలవిని, నీయూహల పోకడగమనించి, పాపము! కర్ణుఁడుగూడ నినుసంతోషపఱుపనో నీ యిచ్చకముగోరియో, పతివ్రతమ్మన్యులు దలంచుకొతిని రాజభక్తినో తనకుసంబంధములేని యధిక ప్రసంగముల నెఱపినాఁడు. ఇన్నియుఁ జూచియు, వినియు నెఱిఁగియునున్న యలనాటిపెద్దలందఱు నిపుడు వినుచుండగనే నీమెడ నినుమంతయు నేరములే దనుచున్నావే! ఇంకేటి దుర్మానము నీయట్టి రాక్షసమునకుఁ దగదుసుమీ!

(స్వగతము) ఇంతమాత్రసర్వ్య మీతఁడా పాండవేయులదెస నొందుటకుఁ గతంజేమియు, వినిముఖమునను రానిచ్చెదఁగాక!

(ప్రకాశముగా) పోనిమ్ము, సుయోధనా! నీకువారిమెడనింత క్రౌర్యమేలకూవహిలెఁ? ఒకింత వినిపింపఁగలవా?

— దుర్యోధనుఁడు —

మహాపురుషుండవనియు, దైవమవేయనియు, జనంబులచేస్తుతి యింపబడుచున్న నీయట్టిదు మాకుటుంబకలహములలో, రాష్ట్రము

లోఁగొన్ని పెగలకు సంభవించిన తగవులలో, జోక్యము కలుగఁజేసికొనుట తగియుండలేదు. ఇపుడు మాపూర్వవైరకారణముల వెలివెట్టుమని నన్నేల రేపెట్టెదవు? వారియెడ నీకుఁగలయభిమానంపుఁ బెంపున నీకిపు డవియన్నియు నసత్యములుగాఁ దోఁపవచ్చును. గాని మాకవి యన్నియు ననుభవములైనవి.

నిజముగ ధర్మజాదులు పాండురాజపుత్రులే కారు. గాలికిని ధూళికినిఁ బుట్టి పెరిఁగిన వారిని పాండుపుత్రులని కుంతి తోడ్కొనివచ్చినది. మాయయ్య దయానఁగొని వారిని జేరఁదీసి తిండి నన్నమును, గట్టబట్టయు నొసంగి, మాతోఁబాటుగ శస్త్రవిద్యాభ్యాసమును, శాస్త్రపాండితీగరిమయు నొసఁగఁజేసి రాజమర్యాదల నెల్లఁ జరుపుట, మా కెంతటిపరిభవమునకైనను కతమైనది.

ఇఁక రాజ్యమునఁ బాలింపఁజేయుట కెంతో యధికారముకలదో యోచింతుమన్న సింహాసనమునఁ గూర్చుండిన మాయయ్య యనుమతిని, మాపినతండ్రి దేశాలపైఁబడి సామంతరాజులనుండి కప్పములఁగొనుట, విరోధివర్గమును కృశగించి వారి దేశాలనస్వాధీనపఱచికొని కురురాజ్యము నభివృద్ధిసేయుట, లోనుగాఁగల కార్యములొనర్చుచుండెనుగదా! అట్టిపట్టున, సింహాసనముపైఁగూర్చుండి, రాజనిపించుకొనిన మాతండ్రిదే రాజ్యమగుంగాని, కన్నుగలిగి నలుదెన్నులఁ దిరుగుచుఁ బ్రజలకుఁ దలలోనాలుకయై అందఱిమంచితనమును బొందినంతమాత్రమునఁ బాండునకు రాజ్యమునందు స్వత్వ మెక్కడనుండియుద్భవిల్లఁగలదు? అట్లు తండ్రికే లేనియధికారము కొమరుల కెటుల లభింపఁగలదు? ఏ రాజ్యముననైన, నేకాలముననైన నిద్దరు రాజులుండుట కాని, రాజ్యము పంచికొని తినుట కాని సంప్రదాయము కాదే! ఇఁక పాండుపుత్రులని పిలిపించుకొనిన ధర్మజాదులమాటఁ దలంతుమనిన వారికి రాజ్యమున భాగమిమ్మని మాతండ్రిని భీష్మవిదురాదిపరిపాలకవర్గమువారు వేధింప వేధింప మాతండ్రియు బేలతనానఁ దన

తమ్ముఁడగు పాండునియందలి ప్రేముడికతమునఁ బరిపాలక వర్గము వారియెడఁగలభక్తి పెంపున నప్పటికిఁ జిఱుతవాండ్రమగు మాశక్తి యుక్తుల నెఱుంగమి పాండవాగ్రజునకుమాయాఖండకౌరవరాజ్యలక్ష్మికి యౌవరాజ్యపట్టాభిషేక మొనర్పననుమాట నే కాదనను. కాని అప్పటికే మాతోనాటపాటలనము న్యూన. విద్యాభ్యసనకాలాన, నవ్వులాలని, యాటలని, మమ్మాభీమసేనుఁడు, పఱిచినపాట్లిన్నిపుడు నీనమ క్షమునఁ జేరొన్నచో, యింకను మేము క్రిందగుటకె యగును. మఱి కొంతకాలమునకు నేనుమాతండ్రిచెవినిలుగట్టి కొని మొఱవెట్టమొఱ వెట్ట, తుట్టతుదకెట్టులైననేమి, మాతండ్రి ధర్మజునర్ధరాజ్యమున కభిషిక్తుంజేసెను. పాండురాజపరిపాలన విధానమును, భీముని నెడ బాయని ప్రజాభిమానమును, ఎఱింగిన ప్రజలు పాండుపుత్రులని యనిపించుకొనితిరుగు ధర్మజాదులనుఁ గూడ, నాదరము పెంపున, ప్రేమమెయిని, గౌరవించునంతదూరమైనను, కౌరవ రాజ్యలక్ష్మి ధూర్వహాని పుత్రులమగు మము గౌరవింపమి, మేమోర్వఁజాలక, క్షత్రియసామాన్యమగు మాపోషమి నొందియుండుట యనవాజమెట్లగునో యిప్పటికిని మాకుబోధపడలేదు. సంబంధము విస్పష్టముకాకయె, పాండుపుత్రులమని ప్రకటించుకొనుచుఁ దిరుగుచుండినవారు మాప్రజలచే గౌరవింపఁబడుటయును, ఉత్తరాధికారమువహింప నర్హులమగు మేము ప్రజాభిమానమును ప్రజాగౌరవమును, దొలంగియుండుటయును, తెలిసికొని, ధర్మజాదుల దవుదవ్వుల కనుపనిశ్చయించితిమి. ఎట్టకేలకు మాతండ్రిచేవారికి ఖాండవ మొసంగఁజేసి వారి నటకనిపితిమి. మాకు స్వప్రతిష్ఠితముచేసికొనిన రాజ్యమును మేము నిశ్శంకంబుగ, నిరంకుశంబుగ, నిర్విఘ్నంబుగ పరిపాలించుకొనుచు కర్ణునిచే దిగ్విజయయాత్రలఁ జేయించుచున్న సమయాన, నావివ్వచ్చుఁడు ఖాండవవనమున నున్న కొండకోయజాతులవారిని, సింహశార్దూలాది వన్యమృగములను, నిర్మూలన మొనర్చి, మయాచార్యుని ప్రాణములరక్షించి, యాతనిచే

మయసభఁగానుకగాఁగొని, రాజసూయము సేయ నెంచి యందఱరాజు
లతోఁబాటు ననుఁగూడ నాహ్వానమొనర్చెను. నేనును జూడఁబోతిని.
ఆమయసభ మాయసభయని యెఱుంగక దాని విన్నాణముఁ జూడఁ బోవ
భ్రమాకరములగు పెక్కుతావుల మోసపోయి నే సిగ్గుల నొందు
చుండ, అట్టినా పాటులఁ జూచుటకే యొకమూల పొంచి వేచియున్న
ద్రౌపదీభీములు దారుణాట్టహాసమున నను బరాభూతుం జేసి మఱింత
నొగులఁ జేసిరి. ఆజన్మమును మఱపునకురాని యుమ్మలికమ్మొనఁ
గూర్చిరి. ఆపరిభవభూతము నను నెఱదప్పిన నేనటుచిరుగుదును. నే
నొందినపరిభవద్రఢిమకొలఁదియే, వారినెంత కాలము జనావాసముల
నుండి దూరము సేయఁగలదో, ఎన్నెన్ని విధాలఁ బరిభవమొనర్పఁగలదో,
వారికెన్నెన్ని యిక్కట్టులు సమకూర్పఁగలదో, అన్నన్ని విధాలఁ బ్రయ
త్నించెనను మాట నేను కాదనను.—విషాన్నము పెట్టితిరి; నీటిలోఁద్రో
సితిరి—యని మాపై నిందలు మోపఁజూతురే కాని, యవియన్నియు
భీముని బాధలకోర్వఁజాలక చేసిన పనులని నీకుఁదోఁపకున్న మానెఁగాని,
ఆపూర్వగాథలన్నియు నానుపూర్వముగ నెఱిఁగిన యీకురువృద్ధులు
గూడ, వారియెడ నక్రమముగ నీవు పక్షమూనుటను, నీయెదుట
వాకొనుటకైన సమ్మతింపకున్నారు.

జ్యేష్ఠకుటుంబములోనివారమగుమాకు ధర్మజుని రాజసూయ
సమయవైభవముఁ జూచి క్షత్రియసామాన్యపుటీసు జనించినదనుమా
టయు నసత్యము కాదు. మయసభలో భ్రమప్రమాదముల వలనఁ
గాలుజారిపడినప్పుడు ద్రౌపదీభీములు పరిహసించుటచే ద్విగుణీకృత
మైన పరిభవము ద్యూతకార్యమున కంకురమైనది. పిదపఁ జరిగిన
దంతయు నీ కెఱుకలేనిది కాదు.

తన నేర్పులేమిని ద్యూతానుద్యూతముల యందు మేమే గెలిచి
తిమి కాని, ధర్మరాజుండే గెలిచినచో, మా సంపద్రాజ్యంబులఁ దాఁ గైకొన
కుండునోటు! మమ్మడవుల కనుపకుండునోటు! మొదటిజూదమునఁ

దానోడియు రెండవతూరి ధర్మరాజు ద్యూతమునకు సిద్ధపడుట మమ్మోదించు నూహపొండ కాదో! తానేయోడి యరణ్యాజ్ఞాతవాసములనలుప నిచ్చకలిగియే జూదమునకుఁ జన్నదని స్పష్టమైన నగుఁగదా! తననేర్పు లేమిఁ దెలిసికొనమియని స్పష్టమైన నూహింపఁజాలమా! తొలి యాటనోడియు రెండవతూరి యనుద్యూతమునకు సిద్ధపడుచున్న ధర్మజుని భీమార్జునులో పరమవీరులై ద్రోహమదియో, యిట్టింగియు నేలవారింపకుండిరో? అప్పుడొకటితిరిగాని, మఱల నిప్పుడేల పడుదుమా- యని వారు దుమింపకుండిరనిసనఁగదా? 'ఈసారి ధర్మజుఁడే జయించును: అనుద్యూతప్రసమయమును వచ్చిన దుర్యోధనుని నే వనవాసాదుల కనుపనన్నా' యను దురాశచేతనే మఱల నాడెను: కాని జూదమాడ రమ్మనిన రాను • రా దని కాదు ధర్మజుఁ డనుద్యూతమునకు సమ్మతించుట! మాకేమి జూదమునఁ దప్పక తానే గెలుతునను నూహయే తనకు లేకున్నచో, భార్యనొడ్డుటకియ్యకొనునే? జూదాన భార్యనొడ్డినవా రీలోకమున నుందురే? తనభార్య నొడ్డి, మాకప్పగించి వేసి, తానితవులకుఁ గొప్పవిశ్వయమున నే యన్యాయము చేసెననఁగదా! తొలిజూదమున వారోడినపిదప ద్రౌపదిని సభ కీడ్చుకొనవచ్చుట ధర్మజుని రాజసూయ సమయమున మయసభలో నను హేళనము చేసినదానికిఁ బ్రతిగాఁ జేసిన యవమానముగా నేల నిరూపింపరాదు! నేనా సభకుఁ ద్రోసి రమ్మని పాతిగామిని రాణివాసమున కనుప, నాయభిమానవతి, ద్రౌపది, మా పాతిగామినిఁ దిరస్కరించి పలికి తన ప్రౌఢతనము సూచించుచుఁ బెంకి ప్రశ్నలు వేయ తాత్కాలిక క్రోధముచే దుశ్శాసనుఁడు ద్రౌపదీకేశగ్రహణము చేసిన చేసియుండును. అది నే నెట్లు కాదనఁగలను? కాని తన్నా సభకు రప్పించితినిగదా యనునీర్ష్యచేఁ దనసమయస్ఫూర్తిచే నపవాదమును నా నెత్తిని బెట్టుటకే రజస్వలా వేషము వేసినది. చెఱగుమాసెనని పలికిన పలుకులు తనయయుక్త ప్రవర్తనకనురూపకములై నెగడున వేకాని సత్యములు కాఁజాలవు.

సభనున్న వారిమనసులం గరంగించుటకును, మమ్మందఱును నిందించుటకును, మేమవినీతులమను ప్రవాదమును బలీయము చేయుటకును గుఱి చేసి, పాండవులును, వారిపక్షమువారును గలిసి పుట్టించిన గాలివార్తలే కాని నిక్కువములు కాఁజాలవు. వానినూఁతగాఁ గొని, నీవేమో గొడవలు వలుకుచున్నావు. ఇంకొక్కమాట! పాండవులైదుగురకును నైదుగురు ప్రత్యేకపుభార్యలుండఁగా నయ్యైదుగురకును నొక్కతె యగు ద్రోవదిని మాత్రమే మేము సభకీడ్పింపం బనిచేమి? అర్జునుభార్యయగు మా సుభద్రకలదని మేమెఱుంగమే? సహదేవు సహధర్మచారిణియగు విజయ నేల తలంపకుంటిమి? నకులుకులాంగనయగు రేణుమతి నేల సభకురప్పింపమైతిమి? ఇంతమాత్రమేని నీవునుంగూడ నూహింపకుంటివో? మముఁ బనివట్టి పరిభవించిన నాబంధకినే మేమును బరిభవ మొనర్చితిమి. ఇందేమియు మా నేరము లేదు.

వారికి రాజ్యమున భాగమే లేదనియు, వారు బ్రదికియున్నంత కాలమును మాతండ్రి యేదేనొకనిమిషచే వారికిచ్చుచునేయుండును గదా యనియునెంచి శత్రువినాశ మొనరించి మా సామ్రాజ్యరక్షణ మొనర్చుకొనఁ బ్రయత్నించుట మా తప్పని నీవనవలె నంతేకాని వేఱొక రిట్లనసాహసింతురే! మఱియు మేమెన్ని చేసితిమంటివో యవి యన్నియు నీకొంతెయుల మొఱువడిగల చేష్టలవలననె యయియినవి; అంతే కాని, ప్రత్యేకముగ మాయుబుసుపట్టనివారిని మేము బాధించితిమని నీవును, నీయట్టి పాండవపక్షపాతులును గాక యన్యులెవరును నన సాహసింపఁజాలరు. వేయేల! మాకును మాకునుంగల వైరకారణము లీనాఁటివి కావు. ఇట్టి చిరకాలమునాఁటి కారణములు మమ్ములను వారినింగూడ గాసిలఁ జేయుట సత్యమె. కాని సంధిపలుకులకు వచ్చిన నీవేమాత్రము ధార్మికుండవైనను, నీయందున్నదని కొందఱు వాకొనుచున్న దేవాంశ యేమాత్రమున్నను, దేవాంశకు విరుద్ధముగఁ బక్షమూనక మాకును వారికిని బరస్పరము సంభవించిన పరాభవములును, యిక్కట్టులును

నీప్రమాణ్యఁగలిగినఁగదా, నీపలుకులయందును, నీవచ్చిన కార్యము నందును మాకువిశ్వాసమును గౌరవమును గలుగుట!

—కృష్ణుఁడు—

చాలు-చాలు-నీ కుతర్కములును, నీతులవపలుకులును! నీవు కోరినటుల యుద్ధమేసిద్ధములే. కాని నీవాడినమాటలలో నెన్నియో కానిమాటలున్నవి నీవాడినప్రతివాక్యమును ఖండింపఁబడఁదగినదియే. యయియున్నను, ప్రధానవాక్యములలో నొకటి రెండు మాత్రమే సూచించి. నీవాంఛితకార్యమే సిద్ధించునట్లొనర్పఁగలను.

ధర్మజాదులు పాండునందనులే కారనియుంటివి. వాయుగాలికిని ధూళికినిబుట్టిపెరిఁగినవారంటివి — నీవొకమాట యెఱుకఁదని బాధించుఁగాక యనివచించి యెంతామునుపో, వారంతయునునాడిన నీవోర్వఁగలవో లేదో తొలి నాలోచించుకొనియే నీవంతయునాడియుందువు. పాండవులు పాండుభూపాలతనయులే యని నేనిపుడీసభనుపూర్వపక్షసిద్ధాంతములు సేయఁబూని, యూపూరువంశము నెత్తివెట్టినచో, నీవును నేనునుంగూడఁ గ్రిందయి, యీయున్నవారలంగూడ మఱియుఁ గ్రిందుపడుచుటయె యగును. అది కానిపని. కాని ప్రజాభివృద్ధియుఁ ధర్మసమన్వయమును ప్రధానములుగా నెంచినమన పెద్దల నగౌరవించి, వారొనర్చిన కార్యములు దలక్రిందుసేయఁబోయినచో మనమెయెంతేని గ్రిందగుదుము కదా! మనతండ్రి తాతలచేతలఁ దెగడుచుంటివారమె మనమయిన, నిఁకమనసంతానమమాత్రమేనా, మనలం దెగడనోడు?

ఇంతకు, నీ మునీశ్వరులును, నీపెద్దలును రాజ్యపాలకవర్గమువారును, పాండునందనులని ధర్మజాదుల సంగీకరించి, కురుసామ్రాజ్యపట్టభద్రుండగు పాండునియగ్రనందనునకె యౌవరాజ్య పట్టాభిషేకముచేసియుండిరి. ఇపుడదికాదని నీవనఁజెల్లునే? కావున నిపుడీక జన్మములవృత్తాంతములను, వంశచరిత్రములను నెన్నుకొనుటకంటె కౌరవరాజ్య మవిభాజ్యమనియు, నప్రదేయమ్మనియు నీవనిన పలుకులె పరిశీలింపఁ దగినవి.

రా య బా ర ము

మీ ప్రతీపునిచే ప్రేమమెయి నొసంగఁబడిన బాహ్లీక దేశమును బరిపాలించుకొనుచు,—అదె చూడుము (బాహ్లీకునిం జూపుచు) బాహ్లీకుఁడు స్వతంత్రుఁడై మైత్రిమెయి మీకుఁ జేదోడును వాదోడునునై యిపుడు మీచే నొసపఁబడు సమారాధ్యాగమున ఋత్విజులలో నొకఁడుగా నిలఁగలఁడే!

అజమీఢుని తృతీయపుత్రుండగు దుష్యంతుని సంతతివారు తొలి పౌరరాజ్యమునం దొక భాగమగు పాంచాలమును జగడము సేసి వేరుపఱచికొని, తాపాటుఁబోయి, తద్రాజ్యము నేలుకొనుచుఁ బాంచాలురను నామమున వ్యవహరింపఁబడుచుండలేదా! అట్లగుట మీ రాజ్య మవిభాజ్యమని మఱి యనకుము.

కర్ణునకు నీవంగరాజ్య మొసంగ లేదా! కావున నిఁక నీ భారతభూమి అప్రదేయ మని మఱి యనకుము.

ఇఁక మీ రాజ్యము జ్యేష్ఠక్రమానుగతము తప్పనే యనుటకు నుదాహరణములు నూతువా! ప్రప్రథమముననే మహాచక్రవర్తి సమారుండగు యయాతి కాలమున నాతని జ్యేష్ఠపుత్రుండగు యదువునకుఁ గాక కనిష్ఠుండగు పూరునకు రాజ్యము సక్కెను.

ప్రతీపుని జ్యేష్ఠపుత్రుండగు దేవాపి పాపండమతావలంబకుండగుట చక్రవర్తిపదమునకనర్హుండగుటను, ఆతని తమ్ముండగు శంతనుఁడే రాజ్యాభిషేచనమందెను.

శంతను జ్యేష్ఠపుత్రుండగు, నీ దేవవ్రతుఁడు రాజ్యము విడి పెండ్లి యాడక బ్రహ్మచర్యంబున నుంట భీష్మునితమ్ముండగు విచిత్రవీర్యుండె రాజయ్యెను.

అనంతరము, విచిత్రవీర్యుని సంతానములో జ్యేష్ఠుండగు నీ తండ్రి జాత్యంధతచే రాజ్యమునకనర్హుండగుట విమలచరిత్రుండగు పాండుఁడే, రాజ్యాభిషేచనమందినాఁడు. కావున మీ-పౌరసామ్రాజ్యపాలనాధికారము జ్యేష్ఠానుక్రమముగ నడచె-ననుమాట మఱి యనకుము.

కావున పౌరరాజ్య మవిభాజ్యమనిగాని, అప్రదేయమనిగాని, జేష్ఠక్రమానుగతమే యనిగాని మఱియనకుము.

* * * * *

ఔను—ఏమనుటకైనను, నీ కౌరవసామ్రాజ్య విస్తీర్ణత నైన నీవెఱింగియున్నఁగదా! నీ తండ్రి ధర్మజుని యౌవరాజ్యాభిషిక్తునిగా నొనర్చిన పిదప నీవు చూపోపమిని బాండవుల లక్కయింటఁ గాల్పింప, వారి పనిపిన వారణావతమును, ద్యూతసభాప్రవేశమునకుఁ బాండవుల రావించిన ఇంద్రప్రస్థమును, పాండవులకు విషాన్నము వెట్టించిన ప్రమాణకోటి తీర్థము మాత్రము నీ వెఱుంగుదువు. అట్లగుట నౌరా యింతవంతకుఁ గతంబగుచున్నది.

ప్రజాభివృద్ధియు, ధర్మసమన్వయమును ప్రధానములుగా నెంచిన మన పెద్దలను గౌరవింపక, వారాకాలమున నొనర్చిన కార్యములను మన మిపుడు తేలికసేయఁ బోయినచో మన మేయుండేని క్రిందగు దుమనుట నిర్వివాదాంశము కాదా! మానవత్వశీ తారతమ్యపేశాంక వెగడు నంతటి వారమె మనమయున, నిక మనసంతానము మాత్రమేనా మనల వెగడనోపును!

తమతండ్రియగు పాండురాజు రాజ్యభ్రష్టుఁ డగుటను, ధర్మరాజుండు నీజనకునివలన మహారాజ్యాభిషేచనమునందు భారతసామ్రాజ్యము నంతకును జక్రవర్తియయ్యెను, జగమునుజేసినట్టి సఖండమగు భరతఖండమును నైకొనసర్వాధికారమును బలమును గలిగియు, జనక్షయ కారణమగుయుద్ధము నొల్లమినేకద, తమ యర్ధరాజ్యమునైన నొసంగ వలదాయని ధర్మరాజుఁ డడుగుట!

దుర్యోధనా, ఇంకనీవాదములలో నేనుఖండింపకమిగిలిపోయినవి మఱిలేవు. కాని చెప్పఁదగినదిమాత్రము మిగిలిపోయినది.

ఎట్లయినను బాండవుల నియ్యాలి మననీయకుండఁ జేయఁదలంచిన నీ మొదటిప్రయత్నములన్నియు విఫలమగుట నేనంచనమార్గముననైన వారిని ప్రజాభిమానమునకు దూరులుగ నొనర్ప నెంచి కపటద్యూతమున నీవువారి నెంతెంతలుపఱచిచూచినను, వశీకృతచిత్తుఁడగుధర్మరాజుఁడు పరమవివేకియగుటను, నీకుర్మానమునింతవట్టు చెల్లనిచ్చినాఁడు! ఆతనివశీకృతచిత్తత నీమెచ్చువడయుటకుబనికలుగ, నీవలన వారియందసమర్థత నారోపింపఁ జేసినది. మాయురే! దుర్మానులును, దురహంకారులు నిట్లెకదా వర్తింతురు! ఇన్నియునైనవి కాని, యింకమిగిలినది, నీకోరినది, యుద్ధమేకదా! అదియు సిద్ధములే! రేపే ప్రారంభమగులే! సరియా! ఇంకనైనను దృప్తిమైనదా? నీహృదయధర్మము నీవలన నెఱుంగఁ దలంచితిని. సౌమ్యసంభాషణంబున నేమాత్రమువీలున్నను సంధిజరిగితీరవలెనని పొరలితిని. మీపూర్వవృత్తము నెఱుంగఁ జేసితిని.

మీకుటుంబగౌరవములపోఁడిమిఁ దెలిపితిని. వేఁడుకోలునంబలికితిని. నిను వంటివీరపురుషులను భారతభూమికోల్పోవునట్లుచేయవలదంటిని. భారత భూమికి వీరభిక్ష నిడుమని యాచింపవచ్చిన యాచకుండనంటిని. మఱి మఱి యెంతో క్రిందయి పలికితిని. నామాటలకు జీదకన్నిడిన నీతండ్రివలెనే, నీవును నామాటలఁ బెడచెవినిడి, యుద్ధమే కావలె నంటివి. జ్ఞాతివర్గమనియెడు నగ్నిని సంపూర్ణముగ నార్పసమర్థమగు మార్గము యుద్ధముదక్క యింకొకటిలేదని దృఢముగ నమ్ముటను గావలయు పౌరుషమునఁ గార్యము మఱి జక్కవడనిచ్చినావుకావు! లోకమునకెంతకళ్యాణప్రదమైనదైనను, అదనీయూహాలకేమాత్రమేని భిన్నమైనదైనచో, మఱినీవు విననైన నోపవుకావలయు! 'కృష్ణుఁడే యీసంధికార్యమునకుఁదానుగఁబోయి ప్రయత్నించినచోఁగార్యము సానుకూలపడదే' యను లోకమువారిసంశయము దీర్చివేసినావు. దూరముననున్న నీభ్రాతృవర్గమును దరిఁజేర్చుకొని అభిమానము సూపినావుకావు. జనకవిహీనులగువారిపై నీతండ్రివలెనైనను జాలిఁ దలంచినావుకావు. నీతోనింతదూరము ప్రసంగించిన నాయెడనైన నావంతయుఁ గౌరవ ముంచినావుకావు. కృష్ణునకు సంధియనూహా సంకల్పమునేనే వికల్పమగుట, మఱిసంధి కుదిరినదికా దనురవ్వకు మాత్రము ననుబాల్పడఁజేసినావు!

—సంధిచెడఁగొట్టికొనియే వచ్చితివి—అనుధర్మజుమాటకు నను లోఁబడఁజేసినావు. సిద్ధపఱచికొనియున్న యుద్ధముమాననని, పాండవుల ప్రార్థన నంగీకరింపనని, వారి కేమియు నీయనని, యుద్ధమే కావలెనని నీవు భీష్మించుకొనియుంట నీసంధి మఱిపొసఁగలేదేమో యనియైనఁ జనసామాన్యమే కాక పండితపుంగవులుకూడ నూహింపఁ జాలక, సంధికార్యవిధ్వంసమునకు నేనే కారకుండనని నాపైనిడునట్టి రట్టునకు నను లోబడఁజేయ నిశ్చయించినావు. నాప్రయత్నములన్నియును, ఇంతవఱకును నా నెఱపిన ప్రసంగములన్నియు, నిపుడిటఁ జేరియున్న యీమునుల తత్త్వబోధనలన్నియు నిట్లు బూడిదంబోసిన పన్నీరయి

యింతసంపూర్ణముగ విఫలములగుటకుఁగారణ మింకేదియో నీమనో గతమైనది యుండీయుండకపోదు. ఏకారణ మెట్లున్నను నైతికముగ నేనెంత చెప్పినను నీవువినక తుదకు ననుఖిన్నతతో మరలఁజేసినావే కాని మఱిసంతోషమునఁ బోనిచ్చినావుకావు. కాని ఆహావము మాత్రమువినోదముకాదు. నీపట్టినపట్టుకింత సడలింపుము. అటుగాక సంగ్రామమె సర్వశ్రేయమంటేని సామ్రాజ్య లోభమున సంపూర్ణ జ్ఞాతిచ్ఛేదనేచ్ఛచే నీవును, మీ సేనలకొనరించిన అమానుష, అనైసర్గిక వంచనవ్యాపారములచే వారును, దందహ్యమానమానసులై యున్నారు. కావున, నీకనిట్టివారికియుద్ధమేజరిగినచో, నేనమయమున కేదిసంఘటిలిన నాసంఘటనకుఁదగిన ధర్మసూక్ష్మము లప్పటికప్పు డేర్పడి, మఱియుఁబ్రవర్తిల్లఁగలవుసుమా! రాజనీతియు, మంత్రరక్షణ కళయు బహుదారుణములై, మిక్కిలిసూక్ష్మములై యెట్టుద్రిప్పిన నటుతిరిగెడిస్వభావమున భిన్నభిన్నరూపములందాలిచి, పరివర్తిల్లఁ గలవుసుమ!—పదునొకండక్షోహిణులు మాకుఁగలవు: వారి కేడేకద-యనియనుకొనకుమా! కేవలము సైన్యములే ప్రధానములుకావు జయమునకు! దైవానుకూలతయు నుండవలెను. నీవనుకొనుచున్న నిమిత్తమాత్రోపకరణములగుసైన్యములపై నాధారపడుట కేవలము పశుబలముపై నాధారపడుటయే యగునుజుమ! దుర్యోధన, నిర్బంధ మును, దుర్మానమును దుర్బుద్ధికెకాక తక్కొరులకుఁదగవు. పెక్కం డ్రుమహీకాంతుల మొక్కులందిన ఘనులగు పాండవులను నీనిర్బంధాధికారముచేఁ బడరాని పాట్ల నలయించినావు! నీదుర్మానముచే వారలఁ బలుతావుల నవమానించినావు! నీపలుకుప్రల్లదనముచేఁ దులువలవలె వారినాడిపోసినావు. వారింకను బ్రతికియుండగనే వారిని పండతిలలని యధిఃకరించి మృతాశౌచ స్నానమనుచుఁ దానమాడి నావు. వారుపాండుపుత్రులే కానపుడు నీవూరక తానమాడనేల? నీదుర్మానఫలము ఘోషయాత్రాసందర్భమున నీకు వ్యక్తపడినను

దానికిఁ గారణము వేరొకటిగా భావించినావు. ఇదియేకద ముక్కిడి జనముల మానసపరిపాటి!

ఇఁక యుద్ధపుంబోకడమాటదలంతుమన్న, అమానుష కారణములుగల యుద్ధములలో రణధర్మములకుమారుగ మారణధర్మములె ప్రధానములు కాఁగలవు. మఱియు నారంభించినది మొదలు యుద్ధమెప్పటికప్పుడు మంత్రరక్షిత మగుచునే యుండును. కావున నే నీవాంఛితసమరపర్యవసానము నిపుడొకింతయైనఁ దలంపరాదంటిని.

దుశ్శా:—(తనలో) అన్నా! కార్యము ముదురుచున్నదే!

(ప్రకాశముగా) మనపితృపితామహాదులు, నీకాప్తులై, నీకు మేలెఱిఁగించు తెఱంగిదికాదు. వీరుచెప్పినచొప్పున నీవు సేయకున్న, నీకృష్ణునకు నిటు మనవారే యొప్పగించి, నిన్నెట్లేని యొప్పించి, తుదకు నినునొప్పింతురు. ఇంతేపట్టు నిజము. ఇచట నీవుండుట నీతలంచిన కార్యమునకును, నీకునుంగూడఁగీడుకల్పించుకొనుటయే యగును. ఇంతకును నీకిక్కడఁ బనియేమి? రమ్ము—లేచిరమ్ము—ఇది యీ పెద్దలకేతగినసభ!

దుశ్శాసనుఁడిట్లనుచుండు తడవుగ, దుర్యోధనుండు దిగ్గన లేచి సభాభవనము వీడి వెడలినాఁడు. కురువృద్ధులనెల్ల ననాదరపఱచినాఁడు. దుశ్శాసనుని విశ్వసించినాఁడు.

దుర్యోధనుఁ డట్లు వెడలుటయే తడవుగ నాతని వెనుకఁ గర్ణుఁడును, శకునియు, ననుజబృందంబును, తనుజతతియు, సఖులును మనుజపతులును దోరణముంబోలె, చీమల బారులాగున నచ్చటు వీడి వెడలిపోయిరి.

సభ వెల్వెలవోయినది. నిశ్శబ్దనినదములు పెల్లుగ నుప్పవిల్లినవి.

మ్రాన్పడినభీష్ముండు కొండొకవడికి లబ్ధచేతస్కుండయి—

"ఔరా! దురభిమానియై, అహంకారపూరితుఁడై, క్రొవ్వియై, తానుం గూడ నొకమహారాజననుకొని ఈర్ష్యాగ్రోషము లొకవంకయు, మదమాత్సర్యము లింకొకవంకను, దన్నుద్రిప్ప, దుర్బోధనములచే మతిసెడి, యీ దుర్యోధనుఁడు లేచిపోవుచున్నాఁడు. మఱి యాతని మిత్రగణంబుమాత్ర మిందుండఁగలదా! మాయురే! ఏమి పౌరుషము! వీరంపఱికును జేటుకాల మాసన్నమయినది!

యదువంశోద్ధారకా, నీవు వచ్చినను, నింతయగుటను మఱి నీ నేరము లేదులే! నీవనినట్లు, జనసామాన్యముగాని, విపరీతబుద్ధులగు పండితమ్మన్యులుగాని, దైవపౌరుషముల సంప్రదాయ మెఱుంగఁజాలనివారుగాని, యేమనుకొనినను మానవ

ప్రయత్నమునకు లోపము రానీయకుండఁ జేసితివి: అంతియె చాలు; నీ వెలయందిమిడి యున్న జగత్కళ్యాణపరంబగు మూలసూత్రమును బోల్చుకొని సంతసించెదవాఁ డొక్కండవైన నీ విశాలజగత్సృతనం దేకాలమునకైన నుండకపోదుగదే!"

—శ్రీకృష్ణుఁడు—

మహామానియు గర్వాంధుండునగు నీతఁ డిప్పు డిటనుండి యిట్లు లేచిపోవుట, నామాట ప్రత్యక్షమునకుఁ దార్కాణమగుచున్నది. ఈ సభాసదుల నవమాన మొనర్చుట యని యెఱుఁగఁ దగినకేమున్నదా!

ఇందు కేమియు మాకు బ్రత్యుత్తరమీయ నేలా!

వీరిచే నానాఁ డబ్బాయిలో కృష్ణయు నిప్పు డీ కృష్ణుండును నవమానితులైనారు. ఔరా! సముద్రుండయ్యు నీకృష్ణుండు కార్య గౌరవమున నింకను మిన్నకుండవలసినదేనా? ఇంత దుర్మానముతో నున్న యీతని గర్వ మింకను జెల్లనీయవలసినదేనా? పరధర్మము విస్మృతినైన నొల్లని యీతని నిర్బంధాంధకార మిట్లింకాలము నడువనీయ వలసినదేనా? తనకిష్టులు కానివారు మఱియెయ్యెడలనైన నుండరా దను నీతని యీప్సితములింక నిట్లే నెరవేరనీయ వలసినదేనా?

ఔరా! యింతటి దీమాత్సర్యమహిమము! మనయువయువము లలో నేడ దుష్టాంగంబైన నర్బుదాని చికిత్సకుఁడు శస్త్రముచేసి, శేషాంగ శ్రేణినైన రక్షించునట్లు, కూర్పరుఁడును, రూపాందిన దుస్సంకల్ప ప్రేరణ యునగు కంసుని వధియించి నూతనితండ్రియగు నుగ్రసేనుని, కంసకృత కారాగారమునుండి విముక్తుంజేసి సింహాసనమున మఱల నాతని బ్రతిష్ఠితుంజేసి, తత్కాలము నిలువంబెట్టినరీతి, నిప్పు డీ దుష్టుని, నీ యమానుష కార్యావలంబకుని, నీయలౌకిక పాపతంత్రుని, వధియించి యేల కులమును రక్షించుకొనరాదు! అంతతో నీవిపత్కాలాంధకార మడంగి భారతభూమి తేజోమయము కాఁగలదే!

— ధృతరాష్ట్రుఁడు — (తనలో)

అన్నా! కార్యము తప్పినచ్చినదే! కృష్ణుని యాగ్రహశక్తికి సభాసదు లేమి ప్రత్యుత్తరంబిచ్చి, నాకొడుకును గ్రక్షవశంబొనర్తురో కద! అన్నా! నేనేమియుఁ

జేయంజాలనయితిని! కృష్ణుఁడు పౌరుషమున నెంతసేయవలయు నంతయుఁజేసిచేసి, తుట్టతుదకు దండనమునఁగాని జరుగనిపనియిదియని తలంపవలసివచ్చినపుడు, మఱి కార్యాచరణమునుపట్ల వెనుదీయువాఁడు కాఁడు! నీతిధర్మములసమముగఁ బాలించు ధీరుల మెచ్చునకువచ్చునట్టికార్యము లేయయ్యును, నాకొడుకును నేనువధియించుట, వంశము నిష్కళంకముగా సేయుటకే యగుఁగాక తాను తనమేనమామయగు కంసుని వధియించుటవంటిదిగా నీవేఁడు తలంచుటయును, శస్త్రచికిత్సకుఁడు రోగియొక్క దుష్టాంగము ఖండించి శేషాంగ శ్రేణినిరక్ష సేయఁగలఁడే కాని, స్వాంగములలో దుష్టాంగముననైన స్వయముగ ఖండించుకొనసమర్థుఁడు కాఁడనియు నీకృష్ణుఁడు తలంపఁజాలకుండుటయు, శోచనీయముకాదా! అట్లయ్యును దుష్టజనసంహారము తనపూనిన మార్గమును, శిష్టజనరక్షణము తనకభిమతమును అనిలోకులనుట నిక్కనియుండును.

(ప్రకాశముగా) వాసుదేవా, తొందరపడనక్కఱలేదు! వీనికొల్ల బుద్ధిమంతురాలు. ఆమె బుద్ధులు చెప్పి వీనిని దేర్పఁగలదు. కావున నామెను బిలిపింతును.

తమ్ముఁడా, విదురా, నీవుపోయి గాంధారిం దోడ్కొనిరమ్ము.

* * * *

విదురుండేగి గాంధారిందోడ్కొని మరలివచ్చెను.

కృష్ణుని చివరమాటలతో సిద్ధమయిన యుగ్రపరిస్థితుల నెంతేసులువుగ నీయాఁటికేయుండుమార్పఁ బ్రయత్నించెను! అపాయమేతటస్థించుననితలంచియు, శిశుపాల వధ తనమనసునకుఁదట్టియు, కావలయు, నీవైచిత్రవీర్యుం డిపుడేగొత్తు నెత్తి, తాననుకొనినపరిస్థితుల నిట్టె తారుమారొనర్చి, తాను తప్పుకొనెంచినాఁడు! కాని గాంధారివచ్చినపిమ్మటనైనఁ బరిస్థితులింకెట్టిరూపమాకారముఁదాల్పనున్నవో!

* * * *

గాంధారియు విదురుండును సభలోనికివచ్చి కూరుచుండిరి

— గాంధారి —

మహాప్రభూ, నీకొడుకవినీతుఁడు. నయబోధవలన వినువాఁడుకాఁడు. కురువంశము నంతరింపఁజేయఁబుట్టినాఁడు. మనవాసుదేవునకుంగూడ విసువుజనింపఁజేసె, సభవారినెల్లర నవమానపఱచి, సభాపతియనుమతినైనఁగొనక, యావలకేగి తనతోడియవినీతులతో నేమోమో దుర్మంత్రంబు లొనర్చుచున్నాఁడట!

ఎవరేమన్నను, నీచేతికడ్డముపెట్టువారెవరు! నీవ సర్వాధికారివి. ఇచ్చిపుచ్చుకొనుటలలో, నీకొడుకుతో నేమిపని? అవినీతుండగు దుర్యోధను నెటేఁగిరొటేఁగి

ఒరులఁ జెఱుపఁబూనినచోఁ దానె చెడును. ఒకరిని వెక్కిరింపఁబోరాదు: నాయనా, వెల్లకిలఁబడుటయె తుదకగును–మఱినీఘోషయాత్రయం దేమాయెనది? అడవులలోఁ బడిరక్కసిమూఁకలచేతనో, మ్రుక్కిడిమృగములచేతనో, చత్తురని యెంచి పాండవులను ఖాండవమున నుండుమన వారేమైరి? మఱింత వర్ధమానులైనారు! వారికి మఱింత బలము సేకూరినది. నీదుష్ప్రయత్నములలో నొకటరెంటనైన, నీయీప్సితము నెరవేరమిం జూచి, యంతలి యీశ్వరేచ్ఛ నెఱింగి యంతతో నీసంకల్పముల నీప్రయత్నముల ఖండించుకొని విరమించుకొనవలసి యుండెను. కాని నీవట్లొనర్చినావు కావు.

నీతండ్రిచేతులయందే సర్వాధికారము నిమిడియున్నను, దానిచ్చివేసినఁ దన్నడ్డువారేరును లేరని యెఱింగియు, ఒకయెడ నీవే యుద్ధమున జయించినచో, మఱి ముందెన్నంటికిని దాయసామంతములు లేగవుకదాయని కానోపు, ఈకురురాజ్యాణి పాండవులకుఁ దవకుఁదోచిన దిచ్చి వారితో మైత్రినెఱపఁ బ్రయత్నింప సాహసింపఁ జాలకున్నాఁడు. వారెంత కావలెనన్నారని ద్రుపదపురోహితుఁడన్నను, వారికెంత యిమ్మని సంజయుం డనుపినను, యిపుడీకృష్ణుఁడు సంధియొనర్పవచ్చి, యేమేమియో గొడవలు చెప్పి, నీవాపములెల్ల ఖండించుమఁ బాండవులకుఁ గలస్వత్వమును అధికారమును వృథపఱచుచు, నేమిమ్మనినను వానినెల్ల నటుండనిచ్చి యేదీ-యెంతయో కొంత-యిచ్చి చూడుము-ఏమాత్రమిచ్చినను, ఏమిచ్చినను, ఏతావున నిచ్చినను, వారు సంతుష్టాంతరంగులై మిన్నకయుండక పోరు. వారట్లూరకుండక, యింకను మనపైనెత్తి రాఁదలంతురేని, నేఁబోయి వారలఁ దూఱియైన నియ్యకొల్పెదః కాదేని, యీవచ్చిన రాజలోకమె వారిని బ్రువ్వదిట్టును. అట్లునుంగాని నాఁడు వారలఁ దూఱుటకు మనకవకాశ మొదవదు.

భీష్మద్రోణాదులును కర్ణశకునిదుశ్శాసనాదులునుంగలసి నీకుజయ మొసంగుదురని భ్రమసెందియున్నావు. కాని నీకే అపజయము కలిగినచో నదియిపుడు నీకు నేఁ జూపఁబోవు పరిస్థితులవలననే కలుగఁగలదు. కనుక జయము కలుగుటకు కావలసిన పరిస్థితుల నేర్పఱచు సామర్థ్యము నీకున్నచో, యుద్ధమునకు సన్నద్ధుండవు కాఁదగును. కానిచో నీక నట్టితలంపు విడుచుటయే కర్తవ్యము.

నీవు—నీబలము—నీపరిస్థితులు.

నాయనా, కంసభీమజరాసంధశిశుపాలాదిమహావీరులం బోలిన వాఁడవు నీవు. నినువంటి మహావీరులు భారతభూమికి అమూల్యాలంకారప్రాయులై, యాదర్శపురుషులై కలకాల ముండఁదగినవారు. నీవు గదాయుద్ధమునఁ బాండిత్యము నొందియున్నావు. దేహబలమున జరాసంధాదులం బోలియున్నావు. నీవు నీవారు

వలెనే దేవబ్రాహ్మణపూజాధురంధరుండవయ్యును పెద్దవారితోడి సాంగత్యము నేసి పెద్దలపేర్మించి యనుకువ నేర్చినవాఁడవు కావు. నీకు దుర్మంత్రాలోచనము ప్రధానమైపోయినది. నీయుగ్రధార్ష్ట్యతకుఁ దగినంతబుద్ధిబల మలవడమి నీపరిస్థితులను, దేశకాలపాత్రములననుసరించి, పరిశీలనతో వివేకముతోఁ బోల్చుకొనఁజాలకున్నావు. నీవెవరెవరిని నమ్మియున్నావో, వారివారిమనోగతులును, భావములును, తెలియంగలేక, చెడిపోవనున్నావు. నీవు సంపూర్ణముగ నమ్మియున్న యీ భీష్మాదికురువృద్ధులును, ద్రోణాదిగురుజనమ్ములును నీమేలుగోరువారేకాని నీ కనిమొన జయ మొసంగలేరు.

—తన మేలుగోరి, లోకకల్యాణ మభ్యర్థించి, మేమెంత చెప్పినను వినిపిడని యీతని ననుసరింపు బనిలేకదా మాకును దప్పనిసరియైన దీనపత్రియాము— అని మానసమున నినుదూర్చి విసువును, అసంతుష్టియు నొంది, అనిష్టముతోఁ జూమీ యుద్ధమునకుఁ దిగుచున్నా రీభీష్మద్రోణాదులు! నీహీనకార్యములవలన నీయెడ ననాదరమును, నీపలుకుఁబల్లదనములవలన నీయెడ నేవయు, నీదుస్సంకల్పములవలన నీయెడ విరక్తియు వా రొందియున్నారు.

నీపెట్టినపాట్లను, నీవొనర్చిన మోసకార్యముల నప్పటికప్పుడు నేర్పున సహియించి యనుభవించి యెప్పటికప్పుడేమారు సేయనొల్లక తగినతరుణమునకై సుమా, పాండవులు వేచియున్నారు. వారియెడ సానుభూతియు, కనికరమును ప్రేమయుఁ గలిగినభీష్మాదులె కాక, వారికి సాయమొనర్ప నెంచివచ్చినవారందఱును వారియెడ సంపూర్ణసానుభూతితో నున్నారు. ఇఁక నీకు సాయమొనర్ప నెంచి వచ్చినవారందఱును దమతమ ప్రత్యేకకార్యముల నెఱవేర్చుకొన నెంచి వచ్చినవారేకాని, నీయెడ సంపూర్ణముగ నభిమానము కలిగి వచ్చినవారు కారు.

ఎవనిని నీవు రాజును జేయఁదలంచి అంగదేశమునిచ్చి నీకడ సచివునిగఁ జేసికొంటివో యా కర్ణుఁడు నీవైరిబృందములో నొక్క యర్జునుమాత్రమే తనకుఁ బ్రధానవైరిగ నెంచియున్నాఁడు. తన కర్జునుపై నలనాటి యస్త్రవిద్యాకౌశలపరీక్షాసమయమునం జనియించిన మత్సరము వైరివర్గమునందలివారే రాతని కనులయెదుటఁ బడినను కీడుఁ జేయఁదగినంతటిదిగా యున్నది. ఆహవరంగమున సర్వదా యర్జునునే యన్వేషించు నీకర్ణునిదృష్టి యన్యవైరులఁ జూడంజాలదు సుమా! ఈతండింతటి తీవ్రప్రయత్న మొనరించుచుండ నాయర్జునుం డీతనికిఁ జిక్కునా? చిక్కినను వీని కపుడే దానిచిక్కు తటస్థించియుండకున్న కదా యర్జును నెదిరించుట! కర్ణుఁ డలసిపోవక యస్త్రములన్నియుఁ దనస్వాధీనమున నున్న తఱిఁ జిక్కినచో, యర్జును నిర్జింపఁగలఁడేమో;

కానిచోఁ బ్రాణతుల్యుం డని నీవనుకొనుచున్న యీ కర్ణుం డేమిమేలు నీకొనఁ గూర్పఁగలఁడు? నీ వపు డనన్యగతికుండవై, చింతించుచు నీతలఁ దాచికొనుటకుఁ దగిన తావు వెదకికొనవలసినదేమో, యెవని కెఱుక?

శల్యుం దోడ్కొనివచ్చినావే! పాండవులలోఁ గవలవారి కీశల్యుం డేమగునో యెఱుంగుదువా? శల్యుని సోదరియగు మాద్రీసుతులు కారా యాకవలగు నకుల సహదేవులు! మఱియుఁ దనకూఁతు విజయను సహదేవున కిచ్చినవాఁడు కాఁడా!

నీశిబిరమున నక్షౌహిణీశేషము లున్నదని గ్రహింపలేకున్నావో లేక రానయియున్న వినాశహేతువు నీబుద్ధికి మాంద్యత ఘటిల్లఁజేయుచున్నదో? కాని నీసేన, నీనాయకులు, వారివారి బాహుబలము లటుండనిచ్చి నీకుసాయ మొనర్పవచ్చిన వారిమనోవృత్తులను, వివేకముతోఁ జర్చించుకొనువారి కీమాత్రము తోఁపకపోదు. మఱియొక పెద్దమాట:—

నిరాయుధుండనై యుందు ననినందున కద, శ్రీకృష్ణునివీడి యాతనిశిక్షణం బెఱిఁగిన పదివేలకంచురథాల నారాయణగోపాలుర నెంచుకొని, వచ్చితినని మొన మొన్న నాతో ననియుంటివి. కేవలము బాహుబలముపై నాధారపడువారందఱు నట్లేతలంతురు. అట్లనుటనెకద, నీయెంపుడులో నున్న యొక పెద్దలోపముం దెలిసి కొనఁజాలకున్నావు. నీవు తోడ్కొనివచ్చిన యీ నారాయణగోపాలురు కృష్ణుని సేనయగుటను, అర్జునరథముపై నొగలఁగూర్చుండి రథమునడుపుచుండిన కృష్ణుని మొగముసూచుచు, నాతని సైనికు లాతనిరథికునిపై శరపరంపరఁ బరుపఁజాలరు. మఱియు నిప్పటివఱకును నెవనిచేఁ బరిపోషితులయియుండిరో, యీయుద్ధమునఁ దాముచావక మిగిలియున్నచో, యుద్ధానంతరము మరల నెవనితావునకుఁ బోవలసి యున్నదో, అట్టి కృష్ణుని మొగముసూచుచు ధనువు నెత్తఁగలరా? ఎత్తినను, బాణము వేయఁగలరా? వేసినను, నయ్యది గురితప్పెడి, వృథయయి, నీకున్యాయ మేకూర్ప కుండునా? కావునవారిపై నీ వాధారపడకుము. నీ విఁక నెవరిపై నాధారపడఁగలవు? భీష్మద్రోణకర్ణశల్యులమాటయిట్లయినది. పదివేవురుకంచురథాలవారిమాటయిట్లయినది. ఇఁక మిగిలినది నీబాహుశక్తి! నిరాయుధుండయ్యును, బరమాప్తుండయి రథముతోలు చుందు ననినకృష్ణుండు, కదనరంగమునఁ బాండవు లొనర్చునట్టి కృత్యములకేని, యకృత్యములకేని, ధర్మసూక్ష్మముల నెత్తి చూపించుటో, కల్పించి చెప్పుటో, చేయుచుండుటయేగాక, వారికష్టముల ధైర్యమునొనఁగూర్చుచు, సానుభూతి నెఱుపుచు, మీ రిప్పటిదాఁక వారికొనర్చిన యపకృతుల, అవమానములకుమిథ్యాపచార

ములనుగ్గడించుచు, గోరంతలు కొండంతలు సేయుచు, చెప్పటికప్పుడు తన మంత్రాంగముచే పాండవేయులను, వారి సేనను, బరిహాసము సేయుచు తనకేమియు సంబంధము లేనియట్లుఁ బ్రవర్తించుచుండె, నీకకాదు సరిగదా, నిను బుట్టఁజేసిన యా బ్రహ్మకైన నలవరము కాదుసుమా వారిని నిర్జించుటకు! నీసేనానాయకులో, నీమిత్రులో నీమేలుగోరువారో, వారెవరెవరే యేతెరఁగుఁ బ్రవర్తించినను, వారందఱు నేకీకృత మనస్కులు మాత్రము కారు. ఏకవాక్యతయే లేనియప్పుడు, ఏకకంఠ్యత మాత్ర మెట్లు వచ్చును? నీకుఁ బ్రాణమిత్రుఁడవలె నీవనుకొనుచున్న కర్ణునకును, భీష్మద్రోణకృపాశ్వత్థామలకును, బొత్తుగఁ బుట్టియేయున్నదికదా! ఒకరి పరాభవ మింకొకరు కోరుచున్నారని వినుచున్నాను. వీరందఱును సవతులేని సమరపాండితీ మహిమాన్వితులై యున్నను, వీరేకీకృతమనస్కులు కారు. వారు నీయందు నిష్పక్షపాతముగ నుండుటకుఁదోడు పాండవులనె యభిమానింతురు. విలువట్టిన విదురుని కెదురె యనునానుడి విందుమే కాని, యాతఁడెన్నఁడును కార్యోన్ముఖుండు కాఁడు. కార్యోన్ముఖుఁడైనను, గినుకను నీజనకుం డాతని నొకసరి పెద్దలనన్న పాండవుల కడకుఁ బోవునె ననుహృదయావేదన నొందుచు నుండుట నాతఁ డేవిధ సాయమొసఁగఁగలఁడు? శల్యుఁడుఁగూడ పాండవులనే యభిమానించునని తోఁచుచున్నది. కాకుండిన, నీకు సహాయము నర్పవాగ్దానమొనర్చియు వారినిఁ జూడఁబో నేల? ఇంతకును దనయల్లుండగు సహదేవుని గొట్టిమి కోర్వఁగల్గునే! తుదకు, నీకుప్రాణసఖుఁడని నీవనుకొనుచున్న కర్ణుఁడుగూడ, ఒక్క యర్జునుపైఁ బగసాధింప నెంచుటచే నొకరీతి నాతండును బాండవులయెడ నభిమానము నూపినవాఁడె యగునేమో! ఇట్లగుట నీసేనానాయకులందఱును, ఏదో విధముగఁ బ్రతిపక్షుల నభిమానించువారే యగుచున్నారు. ఇది నీవుపోల్చుకొనఁ జాలకున్నావు. పాండవులదెసనున్న వారిలో నెవరేని యేకారణముననైన నీయెడఁ గనికరమును సానుభూతియుఁ జూపఁగలవారున్నారా! ఉన్నారని తలంచుటకైన నవకాశమున్నదా!

పాండవులకు నీకున్నంత సైన్యమును, ఇందఱు వీరులును, లేకున్నను, నీపక్షమునందలి దౌర్బల్యసూచకములౌ బహునాయకత్వము, నీశిబిరమున భిన్నాభిప్రాయములు, నీసహాయులలో నంతఃకలహములు, ఇతరరాజలోకము వలని సానుభూతి లేమి, జనసామాన్యపు టభిప్రాయవైరుధ్యము —నను మన లోపములు వారికి మార్బలములయి యున్నవి. ఇందుకుఁ దోడుగ పాండవులు మిక్కిలి నేర్పున, రాజనీతి నుపయోగించి కొన్నిచోట్లను, మానవమానస తత్త్వవిదులై, లోకపు

లెఱిగింతువను జ్యోతిశ్శాస్త్రవిశారదు లేరేని, నీకు విజయము కలుగఁగలవని భావిం దెలిపిరా? లేక స్వప్నావస్థలో నీకేదేని జయమునఁగూడకతప్పదను మాటదొరకెనా? ఇట్టివృత్తాంతములు స్వప్నప్రాయములై, స్వప్నభూతములై, మొదట ధైర్యమొసంగి తుదకు దుర్బలునిఁజేసి, మోసగింపఁజేయునుజుమా! స్వప్నవృత్తాంతములు నిజములనుగొని పాడుపడుదువని యీపు డింతమాత్రము తెలుపవలసివచ్చుచున్నది.

*  *  *

అయ్యో! గాంధారీ, యెంతమాత్రము చెప్పినావు! ధర్మంబును, నీతియును, లౌకికంబును, ముచ్చినపైచి, నీసుతుబ్రదుమఁదెరుసనుముకి పైచి, లోకసంగ్రహవృత్తియను సూత్రంబునుజూపినావు! నిజశక్తిని తెలియఁజెప్పినావు! దుర్యోధనునకు దొరికినసహాయంబులకొలందియు బోధించినావు! కులజనచిత్తప్రకారంబులఁ బ్రకటించినావు! పాండుపుత్రుల బలపరాక్రమంబుల నుగ్గడించినావు! కన్నకడుపని బుజ్జగించినావు! కూరిమియని కినిసినావు! ఇట్లనేకవిధంబులఁ దెఱంగుపడం బోరలినావు! కాని యిసుమంతయుఁ బ్రయోజనము లేకపోయినది.

నీవెంతమాత్రము కొడుకునకు బోధించినను, నీవూహించినట్లాస్వప్నభూతను దెంతటిదారుణశక్తికలదియో కాని, దుర్యోధనుని సహజమూర్ఖతతోఁ బాటు మెండిధైర్యమును మఱింత దృఢపఱచుచున్నది.

*  *  *

ధృతరాష్ట్రుఁడు తనపై నేమియుఁ దోషము వ్రాలకుండుటకును దనకొడుకు కృష్ణునకుఁ జిక్కకుండుటకును, అప్పటికిరూపించిన యుగ్రపరిస్థితులను మార్చివేయుటకును, నిను సభకుఁదెప్పించుట యను ఎత్తువేసినాఁడే కాని తాననుకొనిన యుగ్ర పరిస్థితుల మార్పుటయు కొడుకుమనస్సు ద్రిప్పుటయు లోనుగాఁగల అభ్యర్థిత కార్యముల నదియొనర్చునో లేదో కాని చక్రవర్తియు, సర్వాధికారియునగు నీవిచ్చిన నీచేతి కడ్డమెవ్వరను నీ పలుకులచే, నిన్నును గొడుకును నడ్డముపెట్టుకొని తప్పుకొనెంచిన ధృతరాష్ట్రుని దెసకే భారమంతయు నొఱగినది!

గాంధారీ, నీవు సభాభవనమునకువచ్చి క్లిష్టపరిస్థితుల నన్నింటిని యిట్లా మార్చివేసినావు! భర్తకదాయని యాతనియెడ, నేమాత్రమును బక్షమువహింపక ఉన్నదియున్నటుల వచియించినావు! నీభర్తకుఁగలస్వాతంత్ర్యము దెలియఁజెప్పి ధైర్యము గొల్పినావు! ప్రయోజనముండునేమో యనిచూచినావు! కాని హృదయధర్మమును, మనోవృత్తమును, వాక్ప్రకారంబును నేమాత్రము నేకంబుసేసి

కానఁజాలని ధృతరాష్ట్రునిపక్షమున నేమియుఁ గార్యకారి యైనదికాదు.

అదిగో! నీవెంతచెప్పినను ఔననక, కాదనక, మాఱుమాటాడక, దుర్యోధనుఁడదె మరలసభవీడి,మగిడిపోవుచున్నాఁడు. ఔరా! ఏమిమౌర్ఖ్యము! ఎంతదురహంకారము! ఎంత మెయివడిగల వడవడి!

దుర్యోధనా, పోయినవాఁడవు అట్టెపోవక యల్లటనిలచి, నీమంత్రులతో యోచనల నెఱపుమన్నా వది యేమోయి? దుర్మంత్రము కాదుకద? అశక్తిచే దుర్జనులుచేయు మంతనపుటాలోచనలు కావుగద!

సభాభవనమునకావల సుయోధనుఁడు:—

అంగరాజా, వింటివికదా యాదవుని ప్రసంగమంతయును! తానుపూర్వము కంసునిఁజంపినట్లు నన్నును బరిమార్పఁదలంచి ఆభావములను సూచించినాఁడట! శిశుపాలాదులంబోలె నంతకుబువుగఁ జేయఁదలంచినాఁడు కావలయు!

తనమాటకొగ్గినదికాదుకదా యని తుట్టతుదకు మాయమ్మనుగూడ సభకుఁ దెప్పించి నాకుబుద్ధులు చెప్పించినాఁడు! నీతులుగఱపు నెపమున నిండుకొలువున నన్నెంత పరిభవమొనర్చినాఁడు!

దుశ్శాసనా, మఱి మన మాలసింపఁదగదు. మొదట మనమనుకొనినట్లీ యొక్కనింబట్టి చెఱవెట్టినచో, రెక్కలువిరిగినపక్షులయి పాండవులు తేజముం దూలుదురు. కార్యప్రణాళికయు మన కిట్టె సూక్ష్మము కాఁగలదు. అట్లయ్యును వారుప్రయత్నంబులుడిగి యూరకుండక మనపైనెత్తివచ్చిరేని వారి నిట్టె నిర్జింపనగు. కోఱలు లేనిపాము లేమిసేయఁగలవు! కావున దుశ్శాసనా, మున్ముందుగ నీకార్యమున కాయత్తపడుము. మఱి యాలసింపకుము. బలమైన బలుపగ్గముం గొనితెమ్ము.

అని తనవారికిఁగట్టడి యొనర్చి సుయోధనుండును బ్రయత్నోన్ముఖుండయ్యెను.

ఈవల సభయందు దుద్భవిల్లిన అపూర్వమగునిశ్శబ్దనినదంబులు పెల్లుబ్బెను. ఒకరిమొగ మింకొకరు చూచుకొనుచుండిరి. కృష్ణుం డేమోయోచించుచుఁ దలపంకించుచుఁ దన నునుబొజ్జ సరిదిద్దుకొనుచునేయుండెను. సభాప్రవేశసమయమున దుశ్శాసనునిచే స్వయముగఁ గొనితేఁబడినపీఠములపై శౌరికిరుప్రక్కల సాత్యకికృతవర్మలు గూరుచుండియే యుండిరి. దామోదరునకుఁ గుడిప్రక్కనున్న సాత్యకి బహువ్యాపకదృష్టికలవాఁడౌట సభవీడి వెడలినదుర్యోధనుఁడు తన యనుజబృందముతోఁ దన మంత్రివర్గముతో మాటమున నెఱపుచున్న బుడిబుడిమాటలసవ్వడియు, చెవులలోఁ జెప్పుకొనుచున్న రహస్యముల లీలలును, మంతనపుటాలోచనలస్ఫురణలును, సౌజ్ఞలును, దృటికాలమున

వంపఁబడి నేడకోపోవుటయును, మళ్లఁగట్టియుటయును, నుఱియూఁపుటయు, నెఱుంగు టను దవ్వులనుండి నడిచివచ్చి పగ్గమువట్టికొని యారు దేరనున్న దుశ్శాసనుంజూచి హరింబట్టి కట్టఁదలంచినవాఁడ్రతాంగముగా నద్దానినెఱింగియు నిలిచి "కృతవర్మా, ఈపాపులందఱును నన్ను దెస నిర్భయముగ దోసపుటూహ నొంద జేయుచున్నారు. కార్యము తప్పివచ్చినది. మనమింకను నాలసించితిమేని పరిస్థితి భీషణాకారము దాల్చును. కావున నీవు మనబలములతో వాకిటఁ గావలయుండుము. ఈలోపలికెల్ల నేనొక్కఁడరుగుచుఁజాలుదు. లోపలిపరిస్థితులంగూర్చి యవలోకించుచుందుము." అని సాత్యకియున కృతవర్మయు నప్రమత్తుండయి యావలఁ గావలయుండఁ బోయెను.

సాత్యకియు "అన్నా, వింటివే!" యని, తానెఱింగినయవి యాతనికి రహస్యముగఁ దెలియఁజేసెను.

—శ్రీకృష్ణుఁడు—

(మందస్మితముఖుఁడై)— ఐననేమాయె! ఇం దేమి రహస్యమున్నదని నా చెవిలోఁ జెప్పుచున్నావు? ఇంతకును నేనొక్కఁడనుండను— వారందఱును గుమిగూడి ననుబాధపెట్టిన నేనేమిచేయఁగలను! కురువృద్ధులతో నీవిషయముం జెప్పిన నుత్తరాధికారినని యనుకొనుచున్నవారి ధీమహిమావిశేషమును, ఆతనిపట్టినయందలి యోగ్యతయును దెలిసికొని వారెంతేని యానందింతురు. కావున నీయుదంతమంతయు వారికి నివేదింపుము.

—సాత్యకి—

కాంభవేశ్వరా, భీష్మబాహ్లీకవిదురాది కురువృద్ధులారా, అదె చూచితిరే! కౌరవులశక్తులగుట దౌర్జన్య మొనరింపఁబూనినారు. ఈకృష్ణునింబోఁవిపట్టి కట్టివేయఁదలంచుచున్నారు. సర్వత్రజయశ్రీకాంతుఁడగు నీరమాకాంతునిఁబట్టిపగ్గములచే బంధింప వీరికి సాధ్యపడునే!

విదురుఁ డుపరిపడి, "వైచిత్రవీర్యా, వింటివే యీవిడ్డూరము! రాజ్యతృష్ణయనెడితంతువులచేబద్ధులగు నీతనూజులు రాధేయాదుల దుర్మంత్రంబులవలన కానోపు దృఢసూత్రసంతతులచే నానిగమములైనను బంధింపఁజాలని యీరూపొందినపరమాత్ముని నెఱుంగఁజాలక మోహితులై బంధింపఁ దెగువఁబూనుట వీరికిఁజేటుకాలమె కాక జగత్ప్రళయమేదేని కలుగకమానదని తోచెడిని." అని యనెను.

—కృష్ణుఁడు—

కౌరవనాథా, నాపయిఁగల్గినరోసముకతమున బహుసంతాప కారణమగుననియైన నెదందలంపక నీసంతానము నాయెడనుద్రేకించి క్రూరముగా నిటుసేయంబూనుట నాకును బరమసంతోషమెయగును. ఇఁక నీప్రభుత్వమర్యాదలతోఁ దగురీతిని నాకుననుజ్ఞనొసంగితేని నేసెలవుఁగైకొనిపోయెద: దోర్బలముచేతదుర్జయులమనియనుకొనుచున్న వారివిద్వేషముఁ నాకుఁజేతనైనరీతి నిట్టిచక్కవెట్టఁబ్రయత్నమొనరించెద. నేనొక్కరుండ నెకదాయని వీరందఱును భ్రమసెందియున్నారు. తామును దనవారునుఁగలసి నన్నాక్రమింపఁ దలంపంది యున్నారు. కాని నేనొక్కరుఁడనని భ్రమించుచున్న వీరలకుఁ దామనుకొనుచున్న దిక్కల్లయనియుఁ దామిపుడుచూచుచున్నది సత్యము కాదనియుఁ దెలియఁజేసిమఱియుఁ బనివిసియెద. దుర్యోధనుండునను బంధింపందలంచి యుధిష్ఠిరు. నిట్టిగ్రతాస్థంజేసెనని నేదలంచెద. భారతభూమికి వీరభిక్షునిడుమని యాచకుండనైవచ్చిననన్ను, బంధుగుఁడనై వచ్చిననన్ను, మీహితమునుగోరుమిత్రుఁడనైవచ్చిననన్ను, దూతనై వచ్చిననన్ను, దానును దనమంత్రివర్గమునుంగలిసిబంధింపం దలంచుట అకార్యమనియైనఁదారుతలంపకున్నను నిట్టియమానుష కార్యమొనర్పవచ్చినవారినెల్ల నిట్టనిర్దించి భస్మమొనర్చి సునాయాసముగ నప్రయత్నముగ నిక్కడనుండికదలకుండగనే యీకౌరవరాజ్యలక్ష్మినాయుధిష్ఠిరునకుసమర్పించుసామర్థ్యమున్నను క్రోధపాపజనితంబులును గర్హ్యాంబులును నగునట్టికార్యంబులు నేనాచరింపనొల్లమి నీవారుబ్రదికిపోయినారు ఇంతకును నీవాప్రయత్నములకేల నేనంతరాయము గల్పింపవలె! కానిమ్ము-రానిమ్ము: బంధనకార్యమ్మొనర్పనిమ్ము: రాజబిడౌజా. ఇఁక నీవల పౌరుషమునను, ఆవల పాండవేయుల వలనను, నడుమ నావలననుంగూడ దోసములేదని యీమునిమనీషులు నిండలిపెద్దలునుం దెలిసికొనిరి. అంతియచాలు—

అంత వైచిత్రవీర్యుండు దుర్యోధనుం దోడ్కొనిరమ్మని విదురు నంపెను.

ఒరవెఱికిన కరవాలము దనకుడిచేతం గొని జళీలునఁ గృష్ణుని సమీపించుచు 'పగవాఁడీతఁడు: రాయబారియని తలంపవలదు. పట్టుఁడు కట్టుఁడు:' అనుచువచ్చుచున్న దుర్యోధనుని, ఆవెనుక నొకపగ్గముం గొని సభం బ్రవేశించుచున్న దుశ్శాసనుని, గాంచిన సాత్యకి 'అన్నా! మించివచ్చెఁగదా!' యని తనకుడిచేతఁ గృపాణమ్ము దాల్చి సింగంబుఁ బిల్లగతిం దూకి ముందుకువచ్చి నిలువ, నాసభయెల్లం బెల్లుఘూర్ణిల్లుచుండె; కాని మఱి యాలతాంతాయుధుకన్న తండ్రిమూనసపు ధైర్య మదెంతకలదో కాని యాతఁ డయ్యెడ నేమేని వేగిరంపడియెనా? రమ్యాననంబందు చిర్నగవు న్మానఁడు; దీర్ఘములౌ నెన్నొస ల్ముడువఁడు; చరణయుగళము నైనఁ గదల్పఁడు; వల్లెవాటును జక్కఁగఁ జేసి కొనండు; నునుబొజ్జం గదల్పఁగఁబోఁడు. కత్తిఁ దూసికొని తనపైఁగవియవచ్చిన యాతనిం జూచియుఁ దనగద్దెనుండి డిగంబలంపకయె సుఖాసీనుఁడై యింకను దనహాయశే బయల్పఱచుచు దుర్యోధను నెదుర్కొనఁ గత్తినెత్తిన సాత్యకిచేయిపట్టి యడ్డిన యద్దానవాంతకుని నిబ్బరమే నిబ్బరము!

శ్రీకృష్ణుని శాంతిగంభీరముఖమండలముపై నెల్లరచూడ్కులును నిల్చియున్నవి. సాత్యకిచేయిపట్టుకొని శ్రీకృష్ణుం డడ్డుటయె దుర్యోధనుని దురుసుదనమ్మున కొకింత యంతరాయము కల్గించినది. అప్పటి నందనందనుని వదనభావగోచులఁ జూడ గోరిక వశీకావలయు నాతనిశిరోభాగమ్మునన్న మయూరపింఛ మించుక ముందున కొఱగుచు తొంగితొంగి చూచుచున్నది. శ్రీకృష్ణభగవానుండును దనయెదుట రాజసతామసగుణాకీర్ణమై, రతనాలకలికితురాయి కాంతులతో రవరవలాడుచున్న దుర్యోధనుని ముఖమండలముపైఁ దనప్రశాంతగంభీరవీక్షణముల సారించుచు దరహాస మొనర్చెను.

—కృష్ణుఁడు—

ఏమి, రాకుమారా! కత్తిపట్టితివేలనోయి! నీవెనుక నీతమ్ముని చేత నాపగ్గ మదేలనోయి! నే నిపుడొకరాయబారి ననుమాటయు మఱువఁజేయసమర్థమైనదోయీ నీరాజసతామసప్రవృత్తి! ఒంటిగ నీయింటఁజిక్కిననన్నుఁ బట్టికట్టి చెఱఁబెట్టినచోఁ గాఁగల నీకార్యమదెల్ల సులభమగు ననితలంచి యీచిన్నతనంపుఁ జెయిదములకుం దలపడఁ జేయదగినంతదైనదోయీ నీయాసురప్రవృత్తి! నీ వనుకొనినట్లు

నేనొక్కరుండనుమాత్రముకాను! నేనన, నీవునుంగలసియే యున్నావు. మఱియు నేనన విశ్వమనియు, విశ్వమన నేననియును నీకుం దెలిపి యిటపై వచ్చు కార్యమునకు బాధ్యత మఱియొక నేరికిని లేదనియు నిండున్న వారి కెఱుకపఱచి మరలెద.

అనుచుండ నమ్మురారి యంతరంగమునం గినుకం దలుపు నలంగొని నగవు సోలుపు తన మొగమునఁ గ్రొత్త వెలుఁగొసంగ నంతకంతకుం బెల్లుబ్బి యరుణ కమలాక్షుండయ్యెను. అప్పుడాతని విశాలలోచనములనుండి యపూర్వమై దుర్నిరీక్ష్యమైన దివ్యదీప్తి వెలువడి సభాభవనమంతయు నొక్కపరి గ్రమ్ముకొన్నయ్యెను. సభాభవనమంతయు నీరవమై, నిర్మానుష్యమైనట్లయ్యెను. సభాప్రవేశద్వారము దాటి లోనం బ్రవేశించి కృష్ణుని సమీపింపఁబోనున్న దుశ్శాసనుఁ డింక నొక్కయడుగైనను ముందిడంజాలక యక్కడనే ప్రాణమ్మది నిలువఁ జేసినట్లు త్రాటఁగట్టి వేలాడియెను. శ్రీకృష్ణునిఁ జూపుచు ఖడ్గపాణియై వలనుగ నిలచియున్న సాత్యకియుఁ దేలినుండయ్యెను. ఆతని చేయిపట్టు సడలుటంగాఁబోలును వసివాడు హస్తమునందున్న కృపాణము నేలరాలెను. —పగవాఁడితఁడు: రాయబారియని తలంపవలదు: పట్టుఁడు: కట్టుఁడు— అని కృష్ణుని వేలఁజూపుచుండు నాతని వామబాహువట్టె కొయ్యబారిపోయినది. రాజునకు వెనుకవైపునఁ గూర్చుండి 'యెట్లగునో!' యనుకొనుచుఁ గృష్ణుని నాట లాఁగించు నాతని ముఖమండలముపైఁ జూపిక్కనిగిడ్చియున్న కర్ణుండు నట్టె నిలిచిపోయినాఁడు. ఒరులకుఁగానరాని యట్లు వెనుక పొంచి పొంచి కృష్ణునిఁ జూచుచున్న శకునియు నచేతనుండయ్యెను. ఆవలఁ గావలియున్న కృతవర్మ సభాభవనాంగణమున హఠాత్తుగ వ్యాపించిన నీరవతకుఁ గారణ మరయఁగా వలయునని లోనికరుదెంచి, చూచి చిత్రిసప్రతిమాంగుఁడై నిలిచినాఁడు. తనదు తిరేతి దాపున వ్రేలు వింతగ గడ్డమున నిడికొని అక్కజముగూర్పు చూపుల మాధవు నవలోకించుచున్న ద్రోణుండును స్థగితుఁడై యుండెను. శ్రీకృష్ణుని గట్టు ప్రయత్నపు వచనములు వినంబడునంతఁ గరయుగమునఁ గన్నుయుగళము మూసుకొనియున్న కురుపితామహుండును అనిమిషుఁడయ్యెను

చేతులు నులుపుకొనుచు ధృతరాష్ట్రుఁడు:—

ఏమి! యీ సంరంభము! నిక్కముగ శ్రీకృష్ణుం బట్టి కట్టిరా యేమి యీ తులువలు! వలదు వలదంత లేసి పనులు! ఇంత లేసిదొర లుండియు నిదియా సేయఁబోవంగిరి! ఈ యరిభంజనుని శక్తి నెఱుంగక,

యాతనికే మీరు గీఁడువాటిలఁ జేయనెంచుట, గాలిని బట్టలఁ బట్టఁ జూచుటయె యగును జుఁడీ! మనసభకు వచ్చెఁగదా యనియు, నొంటరి యనియుఁ దలంచుచుండు మీ రెల్లరును బలుతుంటరులు! తొందరపడి కార్యమొనర్చి కంఠాగ్రమునకుఁ దెచ్చుకొని, మము దుఃఖమునఁ బడఁద్రోయకుఁడు!

ఔను. పాపమీ ధృతరాష్ట్రుఁ డెంతేని బలుకఁగలఁడే గాని, వాని నిప్పట్టున వినువాఁడేఁడీ!

'తన విశ్వమయతం బ్రదర్శించుచు కృష్ణుండు సభాస్థారులఁ సన్మయులంజేయు మహాసంకులంబిది' యని యాంబికేయునకు సంజయుండు దెలుప ధృతరాష్ట్రుండును దన కంధత్వంబు దొలంగి విశ్వాత్మక స్వరూపంబు దర్శింపఁ దగు దివ్యదృష్టిఁ బ్రసాదింపఁ బ్రార్థించి, తద్భాగ్యంబు వడసి విశ్వరూపాకృతిం గాంచి కృతార్థుండయ్యెను. సభాస్థారుండనలును నన్ని విధంబుల నవ్విశ్వమయుం గీర్తించిరి. నారదాదుల ప్రార్థనం బంగీకరించి, తననిజవిశ్వరూపప్రపంచంబు నుపసంహరించి శ్రీకృష్ణుండు నిలచి, "సభార్యై నమః" యని యనుజ్ఞవడసి, మునీంద్రుల నామంత్రణంబు సేయ నమ్మహాత్ము లంతర్ధానంబు నేసి తానును సముత్థానంబు నేసి యంతకుమున్నె సన్నిహితులైయున్న కృతవర్మకరంబును సాత్యకి చేయియు నవలంబించి యారక సభాభవనంబు వీడి చనియె. జరిగిన కథాక్రమంబునకును, శ్రీకృష్ణుం డత్తెఱంగున వెడలుటకును నడలుగొని, విస్మితయై గాంధారియు నభ్యంతరమందిరంబున కరిగె. కౌరవులెల్లరును బంధుమిత్త్రసహితంబుగఁ దనతోడన వెడలిరా కృష్ణుండును మొగంబు గంటువెట్టుకొని కక్ష్యాంతరంబులు గడచి చనఁజన నవ్వల దారకుండు తేరినొగలపైనుండి పాదనూపి కేలుమొగిడ్చి ఫాలభాగంబునం గదియించె. కృష్ణుండును దత్ప్రదేశంబున నిలిచి వారలదెస మరల్చిచూచి 'మీ రికనిలువుం' డని పలుక సంజయుండు తన్ను బోదివికొనినదుడువ నాంబికేయుండు దైతేయమర్దనుం జేరి నిజతనూజుల నుపలక్షించుచు:—

—హే కృపాజలనిధే! నేను నీకు వశంవదుండనగుటఁ దెలిసి కొంటివికదా! సమస్తబంధుమిత్రగురుజనకోటికిని, నీధాత్రీజనుల కెల్లరకును, దెలియుటయెకాక, నేను నిర్దోషినని నీకుఁగూడఁ దెలిసిన దంతెచాలు నాకు— ననియె.

భళిర! ధృతరాష్ట్ర, భళి! అహర్నిశము నీకడకుఁ గృష్ణుఁడంపిన దాదిగ నాతఁడు నినుగుర్తించియే యున్నాఁడని యెఱుంగ వోటు! సంజయుచే నీవంపిన

వార్తల పరమార్థము నాతఁడెఱుంగలేఁడని దలంచితివోటు! ఇపుడు సభను నీవు నెఱపిన కార్యవిధానము నాతఁడు బోల్చుకొనలేఁడని యూహించితివో! నీ మానస పరిపాటి యాతని కభేద్యమని తలంచితివో! లేక విశ్వరూప ప్రదర్శనముతో నాకృష్ణుండికముందేమి సేయునో యని దిగులుపడి యిపుడాతని వెంటఁబడి నుడివిన నీ లొంగుబాటుమాటలను, నీకలుపుగోలుతనము జూపు పలుకులకుఁ గృష్ణుఁడు నిను మెచ్చు ననియో యూహించితివా? కృష్ణుఁడిపుడు నీవచోరచన నెట్లు పరిగ్రహించునో, ఆతని ప్రత్యుత్తరమువలననే కద మేము నగ్రహింపవలెను! అదె కృష్ణుఁడే మోయనుచున్నాఁడు.

— కృష్ణుఁడు —

భీష్మద్రోణకృపబాహ్లీకప్రముఖవిశిష్టులారా, ఇపుడు సభను జరిగిన సంభాషణంబులును, పుట్టిన విడ్డూరంబులును, గాంధారీదేవి పలికిన పలుకుల ప్రకారంబును, వినియుఁ, జూచియు, గ్రహించియు నున్నారుకదా! ఇపుడీకురురాజు—తనవలన నేరమే లేదనియు తాను నాకు వశంవదుండననియు,—తప్పుకోలు పలుకులచేఁ దననందను కార్యకలాపమునకింకను మెఱుంగుపెట్టుచున్నాఁడు. తానిందులేకున్న నింతలు పుట్టవనియు, నీతగ వింతదూర మిట్లు నడుపదనియు, నే నొత్తిచెప్పి జరాభరంబున నున్న యీతని మఱింత కంపితగాత్రు నిగఁజేసి, నొవ్వఁజేసిన కొలఁది గట్టుకొననేల? ఈమేదినీవిభుఁడే యిట్టు లనియెంగావున నిఁక నాకిటఁ దడయంబనిలేదు. ధర్మజునకీయుదంతం బంతయు, నివేదింపవలయు.

అనుచు మోమునఁజీకాకు దోఁపఁ గృష్ణుండరదంబు నెక్కి కుంతియింటికిఁ దేరునట్టుమని సూతునకానతిచ్చెను. సంజయుందోడ్కొని ఆంబికేయుండును నిజమందిరంబునకేగెను. కురువృద్ధులును, ధార్తరాష్ట్రులును మంత్రివర్గంబును, బంధుకోటియుఁ దనయరదంబునంటి రాశౌరి కుంతీమందిరోన్ముఖుండయ్యె. దుర్యోధనుండును యందఱిఁ గలిసి నడచుచుండెనే కాని యాతని మానసమెన్నెని విచారములనందుచునేయుండెను.

— దుర్యోధనుఁడు —

ఔరా! ఎంతలెంత లోనర్చి మఱలుచున్నాఁడీకృష్ణుఁడు! సభకు వచ్చినదాదిగ నెంతవినయముఁజూపినాఁడు! బంధువుండనియెంత సంప్రీతి

నెఱపినాడు! భారతభూమికి వీరభిక్షునిడుమని ప్రార్థింపవచ్చిన యాచకుండనని యెంత నైచ్యానుసంధాన మొనర్చినాఁడు! తొలి మాతండ్రిని మంచిసేసికొననెంచి, వృద్ధజనపరితోష మొనర్పఁగల వివిధవిషయములతో దీర్ఘోపన్యాస మొనర్చినాఁడు! ఏమివాక్చతురిమఁజూపినాఁడు? ఏశక్తి వలన నాతమ్ముని చేతనున్న త్రాటిని పట్టుసడలించి క్రిందఁబడఁజేసెనో, యెంతప్రయత్నించినను నేనిప్పటికినిఁ దెలిసికొనలేక పోవుచున్నాను. ఏయద్భుతశక్తులసమ్మేళనమునఁ దనయాసనమునఁ దానట్టులఁగూర్చుండియే, సభనంతయుఁ బెల్లు ఘూర్ణిల్లఁజేసెనో, సభాభవనమంతయు గప్పున గప్పునంతటి దివ్యప్రభాపటిలి పరిభవింపఁజేసెనో, ఎత్తిన నా వామబాహు వట్టె స్తంభింపఁజేసెనో యిప్పటికిని సుబోధ్యముకాకున్నది. ఇది అపూర్వమైనజాలకమగును.

నా మొగంబు చూచును దరహాసంబు సేసినయంతనే యాతనిఫాలభాగంబున బ్రహ్మయు, వక్షోభాగంబున విరూపాక్షుండును, వదనతలంబున వహ్నియు, పార్శ్వప్రదేశంబుల నింద్రయమవరుణకుబేరులును, నాదిత్యమరుద్విశ్వదేవాశ్వినులును గానవచ్చిరి. బలదేవార్జునులును, యుధిష్ఠిరాదులును, యమవృష్ణిభోజాంధకవీరులును, యిట్లింకెంప అంపతో యున్నవిల్లిరి సధూమధూమకేతుజ్వాలాజాలంబులును, తరణికిరణనిభప్రభలును ప్రభూతంబులయ్యె.

భిన్నభిన్న ధర్మములుగల దృశ్యములన్నియును రాశీభూతముగ నొక్కయెడఁ గానవచ్చునట్లొనర్చినాఁడు. ఈమాత్రమైంద్రజాలము నెఱుంగనని తలంచి కావలయు పెల్లుబ్బినాఁడు! కాని బంధనకార్యమునకు నాకవరోధము గల్పించి తాఁదప్పించుకొని తనమానము గాపాడుకొని, మఱియు వెడలినాఁడు. ఇది జాలకవిద్యాపరిశ్రమ ఫలమని యెఱుంగక ముదిమదిదప్పిన వీరందఱు నీతని ననుసరించుటను నేనును వీరివెంట నుండవలసివచ్చినది!

ఇదియేమనిమైన, ఇదియెట్టి జాలకవిద్య యనినైన విదురాదులో వెంగళులుగాని, మిక్కుడులో నా రుసిమూాకలుగాని

యోచింపక యూరక శీనింబొగడ నారంభించినారు. ఏదియెట్లు జరుగనై యున్నను, ఈతని ప్రతిపదమును ముందుముందు జాగరూకతతోఁ బరిశీలించుకొనుచుండవలెను. ఇఁక నొకపెద్ద యెత్తు నెత్తినఁగాని యీతఁడు మనకు స్వాధీనుఁడు కాఁడు—కానిమ్ము.

అని యనుకొనుచు, దుర్యోధనుఁడు కృష్ణుని వెంట నడచుచునే యుండెను.

కడచి, కడచి, తేరుడిగి, శ్రీకృష్ణుండు కుంతి కడకరిగి యొఱఁగి కురుసభంబుట్టినవన్నియు నున్నవి యున్నయటుల విన్నవించి వినమ్రుండయి:—

"అత్తా, కుడిచి గూర్చుండలేక, పాండవుల రాజభాగంబు వంచనమెయిఁ గైకొనియు సంతతోనాగక, అమానుష క్రియలఁ ద్రోవదిని నొవ్వఁ జేసి, పెద్దల నుడులఁ జీరికింగొనక, మోఱకులై ప్రవర్తించుచున్న ధార్తరాష్ట్రుల యెదుట, పాండవేయులు లొంగియున్నారని యుఁ దుదకు నేనునుంగూడ వారికడకు యాచకుండనై వచ్చితినని యెంతవిధేయతానుసంధాన మొనర్చినను, సరకుఁగొనక, గొనకు నను వారు బంధింపఁ బ్రయత్నము లొనరించినారు.

ఏమిచేసినను వారికె చెల్లినది. నన్నును, నీపుత్రులను వారెంత పలిచిన నంతశీఘ్రముగ కార్యము గడతీరు సమయ మాసన్నమగు నను మాట మాత్రము సత్యము. ఇచటఁ బుట్టిన వెల్లఁ బాండవులకుఁ దెలియఁజేయఁ బోయెదను, వారికేమేని నీవు చెప్పఁగల బుద్ధులున్నఁ జెప్పి నన్ననుపుము." అని కృష్ణుండు మిన్నకుండెను.

కుంతి:—నందనందనా, నీశిక్షణం బెరిఁగిన పాండుసుతులు నీతిమంతులును, బుద్ధ్యాపరులును, శూరులునుగదా! అట్టివారికి నీకన్న నేనేమి బుద్ధులు చెప్పఁగలదానను? విక్రమోపజీవనముచేయకున్న, పాండుపుత్రు లనిపించుకొనరనియును, నిస్తేజపుఁ గూటి కాసపడఁ దగదనియుఁ నంటినను. తుదకు లోకాన నపకీర్తిభాజనులు కారాదుకద! నినునిటకనిపి చెప్పించిమాచుట యన్నిటికిని మొఱుంగువెట్టి నట్లయినదనియుఁ గురుసభకుఁ దూతయై వచ్చిన కృష్ణుఁడే యింతలు వడుట వారిదుష్కృత్యములకెల్ల మేరువు పూసయైనదనియు, మరిమనమున ననుమానము మానుమంటినని యనుము. నీయండనుంట, నీ మంత్రరక్షణ కళాకౌశలముచే సర్వదా

పరిరక్షితులగుటను, పాండవేయుల విజయముం గూర్చి సంశయింపం బనిలేదని నా నమ్మకమని యొత్తి పలుకుము.

అనుచుం దన మేనల్లుని గౌఁగలించుకొని, శిరంబు మూర్కొనెను. అచ్యుతుండును నామెకు మ్రొక్కి యయ్యమ దీవించి "—రాజులు దినియెడు నన్నముం దినుట రాజకుమారుల లక్షణ—మని ధర్మజాదులతో నామాటలుగాఁ దను" మని కృష్ణునకుం బో నెలవొసంగెను.

కృష్ణుండును, దన నంపు నింకనుఁ గంటిచూచుచుండెడి ధార్తరాష్ట్రుల కడను, తమకుంగల కురువృద్ధుల యొద్దను, గురుజనంబుల సమక్షంబునను, సెలవు గైకొనుచుం, దన తేరెక్కి— యింక మీరునిలుం—డని మరల వారితో నని, యటదుర్యోధనుప్రక్కను నిల్చియున్న కర్ణుం గాంచి,— నన్ననిపి వచ్చెదు గాక— యని తనకరంబు సాచి యాతని చేయిపట్టి యిట్టి తనయరదంబు పయి నెక్కించుకొని, తనవెంటనంటి యున్నకృతవర్మ నుచితప్రకారంబున సగౌరవంబుగ నిలిపి, సాత్యకిని వేసరిపై నల్లంతదూరమున రమ్మని మందగమనంబునఁ దనయరదమ్ము వోనిమ్మని సూతున కానతిచ్చెను.

ధార్తరాష్ట్రులును, నగరోన్ముఖులై చనుచుండఁ దనపెదమేనయల్లుని శకుని త్వరపెట్టెనేగాని, వాని మానసపుటారాట మదెంత బలవత్తరమయియుండెనో, మనమున నే మనుకొనుచుండెనో కాని, దుర్యోధనుఁడట్టె, కర్ణకృష్ణులు పోవుచుండిన తేరిపయినే దృష్టినిగిడ్చి యామార్గముదెసనే చూచుచు నిలిచినిలిచి, కొంత వడికిఁ జేయునదిలేక సర్వస్వమును జోరులపహరించినపిదప నొందఁగల వ్యాకుల చిత్తముతో, దిగలాగుచుండు కాళ్ళతో, వెనుకకు మరలి పోఁబోవుచు దుఃఖాన్వితమైన హృద్వేగముతో, మాటిమాటికిని వెనుదిరిగి చూచుచు, ముందుకుఁ బోవుచు మరల వెనుదిరుగుచు, బలవంతపునడ నెట్లేని నిజగృహోన్ముఖుండయ్యెను.

# మూఁడవ ప్రకరణము

## (ii)

కర్ణునిఁ దనరథముపై నిడికొని కృష్ణుఁడేగుచున్నాఁడు. ఆవెనుకఁ కర్ణసారథి కొంతదూరమునఁ గర్ణునకై రథము దోలుకొని పోవుచున్నాఁడు.

కర్ణునితోఁ బ్రసంగించుచుండిన కృష్ణుఁడు దారకుంజూచి రథగమన వేగమించుక సంహరింపుమని యాదేశించి మరల కర్ణుం జూచి:—

— కృష్ణుఁడు —

అంగరాజా, నీవు వృద్ధజనోపసేవివి. మఱియు ధర్మార్థ సంవేదివి. ఇంకను నీకడ దాపరికమేల !

(అని యాతనిచెవిలో నేదియో చెప్పి)

కావున నీవు జ్యేష్ఠుండవు. ధర్మజాదులగు నీతమ్ములందఱును నినుగొల్చుచు సకలపుత్రమిత్ర బంధుసేనాసమేతంబుగ రాజ్యానకు నినునభిషిక్తుంజేయ సంసిద్ధులగు నట్లొనర్చెద. అగ్రజుండవగు నీవిట నుండ వారు రాజ్యంబభిలషింపనొల్లరు. ఎట్లయినను వారు పెద్దలకడ సేవసేసికొని బ్రదుక నిచ్చలు నిచ్చఁగలవారు. కావున సకలరాజ్యభారంబు నీవ వహింపుము. నీ తమ్ములసేవల నందికొనుము. చిరకీర్తి నొందుము. రమ్ము—నాతోడన రమ్ము. కుంతీజ్యేష్ఠపుత్రుండవగుట నిను బితృసమానుగ నెంచి గౌరవించుచు వారు నీయెడ విధేయులయి యుందురు. నీ కిపుడె రాజ్యాభిషేకము సేయుదురు. నీసామ్రాజ్యాభిషేకసమయమున నీరథంబున నె యుండి ధర్మజుండు నీకు ధవళచామరంబులు వైవ, భీముండు నీకు శ్వేతాతపత్రంబు నెత్త, అర్జునుండు నీకు సారథికా, నల కవలవారును, అభిమన్యుప్రభృతి కుమారవర్గంబును, పాంచాల యాదవపాండ్యమాత్స్యాదిసకలరాజలోకంబును నినుగొలుచుచుండఁజూచి, — నేనకాదు — ఆనందింపనివారేరుందురు? మహేంద్రవైభవంబున మహనీయప్రతిభావిశేషంబున అఖిల మహీమండలంబేలుకొన రమ్ము! మఱియాలసింపంజనదు. రమ్ము—నాతోడనరమ్ము. మఱొక్కమాట:—

మూఁడవ ప్రకరణము

పాంచాలరాజపుత్రియుఁ గ్రమముగ నిను నారవవానిగ నంగీకరించు. మహాపుణ్యమూర్తివగు నీ కింకేమి కావలయు? అఖిల మహీమండలమునకా మూర్ధాభిషిక్తత: రాణికా జ్యేష్ఠభర్తృత్వము: నేకముహూర్తమ్మున నందుచున్నావు! ఇంకేమాత్రమును నాలసింపం దగదు. మఱివేరగు నాలోచన యేవలదు. రమ్ము... నాతోడన రమ్ము.

* * * * * మఱియు నీ పెండ్లిసేయుట నినుగనిన తల్లియగు గొంతికిని, సమస్తబంధుజనంబులకును బ్రియంబగు. ఇన్నియు సమకూర్చి యన్నింటికిని దలమానికమునఁ దగినచందము నీకీర్తినామంబు సార్థకంబగునట్లీవచ్చిన నసంఖ్యాకులగు రాజులెల్లరకును బాలిందానంబు సేయుటయ. ఇఁక మఱుమాటకుఁ దావులేదు... నీ వౌనని తలయూపిన యంతన నంతయు నిక్కము సమకూరును. * * * ఏమన్నారకున్నావు!

వేడినిట్టూర్పునిడి తలపంకించి పెదవి విఱిచి—

— కర్ణుఁడు —

తొలుత నను వృద్ధజనోపసేవి వని ధర్మార్థసంవేది వని యిపు డిట్లు నీతిబాహ్యునిగ ధర్మచ్యుతునిగ జేయ నెంచితివే? సామాన్యజనవాంఛితములగు కాంతాకనమ్ముల నా కెరసేయుచున్నావే! నీ ధర్మార్థములు జోడింపులోఁబడి నను నలిగిపొమ్మని యుపదేశించుచున్నావే! ఇది నీకు న్యాయమని తోఁచినదేమి? నేనుమాత్ర మంగీకరింపఁజాలను. ఇపుడు నాకెఱుక పఱచినది రహస్యముకాదు. కర్ణాకర్ణిగ నేనిది యిదివఱకే వింటిని. ఇందుకు నేనేమి సేయవలయు! నన్నుఁగనినకుంతి, యేకారణముననైననేమి, గంగలో నను బారవేయ సూతుండును రాధయు నను జేకొని, చాకుండఁగ సాకి, పొత్తిళ్లనిడి, నామూత్రపురీషాదులు దమశరీరములం[illegible], పెక్కుయిక్కట్టు లంబడి పెంచి జాతకర్మాదులొనరించి [illegible]లంగఱపి, పెద్దఁజేసి, వివాహాదికార్యములొనర్చి, నన్నొక[illegible]వానిగఁ జేసినారు. సూత

కులప్రసూతను బెండ్లిఁగూడి సంతానంబు వడసి, యిచ్చిపుచ్చుకొను
సంబంధంబు లేర్పరించుకొంటి. సీలనుసీలయమర్చినట్లన్నియు నమరి
నవి. ఇంతదనుక నేను సూతపుత్త్రుఁడనని లోకమునఁ బ్రకటితంబయి
యుండ, ఇపుడదికాదని పాండవేయుండనని కౌంతేయాగ్ర
జుండనని చెప్పుకొని యుధిష్ఠిరాదులం జేరినచో, అర్జున పరాక్రమ
మునకు వెఱచియె సన్నద్ధయుద్ధసమయమునఁ గర్ణుం డిట్లొనర్చె నని
లోకమువారలు నన్నెంతయు నాడిపోయరే! అట్లే "కర్ణునకు వెఱ
చియె యాతనిం దనపక్షమునకుఁ జేర్చుకొనియె నర్జునుం" డను నప్రతిష్ఠ
పాపముల ఫల్గునునిమాత్రముఁ జెందకయుండునే! రారాజు నాపైనాస
వెట్టుకొని నామీదనే రాజ్యభారమంతయు నిడి సంపూర్ణవిశ్వాసము
తోనున్నాఁడు; అట్టిప్రభువును నే నిపుడు దిగవిడచుటకంటె స్వామి
ద్రోహకృత్య మింకొకటి కలుగఁగలదె! నీతిధర్మముల కుపదేశికుఁడ
వనఁదగిన నీ వింతఁదలంపకుందువే! ఇదియంతయు నొకయోరనుంచి,
నేనేకౌంతేయాగ్రజుండనని ధర్మజున కెఱుకపడకుండ గుప్తముగానుంచి
ధార్మికుండవుకమ్ము. ఈమాత్రము పున్నెముంగట్టుకొమ్ము. కర్ణుఁడు,
కుంతీజ్యేష్ఠపుత్త్రుండని తెలియగనె ధర్మజుండాహవప్రయత్నము
నొల్లఁడు. ఆమీఁదవచ్చు తెఱంగు మనమూహింపఁజాలముసుమా! రూ
పొందినధర్మమొనాఁడగు ధర్మజుఁడెయిమ్మహీచక్రము నేలవలెనంతియ
కాని, యన్యులీసామ్రాజ్యమేల వలంతులే? అన్యులవలన నిద్ధరా
భారంబు నిర్వహింపఁబడఁగలదే! యదుకులశేఖరా, నేనొక్కటి చెప్పెద
వినుము; మహాయోధాగ్రగణ్యులెల్లరుం దోడుపడ, జగదారా
ధ్యుండవైన నీవు సారథ్యంబు సాగింపఁ బెంపుమిగిలి నిలింపనాథనందనుండు
రథికుఁడై విజృంభింప మహాయుద్ధంబున ధర్మజునకు విజయంబు
సిద్ధంబని యేనెఱుంగుదు. కురుక్షేత్రంబున విద్యావయోవృద్ధులగు
క్షత్రియులకు వ్యర్థమరణంబులేక సార్థకంబైన పార్థశస్త్రనిధనంబు
పొనుపడుట వీరస్వర్గంబు నివా. సౌభాగ్యంబగు. సంగ్రామంబె సర్వ

విధంబుల విధిసంకల్పితంబు. దాని కెవ్వరెన్నివిధంబుల నడ్డంబువెట్టఁ దలంచినను బ్రయోజన మొందఁజాలరు. ఏదియెట్లైనను పుణ్యభూమి యాకురుక్షేత్రంబున మాబోంట్లెల్లరును సద్గతి నొందఁగలరు. జరుగున దింతియ: నిక్కువమింతియ.

—కృష్ణుఁడు—

యోధాగ్రేసరా, మిక్కిలిప్రేమతో నేనాడినమాటలనాలింప కున్నావు. తుట్టతుదకిది నీకు సంతాపంబునకుఁ గారణమగునుజుమ! అర్జునునెడ మాత్సర్యంబుకతంబున, నీకుఁ బరాజయమో, కాక మృతియో, నీరెంట నేదేని యొక్కటి సమకూడు: అంతియకాని, యాతనిం గెలువఁజాలవు. ఎట్లయినను, నీమనసునకు శాంతియొనఁ గూడదు. దుఃఖమునకె కారణంబగుట నిశ్చయము.

ఇదియిట్లుండ, దివ్యాస్త్రసంవేదియాఫల్గునుండు తనగాండీ వముధరియించి, యుద్దండత మూకం జెండాడుచుండ నాతనియరదంపు నొగలపై నేనుండి నీవు పరాజితుండవగు నుపాయంబె నెమకుచుండ నీ కలఫాలాక్షుండు తోడువచ్చినను ఫల్గునుం దేరిచూడ వశమా! ఎట్లైనను విజయ మలపాండుతనూభవులపాల నిలుగట్టుకొనియున్నది. ఇఁకదాపరికమేల? నీవంటివీరపురుషుఁడు భారతవర్షమున కమూల్యా లంకారప్రాయముగ నుండఁదగినవాఁడగుట, నింతదూరము నిను గూర్చిప్రసంగించితిని. నీ వెంతకునుమనమున్నుదిప్పుకొనఁజాలకున్నావు. అట్లగుటనీవిపుడెపోయి రానున్న యమవసదివసంబెపుణ్యదివసంబగుట, భండనంబునకు సంసిద్ధులరుకండని, మీవారలకుఁ దెలియఁజెప్పుము. మఱి నాకు కింకేమాత్రమును లేక చెప్పఁదగినదంతయుఁ జెప్పితినిక దా!

—కర్ణుఁడు—

గోవిందా, మరినీవు చెప్పనక్కరలేదు. రణముకాకతప్పని నిమిత్తంబులె పెక్కులుకలవు. పాండవులె గెలుతురు. యుధిష్ఠిరునకే

యీరాజ్యంబంతయు బీరువోవకుండఁ దక్కును. ఇంతకును మూలము నేనును, శకునియు, దుశ్శాసనుండును, నని యేనెఱుంగుదును. అటుగాక యిపుడునీచెప్పినచొప్పున, నేను కాంతాకనకమ్ములనాసించితినేని, సంపూర్ణముగ ననునమ్ముకొని, యుద్ధరంగమునకు దిగుచున్న నాస్వామికి విద్రోహము నెంచుటకాదె! ఇంతకంటె నధర్మముకలదే!

ఇఁక కురుసామ్రాజ్యంబున కేనె పట్టభద్రుండనగుదునుకదా, యనునాస నాకుండకుండునా యనితలంతువేమో! కళింగదేశాధీశుండగు చిత్రాంగదుని కూతురౌ శుభాంగి స్వయంవర సమయమున, మగధేశ్వరుండగు జరాసంధుని ద్వంద్వయుద్ధముననే నోడింప, ననుమెచ్చి యాతఁడిచ్చిన మాలినీనగరమును నే ననుభవింపనొల్లక మత్ప్రభుసామ్రాజ్యవిస్తారముకొఱకుఁగురురాజ్యమునకె చేర్చిన నాకు రాజ్యతృష్ణ యెక్కడిది? సుయోధనుండొసంగిన యంగరాజ్యమును ప్రజలే పాలించుకొను ప్రభుత్వ సూత్రములననుసరించి పరిపాలింపఁబడవలె నను నాశయమున, అంగదేశప్రజలకే తద్రాజ్యము విడిచిన నాకు రాజ్యకాంక్ష యెక్కడిది? రాజ్యపాలన యందు నాకభిరుచి యుండకపోవునా యని దలంతువేమో? రారాజు తాను ప్రభువుగనుండి నన్నమాత్యునిగా నెంచుకొని, నాచేతనే ధరాభారంబు నిర్వహింపఁజేసినాఁడు. అట్లగుట రాజ్యపరిపాలనాభిలాషము నాకుఁ దీరిపోయినది. కావున నాకు రాజ్యముఁజూపి, అధికారమొసంగెద ననునాసలుఁగల్పించి నను నీభేదనీతికిలోఁబడఁజేయఁ బ్రయత్నింపకుము. ఇఁకమిగిలినది ద్రౌపది ననునాఱవభర్తగాఁ గైకొన నేనానందించుట! ఇది యేతీరునఁజూచినను సరిపడనిమాట. నేనామెను వాంఛింతునేమో యని నీవు దలంచినను, నే నేకపత్నీవ్రతుండను. అట్లగుట నీనుడివిన రెండుమార్గములును నను నాకర్షింపఁజాలవు. ఇఁక మత్స్యయంత్రము గొట్టఁబోయిన నేను ద్రౌపదిని వాంఛించియుండనా యని యూహింతువేమో: మత్స్యయంత్రభేదనశక్తి కర్ణునకును గలదను మాట లోకము

నకు వెల్లడిసేయుచే నాపని. 'మత్స్యయంత్రభేదనానంతరము ద్రౌపది నీకుఁజిక్కనుగదా: అప్పుడైన నంగీకరింపకుందువా?' అనియందు వేమో: సత్యమేయగును. కళింగసుభాంగిని దుర్యోధనచక్రవర్తి కొసంగినట్లు ద్రౌపదినిఁగూడ మీదుర్యోధనున కొసంగియుందు నని దోస యూహింపఁగదా!

అట్లగుటఁ గాంతాకనకమ్ములనాన గొలిపి మఱి నన్నుద్రిప్పఁ జాలవు. ఇప్పటికి సమయమన్నింపుము. నీరాజనీతిజ్ఞతకును, అందునను నీ భేదనీతి నేర్పు చేర్పునకును, మాటతో మొగ్గువాఁడనే కాని, యిప్పట్టున నీపలుకు లాలకింపమికిఁ గినుక నొందకుము. ఈసమరసముద్రము గడచిననీదినిను మఱలఁ జూడఁ బ్రదుకున్నంచున: నట్లుకాదేని, సమరావనిం గూలి, నినునాకస్వర్లోకంబునం జూచెద. ఎట్లయినను, నినుంజూడఁగల నను ధైర్యముకలదు. నిన్నుగలియుటయె నాకుఁ బ్రధానకార్యము. మఱియీ ప్రసంగము సేయఁగోరకుము. నాకు సెలవొసంగుము. చాలతడవయ్యెను.

వాసుదేవునకా కానీనుఁడు మ్రొక్కినిలువ, నయ్యచ్యుతుండును, సూత సూతిం గవుంగిలించుకొని,—ఇట్లకాని—యన్న రాధేయుండును కృష్ణునిరథంబు డిగ్గెను. కృష్ణుండును, దనప్రక్కను సాత్యకిం గూరుచుండ నియమించి, తనమోమున చిర్నగవు చిందులాడ 'పదపదపోని' యనుచు దారుకునకుఁ జెప్పి, లక్షితాటోపకలితుం డగుచు, ముందురాఁగలకార్యంబులం గూర్చి కావలయుఁ దలపోయుచుఁ జనియె—

కర్ణుఁడును కరినగరోన్ముఖుండయి మరలెను.

# రాయబారము

## నాల్గవ ప్రకరణము.

### (i)

"మాయురే! ఎంతదురంతము! పంతమున కృష్ణుఁ డెంత సేకురఁ జేసినాఁడు! ఎవనిని నాబహిఃప్రాణముగ నెంచియుంటినో, యెవనినూఁతగాఁగొని యీపాండవస్కంధావారవారాశి నెదురీదఁ దలంచితినో, యెవనియండఁ జూచుకొని, పాండవవీరులనెల్లరఁ దృణప్రాయులుగఁ గణించితినో, ఎవనిసాకుఁదలంచి, కృష్ణునంతవానిం గూడ నిరసించితినో, ఎవనిప్రథిమ నద్వితీయముగ నెంచి, యర్జునునకుఁ దులయగు ప్రతివీరుగ భావించి, ద్రోణకృపాచార్యాద్యాచార్యవర్గమును, భీష్మవిదురబాహ్లికాది కురువృద్ధులనందఱ సరకుఁగొనక తూష్ణీంభావమునఁ జూచితినో, అట్టి నాయనుంగు సఖు నిట్టె తనతోఁ గొంపోయెనే! ఆ మాయదారి నా పెన్నిధానమును నాకు మఱి దక్కనిచ్చునా!

*　　　*　　　*

"కర్ణుఁడు దేవకీనందనునిమాయలలోఁ జిక్కఁడేమి! మఱి నాకుపక్కఁడేమి! అనైసర్గికము! అప్రాకృతికము! ... ... ... దక్కినను తేజమును, వీర్యమును, దూలి నిస్తేజుండును నిర్వీర్యుండును గాకుండునా? తేజోవంతుండును వీర్యవంతుండును నై, మరలివచ్చినను, మఱి మాలోనివాఁ డెట్లగును! పాండవపక్షపాతి యైన పిదప మాయెడ నాతఁ డెట్లు నిష్కల్మషప్రేమాన్వితుఁడై యుండఁగలఁడు?

"రాజభక్తితత్పరుఁడగు కర్ణుఁడు రాజభక్తి మఱచి మిత్రకార్యము నెడనెట్టి రమ్మనునంతనె బుజములెగురవేసికొని, నామొగము నైనఁ జూడనొల్లక నాతోఁ దా నొనర్చియుండిన బాసలనెల్ల వీటఁబుచ్చి సమయానుసారముగఁ బ్రవర్తించు స్వభావముగలయాశౌరిమంతనమునకులోనై యాతనితో నేమని పో వనగు వడెనోకద! మగుడివచ్చినను మఱల నేమొగముతో ననుఁ జూడఁగలుగును! సిగ్గును బోఁద్రోలి, మతిమాలి, మరల నను జేరినను, అన్నపురాజపుత్రుండనగు నే నేమతితో నాతని విశ్వసింపఁగలను! కర్ణుఁడన విశ్వాసమునకుఁ బుట్టినిల్లని నే నమ్ముకొంటిని! అన్నా! యెంతపొరపడితిని! ఇంత పొర రానయియుంటనేకావలయు నే నంతపొరబడి యుంటిని! సమస్తమును సిద్ధమయి కార్యదశయొకతీరున విజయకళ నొందినపిదపఁ గూడ నెంతటివిపరీతపరిస్థితు లేర్పడినవి! తనయెడ నాకుఁగల యభిమానమునైనను

దనపత్షమొనర్చికొని, నన్నసహాయునిగా నొనర్చి, నేచేయఁదలంచినపనిని దానే యొనర్చి, నన్నే ఱెక్కలువిరిగినపక్షిగా నొనర్చెనే! ఎంతకుఁ దగఁడీతఁడు!

"సర్వదా నాశ్రేయమె గోరుచు, నాకని యెన్నో శ్రమల నొందిన కర్ణుఁడింతలో నిట్టెమారుననుకొనుటకు నాహృదయదౌర్బల్యమె కారణమగునేమో!

"మగధ సామ్రాజ్యాధిపతియగుజరాసంధు నోడించి యాతనివలనఁ గానుక గైకొనిన మాలినీనగరముసైతము తనకువలదని నాకొసంగిన యుదారపురుషుండగు కర్ణుఁ డామాయదారి మంతనమునకు లోబడునా? పరమవిశ్వాసియు వీరాగ్రేసరుండ నగు నామిత్రుఁడు కొంచెపుటూహలుగల సామాన్యునివలె దన ప్రథమ నిశ్చితకార్యక్రమమునకు భంగము రానిచ్చునా?"

అనిదుర్యోధనుఁడు తనమనసునొకింత దృఢపఱచికొని జరిగిన కురుసభా భవనమునందలివిశ్వరూపప్రపంచపరిదర్శనదృశ్యము దలంచుకొనుచుఁగృష్ణుపలుకులనే స్మరించుకొనుచు నదివఱకే సభఁగూడియుండిన భీష్మాది కురువృద్ధులఁగలసికొనెను.

---

## నాల్గవ ప్రకరణము

## ( ii)

కుంతీకృష్ణుల సంభాషణము సాంగముగ వినినపిదప కృష్ణు నంపకము వెట్టి కురుభూపతులును, గురువృద్ధులును, గురుజనంబులును, మగిడివచ్చి కూరుచుండి కృష్ణునిగూర్చియే ప్రసంగంబులు నెరపుచుండిరి.

భీష్ముఁడు:—కుంతి యెంతెంతమాటలాడినది!

ద్రోణుఁడు:—ఆమాటలువిని నిశ్చేష్టుండనైతిని.

బాహ్లికుఁడు:—కుంతియు, కృష్ణయు, కృష్ణుండును, కార్యవాదులు. ఖడ్గమునకాని యన్యమునఁగానిపని తామెఱింగినకార్యములపట్ల ఖడ్గధారణమే సిద్ధాంతీకరించి శత్రునిబర్హణమునకుఁదాశార్హునె యర్హునిగానెంచి, కార్యక్రమమునకురుక దమవారినెల్ల సంసిద్ధులఁ జేయుదురు.

భీష్ముఁడు:—ఏమోకాని, ధర్మజునితాల్మి యనుమహాసముద్రమునకుఁ జెలియలికట్ట తెగిపోయినది. ఇఁక మనచే కాఁగలకార్యవిధాన మెట్టులుండునో యని మాత్రము తలంకకతప్పదు.

ద్రోణుఁడు:—దుర్యోధనప్రభూ, సుశ్లోకుండగు ధర్మజుపాలికి నీవుపోయి యతని శాంతినొందింపుము. ...లనెల్లరఁ గాచికొనుము. యుద్ధభూమిని నీ

వారలనెల్లరఁ దిగమ్రింగి, నీవును జివరకు నేలఁగూలకుము. ధర్మజు నీవశము నేసికొంటేని జనస్తుతిఁగాంచెదవు. కానిచో శోకమునొందుట సిద్ధముసుమ! కృష్ణుడింకను నుపప్లావ్యముం జేరకమునుపే మనము ధర్మజుపాలికరుగుట కర్తవ్యము. ఆలస్యమొనర్చిన విపమించుంజుమ!

దుర్యోధనుఁడు ఆవేగపూర్ణమును—సంక్షుభితమును—యోచనాశూన్యమును నగు హృదయముతో, శూన్యములును నిర్లక్ష్యములునునగు వీక్షణములతో నీరవుఁడై నిలచియేయున్నాఁడు.

భీష్మాదులపలుకులు వినుచుండెనేకాని దుర్యోధనుని మొగము రాజుచునే యుండెను. కన్నులఁజింతనిప్పుకలు రాలుచునేయుండెను. మరుమాట లేదు.

* * *

ఏమి దుర్యోధనా! కురుకులము నంతరింపఁజేయ జన్మించితివా! కేవలము బాహుబలముపై నాధారపడువానిని, దన కార్యములవలనఁ దనపలుకులవలనఁ దనప్రతిష్ఠ నచ్చుచున్నదని యితరులెత్తిచూపినను గ్రహింపని మూర్ఖుని, దైవిక మనుదానికి మనసునఁ జోటీయని వానిని, దుర్యోధనుఁడను నామమున నిఁక రాగలకాలాలవారు గూడ వ్యవహరింతురుసుమ! * * *

"ఎంతచెప్పినను లాభము లేదు. ఇఁక మనపైఁగూడ నపోహము నొందఁ
గలఁడీతఁడు. కావున మనవిధికృత్యము మనమాచరింపకతప్పదుకదా!"

—యనితలంచియోకావలయు, భీష్మద్రోణాదులు లేచినిలిచినారు. అందు భీష్ముండు తాఁ జనూనుంజూచుచు, "దుర్యోధన రాజా, మాకేమి కావలయును! సంసారము లేనివాఁడను నేను; సంసారముకడదొరికినవాఁడీ ద్రోణుఁడు. ఇంకను బ్రాణాలపై దీపితీయ యందు ననుకొనుచుంటివే! ఏమివచ్చిన నది రానిమ్మని యున్నారము. సంగరము ప్రాపాని కరముకదా యనియు, జయాపజయములు యుద్ధమునఁ దొలి నిర్ణయింపఁజాలము కదా యనియు, నెట్లయిన ప్రాణనష్టము నాపఁగలమేమో యనియు కురుసామ్రాజ్యమున మీ కెంతస్వత్వముకలదని మీరనుకొనుచుంటిరో, అంతస్వత్వమునఁ బాండుపుత్రుల కింతకుపూర్వమే లభించియేయున ము, మీకుఁదెలుపఁదగినదంతయుఁ

దెలిపి, యుద్ధముమాన్ప నెంతదూరము పోరలవలె నంతదూరమును బ్రయత్నలోపము లేకుండ నెత్తియెత్తి చెప్పి చూచితినేగాని, విధివిహితము కాదనికాని, యిపుడు యుద్ధమునఁజానున్నవా రందఱును యుద్ధము కాకున్నను మఱిచావరనికాని, యిందఱ చావునకును ఇంతటియుపద్రవమునకును నీవు నిమిత్తమాత్రుఁడవు కావనికాని, తుద కీయుద్ధపర్యవసానమున, నీమూలమునఁ గర్ణుకారణమున, శకునిపశమున, నేమికానయి యున్నదో యంతమాత్రము నూహింపఁలేక కాని, లోకానుభవమును గార్యకారణసమ న్వయజ్ఞానమును లేక కాని కాదింతదూరము నీతో బ్రసంగించుట! మే మెంతదూ రము చెప్పవలె నంతదూరముఁ జెప్పిచూచితిమి. కార్యదశ ననుసరించియే ఫలముకలుగు చుండు ననుమాటసత్యము. ఇఁక మాకుఁగర్తవ్యము, నీకొఱకు యుద్ధమునర్చుటయ. ఇంతయైనపిదప సంగరమునకుఁ దలంకెదమనుకొంటివా? అసంశయము నీకక్కఱలేదు. యుద్ధమునకు సంసిద్ధుండవు కమ్ము. మేమును అప్రయత్నమున నేయున్నారము. ఇఁక నీవు సేనానాయకనిర్ణయము, సమరంబునకు సుముహూర్తనిశ్చయము, మొదలగు కార్యములయం దప్రమత్తుండవై యుండుము." అనియనెను.

అంత భీష్ముండును అతనివెనుక ద్రోణాదిగురుజనంబులును వెడలిరి. సాయంసమయము కావచ్చినది. దుర్యోధనుండును నిజోచిత ప్రవర్తనల నుండెను.

---

## నాల్గవ ప్రకరణము

### (iii)

శ్రీకృష్ణుండు కుంతీసదనమునుండి మగిడిపోయిన పిదప చింతాకులస్వాంతుం డయిన విదురుండు కుంతినపనయించి పోనెంచి యామెయొద్దకేగి, "అమ్మా, అన్నియు వింటివికదా! కౌరవాన్వయమహార్ణవ మింకెడు దుర్ణయములను దుర్నిమిత్తంబులను బుట్టినవి. కేశవుం డెన్నివిధంబులఁ జెప్పవలయు నన్నివిధంబులఁ జెప్పిచూచెనేకాని కౌరవసభనున్న వారిలో నొక్కరుండైనను —ఔ— ననలేదు. ఒంటరియగా విజయువిక్రమంబు మొన మొన్ననె చవిజూచియు, నంతయు నెంతలో మఱచివారీ కురుకుమారులు! పాండవులు నారాయణుని పంపున నాతని సాయమున సమరము నడపెదరు. 'విజయునకు సారథినై నేనుండ నెదిరికి జయంబెరిది' యని గూడ నా కేశవుం డుద్ఘాటించి పలికినాఁడు. ఇలస్తోతుకేమియు నుండనీయలేదు. పాండు

కుంతియుఁ దనబ్రదుకుంగూర్చియుఁ దనవారింగూర్చియుఁ బెద్దయుం బ్రొద్దుచింతించి చింతించి శ్రీకృష్ణునంపకము వెట్టుటకేగిన కర్ణుఁడు మరలి వచ్చినపిదప నాతనిం గలిసికొనుటకుఁ గృతనిశ్చయయై భాగీరథీతీరంబున సాయంసంధ్యాద్యనుష్ఠాన తత్పరతఁ గర్ణుఁడున్నాఁడని విని యిదిగో యదనని యెన్ని యాతఁడున్న యెడ కేగుచుఁ దనలోఁ దానిట్లనుకొనియెను.

"రాజ్యలోభంబునఁ దనవారిని వధియించుటది సద్ధర్మంబె? శత్రునిబర్హణ మర్హమగు కార్యంబుకాదె! అట్లని జనక్షయకార్యం బక్లేశకృత్యమె? భీష్మద్రోణకృపకర్ణాటోపములు మాన్పుట లల్పములం దీఱునె? ఈ నల్వురలోఁ గర్ణుని హృదయము పార్థుపై నెల్లప్పుడును గ్రోధదీప్తము. భీష్మద్రోణాదులకైనను యుద్ధముపై నుత్సాహము లేదు. ఉత్సాహప్రభుమంత్రశక్తియుతముకాని కార్య మనివార్యముగాఁ గొనసాగుటెట్టులు? అట్లగుటఁ గర్ణుని పట్టుదుపుజతనము దక్క యింకొక్కటి నాకుఁ బనికాదు. నేనిపుడు గర్ణుంజూచి యాతనిపుట్టువు తెఱంగెఱింగించినంతనె యాతనికి ధర్మజాదులతోడి సహోదర ప్రేమంబు పుట్టకపోవునే! ధర్మజునకుఁ దానగ్రజుండని యెఱింగినంతనె పట్టు సడలఁడె! అర్జునుపైఁ గల క్రోధమునుడుగఁడె! ఎవనిని జూచుకొని దుర్యోధనుఁడు నాతనయుల నింతంతవంతల పాలుసేసెనో, అట్టికర్ణుని నా జ్యేష్ఠపుత్రుండని తెలియఁ జెప్పి యిటు త్రిప్పితినేని దుర్యోధనుండప్పుడె తనతళ్లడిగి యూరకుండక తీరదు. అంతయు నప్పుడె శాంతినొందును."

అనివితర్కించుకొనుచు భాగీరథీతీరంబు తెన్నునఁ గుంతి పోవుచుండెను.

---

## నా ల్గ వ ప్ర క ర ణ ము
## ( iv )

భాగీరథి సుమనస్కునిమనంబుభాతి నిర్మలంబై, దూరాలోచనాపరుని హృదయమువలె గంభీరంబై, మత్తకాశిని చందంబున గమనవేగంబువీడి, ప్రశాంత చిత్తుని తెన్నునఁ గలఁకయుడిగి, మెలమెల్లగఁ బ్రవహించుచుండెను.

కుంతి కర్ణుంజూడఁగోరి భాగీరథీతీరంబున కేగెను. అచ్చట సంధ్యాద్యనుష్ఠా

నంబులు నిర్వర్తించుకొని కర్ణుండు నిమీలిత నేత్రుండై ధ్యానమున నుంటఁ జూచి కుంతియు వాతని వెనుక వలనం గూర్చుండ గొండొక సేపునకు జపంబునీటి కలయం గనుంగొని యమ్మహాదేవిం గాంచి కర్ణుండును సంభ్రమ వినయంబులు దోప నయ్యామం జేరి "అమ్మా, రాధాధిరథుల గోత్రంబున కగు వాఁడను: రాధేయుండను. నీ పాదరాజీవంబుల కభివందనం బొనర్చుచున్నాను. నీ విట విజయం చేయుటకేమి కతంబు? నేఁ జేయుంగల కార్యమెద్ది—యానతిమ్ము." అని యాడెను.

—కుంతి—

ఆగు మాగు మో పుత్రకా, నీవు కౌంతేయుండవు: రాధేయుండవు కావు. నా జ్యేష్ఠపుత్రుండవు.

అని కర్ణుని జన్మవృత్తాంతమునా తనికిఁ గుంతి యేకాంతంబుగఁ దెలిపెను.

— కుంతి —

అట్లగుట నీవు ధర్మస్థితినిఁ బాండునందనుండవు; కావున నీ వన్యులఁ గొలువ నేటికి? ధర్మతనయాదులైన నీతమ్ములకును ధార్తరాష్ట్రులకును నీవ తగిన విభుండవు. వారె నినుఁ గొలుతురు. ఈలోక మెల్ల నేకముఖమున నేలఁ దగిన మహాపరాక్రమవంతుండవు. సకలలోక కర్మసాక్షి కీవుబుట్టి పాండుపుత్రుండవై, కౌంతేయుండవగునీకు సూతపుత్రుండనెడు సొంపుమాలిన పేరును, రాధేయుండను కొంచెపుఁ బలుకును నీకుఁ దగునటోయి? పాండవాగ్రజుండవగు నీవు నీవారితోఁ గలహించి, పరులతోఁ గలియఁ దగునే? నీ తండ్రిరాజ్యమేల నేల దలంపవు? ధరణీచక్రంబు నేల సమర్థుండవగునీవు ప్రభువయియుంట నాకును సకలలోకంబునకును సంతసంబు చేకూర్చు. కౌంతేయాగ్రజా, రామకృష్ణులఁ బలె సౌభ్రాత్రంబునఁ గర్ణార్జునులును నుండిరను పలుకు విని నా మేను వీడఁ దలంచితిని.

కుంతిపలుకుల కలుగక కర్ణుఁడు వినుచుండెనే కాని యాతని మనంబు తిరుగఁబడ లేదు

— కర్ణుఁడు —

అంతయు నిజమగునే కాని, అమ్మా, నే నొక్కటి సెప్పెద,

రా య బా ర ము

వినుము: క్షత్రియ సంస్కారమునకుఁ బాత్రముగా నీవు నన్ను భావింపమిఁగద శూద్రజాతి సంస్కారాదులకయి సూతసూతినైతిని. ఇంతకును మాతృచేష్టయె కతంబగుట మఱి యిపుడిట్లనుట యుచితమగునె! ఇంత కాలము నూరకయుండి యిపుడు పాండవులు నాకుఁ దమ్ములనుచు నేనటు నేరితినేని, 'లేని బాంధవం బిపుడిపుడు గల్పించుకొని పాండవపక్షముంజేరినాఁ డీకర్ణుం' డను నపకీర్తిమోయుటకు నేను సమర్థుండఁగాను.

కుంతి వేడికన్నీరునింపుచుఁ గొంతవడినిశ్శబ్దముగ నిర్వేదోచ్ఛ్వాసము విడిచెను.

— కర్ణుఁడు —

సన్నద్ధమైన యీయాయుద్ధ సమయమున, నేను రాధేయుండను గాననియును, పాండవాగ్రజుండననియును ప్రకటించుకొనుచుఁ బాండవేయులఁ జేరనగుట, నాకేకాక ధర్మజాదులకుంగూడ లఘుత్వంబుఁ జేకురఁజేయును. ఇంకొకమాట!

నే నింత కాల మెవ్వనియన్నముందిని యింత నెలవుఁ గలిగితినో, అర్జునునకేన తగిన యెదిరినని, ననునమ్మి యెవ్వఁడు భీష్మద్రోణ బాహ్లికాది కురువీరులనైన మన్నింపఁడో అట్టి నా స్వామియెడ, ద్రోహముందలంచిన కొలయుఁ గిరీటి కిటీవలెఁ జంకి యావలఁ జేరితి ననువాదును గాలకాలములదాఁక నిలచియుండు నవినీతియు, ననుదాక, కుందునె! ఎవరెవ రేమాత్రము కురురాజుల చేత నింతదనుక గుడిచి, కట్టి, కొనియున్నను, నిట్టి పరీక్షాసమయమున నట్టివాడు రాజును విడువనగునే! అట్లయిన లోకులు ఉట్టురే!

నీ వెట్టి కార్యభారము నహించి నాకడ కరుదెంచితివో, నేను గ్రహించితిని. కాని, సవ్యసాచి కొఱకే నను దనకడ నిడికొని నాఁడు నా స్వామి—సవ్యసాచిని సమయించుటకే జన్మించినవాఁడను నేను. నాచే నర్జునుండీల్గుటో, నేనే యర్జునుచేఁ జచ్చుటో జరుగవలెనంతెకాని, యీ నిర్ణయమునకు మాత్ర మేమాత్రమును భంగము

రానీయను; కావున నే నవశ్యంబును దుర్యోధనునకై నీ కొడుకుల తోడం బెనఁగుదుఁగాని వీడంజాల. నీవచ్చిన కార్యం బెఱింగితిఁగాన మది నరమరలేక చెప్పెద వినుము.

సవ్యసాచిపై నాకుఁ గడుమచ్చర మగుటం జేసి సమరంబునఁ బట్టువడెనేని, వానిఁ బట్టరఁ జంపుదు. వీడు వాఁడనుగాను. సవ్యసాచిచే నేఁ జచ్చుటయు నొకరీతిఁ గీర్తియె యగును. ఎట్లయినను; నీ కొడుకు లార్వు రనుమాట నీకదలంపకుము. అట్లగుటఁ గర్ణుఁడీల్గినన్ ఫల్గుణుం డీల్గినను, నీ కైదుగురె పుత్త్రు లగుదురు. పాండవులలోఁ గవ్వడిగాక యిఁక నెవ్వఁ డెదురైనను, నేఁ జంపనని నమ్ముము. ఇది మాతృభక్తి సూచకమగు సూక్తి; పాండవులు నాతమ్ములని యెఱింగియు నిప్పట్టున వారిఁ జేర నరుగకుంటయె నా రాజభక్తికి బలవచ్చిహ్నము. ... ......అమ్మా, మఱి యింతకన్నను గ్రిందువడఁజాలను.

—కుంతి—

కుమారా! ఏదియెట్లయినను, నీవిపు డనుపమసత్య విస్ఫురణ నాడినమాట మాత్రము మఱువకుము. అర్జును నిర్జింప నీ వొంది యున్న దలం పది యెట్టిదైనను, తక్కటి నీ యనుజుల నల్వురం గడపు మంతియ చాలు.

అనుచుఁ గుంతి కర్ణునిం గౌఁగలించుకొని, శిరంబు మూర్కొనఁ గర్ణుండును ఆమె పాదకమలంబులకు మ్రొక్కి నిజావాసంబునకుం జనియె. కుంతియు మరలెను.

———

## సింహావలోకనము

అన్నా, కర్ణా! ఎంతచిక్కు దటస్థింపఁ జేసితోయీ, నీ కల కృష్ణుండును గుంతియు! కాంతాకనకమ్ముల నాసఁగొల్పి కృష్ణుండు నిను బాండవులం జేరఁ బ్రోత్సహించియు నాతఁడందు దీర్ణుఁడు కాకపోయెను. ధర్మజాదులు నీకు తమ్ములని నీ మనమున నొకింత బాంధవ్యము భ్రాతృభావము నుదయింపఁ జేయ నాతఁడు ప్రయత్నించెనుగదా! కృష్ణుఁడు నిను బాండవులలోఁ జేర్పఁజాలకున్నను, మానవ మానస తత్త్వ

వేఁదియగుట, నాతఁడు వివిధవిధముల నీ యుల్ల మూఁచియూఁచి కలఁచఁ బ్రయత్నించెనే కాని యాతని ప్రయత్న మంత్రఫలవంతము కాకుండెను. ఇపుడు కుంతియునట్లే ప్రయత్నించినది! కృష్ణుఁడు నీతో నొనర్చిన ప్రసంగమున నీ హృత్క్షేత్రమున నాతఁడు నాటిన బీజము లిపుడీకుంతిపలుకు జినుకులచే మొలక లెత్తక తప్పదు. ఏది యెట్లున్నను సర్వసిద్ధమయియున్న నీ యుద్ధసమయమున నీ కడకు వచ్చి కార్యభారము మనమున నిడికొని నీతోఁ బ్రసంగించిన కుంతి, నీ హృదయ రంగమున రాజభక్తి యొకవంకను, మాతృభక్తి వేఱొకవంకను నిలిచి హోరాహోరిగఁ బోరునట్లొనర్చి, కురుపాండవ యుద్ధమునకుఁ బూర్వము నీమనోదార్ఢ్యత కొకింత దౌర్బల్య మాపాదింపఁ బ్రయత్నించినది. ఇదియు శోకరీతిని గార్యకారియే యగు నేమో! నీవు తన కగ్రజుఁడవని యర్జునుండెఱుంగమి పోరొనర్చి నినుఁ బరిమార్పం గలఁడు. నీవర్జునుని నిర్జింపంగల వీరుఁడవె యైనను, అర్జునుఁడు నీకు సోదరుఁడని యెఱుంగుటను నీ వర్జునుని దీవ్రబాణపరంపరల నేయంజాలక యుండుటో, నీకస్త్ర స్ఫురణ మెడలుటో, గురిదప్పుటో జరుగకతప్పదు! ఇంత యెఱుంగక కాదు కుంతీ కృష్ణులు నీతోనట్లు ప్రసంగించుట! అటు కాదేని నిజజననీజనకుల నెఱుంగని నీవు రాధాధిరథులచేఁ బెనుపఁబడి, రాజరాజు నాదరణమున నింతవాఁడవయి యతుల విక్రమాఢ్యుండవగు నీవు, రాజభక్తినిరతుండవగు నీవు, మహేంద్రవైభవముల, ననుభవించిన నీవు, అర్జును మడియింపనె జన్మించితివని దలంచుచున్న నీవు, ఏకపత్నీవ్రతుండవగు నీవు, అర్జునునకు వెఱచికాని, రాజ్యవైభవములకు లోభించికాని, కాంతాకనకమ్ములకు లోఁబడికాని, రాజరాజును భండనమునకు పురికొల్పి పురికొల్పి తుట్టతుదకాతని సంగరమహార్ణవమునఁ బడద్రోసి, తగుదునని నీవు పాండవేయులఁ జేరుదువని కుంతీ కృష్ణులు దలంచియుందురని మేమనఁగలమా ?

శరసంధానవిధాన పాండితీ గరిమమున నయ్యర్జునుని మించఁగలశక్తి నీ కలవడియున్నదని నీవు నమ్ముటనో, ఆతనిమిగులగల ననుమనో ధైర్యముననో, నర్జునుఁడే విశ్వవిఖ్యాతుండగుచున్నాఁడేయను మాత్సర్యదర్ధిమనో, నీవాతని నెట్లయినను జంపఁ దలంచినావు. కాని యిప్పటిదాక నడచిన ఘట్టములఁ జూచితిమేని అర్జునకన్న నీకెక్కుఁడు ధనుఃకళాకౌశలమున్నదన్నచో నెద్దియుఁ గానరాదు. మత్స్యయంత్ర భేదనానంతరము జరిగిన దొమ్మిపోటున అర్జునుఁడే నినునోడించెను. పసులంబట్టించు నాఁడు దుర్యోధనుని వెంటఁదరుముచు నర్జునుఁడేగుచుండ, నీప్రభువును రక్షింపఁబోయి యర్జునునకు నీ వడ్డుతగిలి, ఆతనిచే నోడలు తూంట్లువడువాఱకఁ బోరి మరలితివి.

నీమోటమి కేమి! నిను నోడించిన వారి నే యాతఁ డోడించుట నీ వెఱుంగవోటు! ఘోష యాత్రాసమయమున బంధితుండగు కురురాజును విడిపింపనేగిన నినుబరాభూతుం జేసిన చిత్రసేనుఁ డర్జునుచే నిర్జితుఁడు కాలేదా! ఇట్లింకను వెదకువాని కింకెన్ని ఘట్టములు దొరకునేమో! కావున, నీవాతని మించువాఁడవని యనుకొనుటకు నుదాహరణములు కానరావు. ఇఁక కుమారాస్త్ర విద్యాకౌశల పరీక్షు నాఁటి నీ పిలువని పేరంటమున కేగుటను గూర్చి తలంతుమేని: అట 'నీ ధనుః కళా కౌశలముం జూపఁగలిగితేని, నీ వపుడు సకలజన సంస్తూయమానుండవయియే యుందు' వను జన బాహుళ్యపుటూహ మాత్రమే మిగిలినది. జరిగినవానిలో నింతయైనది. ఇఁక జరిగియుండనిది జరిగియుండినచో,-నిట్లయ్యెడి: నట్లయ్యెడి-నను పలుకుల నేమిప్రయోజనము! కాని ఒక్కటిమాత్రము బహిర్గతమై కానవచ్చుచున్నది. 'అర్జును నిర్జింపఁగల'నని, నీవు సంపూర్ణవిశ్వాసములో నుంటివి. నినువిశ్వసించిన దుర్యోధనుఁడు విశ్వపాత్రయమాపాదింపనున్నాఁడు. నీతిధర్మముల సమముగ నిర్వహింపఁబోయి తత్తఱపాటున నెంతదుఃఖపాటునైనఁ నీవు చేకూర్చుకొంటివని యనక తప్పదు. * * *

ఏదియెట్లున్నను అర్జును నెడ నీకుఁగల శరవిద్యావిషయైక మాత్సర్యమెంతటి విపదంబుధిని సృష్టించుచున్నదోయీ, యీ భారతాన్వయమునకే కాక భారతభూమికింగూడ!

కాని, కర్ణా, ఒక్కపనిమాత్ర మప్రతర్క్యముగా జరిగిపోయినదిసుమీ! నీవది గమనింపఁజాలకున్నావు. నీవింక నది తెలిసికొన నవకాశమును లేదు. అర్జునుపై నీకుఁగల పగ యెంత యగ్గలమైనదో కాని, "అర్జునుమాత్రము బిట్టరఁ జంపుదు" నని యూరకుండక, 'పాండవులలోఁ గవ్వడికాక నీఁక నెవ్వఁ 'డెదురైనను నేఁజంప' నని, 'నమ్ము' మని నీతల్లితో నవఁజేయఁగలిగినది. అట్లనుటను, 'తెలిసి తెలిసి భీష్మద్రోణ విదురులు పాండవుల నభిమానించినవా' రని జను లాడుచున్నట్లే, 'కర్ణా, నీవును ఒక పక్షమునఁ బాండవుల నభిమానించువాఁడవే' యని జనులాడుటకు మఱిగొంకరుసుమ! ఔరా! అర్జునునెడ నీకుఁగల పగ యెంత దారుణమై దీర్ఘమైనదోయీ! కారణమేదైననేమి, అప్రతర్క్యముగనే "పాండవులలోఁ గవ్వడిగాక యిఁక నెవ్వఁ డెదురైనను నే జంపనని నమ్ముము" అని కుంతితో నంటివని యనక తప్పదు. నీతి, ధర్మము, సత్యము, దానపరత మొదలగువానికి లోఁబడి యింకెన్నెన్ని చిక్కులు గొంటో మీదికి దెచ్చికొంటివో కద! ఇఁక నిన్నేమందుము! కాని యింకను నీలో సంప్రదించవలసినవిషయములుండుట నింకొకతరుణమున మరలఁగలసికొందుములే!

## నాల్గవ ప్రకరణము

### ( ౮ )

మయసభలో సుయోధనుఁడు.

"దురంతచింతాపరిశ్రాంతున కీబాహ్యోపచారము లన్నియు నపచారములును మనోవేదనాభివృద్ధికరములును నగునేకాని క్షణక్షణవిజృంభమాణహృదయతాపము నుపశమింపఁజేయఁజాలవుకదా!

"మయాచార్యుఁడు తన నేర్పు మెంపున నెంతేవింతగ నిర్మించిన శైత్యదాయకము లగు నీచంద్రకాంతశిలాఫలకముల రామణీయకత నాయంతస్తాపము నుడుపంజాలకున్నదికదా!

"అది గదిగో! అదియేకదా! ఆసూర్యకాంతశిలయేకదా ఆ మెత్తనిపులి యొనర్చిన రాజసూయముంజూచునాఁడు నను భ్రమఁ గొలిపినది! ఆనాఁడు నాకుఁదీరని మనోవ్యథ నేకూర్చినయీసభ, యీనాఁడుమాత్రము నా కూరటగలిగించునా? హృదయదహనపాటవము జ్ఞాతికే కాదు జ్ఞాతివానివస్తువునకుంగూడ నున్నదనుట కీమాయసభ యొక్కటియే జాలును. ఇదియే నన్నానాఁడు పరాభూతుంజేసినది! కపటద్యూతమునకుఁ గారణభూత మిదియే. కానివనిలోకులు నన్నధిక్షేపించిననధిక్షేపింతురుగాక, కారుటడవులే కలకాలము బాండవులకు నివాసముగఁ జేయుదును. పాండవుల నిఁక నీలోకమున లేకుండఁ జేయుదును. కాని, కర్ణుఁ డామాయదారిమాటలకు వశపడియెనేని, ఇఁక నేనేమి సేయఁగలను? ప్రభుభక్తితత్పరుఁడును, పరాక్రమవంతుండును, పావనచరిత్రుండును నగు కర్ణుఁడు నన్నువీడిపోవునా? కృష్ణుని మాటలాలించి, నను మోసము సేయునా? అసంతుష్టియు, ఫలాభావవిరాగమును, విసువుఁగలయుఁ గృష్ణుని మోమునఁ దోఁచుచుండె ననికడా చారుఁడు చెప్పిపోయినాఁడు. కృష్ణుని మాటలకుఁ గర్ణుఁడు వల్లెయనినచోఁ గృష్ణుఁ డల్లుకానరానేల?—లేదు—లేదు—నాకర్ణుఁడు-కృష్ణునకు,

వశంవదుం డయియుండఁడు—తప్పక మరలి రాక తప్పదు.

"పాండవులను సమరమున మడియించియో, జయించియో యీసభాభవనమునసె నాచే రాజసూయము నెఱపఁజేయుదునని విలు ముట్టి బాసఁజేసినకర్ణుఁడు తప్పక మరలివచ్చును.

"ఘోషయాత్రాసందర్భమునఁ బ్రాయోపవిష్టుండనయియున్న సమయమున ననుసమీపించి కర్ణుఁడు, 'ఎల్లనిపటుత్వంచిన యీపరాజయమునకు ననుక్షమియింపవలదు. పదమూఁడవయేడుగడపి పాండవులుమరలిరానిమ్ము. అర్జుననిర్జించెద' నని యొత్తిపలికెనే! ఇట్టిపరీక్షా సమయమునం దేల ననువీడును! కృష్ణుఁడు భేదనీతిపరుఁ డగుఁగాక—కర్ణుఁడు మాత్రము రాజద్రోహి కాఁజాలఁడు-కానేరఁడు.

"కర్ణుఁడు—రాజభక్తితత్పరుఁడు—ప్రాణమిత్రుఁడు- ఆదర్శపురుషుఁడు-కర్ణుఁడు"

ఉత్తేజితుండగు కర్ణుండు సభా భవనముం బ్రవేశించెను.

కర్ణుం జూచుచు దీర్ఘోచ్ఛ్వాసంబుపుచ్చి, దుర్యోధనుఁడు:
"ఏమోయీ, యంగరాజా, త్రోవఁదప్పి యిటు వచ్చితివో?"
అని ప్రశ్నించెను.

"త్రోవ ద్దప్పు స్వభావమే నాదికాదు. మీ దర్శనముజేయఁ గోరియె వచ్చినాను" అని కర్ణుండనెను.

"యాదవ దర్శనానంతర మింకను మా దర్శన మాసించుట వింతయే యగును." అని దుర్యోధనుఁ డనెను.

"ఎవరేమిచెప్పినను వినినపిదప వేగపడక, వివేకముతోఁగార్య దశనిర్ణయించుకొనునేను, యాదవదర్శనమె కా దింకెవరిదర్శనమైనను జేయువచ్చును. అందువలన నాదర్శితుని మనోభావములఁదెలిసికొనినవాఁడ నగుదును. అం దేమియు దోసములేకుండుటయె కాక, అది మనపక్షమున నెంతేనిఁ బ్రయోజనకారియు నగునుకదా!"

“అది కా దదికాదు...పోఁబోవుచు, నా వసుదేవతనయుండు నీదెసం గనుంగొని, తనకరంబుసాచి, నీచెయివట్టికొని, తనయరదం బెక్కించుకొనిచనుట నేఁ జూచితింగావున, నీ వాతనిమాయలలోఁ బడియు, మరలిరాఁగలుగుట కబ్బురంపడి, ‘మేలు- కృష్ణుని యురులలో మాకర్ణుండు జిక్కుకొనలేదుకావలయు-’ నని యానందము నొందుట నిట్లంటి.”

“ప్రభుశేఖరా, కృష్ణుఁడైనను, మఱి జిష్ణుఁడైనను- నామనో నిశ్చయమును భగ్నమొనర్పంజాలఁడు. చక్కఁగఁజింతించి చింతించి యేర్పఱచికొనిన కార్యకలాపమునకు నడుమనెట్టి విఘ్నములు కలిగినను, కార్యక్రమమునకు భంగమురానీయని స్వభావముగలవారు మీరనుకొనినటుల శత్రుజనపక్షముం జేరఁజాలరు. ఇంతకును శత్రులఁ జేరఁదలంచినచో మఱల మీదర్శనముంగోరుచు నిటకురానేల?”

“విశుద్ధచరితుండవగుట, యాదవు నిర్బంధంబున రిపుజనపక్షముం జేరవలసివచ్చెనని నాకుఁ దెలియఁజేయుటకై ననుఁజూడవచ్చితివనియే భావించితిని. ఇందేమియస్వాభావికమున్నదని యనఁగలవు?”

“అన్నా! నందనందనునిం గొంతదూర మంపకమువెట్టివచ్చుట కేగుటయె నీ కింతసందేహమునకుఁ గారణమయ్యెనే!”

“అది మాకుఁ దెలియుటెటులు? ఆతని ననుచుట కేగితివో- మరియెందులకేగితివో- ఎవనికెఱుక?”

“కురువృద్ధులందఱును నిలిచియేయుండ, రహస్యమునఁగాక, అందఱును వినునట్లు-నన్ననిచివచ్చెదుగాక-యనికదా యాకృష్ణుఁడు నను దనయరదముపైనెక్కించికొనియె! ఇందేమిరహస్యముకలదు?”

“ఇందుబాహ్యమున నెట్టిరహస్యమునులేకుండవచ్చును. కాని నీతోఁ బ్రత్యేకముగఁ దనకవసరమగునట్టిదియును, మేమువినరానిదియు నగువిషయముంగూర్చి సంభాషింప నవసరముగలిగియే యుండును. కానిచో, నిన్నొక్కనినె, తీసికొనిపోనేల?

"ఎవ రేమియొనర్చినను స్వకార్యనిర్వహణార్థమెకదా! అట్లు గుటఁ గృష్ణుఁడెందులకయి నను బిలచినను, దనచింతితకార్యము విఫలమగుటఁ దుదకు విసుగును, అసంతుష్టియుంగూడఁ జెందినాఁడు. 'కర్ణుఁడు కూడఁ దన చెప్పినచొప్పున యొప్పుకొనలేదే' యని పాప మాతఁడు నిర్విణ్ణుఁడై మరలినాఁడు"

"ఏమేమీ! కురుసభలోనన్నూపియూపి, నాయుల్లముంగలఁచి కలంచి, తనప్రయత్నము సఫలము కామిఁ గొన్నికొన్ని వెడమాయలు పన్నియంతతోనాఁగక, నినుగూడఁ గెరలింపఁజూచనేమి? ఆతఁడెంతకుఁ దగఁడు? ఇంతమాయలాఁడింకొకఁడు కానరాఁడు! —నిరాయుధుఁడనై యుందును: పరమాప్తుండనై యుందును—అనియానాఁడనిన యాకృష్ణుని మాటలకిదియె కానోపు నన్వయము! అన్వయము—కృష్ణునకునన్వయము సంకీర్ణాన్వయము—అంతయును సంకీర్ణులే! కనుకనే ఒక్కపంక్తిమునం జేరి యున్నారు. భీష్మాదులుగూడ— ఆ జన్మవాసన యదయెంతకలదో! కాని పాండవేయులఁగూర్చి యేమాత్రము ప్రసంగము వచ్చినను, తాము ప్రసక్తి కలిగించుకొని వారిపక్షమె వాదించుటతోనాఁగక, ఆయాదవుని భగవంతునిగా నెంచుచు, స్తోత్రము సేయుచుందురు. కృష్ణుఁడే భగవంతుడైనచో, ఒకరిపక్షమునవహించునంతటి నీచకార్య మేలయొనర్చును? పక్షము వహించుట, మనవంటివారి స్వభావమునకు నిసర్గముగాని, భగవంతునకుఁగాఁజాలదే! భగవంతుం డొక్కనివాఁడు కాఁజాలఁడే! ఇట్టి పట్టులఁ బాండవాదులును, భీష్మాదికురువృద్ధులును, కృష్ణుని భగవంతుండని పొరపడి నమ్మి, బట్టులవలెఁ బొగడుచుందురు. అంతతోనాఁగక వారింబోలె నేనుఁగూడ నాయైంద్రజాలకునిభజియింపనని ననుదూఱుచుందురు. విషయవిజ్ఞానముతో, కార్యకారణసూత్రములగుఱితించి, వస్తుతత్త్వము నెఱింగి, భగవద్గుణనికాయమును, మానవస్వభావగుణప్రచయమును, వేరుపఱచికొని సరిచూచుకొనఁగల నేనుమాత్రము పామరజనముంబలె వినినదంతయు సత్యమెయని కాని, గుడ్డి

నమ్మకముతో నౌననికాని, యనుకొనఁజాలను.

— కర్ణుఁడు —

ఇపుడు మనకు విషయవిజ్ఞానముతోఁగాని, భగవద్విషయైక చర్చతోఁగాని పనిలేదు. ఎట్టివాఁడు భగవంతుఁడు? కృష్ణుఁడు భగవంతుండగునా కాఁడా? యను సంశయము లంతకన్నను మనకుఁబ్రస్తుతాంశములు కావు. కృష్ణుఁడొనర్చిన కార్యములు కొంద అమానుషములనియు, మఱికొంద అతిమానుషములనియు,నింకంగొందఱు వెడమాయలనియుఁ బ్రసంగించుచున్నారు. ఇం దేదిసత్యమైనను, మనయభిప్రాయములతో నేమాత్రమును సంబంధము లేకయే, కృష్ణుఁడుపొందఁదగిన పేరుపొందియే యున్నాఁడు. ఇంతకును నిం దేదియు మన ప్రస్తుతాంశముతో సంబంధముకలది లేదు.

మనకును వేళయైనది. ఇఁకఁ గార్యక్రమమును నిర్ణయించుకొనుట, కార్యనిర్వాహకులను నియమించుకొనుట మొదలగువానికి మఱి తడవులేదు.

కర్ణుఁడు ప్రభువునసుమతిని వెడలినాఁడు. దుర్యోధనుండును నిజావాసంబున కేగెను.

# రాయబారము

## అయిదవ ప్రకరణము

## (i)

### ఉపప్లావ్యము

"అల్లదే, కృష్ణుని యరదంపు పడగ... అదె వచ్చుచున్నాఁడు ... ..."

అని ధర్మజాదులందఱును లేచి కృష్ణుఁడు రాఁగల తెన్నున దృష్టిసారించి చూచుచుండగనే కృష్ణుని యరదము వచ్చినిలచెను. కృష్ణుం డరదంబు డిగ్గి తన కెదురయిన భీమసేనాదులను, విరాట ద్రుపదాదులను నభినందించి, ధర్మజు నాశీర్వాదంబు వడసి యట్లె నిలచి, ధర్మజు నుపలక్షించుచు:

"—కౌంతేయాగ్రజా, ఉన్మత్తులగు ధార్తరాష్ట్రులేల తగవుఁ బలుకులచేఁ గలయికమనికి కిచ్చగింతురు! స్వ పర బల విచక్షణాజ్ఞాను లగుదురేని ఇందనుక వారలంతలు సేయఁగలుగుదురే! ఇంతఁదనుక వారి వంచనాఘట్టములె మీకుఁ జవిచూపి, వారిబలాతిరేకముల కె మిమ్మెర సేసిరి గాని, మీచే మీ చేవ వారించుకేనియుఁ దెలిసికొనినఁగదా, మీతో సంధి సేసికొన దలంచుటకైనను! మీ కొఱకా కౌరవసభను శాంతిని యాచించుకొని, లోకకళ్యాణమునకై భారత వీరుల నింకం గొంతకాలము బ్రదుకనిమ్మని వేడికొని, యాచకుఁడనైతిని. ఇట్టిపట్టుల నేనెంతవఱకు గ్రిందుకాఁగల నంతవఱకును గ్రిందయి సంధినె కోరుచు నెంతయుఁ బొరలితిని. నా ప్రార్థన మధికమైన కొలఁదియు నాతసమౌర్ఖ్యమును, విదుపోషమియు, దుర్మానమును మిగులఁ బ్రబలినవి. చివఱకుఁ బ్రయోజనము లేకపోయినది."

అని తనపోయివచ్చిన కార్యంపుఁ దెఱంగెఱింగించి, "ధర్మజా, పథశ్రమంబున నున్నాను. సావకాశముగఁ గలసికొని, యీవిషయము ముచ్చటించుకొందము. ఇప్పటికి విశ్రాంతి నొంద ననుమతిఁ గైకొందును—" అని కృష్ణుండును నిజమందిరమ్మున కేగెను.

ధర్మజుండును, దనయనుజవర్గముదెసఁ జూచుచు, మాౘిప్పడి గొంత వడికి నిజోచిత వర్తనముల నుండెను.

---

## అయిదవ ప్రకరణము

### ( ii )

కౌరవసభనునడచిన కార్యపర్యవసానము ధర్మజునకునివేదించి కృష్ణుఁడు దనమందిరమునకు మరలినక్షణమునుండియుఁ దామరాకు మీఁది నీటిబిందువువడువున నిల్కడలేని మానసముతోఁ దనప్రాంగణమున నిటునటుఁదిరుగుచు ధర్మజుఁడు, కృష్ణునిపలుకులె మఱల మరల నెదఁ దలంచుచుఁ జింతిలుచుండెను.

—ధర్మరాజు—

మానవుఁడు తన కుచితమౌ తెఱంగని యెంచినదానింగూర్చి పొరింబోరిఁ దలంచుచు తదనుగుణముగఁ బ్రవర్తింపఁదలంచుచుండును; కాని తనప్రవర్తనకితరులు ప్రధానులగుపట్టుల వారి వర్తనముతోఁ దనకుఁ బ్రసక్తియున్నంతవఱకును, దన ప్రవర్తన మెంత నియమబద్ధమయినదయినను, దాని నొకింత సడలించుకొను నవసర మెడనెడఁ గలుగుచునే యుండును.

నేనెన్నివిధాలఁ బ్రయత్నించినను యుద్ధముకానిమార్గము మఱిస్ఫురింప లేదు. ద్రుపదపురోహితుచేఁ గబురంపిచూచితిని. సంజయు ముఖమున మరేమియు మిగులనీయక, యనవలసినవన్నియు నంటిని. దుర్మానియు, దుస్సాహసుఁడు నగు దుర్యోధనుదెసఁ గార్యంపుఁదెన్ను చక్కపడదని తెలిసియుఁగృష్ణునంపి రాయబారము నెఱపి చూచితిని. ప్రయోజనము లేకపోయినది. పౌరుషమున నింతకన్న నేనేమి చేయఁగలను? పాపమీకృష్ణుఁడుకూడ నాకొఱకెంతశ్రమంపడవలెనంతయుఁ బడియె విడచినాఁడు; కానికౌరవ్యులు తమదుర్జనత్వముచేత, కురుకులమునకు వన్నెదెచ్చిన యలనాటి పౌశీల్యమునుగూడఁ బారఁద్రోలి యెంతలూనర్చిరి!

ఆదుర్యోధనుఁడా భీష్మబాహ్లికవిదురాదులేమైన నైతికముగను, పారలౌకికముగను జెప్పఁబోయినను, వారిని సరకుసేయఁడు. తానను కొనినమార్గముగాక,

ఇంకొకటికలవనియైనఁదలంపఁజాలఁడు. 'తనకుఁదానుగా నైతికమార్గమీతనికిఁదోఁచు నేమో; నేనేలతొందరపడవలెనని చాలకాలముసైచి చూచితిని. ఇప్పటికిని ప్రయోజనము లేకపోయినది.

దుర్యోధనుండు దేవబ్రాహ్మణ గురుజనపూజాధురంధరుండయి నేలయేలుటలోఁ, బ్రజలసౌకర్యము లెఱింగి వారిని సంతృప్తులంజేయుచు వారి నోముటలో, ఆర్త జనంబుల కీవులొసంగుటలో, క్రతువు లొనరించి తత్తదుచిత ప్రకారంబుల గౌరవించుటలో, మాయయ్యపరిపాలనను, మాపరిపాలనముంగూడఁదోసిరా జనిపించునట్లుల రాజ్యంబుపాలించుచున్న మహామహిమాన్వితుండయ్యెను, మహామానియు దోర్గర్వియునౌటఁ, బాండవేయులయెడను దలంపునకు వచ్చినయంతనె, నిప్పుకలం ద్రొక్కిన కోఁతిగతిఁ జెందుచుండు. సౌమ్యమున మఱి కార్యము గడతేఱునని యేయెడనైనఁ దలంప వలనులేదు. కార్యభారమువహించి కురుసభకేగిన కృష్ణుఁడే మంగళహారతినంది మరలివచ్చినపిదప నిఁక నెవఁడింతకన్న సమర్థుఁడున్నాఁడు! కాని కృష్ణునిధార్తరాష్ట్రులకడ కనుపుటమాత్రము లౌకికముగ నెంతేని మేలగుపని యైనదని సంతసింతును.

యుద్ధము సన్నద్ధమె యైనను, ఎట్లేని మాన్పనగునొకా యని నే నెంతే విలపించితిని; ఎంతో ప్రయత్నించితిని; ఎంతయో సైరించితిని; కాని నిర్బంధమును, దురాగ్రహమునుగల దుర్యోధనుని, ఎవరెంత చెప్పినను విననొల్లని యాదుర్బుద్ధిని ప్రేమచే, సైరణచే, అణకువచే, గౌరవముచే, మరల్పఁజూచినను, మరి వలనుపడినదికాదే యని, నేఁజింతిలుచున్నను, అతం డేరునుమరల్పరాని చేటును సంభావనసేయుచు, మమ్మెంతో పరిభవమొనర్చియు, నింకను బరితృప్తిం జెందఁజాలకున్నాఁడుకద !

ఘోషయాత్రాకాలమున గంధర్వులచేఁ జానున్న సమయమున నాతని రక్షింప విడిపించినమాప్రయత్నము, వానికి మాపైఁగల మాత్సర్యముమాన్పి పశ్చాత్తాపము నుదయింపఁజేయఁజాలక, అవమానకరముగఁదోఁచి వాని దుష్ప్రవృత్తినిమఱింత రేచుటకే కారణభూతమయ్యెను.

ఆనాఁ డేకవస్త్రయా ద్రుపదాత్మజను గొప్పువట్టిసభకీడ్చుకొనివచ్చి యవమానమొనర్చినయాతని యవినీతిని మేమెంతయు నోర్చియుండుట నించుకేనియోచింపక దానిని మా యసమర్థతగాఁదలంచి, మఱిమఱి పైకొనమొదలిడెను. ప్రేమమూపి యాతనిహృదయకాఠిన్యము మెత్తపఱుపనొనర్చిన మాప్రయత్న మాచంపము

నను, సైరణనూపి యాతని యవినీతిని బోఁద్రోలి నీతిమంతునిగా నొనర్పనెంచిన యీ ప్రయత్న మీచందమునను, బటాపంచలయ్యె.

'సమయానుసారముగ నరణ్యాజ్ఞాతవాసములు నిర్వర్తించుకొనివచ్చినపిదప నైనను వారుమా రాజ్యభాగమును మాకుఁ దమంతఁ దా మొసంగలేదుకదా' యను నీర్ష్యనొందక, తొలుదొల్త నే వారిపై దాడివెడలనైన నిచ్చగింపక, లోకము నెడ నణకువయును, వారియెడ నింకను గౌరవమునుజూపుచుఁ దొలుత ద్రుపదపురోహితుని బిదపఁ గృష్ణుని వారియొద్దకనిపియుఁ జూచితిని; కాని ప్రయోజనము లేకపోయినది. మాకుఁ బైతృకంబగునట్టిదియు, దిగ్విజయంబున మే మలవరించుకొనినదియు నగు రాజ్యంబు మాకొసంగు మని కోరినను, మకొసఁగకుండుటకుఁదోడు, మాయైదుగురకును, మాచుట్టాలకును, దగినట్టుల నైదు ఊరులనైన నీయ సమ్మతింపనట్లే తెలిసినది. మాకు వారలు గావించిన పరిభవములకుం దెగి, మేము వారిపైఁ గీడు సేయమియుం దలంపలేదు. సర్వవిధములవారు సమరమునే గృవపఱుచుచున్నారు. తుదకన్నింటికిని గిరీటమువంటి శ్రీకృష్ణుని మాటఁగూడ నిలువనిచ్చువారుకారు. ఇట్టిపట్టున సమరంబు కానివిధంబు దోఁపకున్నది.

ద్రౌపది తనపడ్డ బన్నముల నెన్నుచు సదా భీమసేను నుద్రిక్తుం జేయుచుండ నాతండును సమయవిచక్షణ లేకుండ నెప్పటి కప్పుడే గదాధారియై దుర్యోధనుపైఁ గవియ సంసిద్ధుం డగుచుండును. యుద్ధమే లేకుండఁ జేసికొనఁ జే సాచి క్షత్రధర్మ నిర్మూలనమొనర్చి, వారేమిచ్చినను నిచ్చిన కుతుకమ్మనే నందికొనఁ దలంచిరియె కద తొలి భూదేవుని, మలి వాసుదేవునింగూడ నంపియు తుదకు కృతకృత్యుండను కానైతిని. మాధవుమాటఁగూడ దక్కినది కాదని తెలిసికొనినది మొదలు భీమసేనాదులు రేపకడ లేచి, సమర సన్నాహంబులు సేయుద మనుచున్నారు. నే నింతలో మాధవు మందిరమునకుఁ బోయి యాతం డేకతమ యున్నపుడు, చర్చింపఁగల విషయములనెల్ల సంశయముదీరఁ జర్చించిచూచెదఁ గాక!"

ధర్మజుఁడు సమరంబన మిగులఁ గటకటంపడుచున్నాఁడు. మనసునకుఁ దెంపు లేక ఒకతెన్నునఁ బోజాలకున్నాఁడు. మాధవు మందిరమునకుఁ బో నుద్దేశించినాఁడు.

"ఇంతరాత్రియైనదే! కృష్ణుఁ డింతకు నిదురించియే యుండును. ఐనను దెలిసికొని వచ్చెదఁగాక", యని ధర్మజుం డనుకొనుచు, వెడలి, మాధవు మందిరము సమీపించునంత నదివఱకెంత సాంద్రముగుండెనొ, తనమందిరప్రాంగణమున నిటునటుదిరుగుచుండెనో కాని, ధర్మజుం జూచినయంతనె, శ్రీకృష్ణుండు, "పాండవాగ్రజా, ఎంత

వల దనినను యుద్ధమే సిద్ధమైనదే యని నీ మానసము గుదుటలేమి, నిదురరామి, నేమియుందోఁపమి, నిటకువచ్చినట్లున్నది——". అని యనెను.

"మాధవా, మన మిరువురమును గలసి యోచింపఁదగిన విషయ ముండుట నీ యడ్డనురేయి నిను శ్రమపెట్టఁదలంచి వచ్చితిని."

"నీ యాప్సితము నెఱవేఱినదికాదు కదా యనియు, నెన్నివిధాలఁజూచి నను పోరికింపలపడుటెకాని మతశ్శాంతి నెలకొల్పఁబడినది కాదే యనియుఁ జింతిలుచు నిదుర లేక, యిటునటుఁదిరుగుచున్నాను. సర్వమానవప్రయత్నమునఁ బర్యవసానము ననుసరించి, లాభనష్టములకును, నిందాస్తుతులకును ప్రధానధామంబగు, నీకు మానసపుటారాట మాదెంపకలదోకాని యిగానశికిరేయి నిట్లొంటరిగ నిటు కరుదెంచుటకుఁగల నీ కార్యభారము గోచరమగుచున్నది. భవిష్యత్కార్యముంగూర్చి మన మేమేమను కొనవలసియున్నను, కలియఁబోసికొనఁదగిన సమయ మిదియొకదా!"

"ప్రధానమగు నొక యంశముంగూర్చి నీతో సంప్రదించుకొనఁ దలంచివచ్చితిని."

"యుధిష్ఠిరరాజా, నీయాజ్ఞల నౌదలవహించి, నీ కనుసన్నలమెలఁగవలసిన మము బోంట్ల శాసించి కార్యక్రమము నడిపించుకొనఁదగిన నీవు నాయెడఁగల ప్రేమముడిచే నాతోఁ బ్రసంగించి, సంప్రదించుకొనఁదలంచితి నని యంటివిగాని, వివేకమూర్తి వగు నీ వొరులకడ విషయవిమర్శఁ జేసికొనఁదలంచు టేటిమాట!"

"స్వయముగఁ గురుసభకేగి సవిమర్శంబుగ నన్నియు నవలోకించి యేతెంగి వచ్చిన నీతో సంప్రదించుకొనుట యత్యవసరము కాదా!"

"నందనందనా, కురుసభలోని యంతఃబమానసపరిస్థితులం బరికించితివి: మాయావస్థల నరసితివి: కురువీరులఁజూచి వారిసేనలసన్నాహములఁ దెలిసికొంటివి. అంతటివీరులు మన సేనలో లేరు. కాని మనకున్నవా రందఱును వారికిఁ దీసిపోరు. ఇఁక వారి బలగమునఁ గల లోపములును, వారికి దౌర్బల్యకారణములై మనకు మార్బలములు కాఁదగినవియును, నీవుఁ దోఁచినంతవఱకును నాకుఁ దెలియఁజేసినచో నేనును యోచించుకొందును."

"నను బరీక్షించుటకడిగిన ప్రశ్న మిదికాని, వారిదౌర్బల్యములలో నేవి మనకు మార్బలములుకాఁజాలనివని నీ కెత్తి చూపఁగలను? అంత నీ వెఱుంగని వేవి! అయినను నీవడిగినదానికి సదుత్తర మొసంగకతప్పదు కనుక నాచెప్పఁబోవువానిని సావధానముగ విని విమర్శింపఁదగును"

రా య బా ర ము

బాహువిక్రముండ్రై, అఖండమహీమండలంబేలుచు, రారాజనిపించుకొని, దేవబ్రాహ్మణపూజాధురంధరుండయి, మిముమఱపింప, మీ పరిపాలనకన్న మిన్న యనిపింపఁదగినరీతిని, మీరడవులనున్న కాలాన ధరణీచక్రమునేలినఘనుండు దుర్యోధనుండు. పాండవులు దక్కఁ దక్కొరులంగూర్చి యాతనికి దుర్భావంబైనను మఱిలేదు. ప్రత్యేకపుఁ బగలు గలవారిని వీడి యాలోచించినచో నిఁక నెన్నుదమన్నను-ఏదీ మందునకైనను- ఒక్క చెడ్డ, ఆతనియందు! అట్టియాతఁడిపుడీ యాహవమున ముఖ్యముగ భీష్మద్రోణకర్ణదుశ్శాసన శల్యులపై నాధారపడుచున్నాఁడే కాని, వారి వారి వ్యక్తిత్వవిశేషములు మనకు మార్బలములు కాఁగలవనియైన నూహించుకొనన సమర్థుఁడు. సర్వసమర్థుండనని దుర్యోధనుండు సర్వదా తలంచుకొనుచుండుటయె తన యసమర్థతా చిహ్నముగాఁ దలంపఁజాలకున్నాఁడు. దుర్మానముతో దుర్యోధనుఁడు మీయెడ నిర్బంధాధికారము వహించుటయె, తనకు దౌర్బల్యహేతువయి, మనదౌర్బల్యము వాపుటయే కాక, మనకుమార్బలముగూడ నగుచున్నదని తనకుఁ దోఁచకున్నది. ఇంతకన్న నింకేమి కావలయును?

తాఁ గార్చిచ్చు నార్పఁగలననియుఁ, బాషాణవర్షంబు నాపఁగలననియుఁ, ప్రచండవాయువును స్తంభింపఁజేయఁగల ననియు, నీటిని నాటుగను, నాటును నీరుగను దన మంత్రబలంబునఁ జేయఁగల ననియు, మిత్ర శత్రు విషయంబులైన శుభాశుభంబుల మార్పఁగల గ్రహగతులపైఁగూడ సంపూర్ణాధికారము గలవాఁడ ననియుఁ దన ధీమహిమంబును, దన యశేష సేముషీ సనాథత్వంబును, గొనియాడుకొనుచు స్వశక్తులపై నాధారపడుచున్నాఁడే కాని, తానెఱిఁగినమహిమములకు మార్మహిమములును, ఉపసంహారమంత్రములును, ప్రతిమంత్రములును, దనయెదిరి యెఱుంగునో కాయనియైనఁ దా సంశయింపఁజాలండయ్యె. మిత్రశత్రుగణంబుల విషయంబులైన శుభాశుభంబుల

నెఱింగినవాఁడననియు, వానినిపూర్వఁగల గ్రహగతులపైఁగూడ నధికారముఁగలవాఁడననియు, ధైర్యమూనియున్నాఁడేకాని, తనకు రాఁబోవు శుభాశుభంబులంగూర్చిన భవిష్యద్విషయంబుల విచారింప నోపఁడు. ఇట్టివాని ధీరహితత్వము మనకు మాగ్బలము కాదా!

మీకుఁగొంతయైన ధరణీభాగమొసంగుమని యెంతచెప్పినను, వినని దుర్యోధనునికడఁ దన ఖండనవాదత్వము చెల్లఁజాలక, యాతని వీడనేరక, చేయునదిలేక, యిపుడు యుద్ధమొనర్చ వారి సర్వసేనానాయకత్వము సంగీకరింపనున్నాఁడేకాని,— పెద్దవాఁడనగు నామాట వినకపోవుటకుఁ దోషము కృష్ణునిగూడ నిరసించినాఁడే— యాని దుర్యోధనునిమొద ననహ్యాయములేక కాదుసుమా, భీష్ముఁడు మనతోఁ బోరఁ దలఁపఁడుట! ఇదిమాత్రము మనకు మార్బలము కాదా!

కుమారాస్త్రవిద్యా కౌశలపరీక్షా సమయమున నుద్రేకించుచున్న కర్ణునాపి, యర్జును గౌరవము గాపాడిన శిష్యవాత్సల్యుండగు ద్రోణుఁడు- మహాసత్త్వమగు గురుదక్షిణను, ఉత్తర పాంచాలమును, శిరోమణిని గిరీటివలనఁబడసి యనుభవించుచుఁ బ్రముదిత హృదయుడగు ద్రోణుఁడు- తొలి రాజరాజు పోషణమును వడసిన కారణమున నిపుడు యుద్ధమున విలునట్టి నిలుచుట వారికి దౌర్బల్యమును, మనకు మార్బలమును గాదా?

నిశ్చలము, నిష్కళంకము, నిరవధికము నగు ప్రభుభక్తిగల కర్ణుఁడు రారాజునెడఁ గల దురహంకారమును- దురభిమానమును మాన్పి, ప్రమాదము లానవహిలుపట్టుల నెచ్చరించి వానిని మందలింపక, మఱలింపక రాజానుగ్రహమునకై యిచ్చకములాడుచు వాని నేయనుసరించి దుర్మంత్రముల నెఱపుచుంటయు మిమ్ముందఱ సరకుసేయక యొక్క యర్జునునందే దృష్టిని కేంద్రీకరించుటయు దుర్యోధను నాశమునకుఁ గారణములును- మనకు మార్బలములును గావా?

ఇఁకమద్రనాథుఁడందువా? ఆతఁడునీకోరినచందమున నాహవ

రంగమునఁ బ్రవర్తించెనేని గర్ణుఁడు నిర్వీర్యుఁడును నిస్తేజుఁడును నయి యసమయుద్ధక్రీడను జేయాడక దిక్కులుసూచు పరిస్థితు లేర్పడక మానునా? కనుక మీవాఁ డగు శల్యుం డావలనుండుట మన కెంతయు మార్బలము కాదా!

వారి శిబిరములో, వారి సేనలలో, వారి సేనానాయకులలో భిన్నాభిప్రాయము లుండుటయును, గురు వీరులలో నొక్కొక్కరుఁ బాండవ పక్షమున నున్నవారిలోఁ బ్రత్యేక ప్రత్యేకముగ నొక్కొక్కరిపై వేర్వేరఁ బగలసాధింపఁదలంచి యుండుటయును, జయలక్ష్మిం గూర్చి వారివారియాశయములు భిన్నభిన్నములౌటయుఁ, గౌరవ పక్షమువారి గమ్యస్థానములును, కార్యగౌరవదృష్టియుఁ గేంద్రీకరణమునొందక చెదరియుండుటయును, మనకు విజయప్రదములౌ మార్బలములు కావా!

ఇఁక వారిపక్షమున నన్నింటికిని బ్రధాన దౌర్బల్య మేమన: 'బాహుబల సమన్వితులము, దశదశలఁ జూచుకొని సేనల నడిపించుకొనఁగలవార'మనుకొని గర్వించుచు దారుణాతిదారుణములగు పౌరుషశక్తులనెల్ల భస్మమొనరింప సమర్థమగు దైవము నెడవెట్టుచుండుటయేకాక, దైవమునకుఁ బౌరుషము లోఁబడియుండుననియైనఁదలంపఁ జాలకుండుటయేసుమా! అదియే మనకుఁగల "స్వల్పసంఖ్యాక"మను నామమాత్ర దౌర్బల్యము నిట్టె పోఁగొట్టఁగలదుసుమా!

కాని యుధిష్ఠిరరాజా, నీమానసకాసార మిపుడెంతేని గల్లోలమునొందియున్నదనుమాటమాత్రము నిశ్చయమనితోఁచెడిని. ఎంత కాలము వేచియున్నను, వారిపై ధ్వజమెత్తక యెన్నిఇక్కట్టులువడినను, కౌరవ్యులకుఁ బశ్చాత్తాపముకాని, మంచిబుద్ధిగాని, కలుగలేదే యనువేదనయొకవంకను, 'నయ్యో! గురుబంధుమిత్రజనంబులందఱితో యుద్ధమునెఱపి, జయమందియు, రక్తసిక్తమాగూడెటులఁదిందు'నను చింత యింకొకవంకను, 'యుద్ధమేచేయక కందమూలాదులందినుచు

మునులపోలిక నడవుల దపంబొనరించుకొనుచుఁ గడమ కాలము బుత్తుమన్నచో, స్వధర్మమును వర్జించిన పాపమున కొడిగట్టుకొనిన వారమగుదుమే' యను ననుతాపము మఱియొకవంకను, 'పౌర్వాపర్యములు జక్కఁగఁ జర్చించికొని యేఁగుచుంటి మాహవరంగమునకని యనుకొనుచున్నామేగాని పారలౌకికముగా నిదియే ప్రారంభించిన కార్యముగాఁ బరిణమించి, తుదకు దుఃఖభాజనమగు నరకప్రాప్తియే సిద్ధపఱచునేమో' యనుభయ మన్ని దెసలను, నిన్నలమికొనుట నింతవంతకుఁ గారణమగుచున్నట్లు తోఁచెడిని. అట్లయిన నిప్పట్టునఁ జెప్పఁదగినమాట యొకటి లేకపోలేదు. కార్యాచరణముపట్ల మానవప్రయత్నమునకు లోపము రానీయకుండఁ జేసికొని, మనోగతిని వాక్ప్రకారంబును నేకంబు సేసికొని, కార్యదిశ నేర్పరచికొని, యామార్గంబున కార్యమును బ్రవర్తింపఁ జేసికొనినచో మఱి నీయందు, గార్యావసానముపట్లఁ దోస మావహిలఁజాలదు. నిన్ను లోకము దూఱంజాలదు. ఇది యెంతయు సిద్ధము. ఎన్నివిధములఁ బ్రయత్నించి చూచినను యుద్ధము మాన్పు మార్గము మఱిదొరకినది కాదే యని నీకుఁ దోఁచినచో, వంచనమార్గమున మీ రాజ్యమును మీసంపదయును మీరు గోల్పోవుట సత్యమె యయ్యెనేని యా నష్ట సంపదలనెల్ల యుద్ధము చేసియైనను, మరలఁ గైకొనుట యేధర్మమని నీకుఁ జక్కఁగఁ దోఁచెనేని, ఇఁక నాలస్యము సేయక, శిబిరమున కేగి యుచితప్రయత్నములనుండుటయె నీకుఁ గర్తవ్యము."

శ్రీకృష్ణుని నుడుల తదేకధ్యానమున వినుచున్న ధర్మజుం డిట్లు పలికెను

"నందకుమారా, నీనుడులు సమంజసములయ్యు, 'దారుణాశనిపాత తుల్యములు'. ఆహవకార్య మనివార్యమని యెఱింగియు, నెంతేని ముమ్మరమ్మగు నుమ్మలికమ్మున నే ననిచిచ్చుం జొరవలసి వచ్చుచున్నది. అమానుషమౌ మూర్ఖత యెదిరియైయుండ, సైరణ కార్యకారి కాఁజాలదు కావలయు!" అని యూఱకుండెను.

"వేకువయగుచున్నది. మనకార్యక్రమము బహుదారుణమై, సర్వతోముఖప్రజ్ఞను గోరునదై యున్నది.

అదె, దిక్కులు తెలివొందుచున్నవి! ఇంతవఱకును దిక్కుల నలమికొనినచీకటుల వెందుబోవుచున్నవోకాని, రాబోవు నీవిజయశ్రీ వోలె నిష్కళంకమైన ధవళిమ దిక్కుల నావరించుచున్నది. అదె చూచితివా! ఆ ధవళిమయును శరవేగమున విజయు విక్రమంబుం దలపించుచు వచ్చుచున్నది. మఱి జాగుసేయం బనిలేదు.''

అని శ్రీకృష్ణుండాధర్మనందనునకు మ్రొక్కి యాతనిదీవెనల వడసినిలువ, యమనందనుండును, మాధవునను మతింగొని, తనమందిరమునకు మరలుచు మాధవుదిక్కు మొగంబయి మరల "దేవకీనందనా, రేపటియుదయము మఱియొకతూరి మనము గలసికొనవలయు'' నని పనివినియెను.

అ యి ద వ ప్రి క ర ణ ము

(iii)

మఱుచటి వేకువ శ్రీకృష్ణుండు సాత్యకిసహితుండయి ధర్మజుం జూడనేగెను. ధర్మజుండును సగౌరవంబుగ శ్రీకృష్ణున కాతిథ్యంబొసంగి గూర్చుండఁజేసి ప్రసంగంబున కారంభించెను.

— ధర్మజుఁడు —

వాసుదేవా! మము మన్నించి మాపలుకుల నీవు కురుసభం బలికిన ప్రకారంబును, వారి పలుకుల చందంబును, నీ వెఱింగిన తెఱంగును మాకు సవిస్తరముగఁ దెలుపఁ గోరుచున్నాము.''

—కృష్ణుఁడు—

ధర్మనందనా, ఆంబికేయ గాంధారేయుల సమక్షమున సుఖమును, పథ్యమును నై, కయ్యముగాని తెఱంగై, నెయ్యము సమకూర్చు మార్గమున నెయ్యది జరుగఁదగినదియొ, నయ్యదియె విస్పష్టముగఁ బలికితిని. కర్మమును, జ్ఞానమును జోడించి, నాచెప్పిన పలుకులెల్లఁ జీదకన్నిడి, పెడచెవినిబెట్టి, తానునుం దనవారునుంగలసి

నను నీచపఱచి, అపహసించి, మఱియు విడిచినారు. ఆ ధార్త
రాష్ట్రులఁ గూర్చి యేమనఁగలను?

ద్రౌపది — ఐనదా, నేననిన ట్లయినదా? మీ యందఱ కిదివఱకయి
నదిచాలక మా యన్న సంతానమ్ముల కలిసి, యీనాఁటికిఁగూడ మంగళ
హారతిం బట్టించిన గాని మీ యన్న దమ్ములకుఁ దృప్తి యయినది
కాదు! నా కతన, మీ వలన, మా యన్నయు నన్న దాపు మన్ననసంది
మఱలవలసివచ్చినది! ఒక్కొక్కరి కార్యములకుఁ గష్టమును, నప
కీర్తియుఁ దత్కార్యసంధానకర్తకు సంక్రమించుచుండును.

ధర్మ:— అప్పుడైనను మా పెదతండ్రియు నుచితము సెప్పక
పోయెనా? భీష్మవిదురాది సజ్జనులైనను జెప్పలేకపోయిరా?

కృష్ణ:— చెప్పకేమి! వైచిత్రవీర్యుండు సాధుభావంబుబూని, పలువిత
ముల నితవులు కఱపినను అగ్రాహ్యుండు వినడయ్యె.

ఆంబికేయుండు మొగమాటదక్క శంతను పుణ్యవంశ ప్రకా
రంబును, దా జనుమాంధుండగుటను మీ యయ్య పాండునృపాలుండె
రాజ్యాభిషేచనమందిన విధంబును, తత్కారణంబుననె నీవు యౌవ
రాజపదవి నొందుటయు, ననంతరము మీరు కౌరవాన్వయంబున కెల్లఁ
బెంపుగా దిగ్విజయంబుగావించి సంపాదించిన సంపదలనెల్ల వారు వంచన
మొయి నాచికొనినచందంబును, నీవు సత్యంబుదప్పక సమయంబునడపిన
భంగియు, నీ తండ్రిపాలు నీకీక తప్పదను ధర్మంబుపద్ధతియుఁ దేటపడం
జెప్పి పాడితో నంగినయెడఁ దనవారు నశింతురనియును దెలియఁ జెప్పెను.

పరిశీలనము

మాధవా, ధర్మరాజాదులు తనతో నాడని మాటల సంజయుండెట్లుఁ
గురుసభం బలికెనో, అదేవిధంబున నీవును గురుసభను, ధృతరాష్ట్రుఁడు
తనపుత్రునితో నీ సమక్షంబున ననని మాటల నేకొంటకయిన నేమి,—
యిపుడు ధర్మజుతో ననుచున్నావు.

నీ కార్యకలాపము విమర్శింపవట్టుల నిను విడిచిపెట్టముసుమ!

పెద్దలందఱును వాదోడక పాడి చెప్పి చూచిరి, ప్రయోజనము లేకపోయినది. కణ్వాదిమహర్షులు కొతుకుంచక దుర్యోధనుని దురభిమానమును, దురహంకారమును, దుర్మానమును నిర్బంధాధికారాదులు నెత్తిచూపి, వలదని వారించిరి. ప్రయోజనము యోజనములు దాటిపోయినది. పెద్దల సద్బోధనములలోఁ దానెంతవఱకుఁ గువాదము పెంచఁగలుగునో, అంతవఱకును దన కుతర్కము పెంచి చూచి, తన కెప్పట్టునఁ బ్రతివచనంబులు నెంచనైన ననువుపడకుండె నప్పట్టున నాతఁడు కటకటంబడి తత్తనుజానుజ సుహృదామాత్యసహితంబుగఁ దా నక్కఱలువుపీడి యట్టె చనుట కేమాత్రంబును గొంక లేదు. తేఁడును గొడుకు నవినీతికిని, దురహంకారమునకును మదిం గలంగి, గాంధారిని రావించియు, విదురుచేఁ గొమరుని మఱల రప్పించుకొనియుఁ, దల్లిచేఁ దనయునకు వగయును, గూర్మియును, వెఱపును మిగిలిన చల్లనిపలుకులును జెప్పించియుఁ జూచనేకాని ప్రయోజనము నొందలేకపోయెను. ఎవ రెంత చెప్పి చూచినను, విననొల్లనని, యుల్లింబల్లిన చాయి సేసికొని కూరుచుండు వాని కెన రేమి చెప్పిన నేమిలాభమగు? నా యోపినంతవట్టు నేఁ జెప్పి చూచియు, నారదాదిమహర్షులచే నీతిగలనడవడి నెఱింగించి చూచియు, ప్రయోజనములేమి నెఱింగి సమయానుకూలముగఁ దెచ్చికోల్గినుకను, సుయోధనుం జకించియు, భంగించియు, ధిక్కరించియు, వేయేల, తృణీకరించియుం జూచితి కాని లాభము కలుగ లేదు. అట్లయ్యును భగ్నప్రయోజనుండనై మరలివచ్చి నిను దర్శింప నొల్లక, శాంతవచనంబులుఁ బలుకాడితిని. న్యాయనిష్ఠురములఁ బలికితిని; బాంధవంబున సంప్రీతి నెఱపితిని. అనుబంధము చూపితిని. కాని , మహామానియని యంద ఱనుకొనుచున్న యీ దుర్మానియగు దుర్యోధనుఁ డశక్తిచేఁ దన సహజదుర్జనతఁ జూపంబూని, చెలరేఁగినాఁడు. అట్టివాని నప్పట్టున వారింప వేఱొకమార్గములేమి-

మఱి చెప్పకేమి- కొన్ని అమానుషంబులగు వేషమాయలు వన్ని పెక్కు పోకలఁ బోయితి. సంధియ కావలయునని యెంతేఁ బోరల వలయు, నంతయుఁబోరలితినే కాని యప్పాపాత్ముం డెన్నిటం జక్కంబడి నాఁడు కాఁడు. ఎవ రేమిచెప్పినను విననొల్లక, దుర్యోధనుఁడు పంత గించి, 'నడుములు బిగియించి, నడువుండు కురుక్షేత్రంబున' కని తనవారలకుఁ జెప్పఁబంచె. వారలు సేనాముఖంబున భీష్మునునిచికొని యెత్తి విడియంగలవారు. మిమ్ముంబట్టి పల్లార్చినంగాని యాతని మాన సము గుదుటువడదు. ఇంతకు సందియంబులేదు. కయ్యంబ యాతని కవశ్య కర్తవ్యంబు. సామవాక్యంబుల నాతనిమతి మఱల్ప నా కనువుపడినదికాదు. మీకు రాఁదగినదని మీరు మొరవెట్టుచున్న యంశము మీ కెంతమాత్రము నొసంగువాఁడు కాఁడు. ఇంతకును గౌరవులయెడ దండంబుదక్క వేరొక్క యుపాయంబుఁ బొనుపడదని మీకు ద్యోతకముకాఁమి, నింతదవ్వయినను గథాక్రమము నడచుట కవకాశము కలిగినది. ఇఁక నీవును నీ తమ్ములు నేది నిర్ణయింతు రయ్యదియె మీకుఁ బోలిన తెఱంగు కాఁగలదు."

— ధర్మజుఁడు —

కేశవా! ఇఁక నీవును, నీ తమ్ములు నెట్లు నిర్ణయింతు రట్లే జరుగఁగలదని నీవు తప్పించుకొను పలుకాడిన నయ్యది చెల్లఁబోదు సుమా! ఇట్టిపట్టుల జనక్షయంబున కొల్లని నేను, తిరిపమెత్తుకొని తిని మనఁజాలని నేను, స్వధర్మచ్యుతివలని నరకంబునకు వెఱచు నేను, చేయఁదగిన కార్యమెద్దియో నీవ పరిష్కరింప వలంతివి.

— కృష్ణుఁడు —

మీ కార్యముఖము పరిష్కరింపవలసివచ్చినపుడు కొన్ని ముఖ్యాంశములు చింతించి, కార్యదిశ నేర్పఱచికొనినవో, కార్యదశ తనకుఁదానుగ నేర్పడఁగలదు.

రాచబిడ్డల కడిగికొని తిని బ్రతుకుట ధర్మశాస్త్ర నిషిద్ధము.

## రాయబారము

అడవులఁ గందమూల ఫలాదులఁదిని, మరల నారచీరెలంగట్టి కటికి ఱానేలఁ బవళించి, చెట్లనీడ నిలువేసికొని, యుండవలెనన్న మరల నంతటి యాయాసము వడనోపరు.

నీ వచ్చు చుట్టాలకు నాదరంబును, నతిథి యభ్యాగతి జనంబులకు సత్కారంబును నొనర్పకుండుట ధర్మవిరుద్ధము.

కులధర్మంబగు క్షాత్రధర్మంబు వీడుటను నరకము సిద్ధము. అట్లగుట నెన్నెన్ని విధాలఁ జూచినను, యుద్ధమె సంసిద్ధము.

పరిస్థితులిట్లుండ 'జనక్షయకారకమగు యుద్ధము నేఁజేయనోప' నని యనుట యెంత వింత!

ఇపుడా కురురాజు నేలుబడి యెట్లున్నదో, ప్రజాభిప్రాయ మెట్లున్నదో మీరు గమనింపకున్నారు. సిద్ధమైయున్న ధార్తరాష్ట్ర వంశ విధ్వంసమును, కురుసామ్రాజ్యపతనమును మీరలు వారింపఁ జాలరు. అయ్యో, నాయన్నదమ్ములే, నా పెదతండ్రియేయని మీరు వాపోవుటే కాని వీరందఱును నిహతకాయులె; మఱియు నీకఁ బతిత కాయులగుటకాదినమున కెదురు చూచుచున్నారు. అది యెఱుంగమి మీకింత పరితాప మొదవె. ఏ జీవమునకైనను లోకమున శాశ్వతత్వ మున్నదా? ఇది కాదందువేని, ఏడీ మీ క్షేత్రనిర్మాతయగు 'కురు' రాజు! ఏడీ హస్తిపురనిర్మాతయగు 'హస్తి' రాజు! ఏడీ మీ పితామహుండగు 'శంతనుండు'! ఏరీ మీ పితామహులగు 'విచిత్రవీర్య చిత్రాంగదులు'! ఏడీ మీతండ్రి 'పాండుభూవిభుఁడు'! యమనందనా, మనమెవ్వరమును శాశ్వతముగ నిలుచువారము కామని నీవెఱుంగవే!

- ధర్మజుఁడు

దేవకీనందనా, కురువంశ నిర్మూలనంబు నేయంజాలకుంటయు, రక్తపుఁగూడు దినఁజాలకుంటయుఁ గాని, నా చాలమి కాదుసుమీ, నేను నిశ్చయ రహితుండనగుటకుఁ గల కారణము!

మఱి పొందొదవు నుపాయంబు లభింపదే! నా మనోగతియు

నా తమ్ముల చందంబును నీ వెఱుంగుదువు. ధార్తరాష్ట్రుల తలంపులును, భీష్మ ద్రోణ విదురాదుల చిత్తవృత్తియు నెఱింగి యేకద వచ్చితివి! ఇఁక మాకు ధర్మచ్యుతి తగులకుండ, నుచితంబగు కార్యంబును తత్సాధనంబును నీవ నిశ్చయింప సమర్థుండవు.

కృష్ణుఁడు

(తనలో) తన మానసమున నీతఁడెంత గుసుసువడుచున్నాఁడు! జనక్షయమునకు, అందునను భ్రాతృవర్గ వినాశనమునకు ఈతండు తలంకియేకద మనసు కుదుటుపఱచుకొనఁజాలకున్నాఁడు! ఎన్నివిధములఁ బ్రయత్నించినను, మఱి వలనుపడినది కాదుకదా యని యోచియె యిపు డింతదూరము పౌర్వాపర్య చింతం దగిలియున్నాఁడు!

(ముహూర్త కాల మూరకుండి—ప్రకాశముగా)

యమనందనా, ఎందఱెందఱెన్నెన్నివిధాల బుద్ధులుసెప్పినను వినక, కడు మోహకుఁడై, రాజపుత్రినకుఁ దగని విధాన, నను బంధింపఁ దన తమ్మునిచేఁ ద్రాటిని దెప్పించి, తా నొఱ వెఱికిన కరవాలమ్మును వలనుగఁ బట్టి; కొంచెపుబుద్ధితో, నను బంధింప నా ముఖమున నిలచిన న య్యసంబద్ధుండగు దుర్యోధనునితో నింకను, సంధి ననుసంధింపఁదగు నుపాయము నామదిఁ దోఁచుటలేదు. యుద్ధముగాక కొండొక వెఱవునఁ గార్యము నెఱవేరు ననరాదు.

— ధర్మజుఁడు —

ఏమేమీ, నిను బంధింపుటకే ప్రయత్నించెనేమి! రాజ్యతృష్ణా సూత్రములచే బద్ధుఁడగు నాతఁ డుపనిషద్వ్రాత సంతతులచే నా నిగమంబులైనను బంధింపఁజాలని నిను సామాన్యుగాఁ దలఁచి, బంధింపఁ దలంచెనేమి! ఔరా, యెంతటి మౌర్ఖ్యము! ఆదఱు కురువృద్ధు లుండియుఁ, దెలిసియుఁ, జూచియు నూరకుండిరే?

— కృష్ణుఁడు —

కౌంతేయాగ్రజా, కణ్వ నారద జామదగ్న్యాది మహాముని

మనీషు లెంతదూరము బోధించినను సుయోధనుఁడు పాటింపలేదు. వా రెంతదూరము ఐతిహాసికముగఁ బలికినను నాతఁడు గైకొనలేదు. కురువృద్ధులమాట వినలేదు. అట్లగుటనెకదా, భీష్మ ద్రోణ బాహ్లికాదులగు పెద్దలకుఁగూడ ధార్తరాష్ట్రులయెడ, నసూయజనించినది!

ధర్మ:-వాసుదేవా, దుర్మానం బీతని నెంతదూర మహంకారమయునిగ, మూర్ఖునిగ మార్చివేసినది!

కృష్ణ:-యమనందనా, నీకును దుర్యోధనునకును గుణమున నేమాత్రమును భేదములేదు. గుణకళాభేదముచేత, నొకటిలోకవ్యధాకరముగను, నింకొకటియాత్మవ్యధాకరముగను పరిణమించుచుండె.

ధర్మ:-ఏమి కృష్ణా అట్లంటివి!

— కృష్ణుఁడు —

రసావిష్టంభముచేత మీ యిరువురును నొకేజాతికి చెందియున్నారు. మీ యిరువురియందును అహంకారమే ప్రధాన గుణము.

దుర్యోధనుపక్షమున నహంకారము—యిదియంతయు నేనే చేయఁగలను; నేనే చేయుచున్నాను; నావలననే యగుచున్నది; అన్నింటికిని నేనేకలను;—అను నీ మొదలగు తలంపులఁ గలుగఁజేయుచున్నది.

ఇఁక నీయందున్న యహంకారము—వీరందఱును నావారు. జనక్షయకారకమగు యుద్ధము చేసినచో, నావలన వీరందఱును మృతులగుదురు. నేనే వీరందఱ మృతికిని గారణము కానగునా! చేసేతుల నేనేవీరినందఱ వధియింపఁగలనా?—అను నీ మొదలగు తలంపులఁ గలుగఁజేయుచున్నది. వారందఱును మీచే మృతులగుటకు నీ "యహంకర్తృత్వమే" ప్రధానమని తలంచుచున్నావు. నీయందు మమకార కళా మిశ్రితంబగు నహంకార మావిర్భవించుటచేత, నీవు దుఃఖితుండవగుటకుఁ గారణమైనది. దుర్యోధనునందు గర్వ కళా మిశ్రితమగు నహంకార ముద్భవిల్లుటచేత, "యుద్ధమున నందఱ నోర్తును: నే నెంతేని సేయనేర్తును: నా కెదురు కలదే" యని

విజృంభించుచు, నానందమందుటకుఁ గతంబైనది. మీ యిరువురపట్ల నది ప్రత్యేకప్రత్యేకముఖములఁ వేర్వేఱఁదోఁచుచుండినను, అహంకర్తృత్వభావమే, ప్రధానగుణమయియున్నది. ఇందు సందియములేదు.

యుధిష్ఠిరరాజా, మనకిపుడుకర్తవ్యము ముందు సేయఁగలచేతల నెన్ని నిర్ణయించుటకద! కావున ననుజసహితుండవయి, కార్యనిరూపణ మొనర్పుము —.

మఱియుఁ దన కుమారులకుఁ దెలుపు మనిన కుంతీ సందేశంపుఁ బలుకులును, దన కేకాంతంబుగఁ జెప్పిన విదురుని వాక్యంబులును, కౌరవులు వినంబలికిన కుంతి నుడులును, ధర్మజునకుఁ దెలియఁబలికి యుపుడు భండనంబొనర్పను, రిపుజనంబు లగు భ్రాతృవర్గంబును సంగరంబున నిర్జింపను, ధర్మజునకుఁ బాపంబులేకునికియుం దెలిపి, సమరంబె యవశ్యకర్తవ్యమని కృష్ణుఁడు సుబోధకము సేయుచున్నంత సేపును, తమ్ములందఱు నన్న దెసం జూపులునిలిపి యూరకుండ; ధర్మజుండును దన భ్రాతృవర్గము నవలోకించుచు నిట్లనియె.

— ధర్మజుఁడు —

తమ్ములారా, కౌరవులవలన మనముపొందిన కష్టములు దలంచినచో, మన మనంబు లెరిసెడిని. మన బంధువర్గమును, జేసేత వధియించుటకు నాబుద్ధి గోల్కొనకున్నది. వీరపత్నియగు మనతల్లి గొంతి, బంధువధకు నొడంబడినది. మనకు హితమును, ధర్మమును, నయ్యెడు మార్గమిఁక మీరలె నిశ్చయింపుడు ఏదేనొకమార్గము నిశ్చయించి నిర్గమింపఁదగు తరుణ మాసన్నమైనది.

— అర్జునుఁడు —

అగ్రజా, మనకు హితమును, ధర్మమునునై, ధర్మచ్యుతిలేనిదై నెగడినమార్గమిదియని మన యచ్యుతుఁడె నిర్ణయించెనుగద! సమస్త ధర్మ పరిశోధకుండగు విదురునిపల్కులును, వీరపత్నియగు మన తల్లి పలుకును, నా మనంబునంగల సంశయంబులఁ బాపినవి. ఇఁక నఖిల

విద్యాజాలసంవేదియా నీ కృష్ణుండె రణంబు సేయుండన మఱి సంశయమును, విచారమును మన కేటికి?

— ధర్మజుఁడు —

ఐన నట్లనె కానిండు. అఖిల ధర్మవేదియు, మనకు నేమగడయు నగు శౌరియె యుద్ధము నిశ్చయింప నింకేటికిఁ సంశయము? తమ్ములారా, యిఁక నుగ్రసమరంబునకై సన్నాహంబు సేయుఁడు.

బాహుపరాక్రమంబుగలిగి వివిధవ్యూహ విధిజ్ఞతతో, మన యేడక్షౌహిణులును, దన కనుసన్నల నడుపఁ గలిగి భీష్మోత్సాహంబున కోర్చు ధన్వి నొక్కని మన మేర్చుకొనవలెను.

— కృష్ణుఁడు —

ధర్మనందనా, ఇఁక మనము సేయఁదగినది సేనానాయక నిర్ణయము గావున మన సంగర సమాలోచనా స్థలమునకుఁబోయి కాఁదగిన కార్యమ్ములనెల్లఁ బరిష్కరింతము రమ్ము.

అనుజసమేతుండగు ధర్మనందనుండు శ్రీకృష్ణునితోఁ బ్రత్యేకస్థలమునకేగెను.
ఇఁక నపుడట వారొనర్పఁదగినవి సర్వ సేనానాయక నిర్ణయాదులెకద.

—

# రాయబారము

## ఆరవ ప్రకరణము

### (1)

ఎంత వేగరులగు వేగువారిని నియోగించెనో కాని, దుర్యోధనుఁడు పాండవశిబిరములలో నెప్పుడెప్పు డేమేమి జరుగుచుండెనో, సకృచ్ఛముగ నన్నియుఁ దెలిసికొనుచునే యున్నాఁడు.

దుర్యోధనుఁడు తనమందిరమునఁ గర్ణ శకుని దుశ్శాసన ప్రముఖులతోఁ గాఁగల కార్యములం గూర్చి ప్రసంగించుచుండ గూఢవిచారులగు చారులువచ్చి—కురుసభాభవనమునుండి మరలిన కృష్ణుఁడు పాండవులకడ నివేదించిన విషయములును, పాండవస్కంధావారము మహాసైన్యాకారము నొందియుండుటను, పాండవుల రణోత్సాహమును, అక్కడి వారి ప్రయత్నములును—దుర్యోధనునకుఁ దెలుపుచుండ, దుర్యోధనుం డాపలుకులు వినియు విననివానివలెఁ దనమనమ్మునఁ జనియించిన వేదనవికారము లొకింతయేనియుఁ బయల్పడనీయకుండఁ దన యుమ్మలికమ్ము పెరముఖమ్మునఁ దెలుపఁబూని, ప్రసంగింప నారంభించినాఁడు.

— దుర్యోధనుఁడు —

"వింటిరే కృష్ణుని ప్రయత్నములు! వచ్చినవాఁడు వచ్చినట్లు ఊరకుండక తనమాట నెగ్గినదికాదుకదా యను నలుకను, నా ప్రాణసఖుండగు కర్ణుని ననునుండి విడఁదీయఁదలంచె; నదియుం గొనసాగమిఁ, బాండవశిబిరముం జేరి, వారికిఁగినుక యధికమగు తెఱంగునఁ బ్రసంగించె. ఆ యాదవుఁడొనర్చిన కుతంత్రము నేమనందగును! దూతకార్యము తనకుఁ జయప్రదముగ—కుంతీనందనుల కానందసంధాయకముగఁ గొనసాగకున్న మానెఁ గాని తాను బాండవులతో మనపై నుల్లికుట్టుమాటలం జెప్పనేల? ఎట్టులైనను జరుగనయియున్న సమరము విజృంభితమగుటయె యాతని యాప్సితము కానోపు! తాను వారికి సాయపడకున్నఁ బాండవులేడ; మనపై కెత్తి వచ్చుటేడ! వట్టి భ్రమ! మాత్స్య పాంచాలాదులతో నిచ్చిపుచ్చుకొను సంబంధంబు

లోఁబడినపిదపనైన మనపై నెత్తివచ్చుటకు వారికి సామర్థ్యము కలిగియుండెనేని ఈకృష్ణుని రాయభారపుఁబురస్సరణము కలుగునంతదనుక వేచియుండుటకుఁగతంబేమి? మనమొనర్చిన వంచనల నెన్నింటినైనను, భరియించి, యూరకుండుటకుఁ దగినంత కారణమేమి? లోకమింతమాత్ర మెఱుంగఁజాలక, ధర్మజుని సైరణ యొక్క పెద్ద గుణముగా నెన్నుచుండును. మన వెఱపునఁగాకున్న సైరణయును, అనుకూలతరుణాన్వేషణమునఁ గాకున్న, మనకు మాఱుసేయమియుఁ, దనపక్షమున జయసంశయ కారణమునఁ గాకున్న రాయబారములు నడిపించు బుద్ధియుఁ, బాపము, పాండుసుతుల కలవడియుండునా! మనచే నీవఱకుఁ దామొందిన భంగపాటులు మఱువరాని వగుటను, ఇపు డుచితసహాయంబు దొరకొనుటను, కృష్ణుని యుక్కెక్కించు పలుకులఁ గృతోత్సాహులగుటను, పాండునందను లెల్లని మనపై నెత్తివత్తురు. సంగర మింక సిద్ధము; కావున దుశ్శాసనా, నీవును, గర్ణుండును, గాంధారపతియును సర్వంబు సమకట్టుఁడు. సేనానాయక నిర్ణయాభిషేకాదు లొనర్పవలసియున్నది; కావున మన పక్షమున వచ్చియున్న సకలోర్వీపతులను రావింపుఁడు. మనము మరల నపరదినా ముఖంబున సభందీర్చెదము.

అని వారికిఁ గట్టడిగొనర్చి దుర్యోధనుం డంతిపురంబున కేగెను.

## ఆరవ ప్రకరణము

## ( ii )

భానుమతీమందిరమున నుచితాసనములపై దుర్యోధనుఁడును భానుమతియుఁ గూర్చుండియుండిరి. ఈభానుమతి దుర్యోధనునిభార్య.

— భానుమతి —

మీరు పౌర్వాపర్యములఁ జక్కఁగఁ జింతించియే సమరసన్నాహము లొనర్చుచుండిరని తలంతును.

— దుర్యోధనుఁడు —

ఇపుడింక నీకును నాకును పౌర్వాపర్యచింతలేల? మొట్టమొదట జాత్యంధుండని మాతండ్రిని కాదని మా పినతండ్రియగు పాండునకు సర్వరాజ్యపట్టాభిషేక మొనర్చిన వ్యాస భీష్మ ద్రోణ బాహ్లిక విదురాదుల ప్రప్రథమాక్రమకార్యాచరణకాలముననే యవినీతిపుట్టినది. సంజయున కింత తెలియక, మా జూదముననె అనయము పుట్టెనని

పలికినాఁడు. కాని, మనుష్యగుణములను గురుజనముల కారణమునను అనయము లానాట నెప్పట్టేనని చింపలు నెంచఁజాలుచున్నారు. ఏది కానయియున్నదో అదియే జరుగుచున్నది. కానిచోఁ దాను రాజ్యాభిషిక్తుండయ్యును మా తండ్రిని సింహాసనముపయిఁ గూరుచుండఁజేసి పాండుఁడు దేశాలపయిఁబడి పరరాజులంగెలిచి, కానుకలం దెచ్చి, మా తండ్రికిచ్చి, మా తండ్రిచే నశ్వమేధమ్ముల నొనర్పంజేసి, కౌరవ రాజ్యలక్ష్మికిం బరరాష్ట్రములం జేర్చి కురురాజ్య విస్తారమునకై పాటుపడి, తుట్టతుద కడవులంబడి, తా పరిత్యాజసద్దై రాజలాంఛనములనెల్ల మా తండ్రికడ కంపివేసి దిక్కులేనిచావు చావనేల! మా తండ్రి రాజ్యపాలనము దేవుని కనభిమతమైయుండెనేని పాండునిచే నతఁడు మా తండ్రినేల నేల నేలునట్లు సింహాసనముపైఁ గూరుచుండఁ జేయును! నాఁటినుండి పాండుని సంతానమే కౌరవరాజ్యలక్ష్మీభారమును వహించుట దైవసంకల్పమై యుండినచో, సంతానవంతుఁడు కానిపూర్వమే పాండుఁడు రాజ్యమువీడి యడవులం బోవనగునే! ఇంత స్పష్టముగ మానవునిష్టమును దైవాభీష్టమును దెలియుచుండ నింకను నీవు—"పౌర్వాపర్యము"లని యేమో పలుకుచున్నావు.

— భానుమతి —

మీరింతవిచారము నొందుచున్నారు: కాని, నేను వచింపఁదలఁచుచున్నది వేఱు. తమ యుద్యమముంగూర్చి లోకాభిప్రాయము భిన్నముగానున్నది. సాధారణముగాఁ గార్యాకార్యవిచక్షణ సేయవలసివచ్చినప్పుడు జనాభిప్రాయము ప్రధానమై నెగడుచుండును. లోకాభిప్రాయము వలనఁ దుర్లేని లోకస్తుతి, జనసమ్మతి, సర్వజనైక్యత, మనము కోరనే కోరరాదు. లోకమాన్యత మీరు కోరలేదందురేని పాండుని పరిపాలనాకాలమున జనుల కాతనిపైఁ గలిగిన అభిమానముచొప్పున నాతని యనంతర మాతని సంతతులయెడఁగూడ జనులు చూపెడి భక్తిగౌరవములఁ దామెఱింగి, ధర్మనందనాదులు పసివ్రులనున్నకాలాన వారిపూర్వపరిపాలనను ద్రోసిరాజనిపించఁజేయు తలంపునఁ బౌరులను నిర్వ్యాజసమ్మానంబులం [1] బ్రకృతిజనంబుల సహస్రగుణాధికంబుగ సంతుష్టులం జేయలేదే! అట్లయ్యును, నప్పటికింగూడ, నింకం గొందఱు దుష్టజనంబులు ధర్మజు పక్షంబు వహించినవా రుండకపోరని యట్టి పక్షపాతు లడఁగంటుపఱచను, నెల్లని యుపాయాంతరమున [2] సమాత్యకంబుగ భృత్యామాత్యవర్గ సహితంబుగఁ బాండవుల వారణావతంబునకుం బంపితివని మీరే సెలవిచ్చుచుండ వినియుంటిని. ఏ ప్రజాభిప్రాయము మీకు వన్నె

1, 2;—ఆంధ్రమహాభారతము-ఆదిపర్వము పంచమాశ్వాసము-129 వచనము.

తేఁగలదని యెంచియుంటిరేని, అట్టి ప్రజాభిప్రాయ మిపుడు 'జ్ఞాతివర్గమున కింత యన్నమిడనని, సమరమె సద్ధర్మంబని, పరిజనక్షయమునకైన నెదఁ దలంకనని యనుచున్న సామ్రాడ్విధిమును, సామ్రాజ్యవిభూతిని, అంగీకరింపఁజాల' ననుచున్నది. కావున నొకప్పుడు మన మభ్యర్థించిన జనాభిప్రాయము నిపుడు మనమే గైకొన నంగీకరింపమేని, మనకు కావఁదగినట్టి కార్యము కాకయుండుటె కాక, ముందు యుగాలవారుకూడ, మనలను నిందింతురు. కల్పనాసామర్థ్యము గలవారిదియె అదనని, మీ రొనర్చినవి ఒకటి రెండయినచో, వాటి పదిసేయుదురు. మీకు దుష్కీర్తి సాపాదింపంగల పలుకులుపలుకం గొంకరు. జనసామాన్యమున కిదియొక గొప్ప నానుడి కాఁగలదు. పాండవులను మీ రన్యాయముగ బాధలు పెట్టిరను దిట్టు మాత్రము మిగులును. తొలినుండియు భీమసేనాదులు మీ కొనర్చిన యకృత్యములు గాని, పాంచాలి మీ కొనర్చిన పరిభవముగాని ప్రజ లెన్నఁబోరు. నేరమంతయు మనదెసఁ గలదనియే లోకము భావించును. అట్లగుటచే మీ రొకింత పునర్విమర్శన మొనర్చికొనియే యీ సంగరమునకుఁ బ్రారంభింపఁ బ్రార్థించుచున్నాను.

— దుర్యోధనుఁడు —

అయ్యో! వెఱ్ఱిభానుమతీ, "జనాభిప్రాయము-జనాభిప్రాయ" మని యనుచున్నావు గాని, జనాభిప్రాయ మెంత యనవసరమని యందువో కొన్నివేళల నది యంత యనవసర మనికూడ యనఁగలను. జనాభిప్రాయ మెల్లప్పుడును నొకతెన్నున బోఁజాలదు. ఒకేవిషయమునుగూర్చి కొందఱొకవిధమునను, మఱికొందఱింకొక విధమునను, వేఱొకకొందఱు మరియొకవిధమునను అభిప్రాయ మొందుచుందురు. ఇంతియ కాక, ఒకేవిషయము దేశభేదముచేతను, కాలభేదముచేతనుం గూడ భిన్నాతిభిన్నాభిప్రాయములఁ బడయుచుండును. అట్లగుట జనాభిప్రాయమె మన ప్రవర్తన యందు ప్రధానము కాఁజాలదు. అట్లని జనాభిప్రాయమును గేవలము త్రోసిరా జనిపింపరాదు. కావున జనాభిప్రాయమును, స్వార్థమును, ఎంతవఱకేకీకృతము కాఁగలవో, అంతవఱకు ఏకముఖమునఁ బోనిచ్చి, తదనంతరము స్వార్థమునే చూచుకొనవలసియున్నది. ప్రతిమనుజుఁడును శైశవమునుండియు స్వార్థమునే చూచుకొనుచున్నాఁడు. స్వార్థము వీడినవాఁడు మఱి జీవింపనోపఁడు. నిజముగ స్వార్థత్యాగి యోగీశ్వరుండగుచున్నాఁడు. కుటుంబి కానివాఁడు సంఘమున కెంత యుపయోగింపఁడో, యోగీశ్వరుండగువాఁడు ఆధిభౌతికవిషయములం దంత యుపయోగింపకున్నాఁడు. స్వార్థమునం దాధిభౌతికవిషయములే ప్రధానములగుట, స్వార్థము

వీడినవాఁడు సంఘమున కుపయోగింపఁడు. కావున స్వార్థము ప్రధానము.

దురుద్దేశముతో మానగరిఁ జేరిన కృష్ణునియెడ, మనరాజ్యమని భాజ్యమనియు, అప్రదేయమనియుఁ దత్కారణమున నీరిభోజ్యమనియు నాతనితో వాదించితిని. తుద కాతని బంధించి పాండవులను రెక్కలువిఱిగిన పక్షులుగాఁ జేయఁదలపడియు నాతఁ డొనర్చిన కొన్ని వెడమాయలవలన నప్పటి నాపూనిక వీఁగిపోవలసివచ్చినది.

ఏది యెట్లయినను, భానుమతీ, నీతో నాకీ కంఠశోష యేల? నీ వనుకొనినట్లు గాక, నా వర్తమాన కార్యమునఁ బౌర్వాపర్యము లశేషముగఁ గాంచి, చింతించి, తుదకుఁ దేలిన పర్యవసానము ననుసరించియే యీ ప్రస్తుత కార్యనిర్వాహము నర్చి చేయఁదగినదియే నిరూపపఱచికొంటిని. కావున నీచర్చ యనవసరము.

— భానుమతి —

ప్రభుశ్రేష్ఠా, మీతో వాక్యార్థ మొనర్ప సిద్ధపడలేదు కాని, కలకాల మప్రతిష్ఠ నిలుమనట్టులఁ బాప మా ద్రౌపది నవమానించి, మీరు లోకనిందకుఁ బాల్పడినారు కదా యని మనలక్ష్మణకుమారుఁడుగూడ, నెల్లవేళలఁ దనమనమునఁ గుందుచుండును. మానసోద్రేక కారణమున స్త్రీపురుషులు లోకమున నొక్కొక్కయెడఁ ద్రోవదప్పి చరియించుచు, మైమఱచి విడ్డూరము లొనర్చియుఁ గటూక్తులం బలికియు, నింకను నెదుటివారిపయి నేరములెంచు పరిపాటిం దోఁగుచుందురు.

తమకు కలదని యనుకొనుచున్న యధికార మెంతెంత కటూక్తులనైనను, ఎంతెంత యశ్లీలములనైనను బలుకఁ జేయుచుండును. దానికిఁ దోడుగ, నెవరేని తమ ప్రయత్నములనున్న అమానుషత్వమును, అసంప్రదాయమును, ఎత్తి చూపిరేని, మరింత రేగి, తొంటి వివేకమును బోఁద్రోలుకొని, యెదుటివారిని దూషించుటయే ప్రధాన కార్యముగా నెంచి, తాము లోకకంటకులగు చున్నారు.

— దుర్యోధనుఁడు: —

భానుమతీ, మతిమాలి నీతో నింతదూరము ప్రసంగించుటయందు నేనొనర్చిన పొరపాటునకు నే నేఁడు దుఃఖించుచు, సిద్ధమైయున్న సమరమున బాల్గొనఁ నేగుచున్నాను. మరల నిన్నింతలో నిక్కడఁ గలిసికొను నవకాశ మొదవక పోవచ్చును. కావున మన లక్ష్మణకుమారుని దీవించి, నావెంబడి నంపుము. నే నిదే పోవుచున్నాను.

అని దుర్యోధనుఁడు నిష్క్రమించెను.

'తుద కేగతి నడిపింపఁ దలంచి, మన్నాథున కా విధాత యింత బల

సంధిసేతమాని యలిగి యేమని మగిడివచ్చినాఁడు శ్రీకృష్ణుఁడు!

వీరునువారును సంబంధబంధువిషయబంధులగుట శ్రీకృష్ణున కీ రెండువీడులవారును సమానులే కదా! అట్లయ్యును, దానర్జునునకుఁ బక్షపాతంబు సేయుటఁ బాండవుల నొకతెన్నునఁబోనీయక, తనకుఁ దోఁచిన త్రోవల ద్రిప్పుచున్నాఁడు. వీరిమాటయెమీఁదగుటకుఁ దానెన్ని పోకలనైనఁబోకమానఁడు. ఇట్లగుట నింక శ్రీకృష్ణునిమూలమునఁ బాండవులకె జయంబు గలుగకతప్పదు. కౌరవుల కురక చావునిజంబు. సంశయింపనైనఁదావులేనియీదుర్ఘటనముగన్నులఁజూడఁజాలను:వినంజాలను: నేర్పరితనమున, వశీకృతచిత్తమునిమిత్తమునఁ బాండవులకు జయంబును, పలుకుపొందెఱుంగమి, మొఱకుఁదనముకతన, అసంప్రదాయకవృత్తిని, గౌరవులకు వినాశమును సిద్ధమయ్యెంగదా!

మాయురే! నేనేగదా గదాయుద్ధమున సమర్థులం జేసితిని సుయోధనభీమసేనుల! అట్టి వీరిరువురు నొండొరుఁజంపుకొన నేఁజూడఁగలనే! ఇంతకును శ్రీకృష్ణున కెఱుకలేనిధర్మసూక్ష్మములు నాకు మాత్రమెఱుంగనగునా! కాని మావాని కేమిదోఁచినదో, ఏనిమిత్తమున నిట్లారడిబోకనెంచెనో, యెరికెఱుక! ఏమైనంగాని, యీనిష్ఠురతం జూడఁజాలక విననేరక సరస్వతీతీర్థమునకుఁ బోఁదలంచి మీకుఁ జెప్పిపోవచ్చితి.

అనిబలదేవుండనియె. బలదేవుండు మఱికొంతసేపటికి వాసుదేవధర్మపుత్రులాడంబడియనుపఁ దీర్థయాత్రవోయె.

బలరామా, సరస్వతీతీర్థమునకాపోవుచున్నావు! ఆగు మాగుము: నీతోఁ దొలియుత్తరాభిమన్యుల వివాహానంతరము అతివాదులును, మితవాదులును హితవాదులును గలిసి జరిపిన (1) వాదోపవాదములమేము జక్కఁగఁ బరిశీలించుపట్టులనే నీతోఁ బ్రసంగింపఁ దలంచితిమి: కాని ఆవాదినుదులకోడియె నీతో నుడువ నుడిగితిమి. అనంతరము దుర్యోధనుఁడు నానారాజులసాయముంగోరిపోవుచు నీసాయముంగూడ నభ్యర్థించినపుడుమీయిరువురి సంభాషణయు మేము వినినప్పుడైనను, నీతోఁ బ్రసంగింప

(1) రాయబారము 6—12.

నసువుపడినదికాదు. ఇప్పుడో, తీర్థయాత్రకుఁ బోవుచున్నావు. మరి నీవన్నవే మాకొదవదేమో. ఆనాఁటి వివాహమంటపమున నీ వొనరించిన సంభాషణాక్రమముచేత నే మాటలఁ బొందెఱుంగనివారితో, మూర్ఖజనములతో నెట్లు ప్రసంగింపవలెనో కార్యము నెక్కుఁ జేసికొనవలయునో, తెలిసికొంటిమి. అనంతరము సుయోధనునితో నీవు సంభాషించు పట్టున నీ తమ్ముఁడగు కృష్ణుఁ డే మతినుండెనో విశదముగాఁ దెలిసికొంటిమి. ఇప్పుడు సర్వ రాజాదులును, నీ తమ్ముఁడును, పక్కఁగలవారందఱును వినుచుండ నే యంటివో మేము గుఱుతించితిమి. కాని ఒక్కనిజాత్మకమాత్రము విస్పష్టముగుచున్నది. నీ యొద్దనున్న నీ తమ్మునితో నీ వేమియు ననక, నాతనిపై నేరము-ఆరోపణను ఒక్కటివారును వినుచుండఁగ నేమియుఁ గాక-మోపితివి: ఆరోపణను నీపలు కాలించి యు, నీ వాతనిపై నిడిన భారము భరియించితివి. నీతోఁ బలుకకుండనయ్యె. అన్నను గౌరవమున నాతఁ డూరకుండెనో, నీతో విరోధముఁ బెంచికొనినచో ఆనాఁడా ఉపప్లవ్యనగరాన, భీష్మునింబఁ బాండుపుత్రులకు సమాధానమున నీవే రుక్మియుఁ గలిగియుండును బొందిన గతి జ్ఞప్తికివచ్చుటనో యూరకుండె యుండెను!

నీవు నీ తమ్మునితో 1. "పరసంపు మాటలు పలుకఁజాలమి నాతనితో నీ వివాహమున వాదమునకుఁ బూనుకొనవైతిని. అని కృష్ణునిఁ బాసి యే నొక్కనిముసమైన నుండఁజాల" ననిన నీ విపు డెట్లు పోవుచున్నావు తీర్థయాత్రలకని!

భగవంతుని యవతారము లనియనుచున్న నాపదింట నినుఁ జేలచేర్చిరో, నీ తమ్ముని నేలచేర్చ లేదో కారణములుమాత్రము మాకెఱుక రాకున్నను ఒక్కటిమాత్రము విస్పష్టముగఁ గానవచ్చుచున్నది. కౌరవులకును బాండవులకును సంఘటిల్లిన వివాదమున 2. ధర్మనందనునిదెస దోసంబు కలదనియు, దుర్యోధనునం దెన్నఁ దమన్నను దోసంబు లేదనియు, నీవు విస్పష్టపరచి నీ శిష్యుండగు దుర్యోధనునెడ వాత్సల్యంబు సూచించుచున్నావనియును, అర్జునునెడఁ దన ప్రేమాధిక్యమున కృష్ణుఁడు పాండవులవల పక్షము వహించెననియును, జనులాడుచున్నారు. ఈ రెంటను సత్యమును అసత్యంబునుఁ గూడ నున్నవి. మానవుఁడు తన స్వత్వముల నితరులచే వంచనమెయిం బోఁగొట్టుకొనినపుడు తన తమస్వత్వములను నష్టసంపదలను బునస్సంపాదనమున కెన్నివిధముల నైనఁ బ్రయత్నింపనుద్యోగింపవలెననియు, నా యుద్యోగంబునకవసరంబగు నుపాయంబుల నెన్నేని- తనకు యథావిధానమైన-పన్నవలెననియుఁ గృష్ణుండనుచుండు. మోఱకులైన వారిని బలుకుసొంపెఱుంగనివారిని మంచిమాటలచే నొప్పించుకొని వారిచేఁ

రాయబారము 1:- 33; 2:- 7--8.

దనకు కావలసినపనులొనరుపఁ జేసికొనవలసినదనియు నీవనుచున్నావు: మీయిరువురి సూత్రములును బలీయములైనవే కాని బలరామా, నీ శిష్యుండగు సుయోధనుపట్ల నీ పలుకుచల్లఁదనము పనిచేయదని నీవింతవఱకు నెఱుంగకున్నావని కొందఱనుచున్నారు. ఇందుకు నీవుమాత్ర మేమనఁగలవు! అభిమానముగలవారి సూత్రబలము సుంతయైన సడలుచునేయుండు నను మానవ మానసతత్వవేత్త లిందు కేమనఁగలరో!

## ఆరవ ప్రకరణము

## ( v )

దుర్యోధనుఁడు దండనాథుల నెంచుకొని వారివారి సైన్యములం దోడ్కొని కురుపితామహుం జూడఁబోయినాఁడు.

— దుర్యోధనుఁడు —

ఆర్య, పితామహా, మాకును పాండుసుతులకును పోరు నిశ్చయమైనది. పురంబున నెల్లి దండని జాటఁబంచి, సర్వంబును సిద్ధంబు సేసికొని, శత్రుభయంకరుండగు ద్రోణాచార్యుని, రణోత్సాహలంపటుండగు రాధాసుతుని, శరతత్వవేదియగు నశ్వత్థామను, బాహుబలవిలాసుండగు బాహ్లీకపితామహుని, శౌర్యశాలియగు శల్యుని, శౌర్యనిధియగు కృపుని, దుర్జయమూర్తియగు భూరిశ్రవుని, దర్పోజ్వలుండగు గాంధారపతిని, తేజస్వియగు కృతవర్మను, ప్రతాపఘనుండగు కాంభోజుని, పరాక్రమఘనుండగు సింధురాజును, క్రమంబున మనపదునొకండక్షౌహిణులకును బదునొకండుగురుపతులనభిషేకించి వీరినందఱిం దోడ్కొని నీ దర్శనంబు సేయ వచ్చితిని. ఇన్ని సైన్యంబులు నొక్కలావున వర్తించు చందంబు చూచికొనవలసినపని యున్నది. నానాదేశవాసులును, భిన్నభిన్నములౌ మనోవాసనలు గలవారును, నగు వీరులుగల యిమ్మహాసైన్యము,—అమరసైన్యమైనను దనకుఁదానుగ వర్తింప నేరదు గావున—నీ వరసి యొక్కమొగి ననిమొన నడుపంగల మేటివగుట, నీ సేనానాయకుల నెల్లర నీ మ్రోల నిలిపితి. తారకాగణంబునకుఁ జందురునిపగిది, నీవ సర్వసేనానాయకత్వంబున కభిషిక్తుండవయి, మాకొఱకై యేకాగ్రచిత్తతతోఁ బాండవులతోఁ బోరి, మాకుఁ బూర్ణవిజయము సేకుఱఁ జేయుమని నిను బ్రార్థింప వచ్చితి

దుర్యోధనుండు నిటలతటఘటితాంజలియై భీష్మాచార్యునకుఁ జాగిలి మ్రొక్కి నిలువ, భీష్ముండును, దుర్యోధను నాశీర్వదించెను.

క్షేత్రంబు దక్కియంబోయి యటనొకరమణీయప్రదేశంబు విడిదలగా నిరూపించి, తనవారినెల్ల నటనిలిపెను. గాంధారేయుండును, రాధేయుండును, నచ్చోట నెవరెవరి కేయేతావుల నేమేమి యెప్పుడెపుడు వలయు నవియెల్లసిద్ధపఱచి, సల్లాపంబుల విహరించిరి.

*  *  *  *

కురువీరులనెల్ల సభఁదీర్చ రావించి అందఱును ఉచితాసనమ్ములఁ గూరుచుండిన పిదప, సర్వసేనానాయకుండగుభీష్మునితో, సుయోధనుండు స్వపరబలవిచక్షణలంగూర్చి ప్రసంగింపఁదలఁచి, మాటలు రానిచ్చి యిట్లుప్రసంగంబున కుపక్రమించెను.

— దుర్యోధనుఁడు —

పితామహా, మాయిరువాగులవారిలో నీయెఱుంగనివారులేరు. సేనలనడిపింపను, బారిపింపను, అపుడెడమైనపుడు గలిపింపను, గడు నేర్పరివీవ. అట్టినినుఁగూర్చి వేఱఁ బ్రస్తుతిసేయనేల? మనయందును వారియందును జేవగలవారి నెఱింగినవాఁడ వీవగుట, నెవరెవ రెంతంత వారో, నాకు వినిపింపుము.

— భీష్ముఁడు —

అసమయమున నడుగుచున్నావు: కాని నీవిట్లడిగితివి కావున, నేనూఱకుండఁదగదు. ఉన్నదియున్నయటుల చెప్పఁగలను. మనవారలను, వారివారలను, వేర్వేరుగ బలశౌర్య పరాక్రమ విక్రమోన్నతులఁ దెలిసి చూపెద: వినుము.

అతిరథుండవు నీవు. నీ తమ్ములందఱును సమరథశ్రేష్ఠులు. వీరందఱును పాంచాల సేనల నిర్జింపఁగలరు. భోజ వృష్ణికులములకుఁ గల తగవుల కారణమునను, కృష్ణునెడఁగల ప్రత్యేక ద్వేషము కతమునను, వచ్చి మిముఁజేరిన కృతవర్మ అతిరథుండు. నకుల సహదేవులకు మేనమామయు సహదేవునకుఁ దన కూతునిచ్చిన మామయు నగు శల్యుం డతిరథుండు. వాసుదేవుతోడి యీసువాఁడల్లభూరిశ్రవుం

దతిరథుండు. మన సైంధవుండు మహారథుండు. నీకొడుకు లక్షణకుమారుండు సమరథుండు. ద్రోణాచార్యుం డతిరథోత్తముండు. నేనును ఆతఁడునుంగూడ వృద్ధులమని భావింపరాదు. అని మొననిల్చి మేము పరాక్రమముఁ జూపుచుండ, మా మా యుంగవిస్ఫురణభంగి చూచి మెచ్చుకొనవలసినదే కాని, యిప్పుడు చెప్పుటకు వలనుపడదు. కాని ద్రోణుండు శిష్యవాత్సల్యంబున నర్జును నోసేయంజాలఁడు. శరములెక్కుపెట్టుటుంగుట నర్జును నొక్కని మాత్ర మేనోర్వంజాలను. ఇంకంగల వారినందఱ నట్టెయుండి, నీకుఁ బ్రోగడయును, జెలియునునై కయ్యమునకె కాలుద్రవ్వుచుఁ బాండుపుత్రులపై నీకుఁగల పగను మఱింత వృద్ధిపఱచుచు, నీకువిజయలక్ష్మిని గొనితెచ్చి యిచ్చెదనని ధైర్యము గొలిపి ప్రోత్సహించుచుఁ దనశరవిద్యాకౌశలమున నర్జును పైఁ దనకుఁగల యసహనంబుఁ జెప్పున, నీ పురస్సరణమునఁ, దన పగఁదీర్చికొనఁ దలంచి కొలువున ననత్యములు వలుక నలవాటు పడిన రాధాసుతుం డర్ధరథుండు. కవచకుండలములఁ గోల్పడిన నాఁట నుండియుఁ బాప మీతఁడు పిఱికియైనాఁడు. కరుణారసంబున నీతఁడు పిఱికిసేయఁగుట నోరుల కొసంగఁ గలవాఁడు. దాతృత్వంబు కారణంబునఁ బ్రఖ్యాతవంతుండె యగుఁగాక! కాని పాపమీతని యస్త్రవీర్యంబెల్ల పరశురాముండు చెఱచె. కావునఁ బార్థునిం జెనకి యీతఁడు గెలువఁజాలకుండుట మాటకేమిగాని, ప్రాణములనైనఁ దక్కించుకొని మఱలి రాఁగలుగునా యని వగం జెందుదుము. ఇది యంద ఱెఱింగినదే!

— ద్రోణుఁడు —

రాకుమారా, ఈ కర్ణునిచంద మెవ్వరు నెఱుంగనిది కాదు. కర్మగతిచేతఁ బాప మీతనికి సమరమున కవసరమగు నస్త్రములు స్ఫురణకు రాకుండుట, సంఘటిలఁగలదు. ఎదరి నెదుర్చు సమయమున ముందు తనకురాఁగల యాపద నెఱుంగఁజాలఁడు కావున, నీతని మూలమున మనకు జయమొనఁగూడు సూచనలు లేవు.

అట్లగుట నీతం డర్ధరథుండె యగును. ఇందుకు సందియము లేదు. దైవగతి కెవరు మాత్ర మేమి సేయఁగలరు?

గాంగేయుని పలుకులకుఁ గనలి, ద్రోణుని నుడులకుడికి, తామ్రాక్షుండగు కర్ణుండూరకుండఁజాలక, భీష్ముండా దుర్యోధనుతో మాత్రమే పలుకుచున్నాఁడని యెఱింగియుఁ, దనను గూరిచిన పలుకునఁ దనకుఁ జిన్నతనమును, విక్రమగౌరవహానియు నయ్యెంగదా యని, తనమనసు నిలువరించుకొనఁ జాలక, నిలచెను.

— కర్ణుఁడు —

శాంతనవా, నను జూచి యోర్వంజాలక, గాలివార్తలు విని, 'ఆకాశపుఁ బంచాంగ' మనినట్లు నను నోరికి వచ్చినట్లెల్లఁ దూలనాడితివి. నాయందేమి తక్కువ కలదని, నను నర్ధరథుంగా రాజు నెదుట నిరూపించితివి? ఇది రాజుసమక్షమునఁ బలుకఁ దగిన పలుకనియే యిట్లాడితివో? నీతో వావాదేల యనియు, రాజు మొగమైనఁ జూడవలదా యనియు, విశ్వాధారముగల యొకగొప్పపని ముందుండుట సభాగౌరవ మెఱింగిన నేను నీయట్టి తులువపలుకులు వలుకఁ జాలక, ఇంత నిండిన కొలువున నినునొవ్వఁ బలుకుటేల యనియు నూఱకుండ వలసివచ్చుచున్నది కాని, కానిచో నీవు లోకమున కేమియైన నగుదువుగాక, నాకంటె మాత్రమర్ధరథుండవె యగుదువని నినుఁ ధిక్కరింతును.

కొలువుం బరికించుచు–దుర్యోధను నుద్దేశించి,

ఈ గాంగేయుఁడు మనకు హితుఁడని నమ్మవచ్చునే! కార్యభారము వహించినవాఁడిట్టులఁ బలుకునే! రాజునకు నాదెసఁ గూర్మి గోయుతలంపున సామాన్యమర్యాదనైనం దలంచినాఁడు కాఁడే యీతఁడు! ఇట్టి యెక్కువ తక్కువ పలుకు లింతనిండినసభను బలుకుట యిటఁ గూడిన మేదినీపతుల సమక్షమున నను జిన్నగఁ జూచుటో, వీరెల్లరకుంగూడ, నాయెడ నెగుసు జనింపఁ జేయ నూహించుటో. యగుంగాని, కురుపతికిని, కొడుకులకును, సేమముగోరి మాత్రము కాఁజాలదు కద! ఇట్టిరాజద్రోహితోడి తగులము వలనఁ గౌరవకుటుంబచ్ఛేదమును, కౌరవ గౌరవహానియుగాక యింకేమగును ?

(దుర్యోధనుం డాడుచు)

రాజేంద్రా, నీయెదుటనె మన కార్యము చెడిపోయినది. దుర్జనుండగు నీ గాంగేయుఁడు, నినుముంచివేయుటకే తాఁ బడియుండెనచో, నిందఱయెదుటను ని ట్లింతలు వలుకఁడు. నిను వర్జించి, కులమునిలువం బెట్టుకొనుమని నీ జనకునితో నా కృష్ణుండు పలికెంగాని, అంతకన్న నీ గాంగేయుని నొక్కని విసర్జించుకొనుమని యని యుండినచో, మన వారందఱు దుఃఖించుటయును బోవును: నీకు జయమును సమకూడును. ఈతఁడున్నంత కాలమును నీకు జయశ్రీ లభియింపనేరదు. అర్జునునందుఁ బక్షము వహించినా, యింతంతలు వలికినాఁడు! ఈ కథాక్రమ మింతతో నాఁగదు. ఈతఁడర్జునును నెడరింపఁడు రాజద్రోహి యనుకీర్తినామమునఁ దగఁగాఁడు. ఈతఁడు సమరసన్నాహమే సేయును గాని, ఉగ్రసంగరకేళి నొనర్పఁడు. వయసు మరలినంతమాత్రమునఁ బాలదనిము, బుద్ధిచే వృద్ధులగుటయె యావసరమనియు నెఱుఁగక చతురమతులగువారె వృద్ధజనంబుల బుద్ధులువినుచుందురు. ముదిమిచే బుద్ధి పెడతలఁ బట్టుటను నోటికి వచ్చినట్లెల్ల వదరుచుండెడి వారి మాటలువినుట పాడియగునె?

మహారాజా, నీ వేమో యనుకొనుచున్నావు కాని, యీతఁడే నేనకు మొగమై నిలిచెనేని, యీనృపవర్గము నీసేమముంగోరి పోడవఁ జాలరో కా యని తలంతును. అందుననేకదా, దురమున నీతనితో నడుమనె సంగీకరింపకున్నాను.

వేయేల, నీకీసమరమున నపాయమె తటస్థించినచో, నయ్యది యీ భీష్మునితో సంబంధములేనిదిగా నుండదు. ఇదమాత్రము నిక్కువము.

— భీష్ముఁడు —

సూతపుత్రా, ముసలినగు నాచలమును, నాబలమును, నా వివిధాస్త్రసంపదయును నిజముగఁ దెలిసికొనఁ దలంపుకలదేని, నీ విపుడపోయి, నీగురుఁడగు భార్గవరాముని నడిగి తెలిసికొనరమ్ము.

కదనమున, నన్నెదిర్చిన వారందఱును, నెక్కడెక్కడ నేమయిరో యాతండును, లోకంబునుంగూడ నుడువు. నీతో వాగ్వాదం బేల యని దలంచుటనుగాని, కానిచో, నే నెవ్వని ననిమొన నోర్వ నేయ నసియంటివో, యట్టియర్జునుండు నాముదిమియు, నీ కుమారత యు మున్ముందు తెఱంగియే యున్నాఁడని చెప్పవలసివచ్చును.

సూతసుతా, దుర్జాతుండవగు నీకతమున నీసభలో నను నేన చెప్పుకొనవలసివచ్చిన పాపమునకుఁ బాల్పడితిని. కార్యమున కును ఖడ్గమునకుంగూడ, నగుదు ననుచు, నీ వెవ్వండవో యెఱుంగక, మఱియు నెఱుంగఁగోరక, వీరిలో నొకరునిగాననుకొనుచు బలవంతపుదీవనవలె బాలవద్వారోధము పాండవులపైనఁ బెంచుటను, కౌరవుల కింత చేటువాటిల్లెఁగదా: ఇట్టిపట్టుల నన్నియుఁదీర్ప మము బోఁటు లెట్లుసాలెదరు? బలుపోటరివగు నీవ యంతయుఁ జక్కం జేయఁజాలుదువు. పాప మేదే నొకనెపము దొఱకునాయని వెదకి వెదకి తుదకిపు డిట్లుకలిగిన యీ వాగ్వాదము నొకనిమిత్తముగాఁ జేసికొని యెల్లని దప్పించుకొనుట కిట్లు సేయఁదగునే!

మన గండుమగలెల్లరును గతించినపిదప నీ వెట్లైనను రణ భూమింబడకయుఁ దప్పదు: అట్లుపోయి, అలనాఁటిజూదపు రంగస్థల గమునఁ బాంచాలిని నీవాడిన వాడినుడుల నింకను మఱువఁజాలక రోషారుణలోచనుఁడై, కుపితమనస్కుఁడై, నిన్నెదుర్కొను ఫల్గు ణుచే నీవు చావకయుఁ దప్పదు. అప్పట్టున హతశేషంబగు పరివా రంబును, నీపతియును, నినుగూర్చి విచారించుచు, నీపోటరితనమును, నీమగటిమియు నెఱుంగకయుఁ దప్పదు.

(దుర్యోధను నుపలక్షించుచు మరలఁ గర్ణునితో)

సూతజా, మనసు మోధనుఁ డిప్పట్టున, నాపై పెద్దభారముంచి యుండుట నెఱింగి, నినునిపుడె గర్హింది సేయనాకుఁ గాదని సైరించుటను, నీవు బ్రదికిపోయితివి. ఇఁకనైన నూరకుండుము.

హృదయమునఁ గోపము నాగ్రహము నెక్కటివానిగ గ్రమ్మింగి, మిన్నకున్న భీష్మునతారముమునా నిలచియున్న భీష్ముం గాంచి, కంపితశరీరుండగు దుర్యోధనుండు శాంతనవు నుద్దేశించి, పలుకందొడంగినాఁడు.

— దుర్యోధనుఁడు —

పితామహా, ఇట్టిపట్టుల నీవిట్టులఁ గోపింపందగునె! కార్యభారంబునైనఁ దలంపవలదే! నా మొగింబైనఁ జూడవలదే! నా బ్రదుకు నీవపేక్షించితేని, సర్వంబును నీవు సహింపవలయును.

(కర్ణుం జూచును)

అంగరాజా, విరోధిగురుఁడు నీపట్టున నేకమై కార్యభారంబు సంపూర్ణముగ వహించి, మనపనిఁ జక్కఁజేయుట మాని యెదురు మాట లిప్పట్టునఁ దగునె! ఇంతమాత్రమును దలంపవే!

— భీష్ముఁడు (తనలో) —

అన్నా, కర్ణుఁడెంతటి యీసువహించియున్నాఁడో యర్జునుని దెస! ఈతనియీసుం గోసినఁగాని జనక్షయం బుడుగదు కదా యని, వీని నెన్నితరుణముల నెంతెంత నీచపఱచినను, ధనంజయుదెస నీతని పగ యడంగకున్నది. కర్ణుని జన్మవృత్తాంతమంతయు నెఱింగియు, 'సూతపుత్రా' యని, నే నీతని నెంతకించిందుచేయుదు: నెంతకును బట్టుడుగఁడు. అతిరథులలో నొకరుండననదగిన విక్రమాఢ్యుండనియు, అసమాన తేజోవిరాజితుండనియు, నే నెఱింగియు, నీతని నర్ధరథుం డని యధిక్షేపింతును: తా గ్రిందువడఁడయ్యె. అర్జును నిర్జించుటయో, ఆతనితో సమపడుటయో, చేయఁదగినవాఁడఁడయును, అర్జునవశా సమవైరి యీతఁడేయనియును నే నెఱింగియు, 'నీవే యర్జునుచే రణమున నిహతుండవగుదు' వని, యెన్నిసారు లీతని నిస్తేజుం జేయు పలుకులు పలుకుదు: ఈతండేమాత్రమును దేజముందూలఁడు. ఒక్క కర్ణుఁడు లేనిచో, బహుళ ప్రజాక్షయకారణ మూండదుకదా యని యెంచి, యీకర్ణు నెక్కిన దుర్యోధనుఁడు వీడుఁగాక యని, యెంత

పాటులిటి నంతయు వమ్మయినది. ఎట్లేని సంధి పొసఁగఁగాక యని కృష్ణుఁడు, కౌరవసభను దానెంతయుఁ గ్రిందయి, యాచకుండననియు భిక్షుకుండ ననియు, నెంత పొరలవలె నంతయుఁ బొరలెను. నాఁడు కృష్ణుఁడును, నేఁడు నేనును సమముగనే మనోవాంఛాఫలదగ్ధుఁ మయితిమి. సత్సంకల్పముతోఁ బ్రయత్నముచేసియు, భగ్నమనోరథులగుటకు నిదియు నొక తార్కాణము కానోపు! సంకల్పము, కర్మముసేయువాని స్వభావమును గుణశీలములను దెలుపుచుఁ గార్యదిశ నేర్పఱుపఁజాలునేమో కాని, కార్యదశనుమాత్ర మేమాత్రమును మార్పఁజాలదనుట కిదియే ప్రధానలక్ష్యమై నెగడుచున్నదికాదా!

అని భీష్ముండు తనలోఁ దాననుకొనుచుఁ 'గర్ణునింకెట్లు నిర్వీర్యునిగ, నిస్తేజునిగ నిర్విక్రమునిగఁ జేసి జనక్షయము వాపఁగలనో కద!' యని చింతించుచు విషణ్ణమనస్కుండై విచారించుచుండ, మరల దుర్యోధనుం డా గంగాసుతుం దిలకించుచు నిట్లనియెను.

— దుర్యోధనుఁడు —

మహాత్మా, మనలో మనవారింగూర్చిన పలుకుల కేమి కాని, పాండవపక్షంబునం గల తారతమ్యంబులఁ దెలుపుచు, మనలో నెవ రెవరితో వారి వారిలో నెవ రెవరు సాటివారలో యొకింతఁ దెలియఁ బలుకుము. ఉభయపక్షంబులం గల వీరుల నీ వెఱింగిన ట్లెవ్వ రెఱుంగుదురు!

— భీష్ముఁడు —

నీ వడుగకూడని ప్రశ్న యడిగితివి. పాండుపుత్రులను, వారి దెసఁగల దండిమగల నేనొత్తిచెప్పినచోఁ బ్రప్రథమమున నీ కర్ణునకే కర్ణవేదనయు శిరోభారమును గలుగకమానవు. పిదప నీకును మనసున నొవ్వు పుట్టు. పదంపడి నీచిత్తవృత్తి యెత్తెఱంగునఁ దిరుగఁ గలదో యెవరి కెఱుక? ఇంతకును మధ్యస్థుండనగు నాకేల నీగోల? ఊరకఁ గ్రక్కుటయు నెత్తుటయు నాకుం గాని పని.

— దుర్యోధనుఁడు —

పితామహా, విషయవిజ్ఞానము నొందుదునని నిన్నడిగితిని.

— భీష్ముఁడు —

నన్నడుగవలదని నే ననుట యసమంజసమని యెంచి కావలయు మఱల మఱల నను గ్రుచ్చిగ్రుచ్చి యడుగుచున్నావు?

— దుర్యోధనుఁడు —

వారిపరాక్రమముల నెఱుంగఁదలఁచిన నేను నీపైఁ గినియుదునే? సభనువచ్చిన ప్రసంగవిషయ మెఱింగియుండియు, నా ప్రార్థనంబు వినియు, నూరకుండుట ధర్మముకాదు.

— భీష్ముఁడు —

నీవింతదూరము నను దఱిమి తఱిమి యడుగుట, నానోట ననకుంట మేలుమాటకాదని చెప్పవలసివచ్చుచున్నది. అడిగితివి కావున వినుము.

అగ్నికల్పుండగు యుధిష్ఠిరుం డతిరథుండు. అమానుష విక్రమాఢ్యుఁడై రణమున నప్రతిహతుండగు భీముం డతిరథశ్రేష్ఠుండు. తమ మొనలను మించి పర్విడు కవలు సమరథులు.

ఇఁక నాయైదుగురిలో మిగిలిన అర్జునుంగూర్చి చెప్పఁబోదు మన్నను, అతఁడీమానవము వాఁడని నుడువఁజాల. అంతవాఁడింకొకఁ డెక్కడ నెవ్వండును లేఁడు. అతని కతం డెసాటి. ఇట్టి నరునకుఁ దాఁ జేయఁదలంచినపని నితరు లాపంజాలనంత సమర్థుండగు నారాయణుండు తోడుగనుంట నిం కేమిచెప్పుదును! అట్టి నారాయణుండు సారథిమాత్రమై యయ్యును దా నొక్కరుండె పాండవ పక్షమునను్న సేనల నన్నింటినిఁ గాపాడుచుండ గాండీవదుర్దాంతుఁడగు నర్జునుం డొక్కరుండె చాలు నీబలమును నీ సేనల బలమును గీటడగింప! ఇంతకును వారియయ్యగా పాండుఁడె రాజ్యాభిషేచనం బందియుఁ దనయన్న యందలి గౌరవంబున ధృతరాష్ట్రుని సింహాసనంబున గూరుచుండఁబెట్టినంత మాత్రమున నింతలు విడ్డూరంబులుపుట్టఁదగునే యని వారందఱును దుఃఖించుచునుండుటను మనపన్నిన యురులంజిక్కి మనచే నవమానముపాటును దుఃఖము

పాటును బొందినవారగుటఁ బ్రాణాలపై నాసలుగోసికొని మనసేనఁ వెఱగొందఁజేయుచు రణకేళిని, మనలమార్కొని తుత్తునియలు సేయుచుండ, నాహాళాహాళికోర్చి నిలుచుట మనకు వశముకానిపని. ఇంత మాత్రమెఱుంగక కాదు తొలినుండియు నేనర్జునుంగూర్చి యాతఁడు పేర్చిన కార్చిచ్చని యనుటకుఁ గారణము! ఇంత తెలియక యర్జునుపైఁ బ్రత్యేకంపుఁ బగసాధింపంబూనిన వెంగళులు దీపపుసెగం బడిన శలభప్రాయులై మండిపోవుదురు.

శాంతనవుని పలుకుల కటఁగూడియున్న రాజులెల్లరును వెలవెలవోయి ధైర్యము దిగఁజారఁ జేవల్లకిఁ దిక్కులు సూచుచుండిరి.

మహారథులు ద్రౌపదేయులు. వారితో సమానుం డుత్తరుండు అర్జునవాసుదేవులకుఁ దీటువచ్చు నభిమన్యుఁడు లఘుచిత్రములు నేర్చియుంట బెడిదంబుగాఁ బోరు. పాండవస్నేహితుఁడై అతిరథోత్తముండగు సాత్యకిమనపైఁ బెనుగినుకను గనలియుండుట, మన యోధవరులనెల్లరఁ బెల్లుగడుల్లఁ జేయఁగలఁడు. పాండురాజసుతసంబంధప్రియస్నేహంబు కతంబున మహారథులౌ ద్రుపదుండును మాత్స్యుండును, అడవులంబడి కడునిడుములఁ బడియుండిన పాండవుల దైన్యమునకుఁ గడునొచ్చియుంట, నేకీభూతమనస్కులై చచ్చుటకైన నోర్తురేకాని, పాండవులం గెలిపింపక వీడరు. ఇంకంగల యతిరథ మహారథ అర్ధరథానీకమును, దక్కటిజోదులఁ బ్రోదిని వివరింపం బూనుట పిష్టపేషణమ యగు. ఈ రెండువీడుల గండు మిగిలిన దండి మగలె పెక్కండ్రుగలరు. ఇంతటి వీరాధివీరులను మఱల భారత భూమి నెన్నండును జూడఁబోము. కనుకనే తుదకు జయలక్ష్మి నెవ్వరు చేకొనినను 'కుటుంబకలహకారణమున జ్ఞాతివర్గమున కింతఁ దిన సన్నమిడ' వనిన నీకొంచెపుఁ బలుకులవలన నెంతమూడనయి యున్నదో కద యని దుఃఖించుచున్నాము. మహావీరజనక్షయమున కోర్వఁజాలక, మహాజనక్షోభము వినసహింపఁ జాలక, ప్రాణనష్టము

చూడనోపక, నీ యోగావసరియత్నా విరమణమున కెంతపారలవలె నంతయుఁ బ్రయత్నించియుఁ బొరలియుఁ జూచితిని. కాని కార్యదశ భిన్నముగానుంట నేమియుఁ గార్యకారి కాఁజాలకపోయినది.

దుర్యోధనా, జనక్షయము నాటిల్లనున్న యప్పుడు, తెలిసినంత వఱకును ఆ క్షోభము నుడుపఁ బ్రయత్నింపకున్నచో, విలయకారకుండు తానయగు నని ధర్మశాస్త్రంబులు పలుకుటను, గొన్ని విశేషంబులు తెలియఁజేయవలసియున్నది.

నీచిన్నటనాటనుండియు నీవు భీమాదులచేఁ బీడవడియుండుటను, పాండవులపైన నీరోసము దీర్చికొనుట కెంతయో వేదనంపడుచుండ కుమారాస్త్రవిద్యాకౌశలప్రదర్శనసమయమున ననాహూతముగా నేర్పడిన కర్ణుని యీర్ష్యయర్జును మన్నిగొను నంతదియగుట నాతఁడు నిను జేరుటయు నీ వాతని జీవనమునకుఁ జేయూఁత నొసంగుటయుఁ దటస్థించినవి. అదివఱకే ఈర్ష్యాబాధితుండవగు నిను నాతఁడు రేపెట్టి పాండవులయెడనీకున్న దారుణక్రోధాగ్నికిఁదనయీసుపలుకులగాలినిఁ దోడుచేసి నీ పగ నగ్గలమొనర్చుచు నర్జునుపైఁ దన పగ సాధించుకొనదలఁచి వేచియున్నాఁడే కాని నీకు జయశ్రీ లభింపఁజేయుటే తనకు బ్రధానకామితార్థముమాత్రము కాదుసుమ! తనపగఁ దీర్చికొనుటయుఁ, దన్మూలమున నీకు జయశ్రీ లభించుటయుఁగావలసిన దే కాని, ప్రత్యేకముగ నీకు విజయము నభిలషించి కాదీకర్ణుని తుళ్ళు. తనతుళ్ళడగించునంతటి శాపావళి తన్నుసమయించు సమయమునకొఱ కెదురుసూచుచుండఁ దా నది మఱచియో, తనలోఁ దా నద్దాని నెట్లో సమర్థించుకొనుచునో, శాపఫలమునుగూర్చి తనకు నమ్మికలేమినో, నినురక్షింతు ననియు, నీకుఁ గెలుపందిత్తు ననియు, నను నాతని మిథ్యాలాపంబులం బడియుంట, నీవు పోరఁ బోరగిలుదువు.

చిన్ననాఁటఁ ద న్నవమానించిన ద్రుపదు నింకొకతూరి తూలఁగొట్టవచ్చుఁగదా యను నూహాకల ద్రోణునిసంరంభ మాతని

సంగరారంభశీలునిగ నొనర్చుచున్న దే కాని తన ప్రియశిష్యుండగు నర్జును నేయంజాలమి నాతని మనంబుగడుదిరుగుడువడఁ జేయుచు నే యున్నది—అట్లగుట ద్రోణ కర్ణులమాట యుంతయైనదికద!

ఇఁక ననుగూర్చి: నేను దొలుదొలుతనే చెప్పికొంటిని. మీరును బాండవులునునాకు సమానులంటిని. బాంధవమునఁనొక్కటఁ గలిమియు, వేఱొకటలేమియు నుండవుకద! ఇఁక నాసంగరకేళీవిక్రమ మెంచిచూతునందువేని, సన్నెదిరించి, నిలిచి, గెలుపొంది, ప్రాణ ములఁ దక్కించుకొని మగిడిపోయినవాఁడీయిల నిప్పటికి లేకున్నను, ఫల్గునునకున్న నానావిధ శరసంధానశక్తి నాకు లేకునికియు, నా యందలి గౌరవంబుపేర్మి వారు నను నేయంజాలమియు, వారియెడ వాత్సల్యంబుకతంబున వారినేయ నాకుఁ జేయాడమియు నే నిది వఱకే నీకు నివేదించితిని. నీతో నింతకాలముఁ గలసియుంట కను గుణంబగుటకు మాత్రముగా నీదెస నిలిచి పోరవలసివచ్చిన దే యని యనుకొనుచుఁ బోరవలసిన దేకాని, ప్రత్యేకవైరమునా కెవ్వరిపట్లను లేకుంట నీయోధవరులలోఁ గొందఱనలెఁ బ్రాణములైనను బోవు గాక యని పోరఁజొరనొల్ల. లోకధర్మమును క్షత్రనీతియు మాత్రము నీపక్షంబున నను నిలువంజేసి నా శరవిద్యాపటుత్వ మహత్వమును జూపఁ జేయుచున్నవి.

ఇఁక మనపక్షమున సాయము సేయవచ్చిన పెక్కండ్రు రాజులు దుష్టపను నెడనో, కృష్ణునిదెసనో, పాండవేయులవలననో, భిన్నభిన్న కారణములచే శత్రుత్వము నూనినవారే యగుదురు. పాండవులు మనతోఁ గలసియున్న కాలమునఁ గలకులయందు కలిగిన యొత్తుడు నణచుపట్లను, గప్పమున కొప్పని పుడమిపతుల నణచి నొప్పించి, యొప్పించి కప్పములఁ గైకొనినపట్లను, భీమార్జునులదెస వైర మూనిన వారేని అయి, వారిదెసఁ దమతమ పూర్వవైరముల సాధింప నెంచు చుండ, నయాచితముగఁ దటస్థించిన యీయాతురుణమున నినుజేరినవారే

యయియున్నారు. ఇన్ని కారణములుండుటనేకద యిప్పుడు నినుఁజేరిన సైన్యము పదునొకం డక్షౌహిణులయినది. అట్లయ్యును, మఱి వేయింతలు సైన్యము మనకుఁ జేరినను, మనకు జయమబ్బదు. మనయెదుటి యుద్ధతిఁ జూడలేక, నీవు మాచే వారిని నిర్జింపఁజేయఁ దలంపొందితివి. ఇఁక వారనిన మనచే నవమానితులై, మనచే వంచితులయి, మనచేఁ బెక్కిడుములఁ గుడిచి సిలుగులనొంది, మానసముఁ గను కుంది కుంది మనకన్న చిన్నసైన్యములతోఁ బెక్కండ్రు మహారథులతో, లెక్కకుమిగిలిన అతిరథశ్రేష్ఠులతోఁ జక్రరక్షకులును, వివిధోపాయ పరాయణులును, సకలభువనముల నఱచేతికిఁ దేఁజాలినవాఁడును నై, మంత్రరక్షణ కళాప్రవీణుఁడై, తన మంత్రాంగశక్తిచే నీ కర్ణుని మంత్రాంగము ద్రోసిరాజనఁ దగిన సామర్థ్యముగల కృష్ణుని సారథ్యముతోఁ బాండవులు మనపై విడియుచున్నారు. ఫాల్గునకు సారథియగుట శ్రీకృష్ణుని, తురంగంబుల పటుత్వం బెఱింగి చతురత్వం బున రథముఁదోలు సారథియని భావింపకుమా! శ్రీకృష్ణుండె యీ సమరమునకు సూత్రధారుండై, పాండసైన్యంబును నోడకుఁ గర్ణధారి యై నెగడునని నీ కెంతఁ దెలియఁజెప్పినను నేమి ప్రయోజనము? నీ కర్ణుని పలుకులు విశ్వసించి, నను రాజద్రోహిగఁ దలంచినను నే నంతవంత నొందను కాని, నీవిపు డీసూతపుత్రు మాయావాగురం దగులువడి విశ్వవిలయకారకుండ వగుచున్నావని మాత్రము దుఃఖింతును. తమ కార్యములవలనఁ దమ పలుకులవలనఁ దమ కప్రతిష్ఠయుఁ బరులకు హానియుఁ గలుగుపట్టులుఁ గూడ గుర్తింపనొల్లనివారికిని, ఎంత బోధించినను విననివారికిని, నీవు సామ్యుఁడవై లోకకంటకుండ వగుచున్నావే యని కటకటంబడక తప్పనిసరియైనది.

— దుర్యోధనుఁడు —

ఓ నాను-పితామహా, నీ వింతదూరము చెప్పిన దంతయు కొప్పుగ నున్నది. కానున్నది కాకమానదు. ఒకటి ఈశ్వర ప్రేరితమై

యింకొకటి కాకయుండునా? ఈ వివాదసూత్రములును, జర్చయు నటుండనిచ్చి పాండవబలంబుల నెల్ల సంపూర్ణంబుగ సమయింప నీ కెన్నిదినంబులు వలయు; ద్రోణకృపాశ్వత్థామల కెన్నెన్నిదినంబులు చాలు; అది తెలియఁజేసి, నను గృతార్థునిఁ జేయవేఁడుచున్నాను.

— భీష్ముఁడు —

గాంధారీనందనా, పాండవసేనలఁ జంపను జెఱుపను దగు తెఱంగును, అందుకువలయు కాలప్రమాణమును సంశయము వాయ నట్లీవ నన్నడుగుటయె పరమసంతోషము. నే నెంతవఱకుఁ జాలుదు నంతయుఁ జెప్పెద. తక్కటివారెల్లఁ దమతమ లావుకలుములును, దమతమ చాలుటలు తామె చెప్పవలంతులు. వారివారి పలుకులు తరువాత విందువుగాక— మున్ముందు నీ కొక్కబాస యిచ్చెద వినుము.

——రాజరథికుల మేటిమగల దినమున కొకవేవుర నే వధియింతును. నరుశరపరంపరలు నా మేననాటి నను నేలఁదొరఁగఁజేయు నందాక మనకుఁ బ్రతిపక్షమున నున్నవారి నెల్ల వేటాడెద—నని బాససేసెద. ఇం దేమాత్రమును సంశయము లేదు.

మఱియు, నా నాయకత్వంబున నే నని సేయు కాలంబునఁ బదివేలనైనను జంపనోపుదును. అంతియకాక, మన పదునొకం డక్షౌహిణులను జతురితరంబుగ నడిపింతును; ఎదిరిం బొడిపింతును. అడుగడమైనం గలిపింతును; దవ్వగు పరచమూసమూహంబులం గలంతును. ఆ సందియంబును నీకుఁ బాపెద.

—— ఆ పాండవబలంబుల నెల్ల నా శరవిద్యామహిమంబున నొక్కమాసము కాలంబునఁ దెగంజేయఁ గలాఁడను—.

— దుర్యోధనుఁడు — (గురుకృపాశ్వత్థామలం దిలకించి)

మీమీ బలంబుల కొలంకుల నెఱింగి వర్తమానసంప్రశ్నిత విషయంబును నానతిండు.

— ద్రోణుఁడు — (దుర్యోధను నీక్షించుచు మందస్మితాననుండగుచు)

రాకుమారా, నేనును ముదిసినవాఁడ నని యెఱింగియు, న న్నిట్లడుగుచుంటివి. ఇంతకును, గురునకే పరీక్షాసమయ మాసన్న మైనది. ఇంకేమని చెప్పఁగలను?

నా ముదిమికతంబునను బ్రతిపక్షమున నున్న యసమాన శరవిద్యామహిమంబు కలిమిని, నీ యనుంగుతాత చాలినన్ని దినంబులును శత్రుజలంబుల సమయఁజేయ నాకును వలయు.

— కృపాచార్యుఁడు —

రాజేంద్రా, ఆచార్యుండు నుడివిన కాలప్రమాణమునకు ద్విగుణంబుగ నాకు వలయును.

— అశ్వత్థామ —

పరసైన్యంబుల నెల్లఁ బదదినములలోఁ గడతేర్తు.

— కర్ణుఁడు —

నానేర్చిన నానాస్త్రశస్త్రచయ మనెడి బడబానలముచేఁ బాండవసేనాసాగరము నేనాళ్ల నే నిముఱఁజేయుదు నని యీసంగర సమాలోచనాసమితియందు రారాజు నెదుటఁ బ్రతిన సేయుచున్నాను.

— భీష్ముఁడు — (సభం దిలకించుచుః పకాలున నవ్వి)

మనరాజునొద్ద మార్పలికెడివారు లేరు కాన, నెన్ని యైనఁ బలుకవచ్చును. పలుకులకును బనులకును నెంతేని వాసి కలదు. ఈ సూతసూతి రజ్జెడువాఁడు కాఁడని తెలిసికొనుటకైనను, అంతఁ దనుక నేనును మన యాచార్యుండును మిగిలినఁగదా! రాజపుత్రా, మన సూతపుత్రుని సత్యవాక్యపరిపాలనము నీవు దెలిసికొనఁగలవు. మిథ్యావాది యీతండని నీకుఁ దెలిసినపిదప నీవుచేయఁదగిన కార్య మేదియు మిగులక నీ వెందేని దలఁదాచికొనవలసివచ్చునేమో!

రాధేయా, ఇంతకును నీ విప్పట్టున నిట్టి మిథ్యావచనంబులు వలుకకుండ నెట్లు లూరకుండఁగలవు? ఫల్గుణుని గాండీవదీప్తులచే

మిఱుమిట్లుఁగొన్న కనుదోయియు, తద్గుణధ్వనిని వ్రయ్యలైన వీనుం గవయు, తన్నారాచప్రచయమునఁ జిల్లులువడిన మేనిజల్లెడయు, నేర్పడినపిదపఁగదా, మఱి పలుకులేక నీవు పుల్లవడుట! అంతదనుక నిట్టుగ్గ పెట్టున ప్రేలుచుండవలసినవాఁడవే.

— కర్ణుఁడు —

రాజబిడౌజా, వింటివికదా యీ ముదుకని పలుకులు! ఈతఁడు పోటరి యని నెత్తిపై కెక్కించుకొని యూరకుండక సర్వసైన్యాభిషేచనముంగూడ నొనర్చితివి. కొఱవిం దలఁగోకికొంటివని తుదకు విచారింతువులే !

— భీష్ముఁడు —

తుదకు విచారించునది నీకొఱకే యగును. నరుని శరప్రవాహమునఁ దొలుదొల్త గొట్టుకొనిపోఁబడువాఁడను నేనే. నావెంటం జనుదెంచు నీ గురుఁడు. తుదిదాఁక నీపలుకులచే రాజున కాసఁగొలిపియుఁ బాప మీఱేని నసహాయునిజేసి, నీ వెవనిపై నగ్గలంబగు పగఁ బూనియుంటివో, యాతని బాణాగ్నినె భస్మము కాఁగలవు నీవు. మాయందఱపైనింక నేడ్వకుము. మేము మాధర్మము-విధ్యుక్తకర్మము-విహితకర్మము-కామ్యములేనికర్మము- రాజునాన నాచరింప నున్నారము. మా కెవ్వారిదెసం బ్రత్యేకంపుఁ బగ లేదు. ప్రత్యేకపు టూహ లేదు. ప్రత్యేకపు టాస లేదు. మఱియు మాకిదిక్షత్రధర్మము. రాజునాజ్ఞ నొదల ధరియించి కర్మముకొఱకు కర్మము, నిష్కామ కర్మము, సేయంబూనినవారము. కౌరవ పాండవులలో నెవరు జయ మందినను, రెండవవారింగూర్చిన దుఃఖము మాకు విధివిహితము. ఇందు నీ ప్రసక్తి, నీ పురస్సరణము, నీ పట్టుదల, నీ విడుపోపమియు బ్రత్యేకకామితాకర్షకములై, యీర్ష్యాసమ్మిళితములై, పండితజన నింద్యములై యున్నవి. పూరునికాలమునాఁటంగోలె, హస్తినుండి మత్పితృపరిపాలనము దనుక, నెంతేని గీరితిఁగన్నదన్న కౌరవగౌరవ మీ

నాఁట నీయంటున, నీ టక్కుటొంకుపలుకులకలన, నీమృషాలాపమ్ముల కతమ్మున, నీ ప్రగల్భప్రలాపప్రచయమ్ము కారణమ్మునఁ జెడుటతో నాఁగక బంగారువంటి భారతవంశము నిర్మూలనమైన దను నానుడి జనులాడుకొనుటకు మఱి జడియరుసుమీ! ఇంతమాత్రమైన నే నలుక నీక నద నోపవదని, యిప్పుడే యింతాడితి.

— దుర్యోధనుఁడు —

పితామహా, అంగరాజుతో నీకేమిపని? కర్ణా, మా కందఱకును వందనీయుండు మత్పితామహుండు: విశేషించి నీప్రభువునకు వందనీయుండు. నీకుమాత్రము కాకుండునా? అతం డెంతాడినను నీవ్వూరకుండవలదోయి. రాధేయా, కార్యభారమునైనఁ దలంపవలదా?

అని యింకేమియనఁబోయెనో కాని, యింతలో నొక ప్రతీహారివచ్చి, రాజు నెదుటనిలచి,—"మహాప్రభో, పాండవులకడకుఁ దా నంపిన యులూకుండువచ్చి రాయబారకార్యము నిర్వర్తించికొని, యేమో కొన్ని వార్తలు సమక్షంబునఁ దెలుపవలయునని వేచియున్నాఁడు." అన దుర్యోధనుండును నులూకుని రాఁబిలువనాజ్ఞయొసంగెను.

ఉలూకుఁడు ప్రవేశించి రాజునకు నమస్కరించి యేమో చెప్పఁబోవుచుండ దుర్యోధనుఁడు: "ఇప్పు డెవనికి—అపరాని పలుకులఁ బలుకవలదు—భీముం డేమనియె!" నని యడిగెను.

— ఉలూకుఁడు —

భీముం డేమియుననియుండునో కాని, కృష్ణుం డాతని నపవారించెను.

— దుర్యోధనుఁడు —

అంగరాజా, వింటివా! ఎవరినింగూడ నాలుకమెదప నీయఁడోయీ! తా నొండె - తనయర్జునుం డొండె: పలుకవలె; చేయవలె. అంతేకాని, తక్కొరుల కీక నటఁ జోటు దొరకనీయఁ డమ్మాయలాఁడు!

———ఆఁ— తరువాత ?———

— ఉలూకుఁడు —

మీ రట నుడువుమనిన విషయములెల్ల కొంకులేక పలికితిని. వినివిని కృష్ణుఁ డిట్లనియెను.

— కృష్ణుఁడు —

ఉలూకా, మఱల నిప్పుడీ రాయబార మేలనోయీ? అందఱును వినునట్లు సుయోధనునితో నిట్లనుము.

'రేపే కద యుద్ధప్రారంభము- మఱియింకేల యీ పొల్లుపలుకులు?

'సంగరరంగమునందైన నీవు పోరక నీవారియందఱిచావును విని విని, దిక్కులేక, నీవెందెందుఁ దలఁదాచికొనఁ జొచ్చిన, నందందే చొచ్చుఁజుమీ కృష్ణసారథికంబగు విజయురథము.

'మింటను, మంటను, నీటను, నాటను, గాలిని, నీవెందు దాఁగియున్నను కృష్ణార్జునులకు నగపడకుండఁజాలవు. సుయోధనుదెస నెవరెవరే యేమాటలనియు నిర్వహింపఁజాలుదురొండే: పాలుపంచుకొందురొండే- కాని పాండవులలో నెవరెవరే యేవిధమునఁ గౌరవులను సేయుదుమని యలనాఁడా ద్యూతసభను గొంతెత్తి వలికియుండిరో, ఆయాతీరుల నందఱును బ్రతినలఁదీర్చికొనక యూరకుండరు.' అని నుడువుము.

అని కృష్ణుండు మిన్నకుండ—

— అర్జునుఁడు:—

తనకు స్వతస్సిద్ధముగ శక్తిలేక, యెల్లప్పుడును- వారు కలరు, వీరు కలరు- అనియే యనుమందు మీ సుయోధనుండు. ఆ కలవారినందఱఁ ద్రోడ్కొని, మాపైవచ్చి వారిలో నందఱుఁ గూలినపిదపఁ దాఁ బలికిన కటూక్తులును దానొనర్చిన వంచనకార్యములును, ఒక్కొక్కటిగ మఱలమఱలఁ గెరలించుచు మాయన్న భీమన్న గదాప్రహారములిచ్చుచున్న సమయానఁ గదా మమ్ముఁ దను మాకున్నవారి నెఱుంగుట!

ఉలూకా, మఱిపలుకులేల? రేపకడను మీరాజునకుం గలవారి నెల్లఁ గలనికి వలనుగ నడిపింపుమని చెప్పుము.

అని యర్జునుండన, మహాప్రభూ, ధృష్టద్యుమ్నుండును, శిఖండియు, నెచ్చటనుండి వచ్చిరో కాని, 'ద్రోణుం దొడరఁబడసితి'ననియు, 'భీష్ముం దలపడఁగంటి'ననియును గ్రమంబుగ గొంతెత్తి యఱచుచుండ, ధర్మజుండును వారిని వారించి, నాకుఁ దాంబూలాభరణంబు లిచ్చి ననువీడ్కొలుపఁగొంత దవ్వనుప న న్ననుసరించి నడచుచు, 'భీష్మ

ద్రోణకృపబాహ్లికాది భద్రజనంబులకు 'మద్దండవక్త్రనామంబుల, దెలియఁబలుకు' మని నాతో నని మఱలెను.

ఈపలుకు లులూకుఁడు పలుకుచున్నంతతడవును నాసభంగల కురువృద్ధామాత్యాచార్యవర్గంబెల్ల—"ఔరా, యెంతయొప్పదముగఁబల్కెఁగృష్ణుఁ" డనియు, "ఆహా! అర్జునుండున్నది యున్నటులఁ బలికె" ననియుఁ "దానంతటిదురవస్థనున్నను సాంఘికమర్యాదల నెంతదిటముగఁ బాటించు ధర్మజుం" డనియుఁ దమమనంబుల ననుకొనుచు, నుల్లంబుల నొల్లవోవుచుండ, సుయోధనునకు సాయమొనర్పవచ్చిన రాజలోకము మనోధైర్యమువీడి నిర్వీర్యమై స్థలాంతరమునకు నడచెను.

ఉలూకునిపలుకుల యనంతరము సభముగించును, దుర్యోధనుండు భీష్ముంజూచుచు, "పితామహా, శిఖండి ధృష్టద్యుమ్నులు నిన్నును గురునింబేర్కొనం గతంబేమి?" యని యడిగెను.

"అది ప్రత్యేకవిషయము-అప్లయ్యును జెప్పెదవినుము" అనిభీష్ముండని, అంబ తనపై నెట్టిపాలిఁబగఁబూనియుండెనో, యిపుడు శిఖండినై, తనపగసాధింపఁ గాన నెట్టిప్రయత్నములు సలుపుచుండెనో, ధృష్టద్యుమ్నుఁడు తనజనకుండగు ద్రుపదునిమాటఁదీర్ప, ద్రోణునెడవహించిన క్రోధముకతమున నేమి సేయఁదలంచెనో, నీ మొదలగు విషయములెల్ల సకృత్స్నముగఁ దెలియపఱచెను.

సభనున్నవా రొక్కొక్కరె మెలమెల్లగ లేచి వెడలుచు నేయుండిరి.
రేపకడ నడుములుబిగియించి బోరికలనికి నడువసన్నాహములు నడచుచునేయున్నవి.
కర్ణదుర్యోధనులు ప్రత్యేకస్థలమునకుఁబోయి యేమో ప్రసంగించుకొనుచుండిరి.
భీష్ముండును నిజోచితప్రవర్తనల నుండెను.

## సింహావలోకనము

కర్ణభీష్మసుయోధనులారా, మఱి విూరు మాకు గానరారు. కావున మీ ముప్వురతోఁ బ్రత్యేక ప్రత్యేకముగ నొకింత ప్రసంగింపవలసి యున్నది. ఆఁగుఁడు—ఒకింత తాళుఁడు.

కర్ణా, నీవు సుయోధనుచే బహూకరింపఁబడి దిగ్విజయమునకు బయలుదేరి ద్రుపదునోడించి యాతనిచే ధన కనక రత్న వస్తువాహనాదులఁ బన్నులుగా గొనియుంటివి. ప్రాగ్జ్యోతిష పురాధీశ్వరుండగు భగదత్తునోడించి, అనేకధనరాసులఁ

గానుకగాఁ గొనియుంటివి. హిమవత్పర్వత ప్రాంతమున నున్న రాజుల నెల్లర జయించితివి. తూర్పుననున్న వంగమగధాది దేశములం జయించి, దక్షిణ దేశాలపై దాడివెడలి విదర్భ చేది పాలకులగు రుక్మి శిశుపాల తనయాదుల నోడించి, పాండ్య కేరళాది దేశాధిపుల వశపఱచుకొని, యవంతీనాథు సాధించి, వృష్ణివరులను సామోపాయంబున వశపఱచుకొంటివి. పశ్చిమ దిగ్విజయయాత్ర నెఱపుచు మాళవ యవన శకముల నోడించి అనంతములగు ధనరాసులు గొనితెచ్చి దుర్యోధనున కిచ్చియున్నావు. నీచే సమర్పితమైన యనంతమగు ద్రవ్యముతో ధర్మజుని రాజసూయమును ధిక్కరించు నట్టి వైష్ణవమను మహాయజ్ఞమును జేసి దిగంతవిశ్రాంతమగు కీర్తిని బడసి, 'దుర్యోధనుఁడు మహావైభవముతోఁ బాండవుల శవులమన్న కాలాన భూవలయమును బరిపాలించుచుండెఁ' ననుమాట మాత్రము మే మెట్లు కాదనఁగలము! నీచేఁ జయింపంబడిన సకలపర్వతారణ్య పట్టణ గ్రామ ద్వీప జలధి సహితమగు వసుధామేఖల నెల్ల దుర్యోధనునకు సమర్పించి యాతని మెప్పుల బడసినావు.

నీ దిగ్విజయమును నీ యభేద్య కవచపరిధానమును రాజరాజు రాజ్యవైభవంబును నాతని ప్రజానురంజకతను ధర్మరాజు చారులవలన విని మిక్కిలి పరితపించుచు నిద్రాహారములపై నభిరుచి లేక యింతకాలమును వందురుచుండెననుమాటయు మే మెఱుంగుదుము. నీయౌదార్యము, సాహసము, సత్యవ్రతము, ధైర్యము మొదలగు మహాగుణములు లోకమున ప్రథమముగ నెలకొల్పఁబడినవనియు మే మెఱుంగుదుము. నీ ప్రతిభయు, నీ విక్రమమును శరవిన్యాస శక్తియుఁ దలంచికొనిన కొలంది నెంతయు నానంద మొందవుచుండునే కాని, నీ యొనర్చిన కొన్ని కొన్ని కృత్యములు దలంచికొనిన మనమున కేవజనింపక తప్పదుసుమా! "అరణ్యవాసము చేయుచున్న పాండవులకును ద్రౌపదికిని నీ వైభవమును జూపి మయసభా దర్శనము నాఁటి యవమానమునకుఁ బ్రతీకారమును జేసి విఱ్ఱవీఁగుటకంటె నీకుఁ గృతార్థత వేఱుగ లేదు"—అని నీవు దుర్యోధనున కుపదేశించుట కేమందుము? ఇదియును నీ రాజభక్తియే యనువారి వాదము నే బలపఱచునని మేము తలంపవలెనే! నీయట్టి మహాపురుషుఁ డిట్లుపదేశించుట యనుచితమనుట యెట్లుసంగత మగును? ఈ పాపము కట్టికుడుపుటకే కావలయు నీ కీ సంగ్రామమున నాద్వైతవనమునఁ దగని యోటమియు, నపకీర్తియు నాపాదించి యాచంద్రతారముగ నీకీర్తి శరీరమునను బాయని కళంకము కలిగించినది. నీ వెంత రాజభక్తి తత్పరుఁడవైనను, ఎన్నెన్ని విధములఁ బాండవపరాభవమునకు నీవు ప్రయత్నించి, నీ ప్రభువున కానందము నొదవఁజేయనగు మార్గముల ననుసరించిన ననుసరింప

నగుచేకాని, మహాపతివ్రత యని యనుపించుకొనిన ద్రౌపదిని ద్యూతసభను—ఆమె విపద్దశనైన నెంచక,-బంధకి-యని పరాభవించుటయు, "నీ కిపు పతులు లేరు; వీరు జూదమున నోడి నినువిడిచిరి; కావున నీపైఁగూరిమిగల మగని నింకొకని వెదకికొనుము.'' అని యెల్ల సమాడుటయు, మఱియదియేమనుకొనోకాని, అదిమహాక్రూరముతప్పుగాకపోదనియే మనీషులు తలంతురు సుమా!

వీరపురుషోచితముగఁ బాండవులను సంహరించి వారిసిరిగైకొనుటే యుక్తమని పలుమారు నీవు దుర్యోధనునకు బోధించుచువచ్చినను పాండవులం జెఱచుటకు శకుని ప్రభృతులు దుర్యోధనునితో నెఱపు కపటోపాయములందు నీ వేకీభవించుచు నావానితో నీవు పాల్గొనక పోలేవని మేమెఱుంగక పోలేదు

ప్రభుభక్తి నీ కనుగప్పుటనే కాఁబోలును దుర్యోధనుని దుర్వ్యాపారముల నేవగింపక, సద్బోధనము సేయక, నీ ప్రభువును మఱింత ప్రోత్సహించుచునే వచ్చితివి !

స్వామిభక్తులకుఁ దమయధిపుల వ్యాపారములలో మంచిచెడ్డలను విమర్శించుచు వారి దుర్వ్యాపారముల నడంచుచు సదుపదేశములు సేయుట, లక్షణము కాదనువాదము సేయువారే యానందింపవలెఁగాని, తక్కటి వారెరును నిన్నీపట్టున మెచ్చుకొనరు సుమా!

నీకు నిజమయిన స్వామిభక్తికలదని పెక్కురనుచున్నను, పాండవులం గూర్చియు, వారి ప్రవర్తనలం గూర్చియు నీ ప్రభుసమక్షమున నీవాడిన పలుకుల యందు గొంతయుక్తి యున్నదని సంతసింతుమన్నను, పాండవులచేతను ద్రౌపది చేతను నీ ప్రభువగు దుర్యోధనుఁడు పరాభూతుఁడగుట నీకు దుస్సహమయినను, మహాగాతవును, నిత్యసత్యవ్రతుండవును, ధర్మాత్ముండవును, తపశ్శాలివియు, నౌచిత్యసంపన్నుండవును నగు నీవిట్టి యనుచిత కార్యము లొనర్చుట అద్భుతమును, ననుచితమును నని యనుకొనక తప్పదు. ఇఁక నీ కార్యములును, నీ పలుకులును సమర్థింప నెంచితిమేని, సృష్టిలో నెవ్వని చరిత్రమును నిష్కళంకమైయుండలేదని నిను సంభావించుటదక్క మఱియొకమార్గము లేదు.

"నిజమయిన స్వామిభక్తులు స్వలాభనష్టములను పాటింపక స్వామి కార్యమునకై తమ శరీరమును ధారవోయుట వింతకాదు" అనుమాట యేపాటిమాట!

పాండవులను బయలుపెట్టుటయే ప్రయోజనమని బయలువెడలివచ్చిన దుర్యోధనునకు హఠాత్తుగా భీష్ముఁడు వారి సహాయముఁబూర్తి యయ్యానని చెప్పుట

చేతను, భీష్మాదియోధులు పరాజితులయి పాఱిపోవుటచేతను, ద్రోణుపడియున్నట్టియు, నప్పు డర్జునునితో యుద్ధము సంభవించునని తలంచి యుండనట్టియు, విరాటునోడించుటకుమాత్రము తగిన సన్నాహముతో వచ్చినట్టియుఁ గర్ణుఁడు పరాజితుండగుట వింతకాదు అని మేము సమాధానము చెప్పుకోవలెనందువా?

మఱియు వనవాసాద్యాయాసంబుల మిక్కిలి కినిసియున్న యర్జునుని వాఁడి నారసముల నొడలు కోసికొనియున్నట్టియు, నెట్లయిన జీవించియుండి యర్జునుని వధించి, నీప్రతిజ్ఞను నెఱవేర్పఁగోరి యున్నట్టియు, నీ వొక్కరుండవు నిలువరింపఁజాలకుండుట యద్భుత మెట్లగునని బలవంతముగ సమర్థించుకొనవలసినదే కాని మఱియొక మార్గము లేదు!

కాని, కర్ణా, నినుబాండవ పక్షముం జేరరమ్మని కృష్ణుండును, గుంతియు, నినుగోరినపుడు నీ నడకత్తుటబడినట్లయితి వనుటమాత్రము సత్యము. నీవనానుకుఁడవై నీచకులజుండవని నిరసింపఁబడు సమయమున నిన్నాదరించి, యుత్తరోత్కర్షముగ మన్నించుచున్న దుర్యోధనునిఁ గార్యము ముట్టివచ్చినప్పుడు నీవు ఆదుర్యోధనుని వీడవలయును—ఇది కాదందుమేని, అట్టి దుర్యోధనుఁడు నీకుఁజేసిన మన్ననలకు మెచ్చి నీవు—అర్జునువధియించెద—ననియాతనికిఁ బ్రీతికరముగఁ జేసిన ప్రతిజ్ఞను విడువవలయును; లేదా కడుపారఁ గన్నతల్లియొక్కయు, మేనమామకుమారుండగు శ్రీకృష్ణుని యొక్కయు, సకలకర్మసాక్షియు నిష్టదైవతమును, దండ్రియు నగు సూర్యభగవానుని యొక్కయు హితవాక్యముల నుల్లంఘించి, యఱచేతం బడనున్న సామ్రాజ్యంబును, త్రిలోకసుందరి యని వాకొనఁబడుచున్న ద్రౌపదిని విడుచుకొని, తన్నెఱుంగని సోదరుని, దానెఱిఁగి యెఱిఁగి నీచేతఁ జంపికొనవలయును! ఇంతియేకద నీవుచేసినచోఁ జేయవలసియున్నవన్న పనులు! కాని మహాధైర్యశాలివియు, స్థిరప్రతిజ్ఞుండవును, సత్యసంధుండవును, నగుటనేకదా, ఇట్టి సమయములందుకూడఁ, జలియింపక నీవు సామ్రాజ్యముకన్నను, దుర్యోధనుని సేవకత్వమునే యున్నత పదవిగ భావించియుంటివి! మహాపురుషులు సామ్రాజ్యసంపాదనమునుగూడ ననుచితమార్గమున నైనచో, నంగీకరింపరు. అట్లగుట నీప్రభువు ననుసరించియున్న వారిలో, భీష్మునికన్నను నీవే యెన్నో మడుంగు లుత్కృష్టుండవని యంగీకరింపవలసివచ్చుచున్నది.

* *

భీష్మాచార్యా, పితామహా, మహానుభావుండవు నీవని గీరితిగన్నమిన్నవయ్యును, కౌరవులును పాండవులును నీకు సమానులయ్యును, నీవు కౌరవుల ననుసరించి యున్నందుకునే నగినట్లులు ప్రవర్తింపక, పాండవపక్షపాతివై, సమర్థుండవయ్యును, స్వామియగు దుర్యోధనుని కార్యము నెఱవేర్చినావు కాదను నపవాదము నీపై ప్రబలతరముగ నున్నదిసుమా!

విరటుపసులఁ బట్టిననాఁడు నీ వర్జునితోఁ బోరుచున్నతఱి, నాతని సమ్మోహనాస్త్రము నుపసంహరింపఁజాలియు, నీ వూరకుండ లేదా!

పాండవుల సమయము గీఁగుట నీ వెఱింగియుండియు, పాండవులబయలు వెట్టుతలంపున దుర్యోధనుఁడు బయలుదేరుసమయమున, నయ్యది చెప్పక పోయితివే!

తుట్టతుద కప్పట్టున నర్జునుఁడు ధనుర్బాణధారియై వచ్చుచున్నప్పుడు పదుమూఁడేఁడులును నిండెనని సాక్ష్యము నీయ లేదా!

కర్ణుని మూలమున సంధి కుదురు లేకున్నదని నీవూహించి యాతనిం బేరోలగంబున నిస్తేజుం జేయ ప్రయత్నింప లేదా!

ఇంతకును కౌరవ మూర్ఖజనములే యని నీవనినచో, ధర్మశాస్త్రములు చెప్పినచొప్పున నట్టివారి నేల వీడి వెడలవైతివి?

వ్యాసునిచే, సత్యవతిచే నాజ్ఞాతుండవగుట నేనే నెట్టుల దుర్యోధను వీడఁగల ననుటకుఁ నీవు గొంకవు. ఇంతకును, ఆనాఁడు గౌరవమునే నీకును, ప్రజను కథకుండగుట నేఁడు మాకును వ్యాసుఁడేకదా ప్రమాణము!

* * * *

సుయోధనా, ఎంతయో శ్రమపడుచున్న నిను మా మాటలచే వలనుట నొందనీయములే!

విమలచరిత్రుండగు పాండుఁడే రాజ్యమేలెనని నీవు స్వయముగ నెఱిఁగి యున్నను లేకున్నను, నీతండ్రియు నీ పితామహుండును చెప్పుటనైనను నీవెఱుంగుదువు. అటు కాదందువేని, ధర్మజుండు యువరాజయిన పిదప నీతండ్రితో * నీవు ప్రసంగించినపరికారం బేమెఱుంగమా! తుదకు నీవు ప్రాయోపవేశంబు నొందుటకు సంసిద్ధుండవగుటయు, అందుకు నీవుజూపినయుపపత్తులును, నినుబ్రాయోపవేశమునుండి తప్పించుటకు నీవు నీ తండ్రితో చెప్పిన యుపాయములును మేమగ్రహింపలేదా! మీమీ ప్రసంగముల నెఱి నెఱింగిన వ్యాసునకును, తద్వచనముల జక్కఁగఁ దెలిసికొనిన మాకును విస్పష్టము కాకపోలేదులే!

---

* ఆంధ్రమహాభారతము: ఆదిపర్వము: షష్ఠాశ్వాసము: పుటలు, 160—164.

నీవు కనుదెఱచి చూచునప్పటికి పౌరసింహాసనమున నీ తండ్రియే కూరుచుండెను. నీవే యువరాజు ననుకొంటివి. అట్టి యాసనే యుంటివి. ఇంతట మునిమూకలు గొంతిని యామెయైదుగురు సంతానమునుగొని తెచ్చి వీరు పాండువిభుపుత్రులని నీ తండ్రి కప్పగించిరి. నీ తండ్రియు తన తమ్మునివలని ప్రేమమ్ము కతమ్మున వారలకు విద్యాబుద్ధులు గఱపి పెనిచి పెద్దవారలఁ జేయుటయు, నా కాలంబుననె నీవు భీముని బలాతిరేకంబులకు మనంబున నోర్వంజాలక, [1]నాతని మారణోపాయంబుల నెంచుటయు, కుమారాస్త్ర విద్యాకౌశల పరీక్షనాఁడు భీమునితో నీ కొదవిన గదాకౌశలప్రదర్శన సమయమున నీ వాతని మించఁజాలకుండుటయు [2]"వీరులని పాండుసుతులకు వెఱతు నేను" అని నీవు దుఃఖించుచుండుటయు ననంతరము నీ తండ్రి [3]యుధిష్ఠిరుని రాజ్యభారధురంధరుంగా నెఱింగి, భీష్మవిదురుల తో విచారించి, యౌవరాజ్యాభిషిక్తుం జేయుటయు, పిమ్మట నీ వాతని యౌవరాజ్య పదవి కోర్వంజాలక కుంతీసహితులగు పాండవుల వారణావతంబున కనుపునట్లొనర్చుపట్టుల నీతండ్రితో నీ వనినమాటలును, అనంతరము వారల వారణావతంబున లక్కయింటనిడి నిప్పువెట్టి కాల్పించు ప్రయత్నములును, తదనంతరము దుశ్శ్రవమై దుస్సహమగు ద్రౌపదీ వస్త్రాపహరణమును, వరుసగా మే మెఱుంగుదుము. అరణ్యాజ్ఞాతవాసములా పాండుసుతు లనుభవించునటుల బన్నగించిన జూదమున వారు రాజ్య మోడకున్నను, వారూర లేనిసమయము వెదకి వారి రాజ్యమాక్రమించినావు. 'చిక్కినది తగ' వనియెంచి మరియీయ ననినావు. వారికి రాజ్యమున స్వత్వము లేదనినావు. ధర్మజాదులు పాండుపుత్రులే కారనినావు. నీచిన్నితనాన నేదియోట్లు జరిగినను యిఁక భాగముమాట దలపెట్టవద్దనినావు. ఇంతదూరము పరువెత్తుచున్నావే, నీ వాదమున నేమాత్రము బలమున్నను, నీకే సర్వాకారవరాజ్యమును, అభిషేకింప దలంచి వ్యాసుని ప్రత్యక్షసాక్ష్య మంగీకరింప మని, తదితర పరోక్షసాక్ష్య మంగీకరింప మని నిన్ననుసరించువారి యభిమానము విడయఁదలంచి యెంతశ్రమంపడి పర్యాలోచించినను నీయెడ నిర్దోషత గానరాదు. ధర్మజాదులు గడసరులనియు, నీపై నొక కొన్ని యపవాదములం బ్రబలఁజేసిరనియు, నీవు వారిపై నిడు నేరములో, దోషములో, టకటొంకుపలుకులో గాని—అవిమాత్రమే కానవచ్చుచున్నవి కాని, నీకు రాజ్యముపై నున్న స్వత్వముల నిరూఢ పరచుటకుఁ దగిన యుపపత్తు లెందును

[1]ఆంధ్రమహాభారతము: ఆదిపర్వము: షష్ఠాశ్వాసము. పుటలు 160—164.
[2]ఆంధ్ర ... ... పద్యము 121. [3]ఆంధ్ర ... పుటలు 160—164.

గావరావు. కార్యముగడచెఁడీరు సమయానకైన నీ హితుల్ల స్థిరపరచుకొను పలుకుల నైన నలూకునిచే గబరంపియుండిన నన్నింటికన్న మిన్నగ నుండెడిదే! అదియును తలంచినావు కావు. అపనయమున పిట్టంచుకలుగలుకరింపక బంపినావు. నీ యులూకుని రాయబారమున నేమి ప్రయోజనము యోజించినావని తర్కించుకొనినచో నేమియు ప్రయోజనము తేకుసరికిఁదోడు పాండవులకు మఱింత యుద్రేకము గలుగుటకును, గాఁగల కార్యములను మఱింత త్వరపెట్టుటకును మాత్రమే గుఱిచేసిన ట్లగపడుచున్నది.

ధర్మజుని యౌవరాజపదవికి నీ చూపోపమియు, అనంతర మాతనియర్ధరాజ్యాభిషేకమునకు నీయంగీకరింపమియు, నాతని రాజసూయంపు కలిమికి నీ యోర్వలేమియు, ఆ మయసభను నీ వొందిన జారపాటులకు ద్రౌపది నగినదనిన నీ పరిభవమున కోర్వఁజాలమియు, నిన్నెంత ప్రజప్పటలకైన నొందఁజేయుచున్నవి. ఇదియొంబుఁగక, నినుగూర్చియు, నీ సత్వంపుదన్ననగూర్చియు విచారింతుమని "సుయోధనవిజయ" మని "దుర్యోధనవిజయ" మని పలుకాడువారి నేమనవలయు!

ఇంతకును అంతము జూచినఁగాని వీడని నినుగూర్చి కాలము వృథ సేయుటకన్న నీవలనఁ జెడనున్న నీతండ్రి సంజయునితో నేమనుచున్నాఁడో వినఁ బోయెదము లే! నీ గుట్టు బయల్పడక పోదు లే అప్పుడైనను!

# రాయబారము

## ఏడవ ప్రకరణము

**పాండవశిబిరము :**

— ధర్మజుఁడు —

అర్జునా, వింటివా, మనచారులు దెలిపిన యంశములు! దుర్యోధనుండు తనసేనానాయకులను, సర్వసేనానాయకుండగు భీష్ముని రావించి, మనసేనల నెల్ల నుల్లఁజేసి సమయింప వారిలో నొక్కొక్కని కెంతెంత కాలము సాలునో, అడిగి తెలిసికొని యానందించినాఁడఁట! ససైన్యంబుగ మనల సమయింప మనభీష్ముం డొక నెలయు, ద్రోణుం డొక నెలయుఁ, గృపుండు రెట్టియుఁ, గృపికొడుకు పదిదినములును, బాహువీర్యఘనుండగు కర్ణుం డైదుదినములును మనలను మాపఁజేయఁ గడువుఁ గోరిరఁట!

— అర్జునుఁడు —

అగ్రజా, యిపుడు నీనుడివిన వారందఱును నంతింతవారలు కాకపోయిరే! ఇంతకును రాజు నెదుట నంతలు బోసలు సలిపి చెప్పుట యొప్పని పనికదా?

ఇఁక మనబలంబులఁగూర్చి నీమనంబున ననయము వేధించుచున్న యనుమానము వాయ నే నొక్కమాటయె చెప్పఁదలంచితిని. యదుకులనాథుని సాధనముగఁ జేసికొని నాచేవఁ జూపి దేవదానవ సహితంబగు నీ ముల్లోకంబుల నొక్కత్రుటి పాటున నిట్టె చూర్ణంబు గావింపఁగలను. అది యెట్లనువుపడునని దలంతువేని, వెనుకటిసంఘటన మొకటి నీకు జ్ఞప్తికిఁ దెత్తును. మున్ను పశుపతి నాభుజపరాక్రమమును, శరవిన్యాసశక్తియుఁ బరీక్షింపఁ గృత్రిమకిరాతరూపమునఁ బందికై నాతోఁ బవర మొనర్చి తా నలసిపోయి తుదకు నను మెచ్చి జగత్సంహారసమయమునఁ దాఁ బ్రయోగించునట్టి పాశుపతమహాస్త్రము నా కనుగ్రహించి, యొసంగుట నా యందది సన్నిహితంబై యున్నకతన, శత్రునిరాసం బనాయాసంబయి యుండును. అట్టి పాశుపతమహాస్త్ర మహనీయ ప్రభావంబు భీష్మద్రోణ కృపాశ్వత్థామలె యెఱుంగరన నిఁక గర్ణున కెఱుంగ నెట్టు లనువుపడఁగలదు! కాని అనన్యగతికంబగు నవసరంబు కలుగకమునుపె, సమస్తంబును సమయింపఁజేయగలట్టి ఘోరసాధనంబుఁ బ్రయోగించుట యుక్తంబు కాదని, తక్కటి యాయుధంబులం బ్రయోగించి ధర్మమార్గంబున శత్రునిబర్హణం బొనర్చి పౌరుషంబు దీపింపఁజేసెద: సమరంబున సందిగ్ధావస్థలు దటస్థించుపట్టుల, నప్పటికివలయు విధంబులు సేయుచుందును. శత్రుసంహారక్రియాకలనవలన నీవు దిగులొందుచుఁ బలవింపం బనిలేదు. ఇంతియగాక యిచ్చటి నీవారచ్చటి యేరికిఁదక్కువ? మనకడనున్నవారందఱును వీరాధివీరులు-

అతిరథులును మహారథులును నగు వీరాధివీరులు. ఇంతటిమాట యట్లుండనిచ్చి, దివిజులకుంగూడ నజేయుండవగు, త్రిభువనంబుల నెదురులేని విక్రమోపేతుండవును నగు నీవు నేనుండఁగా వేఱె, నిను నీవ యెఱుంగమి యింతచింతయుఁ గలుగుచున్నది. మనకు విజయానందంబు సులభంబని తలంపుము. — (శ్రవణము నభినయించుచు)

అదె పాంచజన్యంబు వినవచ్చుచున్నది! శ్రీకృష్ణుం డిదె పిలుచుచున్నట్లున్నది. అదియె విజయానందసూచకమౌ చిహ్నముగాఁ దలంపుము

అని శ్రీకృష్ణున కెదురుగ నర్జునుం డరుదెంచి, యాతిథ్య మిచ్చి, మ్రొక్కి నిలిచెను.

— కృష్ణుఁడు —

ఫల్గునా, నేఁడే యుద్ధప్రారంభమనియుఁ, గౌరవసేనలెల్ల బలసి కోలాహలముగ వెడలివిరిసియున్నదనియు నీకు మనమును స్వసైన్యముగఁ బొలికలనికి నడుపఁదలఁచుచున్న దనియు నెఱుంగకయా యేమి యీ యిష్టాగోష్ఠి!

— అర్జునుఁడు —

మనుష్యులను, మా సేనలను నిర్మూలింప నెవ్వరెవరి కెంతెంతకాలము కావలయునో తెలియఁగోరి సుయోధనుండు పెద్దవీరులఁ జేర్వఁ బిలిచి యడిగి తెలిసికొనెనట!

— కృష్ణుఁడు —

అతం డట్లుల తెలిసికొనియెం గావున నీ కౌంతేయాగ్రజుండును కౌరవ బలంబులనెల్ల విధ్వంసము సేయనగ్ని నీ కెంతకాలంబు వలయునని యడిగెనా యేమి?

— అర్జునుఁడు —

కాదా మఱి— అట్లడుగఁడగదా! మాయన్నకు మాత్రము ధైర్యము నొసంగఁదగిన నిమదుదార్ఢ్యతి వలదా! అం దేమి దోస మున్నది?

— కృష్ణుఁడు —

యుధిష్ఠిరుం డడుగుటయందును దప్పులేదు. నీవుఁ దోచిన ప్రత్యుత్తరం బొసంగుటయందును దప్పులేదు. చాలు— మఱి జాగుసేయకుము. లెమ్ము; కవచధారివై బాణతూణీరమ్ముల ధరియించి, ధర్మజునకు మ్రొక్కి రథారోహణం బొనరుపుము. స్వసైన్యంబుగ సేనానాయకులందఱును సమరక్షోణీముఖులై పోవుచున్నారు. ధృష్టద్యుమ్నాదులు సమరప్రారంభమున కనుజ్ఞ నొసంగు శంఖారావంబుల కెదురుచూచుచున్నారు. భీష్మశంఖారావము వినరాక పూర్వమే మనమట నిలువవలెను.

అర్జునుఁడు ధర్మజునకు సాగిలి మ్రొక్కి— యుధిష్ఠిరప్రభూ, నీయాజ్ఞానువర్తులమయి సమరాంగణం జేరఁబోవుచున్నాము— అని కృష్ణసహితుండయి నడలెను.

# రాయబారము

## ఎనిమిదవ ప్రకరణము

— ధృతరాష్ట్రుఁడు —

సంజయా, ఉలూకునిచే నాకొడుకు పాండవేయులకడ కనిపిన నోరిచేటులకు వా రొసంగిన ప్రత్యుత్తరములు నాకుఁ దెలిపితివి. చివరవఱకునుఁ బాండవులదెసఁ దనకుఁగల బగల వెలువఱచుచు, నాసుతుఁడు తిట్టుంబలుకులు మానినాఁడుకాఁడు. ఉలూకునితోఁ గృష్ణుం డెంత తీవ్రముగ నాడెనో, అంతతీవ్రముగ కార్యములను జేయఁగల సమర్థుఁడు. నాకొడు కెవ రెన్నివిధాల ధర్మమార్గ మనుసరింపుమని కోరినను రానయియున్న వినాశహేతువునఁ గావలయుఁ బాండవుల కింతయిడుటయన నొల్లకున్నాఁడు. ఇఁక నా కొడుకులకు బ్రదుకెక్కడి దని, యహోరాత్రములను దుఃఖించుచు, ధర్మమే జయమందు నని, యూరకుండుటకంటె నింకేమి సేయఁగలను!

— సంజయుఁడు —

ఇట్లెల్లవేళలను నీకొడుకుపయిఁ దప్పుమోపి, నీవుగాఁ దప్పించుకొనఁ జూచుచుందువు. ఇది నీకుఁ దగదు. నీవలని తప్పు నీవు తెలిసికొనఁజాలకుంటివో; దాని నొరు లెఱింగియుంట నీ వెఱుంగవో! నీయందున్న లోపము నొరు లెత్తిచూపిన నెఱుంగనివాఁడుంబోలెఁ బ్రవర్తింతువు. ఇది కా దందువయేని నీ వెఱుంగకుండఁ బాప మప్పాండుసుతుల నీకొడు కంతంతలు సేసియుండెనే! జరిగినవంతయు నెఱింగిన వారొకమాటనె నీ విట్లుపలుకుచుండ, నిఁక నొరులయొద్దమాటఁ దలంప నేల! నీ నయనేంద్రియ మాంధతనొందినను, జరుగుచున్నదియు, జరుగనయియున్నదియు కార్యకారణముల సమన్వయపఱచికొనుచు జ్ఞానేంద్రియముచేఁ దెలిసికొనఁగలవాఁడవు, పాప మనురాగాంధతచే నీవు కొడుకువలదినవాఁడవగుట, నేయఁదగినది యెఱింగియు, సుతుమతి కది విరుద్ధంబని యెంచి యేమియుఁ జేయఁజాలకున్నావు. పాండుసుతుల బలపరాక్రమంబులు వినుచున్నంతసేపును, భీముని గదావిహారము నీ హృదయమునకుఁ దట్టినంతవట్టును బాండుకుమారులె జయింతురనియు నీ కొడుకులకు పరాజయమనియు మదినిశ్చయించి తలంకుచుందువు. నీతనయుని సామర్థ్యాతిశయాభివర్ణనము నీవు వినుచున్నంతదడవును, నీ కుమారకవర్గమె జయించుననియుఁ బాండుపుత్రచయమె పరాజయమొందుననియుఁ దలంచుచుందువు. ఇట్లొకతెన్నునఁ బోఁజాలకున్నావు. ఇంతతో నాఁగక లోకము నినుగూర్చి చెడుగుఁ దలంపకుండుకొఱకు

నీమనమున నీ వొందుచున్న ఆరాట మెన్నిముఖములనో అప్రయత్నముగ వెలువడుచు నేయున్నది. అట్లగుట నిక దా:—

కృష్ణుఁడు నీతోఁ దొలిపలికినయపుడు గాంధారిని సభకురప్పించి, నీకొడుకునకు నీతులుగఱపఁజేయుసమయాన నీయందున్న భారము దించికొనుటను నీకొడుకుపయి నేరము మోప నెంచితివి? అట్లయ్యును, గాంధారి సభకే తెంచి, పాలకుఁడవుగా నీకుఁ గల స్వేచ్ఛ, తండ్రివిగా నీకుఁగల స్వాతంత్ర్యము, కురువృద్ధుఁడవుగా నీయందవ హితమయియున్న యుత్తరవాదిత్వము నీకు సుబోధకముగానెంచి నీయందున్న బాధ్యతనెల్లఁ దెల్లమొనర్చెను. అంతతో నీయం దదివఱకుండిన భారము ద్విగుణీకృతముకాలేదా! నీ వాచరింపవలసియుండియు నట్లాచరింపని కార్యములును, నీ వుపేక్షింపరానివయియుండియు, నీవుపేక్షించిన ఘట్టములును, ఇంకను కృష్ణాదులకు సువ్యక్తములు కాకపోలేదని నీ వెఱుంగక కానోపు, పాపము మఱలిపోవుచున్న కృష్ణుని వెంటనంటి [1]నీవనినమాటలు మాకుజ్ఞప్తి లేకపోలేదు. ప్రజ్ఞాచక్షుండనగు నిను బోల్చుకొనఁజాలండని నీవు తలంచుట నట్లుంటివి. కాని, విశ్వచక్షుఁడు కృష్ణుం డని నీ వెఱింగియుండేని నట్లనియుండవు. కాని [2]కృష్ణుఁ డయ్యుత్తరక్షణమున నేమనియెనో మఱచితివే? కృష్ణుం డదియంతయు గ్రహించియె మనలనువీడి కుంతియింటికి వెడలినాఁడు. నివు నాతో, "ధర్మో జయతి యని యూరకుండునాఁడ" నని మఱి యనకుము. నీ వేమనుచు నూరకున్నను, నింతకాలమును, నీ వుపేక్షించిన కార్యములును, నీ వాచరించిన అకార్యములును, వాటివాటి పర్యవసానములయందు తదనురూపఫలముల నందఁజేయకమానవు. ఇపుడు నడచుచున్న కార్యకలాపమున నేది ధర్మమో యేది యధర్మమో యెఱింగియే- ధర్మోజయతి- యని యనుచున్నావో, కార్య మకార్యముగను, తారుమారుగను, దలంచి ధర్మోజయతి యని తలంచుచున్నావో కాని, నీవు పొరపాటొందుచున్నావు సుమా!

— ధృతరాష్ట్రుఁడు —

సంజయా, నీవింతదూరము చెప్పుచుంటివి, మఱి దాపరికమేల? మది నరమర వీడి చెప్పెదను వినుము.

నాతమ్ముఁడు లేకున్నను, అతనియెడ నాకుఁ బ్రేమ లేకపోలేదు. సహజముగా ధర్మజువర్తనము పండితజనవంద్యముగుటను, నాతఁడు కురుకులమునకు మండనాయమానుండగుటను, నాకొడుకులకన్న మిన్నగ నే నాతని నెంచి తొలుదొల్త నాతని

1 రాయబారము పుట 275.  2 రాయబారము పుట 276.

యౌవరాజ్యమున కభిషిక్తునిగా నొనర్చితిని! కాని నాకొడుకుమతి నతిక్రమింపఁజాలక పాండవులను వారణావతమున కనిపితిని. దానంజేసి తదనంతరచర్య లన్నియు నడచుట యసత్యముకాదు. ఐనను సంజయా, ఒక్కటిమాత్రము సత్యముసుమా: పాండవేయు లెంతబాగుపడిన నే నంత సంతసింతును. కాని నాకొడుకులు నశించి వారేమాత్రము బాగుపడినను, నే నోర్వఁజాలను. మఱియు నాకొడుకులకు వినాశహేతుభూతమయ్యేనేని, వారి మనికియై యియ్యకొనఁజాల. నాకొడుకులఁ గడతేర్ప నెంచియున్న వా రెట్టివారైనను నే సహింపఁజాలమియు,-వంశనాశనకరుండే యగుఁగాక- ధర్మశాస్త్రములు చెప్పినవని, కొడుకును ద్యజింపఁజాలమియుఁ, నాయందుండు లోపములని మీరందఱు నాడ సాహసించుచున్నారు. కాని, వంశదూషకుండని తన మేనమామ యగు కంసునివధియింపఁ గృష్ణునకుఁ జేయాడినట్లు నాకొడుకును వధియింపఁ నాకుఁ జేయాడదు. కార్యాచరణము ఇతరుల కుపదేశించుటవంటి సుకరకార్యము కాదుసుమా! కావున నే కృష్ణుఁ డెంతెలు సెప్పినను, నే నేమియుఁ జేయంజాలక ధర్మోజయతి యని మిన్నకుంటి. జగత్ప్రభుండని, విశ్వనియంత యని, సృష్టిస్థితిలయకారణకారకుండని, మహద్వ్యఖ్యాతిఁగాంచినవాఁడుకదా యని కృష్ణు నే మనుటకును వీలుచిక్కకున్నది. కాని, కానిచో జగత్కంటకుండను కారణమున నే యాగాక, ప్రాగ్జ్యోతిషపురాధినాథుండగు నరకుని వధియింపఁబోయియు, నరకుఁడు దనకుమారుఁడనిలోకులనినంతమాత్రమున నెకద,తావధియింపఁజాలక, సాతని సవతితల్లియా సాత్రాజితిచే వధియింపఁజేసె. ఈమాట నే ననినచో యధఃకరణం బగునని వెనుకకు తగ్గవలసివచ్చుచున్నది. నరకు నట్టుల లోకకంటకుండని నాకొడు కనిపించుకొనలేదే! కృష్ణుఁడువలచిన పాండుకుమారులకు ధరణీభాగమీని యేకమాత్రకారణమున నాకొడు కెట్టుల లోకకంటకుండగును? రాజ్యపరిపాలన యందేమి, అర్థిజనంబుల కీవు లొసంగుట యందేమి, తన లక్ష్మణకుమారునట్టులఁ బ్రజల సర్వవిధముల సంరక్షించుట యందేమి, పాండుకుమారవర్గమును ద్రోసిరాజనిపించుచునే యున్నాఁడే మాసుయోధనుఁడు! మీ కోరినరీతి నొనర్ప మావాఁ డిచ్చగింపమికి నేనే కారణమనియుఁ, జిన్ననాఁటనుండియు నేనే సుయోధనుని బెచ్చు పెరుగనిచ్చితి ననియు, మాయిరుగురను మీరందఱు నన్నన్నివేళల నిందించుచున్నారేకాని, ఒక్క లోకధర్మము మాత్ర మాలోచింపఁజాలకున్నారు.

ఎంతకాలమువఱకును లోకమునఁదమపిల్లలు జననీజనకుల మాటలఁ జవదాటరో, అంత కాలమును నాపిల్లలును, నామాట దాటనేరేదు. పుత్రులకు యుక్తవయసువచ్చిన

పిదప, సుచిత్రాసునిచ్చి నాతో కలసి జీవింపని వారికిఁ దోఁచినపిదప, వారిచిన్నతనమున జననీజనకు లొనర్చిన కార్యములయందుఁ బుత్త్రులకు లోపములు పడినపిదప, వాని నెల్ల సవరింపవలె నని వారికిఁ దోఁచినపిదప, జననీజనకులు మఱి జీవింపకుండుట మేలగునంగాని కాకున్నఁ దా మొనర్చిన వెనుకటి కార్యముల కంతరాయములు గలి గించుచున్నారే పుత్త్రులని జనకులును, తమ స్వేచ్ఛకు జనకు లవరోధములు గల్పించుచున్నారే యని పుత్త్రులును, ఏహ్యపలసివచ్చుచుందురు. అట్లు పట నెకదా ము దుసలులగు జననీజనకులు లోకమునకే బాల్పడుటయుఁ, గొడుకులు లోకకంటకులై యుండుటయు సంభవించుచున్నది! లోకములో నందఱివలెనే నా కొడుకును తనకు బదేండ్ల వయసున, పండ్రెండ్రేడుగు నేను చాల చెడిసినవాఁడనని యోంచినాఁడు; తనకు బదునారేండ్లు పైఁబడఁగనే నాకుఁ దెలిసినంత దనకును దెలియునని తలంచినాఁడు; తన కిరువదేండ్లు వచ్చినవి- సరి - నాకన్నఁ దనకు ద్విగుణముగా దెలియునని నిర్ధారణ మొనర్చికొని యింటిలో కుటుంబకలహములు జనింప నేర్పరించినాఁడు. ఇవియంతయుఁ బురాకృత కర్మానుభవము కాకుండిన, నే నింతవృద్ధుండనయ్యు, నెవరి ననుసరించుటకని నే నింకను జీవించియుండుట! వాసుదేవుం డెవ్వారిని వరియించు, నెవ్వారలకే జయశ్రీ లభి యించునని నే నెఱుంగనివాఁడనుకాను; అట్లయ్యును, నా కొడుకుల విడుపోపమి నే నుపేక్షింపఁజాలమియె యింతవంతకుఁ గతంబయ్యె; కొడుకువలచిన వాఁడనియు, సుతువాఁడనియు, నను నీవును భీష్ముండునుంగూడ గడువాఱుమందురే కాని మాశంత నునకు భీష్మునట్టి కొడుకుగాక, సుయోధనునట్టి కొఱగాని కొడుకు, కులము జెరుపఁ బుట్టినకొడుకు, ఎవ రెంతజెప్పినను విననట్టి కొడుకు గలిగి, ఆ శంతనుఁడు ననుబోలి జనుసాంగుండయి, కాలముదీరి, కాటికి కాళ్లు సాచికొనిన తండ్రియె యయి, యిప్పటి పరిస్థితులే అప్పుడు వనకును దటస్థించియుండిన నేమయియుండెడివో! ఇట్టికష్టములఁ బడినవానికే కదా యిందున్న కష్టములు దెలియుట! ఇంతయును 'ఒకరీతి కర్మవిధాన మిథ్యావిలాసమయి, యింకొకటి కాకుండునే' యని మనసు కుదురఁ జేసికొని మిన్న కుండును. మిన్నకుండక నేఁజేయున దేమున్నదికనుక!

నా కన్నకొడుకును ద్వేషింపఁ జేసిన భగవంతుఁడో, భగవదవతారమో కాని, నా సుతు నే నట్లు విసర్జింపంగల హృదయకాఠిన్యతయు, సాహసమును దానే నా కొసంగవలదా! ఇంతయేల! నా కొడుకు మనసుఁ ద్రిప్పి, వానిం దన తెన్నునకేల మరల్ప రాదు! పరిస్థితులన్నియు నొక తెన్నునకు రాఁగలవే—!

నే నెంత దుఃఖించుచుంటినో, యెవని కెఱుక? ఇన్ని దుఃఖము బహిర్గవించు

చున్న నన్ను నిందించుటకంటె, పెద్దకాలము జీవించుచు నింకను అంతముదెలియక దుఃఖపడుచు, నెపు డేమి దుఃఖవార్తలు వినవలసివచ్చునో కద యని సదాసంశయించుచు నెపు డెప్పు డని చావున కెదురుచూచుచున్న నాకుఁ దడవులేని చావు గలుగున ట్లాశీర్వదించి పుణ్యముగట్టుకొనరాదో!

— సంజయుఁడు —

మే మెవరము నెట్టిపుణ్యమును గట్టుకొన నక్కఱలేదు. నీ వింతదూరము చెప్పినదియును పుత్రవ్యామోహావస్థను సమర్థించుకొనుచుఁ జెప్పినదియే యగును. ఈమాత్ర మెఱుంగక కాదు, దేశమునకును, కులమునకును, వంశమునకును, నాశన మాపాదించువాఁడు కొడుకైనను, వధ్యుఁడనియును, వర్జనీయుఁడనియును, అంటిమి. కాని లోకమునఁ గుమారు లందఱును భీష్ములు కారనియు, జనకు లందఱును శంతనులు కారనియు, మేమందఱ మెఱుంగక కా దిన్నినాళ్లును నీతో నింతదూరము ముచ్చటించుటకుఁగతంబు. నీ వనినను, అనకున్ననుంగూడ ధర్మమే జయమొందును లే!

— ధృతరాష్ట్రుఁడు —

కాటికిఁ గాళ్లుసాచుకొనియుండి, కూడనంతకాల మియ్యిలజీవించి, పెద్దల యెడఁ ననాదరముంజూపు కొడుకులుగల జనకుల బ్రదుకు లిట్లేయగును.

కాని సంజయా, యిపు డేకార్యక్రమము నడచుచున్నది ?

— సంజయుఁడు —

మఱి నడచుట కేమున్నది! ఏకార్యక్రమము మనసార నీ వభిమతించితివో అదియే నడచుచున్నది. ఇరువాఁగులవారును కురుజాంగలమునఁ బలసి విడిసియున్నారు. ఇదిమొద లెవ రెవ రెప్పు డెప్పుడు గతించిన నావార్తలు దెలుపుటకు నేనును, వినుటకు నీవును, సిద్ధపడు కార్యక్రమముదప్ప నింకేకార్యక్రమము మిగులఁగలదు!

వినియు విననివానింబోలె నాజీకు శ్రుతి నభినయించుచు మిన్నకుండెను.

సంజయుండును ఎప్పటి సంఘటనల నపుడు తెలుపుటకు ధృతరాష్ట్రు సమీపముననె కూరుచుండెను.

# రాయబారము.

## తొమ్మిదవ ప్రకరణము

### యుద్ధప్రారంభము—యుద్ధప్రదేశము.—

ఇప్పటి పాశ్చాత్య యుద్ధప్రదేశములవలెఁ గొన్ని మైళుల ప్రదేశము యుద్ధప్రదేశముగా నిర్ణీతముకాఁబడి యుండినట్లు, కౌరవపాండవ సైన్యములు విడిసియుండిన ఆ ప్రదేశము, నిర్ణీతము కాబడియుండలేదు. ఇప్పటి యుద్ధ సేనలు బ్రిటిషు ప్రభుత్వము క్రిందనున్న వన్నియు నొక్కెడ గుమిచేసి నిలువఁబెట్టిచూచిన నైనను, భారతయుద్ధ కాలమునాటి యొకదెస నిలచిన సైన్యభాగములో నెన్నవ వంతు కానగునో, యలనాటి కురుపాండవసైన్యములు నిలిచిన ప్రదేశపుపరిహద్దులు దిఙ్మాత్రముగా నైనను పరిశీలించి చూచినచో మనమే గ్రహింపగలము.

మొట్ట మొదటఁ గురుపాండవసమరసమయమునాటి భరతవర్షమిప్పటి పాశ్చాత్యలేఖరు లనుకొనుచున్నట్లు బ్రిటిషుఇండియా మాత్రమె కాదు.

(1) హిమాలయోత్తర భాగమున గల నేటి తిబేతులోనివగు, ఉత్తర కురుకాంభోజ, ఉలూక దేశములును,

(2) తూర్పున చైనా ఆసాందేశములలోనివగు ప్రాగ్జ్యోతిషమును

(3) మధ్య ఆసియా, ఆఫ్ఘనిస్థానములలోనివగు ఉశీనర, మద్ర, బాహ్లీక దేశములును,

భరత ఖండస్థరాజ్యములుగా నానాడు పరిగణింపబడినవి.

వేదకాలమునందును, మహాభారతకాలమునందును, నేమను మహాప్రసిద్ధినే పొందియున్న యీ కురుదేశమునే మనువును, మహాకవికాళిదాసునుంగూడ, బ్రహ్మావర్తమనియే వర్ణించియుండిరి. అట్టి యీ కురురాజ్యమునకు:—

1. ఉత్తరమున:—హిమాలయమును,
2. తూర్పున:—పాంచాలదేశములోని అహిచ్ఛత్రమును, మాకందియును కాంపిల్యము నను భాగములును,
3. దక్షిణమున:—మత్స్యదేశమును, నాడు మరుస్థలమని పిలువబడుచుండిన యిప్పటి రాజపుత్రస్థానపు ఎడారియును,
4. పశ్చిమమున:—నేటి కాంధహారు లేక కాంధార్, పశ్చిమోత్తర పరగణాల లోను, పంజాబులలోను గలసిన గాంధారదేశమును,

కలవు.

గాంధారదేశమునకు పశ్చిమోత్తరభాగములలో బాహ్లిక, మద్ర, కాశ్మీర ములును, నైఋతి దిక్కున: కేకయసింధు సౌవీర దేశములును, నేటి రాజపుత్ర స్థాన గుజరాతి దేశములలో నున్న మరుస్థలమను నెడారియు, మత్స్య త్రిగర్త దశార్ణ దేశములును, శూరసేన, అవంతి, సౌరాష్ట్ర దేశములును,
నేటి మాల్వా, మధ్యరాష్ట్ర భాగములలోనివి యగు నిషధ హైహయ, విదర్భ చేది, దక్షిణ కోసల దేశములును,
పాంచాలమునకుఁ దూర్పునఁ గాశీకోసలదేశములును,
బేహారు బంగాళా రాష్ట్రములలో విదేహ, మగధ, అంగ, వంగ, పుండ్ర దేశములును,
ఆసాం, చీనా బర్మా భాగములలోనిదగు ప్రాగ్జ్యోతిష రాజ్యమును,
ఉత్కళ ఆంధ్ర మహారాష్ట్ర దేశములలో కళింగాంధ్ర, మణిపుర శోణ మల్ల దేశముల భాగములును,
ద్రవిడ కర్ణాటక మళయాళ మహారాష్ట్ర భాగములలో చోళ పాండ్య కేరళ కొంకణ, సాల్వ దేశములును,
చేరియున్నవి.

మహాభారత యుద్ధమునఁ బదునెనిమిది యక్షౌహిణుల సైన్యము పోరి యుండెనా? అట్లయినచో నన్నిసైన్యములు నిలిచియుండుటకుఁ దగినచోటు కలదా యను సంశయ మేలని? ఉద్యోగపర్వమున 18వ అధ్యాయమున నీ విషయము వ్యాసుఁడు విస్పష్టము గావించియే యున్నాఁడు.

నేటి అలహాబాదు మొదలు రమారమి రాజపుత్రస్థానపు టెడారివరకును గల ప్రదేశమంతయు యుద్ధరంగమె. అందు వారణావతము, అహిచ్ఛత్రము, పంచ నదము, కురుజాంగలము, రోహితకారణ్యము, కాలకూటము, గంగాకూలములలోఁ గౌరవుల సైన్యము నన్నుబడి సుమారైదువందల మైళుల ప్రదేశము యుద్ధరంగమని సకృచ్ఛముగ వర్ణింపబడియుండ నింకను సంశయ మేల! అట్టి యుద్ధరంగము కౌరవులలోనివారగు భీష్మద్రోణాదులకుఁ బాండవుల లోనివారగు శిఖండి ధృష్ట ద్యుమ్నాదు లెదురుగ నొడ్డనములఁ దీర్చుచుండిరి. విచిత్రవీర్య చిత్రాంగదులవివాహ కాలమువాటి భీష్మునెడ పగదీర్చుకొనుటకు శిఖండియు, తన తండ్రిమాట దీర్ప ద్రోణునెడఁగల ప్రాఁబగఁదీర్చుకొన నాతనినవధియించుటకు ధృష్టద్యుమ్నుండును సమయముకొరకు వేచియుండి కేంద్రీకృత దృష్టులతో నుండిరి. ద్రోణునందొక గొప్ప యౌదార్యగుణము గణనీయమైయున్నది. ద్రుపదుని తనకు శత్రుఁడని యెఱిఁగి

యుండియు, నాతని పుత్రుండగు ధృష్టద్యుమ్నునకుం గూడ, తదితర రాజపుత్రుల తోపాటు అస్త్రవిద్యయం దమితకౌశల మొసంగఁజేసెను. ఇపుడీ యుద్ధమున స్వపక్ష పరపక్షములం జేరిన యోధవరులలో పెక్కండ్రు ఘనద్రోణాచార్యునొద్ద సుశిక్ష నొందిన వారే యగుచున్నారు.

కురుక్షేత్రమున నానాఁడా కౌరవపాండవభండనము జరిగిన నాటనుండియు ఆస్థలమున కేమి యంటుతగిలినదోగాని, (1) క్రీ॥శ॥ 1192 వ సంవత్సరమున పాని పట్టునొద్ద పృథ్వీరాజు మహమ్మదుఘోరీలకును, పిదప (2) క్రీ॥శ॥1526వ సంవత్సరమున స్థానేశ్వరమునొద్ద బేబరు యిబ్రహీంలోడీలకును అనంతరము (3) క్రీ॥శ॥ 1761వ సంవత్సరమున పానిపట్టునొద్ద మహారాష్ట్రులకును అహమదుఅబ్దాలిలకును, జరిగిన మహాఘోర యుద్ధములు హిందూదేశచరిత్రయందు ప్రసిద్ధిగాంచి ప్రతియుద్ధమునందును ప్రబల రక్తపాతమును, ప్రజాక్షయమును, మిక్కిలి ఘోరముగ కలిగించుచునే యుండెను.

అట్టి తావున మనదుర్యోధనుని సేనలును, తనకు సాయముసంగవచ్చిన రాజవరుల సేనలును నిలచి యుండ, ధర్మజు సేనలును, తత్పక్షమున సాయము సేయ దమతమ సేనలతో వచ్చిచేరిన జోదుల వరుసయు ప్రతిపక్షుల క్షణకాలమున కక్షతో గబళింపనెంచి నిలచియుండిరి.

అపు డట నెందు మాతమున్నను అందరును సాధారకనముతే! అందరును ఆబద్ధ తూణీరులే! అందరును ఆకలితకార్ముకులే! అందరును ఆమూఢరథులే!

రణభేరి మ్రోగుచుండెను. శ్రీకృష్ణుని పాంచజన్యధ్వానము, పంచభూతములును కలసిరాసియై తుక్కుముక్కలై తిరిగి లోకముల పరమాణువులం బోలె నెగిరింప నెంచి సంయుక్తధ్వాన మొనర్చినచో కలుగగల నిక్వణనము సృజియించియుండనో పునినదోపఁ జేయుచుండెను. అప్పటి శంఖారావములే మూరమున మున్న వారికి సంజ్ఞలయియుండెను. పాండవ వీరులందఱును యుద్ధభూమిం జేరినారు. అప్పటి సేనల నిలువరింపు ఇప్పటి మనము బోధపరచుకొనవలెనన్న ఆపారిభాషిక శబ్దములనే ఉపయోగ పఱచి వ్రాయుటకంటె సమరరంగము బహుభయంకరమై నెగడుచున్నదనినఁ జాలును.

---

ఇన్ని సైన్యములును చేరియుండిన స్థలమునుగూర్చి వ్యాసుడభివర్ణించుచు, సైంధవవధ నాడన్ని సైన్యముల నొక్కటిగా గూర్పవలసి వచ్చినప్పు డేనను గౌరవ సైన్యము పండ్రెండు యోజనములస్థలము నాక్రమించినదై యున్నదనినాఁడు. కావున ప్రదేశ పరిమితినిగూర్చిగాని, సైన్యముల నిలుకరింపు ప్రకారమునుగూర్చి గాని మఱి సంశయింపఁ బనిలేదు.

తొలి పాంచజన్యము నొత్తినాఁడు కృష్ణుఁడు. తనదేవదత్తము పూరించి దిక్కులం బ్రద్దలగునట్లొనర్చినాఁ డర్జునుండు. యుధిష్ఠిరుం డనంతవిజయము నూదినాఁడు. భీముఁడు పౌండ్రమును, నకులసహదేవులు సుఘోషమణిపుష్పకములం బూరించినారు. కౌరవపక్షమునంగూడ వీరజనోచితముగ శంఖారావములు వినవచ్చుచున్నవి. ఏక్షణమున ప్రారంభింపబడునో యుద్ధమని యెల్లరు నెదుళ్లు సూచుచుండిరి. అర్జును నమోఘ రథరథ్య ధనస్తూణీరసారథులం బరికించుచున్నాఁడు భీష్ముఁడు. శ్రీకృష్ణ నియంతుఁడై తనధనుర్బాణముల నొకటనుంచి, కవచమువీడి, రథంబుడిగ్గి, పాదచారియై, గ్రిక్కిరిసియున్న యిన్నిసేనల నడుమం ద్రోవఁజేసికొనుచు, యుధిష్ఠిరుండు భీష్ముంజేరి—'ఆర్యపితామహా, ఆచార్యా, నీ వలన నింతవారమై నెగడిన మాకు, కాలకర్మవశమునసంప్రాప్తించిన యీ యుద్ధప్రారంభమునకు సెలవొసంగి, మాకు జయముకలుగునట్లాశీర్వదించి పంపుము'—అని శాంతనవునకు నమస్కరించి, సవినయంబుగ నిలచెను.

భీష్ముం డాధర్మజుని సాదర దృక్కుల నవలోకించి యాశీర్వదించి, —ధర్మజా నీవిపుడిట్టులవచ్చుటయె నీ జయమునకుకారణమగు. నీకే జయము కలుగగలదు—అని ఆశీర్వదించి అర్జును నంపివేసినాఁడు. ఇదియంతయు జక్కఁగ గమనించుచునేయున్నాఁడు కృష్ణుఁడు.

*　　　*　　　*　　　*

ధర్మరాజా, ఏ సమయమున కేది ధర్మమో, అదిచక్కఁగ గుర్తెఱిఁగి, అట్లొనర్పఁగల మేటివని నిను ధర్మరాజనియందురా యని దోపఁజేయుచున్నది నీ ప్రతిపదమును! ఇపుడీవొనర్చినపని, ఈసమయమున నీపరిస్థితులకు ధర్మమైనదియె యగును. సన్నద్ధయుద్ధసమయాన పాదచారివై పోవుట యుద్ధభూమిని నిలచియున్న వారికబ్బురముగొల్పినది. ప్రతిపక్షముననున్న భీష్మునకు నమస్కరించుట దుర్యోధనపక్షమున నిలిచియున్న యెల్లరకును మేని గగుర్పాటొదవఁజేసినది; భీష్మునకు నమస్కరించుటయు, యుద్ధప్రారంభమున కాతని యనుమతి వడయఁగోరుచు సవినయంబుగ నిలచుటయు, నాతని సగము బలము దిగజారినది. ఇట్లంతవాని నిట్టె దుర్బలు నొనర్చినావు! ప్రతిపదమందును మానవ మానసతత్త్వవేదివయి బ్రవర్తించునీకు తత్త్వమునకు మీమాంసకుండు కృష్ణుండు నీకు గురుండు. ఔరా! యింకెట్లెట్టి ప్రభవింపఁజేయుదువో స్వవిజయదాయకములగు కార్యములు!

*　　　*　　　*　　　*

అక్షయతూణీరముల ధరియించి అకుంఠితధనువుంబూని అశ్వరత్నములంబూన్చిన దివ్య రథంబధిరోహించి నారాయణుండు సారథిగా నారథంబుగడపుచుండ, అర్జునుండు పాంచజన్యంబొత్తుచు సంగరావనింజేరినాఁడు. నలుదిక్కులం గలయఁ జూచినాఁడు. కురువృద్ధులందరను జూచినాఁడు. గురుజనమ్ములఁజూచినాఁడు. ఎందుజూచినను దవ వారే; తనయాప్తవర్గమే; తనమిత్రవర్గమే; తనబంధుకోటియే. అర్జునునిహృదయమున వికారోదయమయ్యెనన అనందేమి ప్రాకృతికమున్నది. ఆతనిముఖమునను నయ్యది ప్రతిబింబించినది. ఎక్కుపెట్టినవిల్లునుగూర్చినకోలయురథముననొకయోరగనువిడివేసినాఁడు. ముచ్చెమటలు వోసినవి. శరీరసంధులబలము సన్నగిల్లినది. గొంతుకపడి యూరినది. క్షణకాలమూరకుండి 'యదుకులశేఖరా, మతిగేనీయుద్ధము సేయఁజాలను. ఇందరు నా వారలఁ జంపుటకన్న మాఱల నడవులంజేరుటయే మేలు. ఇందర వధియించిన పాపము గట్టుకొని, భారతభూమిని వీరపురుష రాహిత్య మొనర్చి తన్మూలమున వర్ణసాంకర్య మొదవఁజేసి, పితృలోకముననున్న నా వారల నందఱకును గతులు లేకుండఁజేసి, నే నొందెడిదేమున్నది? దేవకీనందనా, మోహాంధచేతస్కుండనై సంశయాత్ముండనగు నాకజ్ఞానము దొలఁగఁ ద్రోసి, నన్నుద్ధరింపుము'' అనియర్జునుండనెను.

— కృష్ణుఁడు —

(తనలో) అన్నా, చిక్కు తెచ్చిపెట్టినాఁడే యింతవీరపురుషుఁడును! నే నెంత యనుకొనుచుంటినో, అంతయు నైనది. కాని "పితృలోకము—నరకము—పాపము'' అనుచున్నాఁడు: కావున ఆస్తికత్వమీతనియందు దొలంగలేదు. తనమోహాంధత బోఁదోలుమనుచున్నాఁడు: కావున నిదియె సమయము: ఈతఁడె తగినవాఁడు: నే నీతనికి, యిపుడే, యుపదేశింపవలెను.

(ప్రకాశముగా) అర్జునా, మంచిసమయమున నేకలిగినదే నీకీ నిర్వేదము ఏమో మహావీరుండ వనుకొంటిని: భారతభూమిని శాశ్వతముగ నీపేరు నిలువ గలదనుకొంటిని. బాణతూణీరముల విడిచి, చతికిలబడితివే!

పోనీగాని—నీతాతలు, తండ్రులు, గురులు— వీరిని జంపఁజేయాడవని యంటివి గదా, ఈ యుద్ధభూమిని వీరుకాక, ఖాండవమునంబలె వెరవారేరైన నీ యెదుట నిలిచి నీతో బోరనున్నచో, వారిని వధియించినచో ప్రాణహానికాదో! నీకు పాపము రాదో! నీకు నరకప్రాప్తిలేదో! ఎవరిని బోదువవచ్చితివోయీ యుద్ధభూమికి పటుపోటరినని—చాలుఁ చాలు— నీవును: నీ తొలివీరాలాపములును! అనార్య

జుష్టమై- అస్వర్గ్యమై- అకీర్తికరమును- నపకీర్తిప్రతిపాదకంబును- నగు పలుకులు నీ నోట వెలువడుట యెంత శోచనీయము !

— అర్జునుఁడు —

యుద్ధమున నావారిని జంపుకొనుటకంటె హేయమైన దింకేమికలదు ?

— కృష్ణుఁడు —

ఓహో, చాలా పెద్దమాటలు నేర్చినావే! వీరందఱును నీవారగున్న, తక్కిన వారు పెరవారనియుఁ దలంచుచున్నావో! సృష్టిలో మానవులందఱును ఒక్క మూల పురుషునుండి వచ్చినవార మేయని యెఱుంగకున్నావు. నీ వెవడవోయీ వీరిని జంపుటకు! ఇదివరకు నీ శరములంబడినవారందఱును నీవే చంపితిననుకొని గర్వించుచున్నావు: కావుననే యిపుడీ మోహాంధత నీ కొదవినది. నీవు చంపువాడవును- వీరు జచ్చువా గునా? ఏమివింత! నీతాతల నేరుజంపిరోయి! వారితండ్రితాతల నేరుజంపిరోయి! ఒకరు చంపుట- ఇంకొకరు చచ్చుట— వట్టిమాట! కొఱగానిమాట!! ఎవరి ధర్మము వా రాచరింపవలెనే గాని తక్కిన సంగతులతో నేమి ప్రయోజనము! శూద్రుఁడు కార్మికవృత్తు లేలచేయవలెనో, వైశ్యుఁడు వాణిజ్యము నేల నెఱపవలెనో, బ్రాహ్మణుఁడు ధర్మాధర్మముల నేల లోకమునకు బోధింపవలెనో, క్షత్రియుఁడందుకే యుద్ధము సేయవలెను. ఇట్లు స్వధర్మపరిరక్షణమే గాని యుద్ధముపాపకృత్యమెట్లగును? చెడినది- చెడునది- యీ శరీర మేగాని ఆత్మకాదాయెను. నిత్యమై శాశ్వతమైన జీవుని నెవరు చంపగలరు? వినశ్వరములగు శరీరము లెల్లప్పుడును నిమిత్త మాత్రములు. నాశనములేని జీవుఁడు మృతుఁడని గాని- నీవు చంపినజచ్చెనని గాని- నీ వవివేకమున దుఃఖించుటకంటె నీచమున్నదా? నీ విపుడు వీరిని యుద్ధమున జంపకున్న వీరందరు నీయిల నట్టెగట్టుకొని శాశ్వతముగ నూగుచునే యుందు రనుకొనుచున్నావో! ఏ యుద్ధమున నెవరుజంపిరోయీ నీపితామహప్రపితామహులను? చావునకు యుద్ధమే కావలెనను కొంటివో! కాలమాసన్నమయియున్నవారు నీవు యుద్ధముమానినను వారు చావక తప్పదు. ఇంతకును చీకు గుడ్డల విడచి నూతన వస్త్రముల ధరియించులాగున శిథిలమైయున్న యీపాతశరీరముల విడిచి కోమలమైన నూతనశరీరముల వారుధరించుటకీ వోర్వఁజాలవా? నీవు యుద్ధముచేసి వీరినందర జంపివేసినచో ధర్మనాశనమగు ననుచున్నావే గాని, నీ క్షత్రధర్మము చొప్పున నీ విపుడు యుద్ధ మొనర్పవేని నీ కది ధర్మహానికాదా: అందువలన నీకు పాపముఁరాదా? సర్వమును సిద్ధపఱచికొని,

## తొమ్మిదవ ప్రకరణము

రాజ్య కాంక్షతో యుద్ధము సేయవచ్చి పిఱికివై వెనుదీయుదువేని యిప్పుడీ వచ్చిన రాజులందఱును నిను గూర్చి యేమనుకొందురు? నీ కపకీర్తి తెచ్చుకొను గోరిక వాఁడవె నోయీ! తరువాత నా యవమానాగ్ని భరియింపగలవా? ఈ కనబడుచున్న వారి నందఱిం జూచి, వ్యామోహితుఁడ వగుచున్నావే గాని నీ విప్పుడు పోయి మఱల కందమూలాదులం దినుచు కాలము బుచ్చ నారంభించినను అదెంత కాలము సాగగలదు? ఆ జీవనము కలకాలము సాగఁజాలినదియే యైనచో నేల జనావాసములకు మఱలితిరి? యుద్ధమున కేల సిద్ధపడితిరి? వీరందఱును ఈనాఁటికే జచ్చియున్నారే; నీ వంతమాత్రము నిమిత్తముగా నిలిచియున్నందులకు—కాఁగలకార్యముం జేయుఁ దనకుఁ దాన నెరవేఱును. కావున నీ వెఱ్ఱి వెఱ్ఱి మాటలాపలనుంచి కార్యరంగమున నురుకుము.

అర్జు:—అట్లయినచో, యుద్ధము చేయవలసినదేనా! ఇది అకార్యముకాదా?

కృష్ణు:—కార్యాకార్యవిచక్షణ నీ కేల నోయి? నీకు సారథియందు విశ్వాసమున్న కదా నీవు సారథి ననుసరింతువు!

ఎవని కర్మఫలము వాఁ డనుభవించుటయు, ఎవని కర్మము వాఁ డాచరించుటయు విహితములు కావా? ఇక చావుమాట దలంతువేని, సంపూర్ణముగ కర్మక్షయమగువఱకును జన్మము పుట్టుచు నుండుట మెయి వాల్పులకెల్ల సాజము.

అర్జు:—అట్లయిన కర్మక్షయమగు టెట్లు?

కృష్ణు:—బ్రతికియున్నంతకాలమును నరునిఁ బ్రకృతి ప్రేరేపించుచుండును కదా; కావున నాతఁడు కర్మము నొనర్చుచునే యున్నాఁడు. కాని ఫలాపేక్ష లేకుండ, కర్మ మొనర్చుచుండువాని కర్మము క్షయమగుచుండును.

అర్జు:—ఏమి బావా, అట్లంటివి! ఫలాపేక్ష లేని కార్యమెవఁడైన నొనర్చునా? రాజ్యకాంక్షయే నాకు లేకుండిన నే నీయుద్ధమున కేల సంసిద్ధుండను కావలయును?

కృష్ణు:—లోకక్షేమము కాపాడవలసిన క్షత్రియుఁడు, రాజ్యభోగము లనుభవించుటకే జన్మించినాఁ డనుకొనుటవలన కలిగిన ప్రమాద మిది! ప్రజలను ధర్మానువర్తులనుగా వేసి అధర్మము నణగద్రోయుటే క్షత్రియునకు విహితకర్మము. అట్టి విహితకర్మము నొనర్చునప్పుడు ఫలాకాంక్ష యెట్టుల సమంజసంబగును? వివేకముగలవారు విహితకర్మ మొనర్చినామను సంతృప్తి నొందుదురు. విహితకర్మానుష్ఠానముకన్న ఫలాకాంక్ష యేమున్నది! విషయానంద ఫలాకాంక్ష పరిమాదప్రదమగుచుండ, విహితకర్మాచరణము ప్రమోదప్రదమగుచున్నది.

అధర్మముతో లోకము నిండినపుడెల్ల వివిధరూపములతో నే నవతరించి,

ధర్మసంస్థాపనము చేయుచుందును. కర్తను నేనే—భోక్తను నేనే; నేనే భగవంతుండను. ప్రపంచమిప్పు డధర్మముతో నిండియుండుటను నిను నిమిత్త మాత్రుఁడుగా నిలువఁబెట్టి అధర్మమును బోఁద్రోలి, ధర్మరాజ్యప్రతిష్ఠాపన మొనర్పఁ దలంచియున్నాను అందుకు నిమిత్తములకువారి నొక్కొక్కరి నొక్కొక్క ఘట్టమున నెంచి కార్యవిధానము నడిపించినాను. ఇపు డీసమయమున నిను నిమిత్తముగా నిలువఁజేసి, కార్యమునడిపించ దలంచినాను. అట్లు చేయుటకు, నీవు మహావీరుండవనియు నీమూలముననే ఇదియంతయు కౌశలముననని కావలయు తలంచుచు గర్వించుచున్నావు. పరిజాత్కుయ మిపుడెయియేతీరవలెను. నీవందుకు నిమిత్తమాత్రుఁడవు: తెనూమ్మలమునఁ గీర్తియు నీకొదవును. అంతమాత్రము నీవు నిలచియున్నం జాలును; తక్కినపనియంతయు నే నొనఁగూడఁజేసెద: ఫలముతో, కార్యవిధానముతో, నీకు నిమిత్తములేదు. కాని క్షత్రియుండవగు నీవు క్షాత్రధర్మముచొప్పున బ్రవర్తింపవేని, నీకు నరకము సిద్ధము ఇంతకును సారథిని నమ్మి ప్రవర్తించిన వానికి పాపము రాదు: నరకము లేదు: తెమ్ము—యుద్ధమునకు సిద్ధుఁడవు కమ్ము.

అనుచు కృష్ణుఁడు నర్జును గనుదమ్ముల దన కరపద్మమున మూసి తెఱచెను.

అర్జునుఁడును శ్రీకృష్ణునివిశ్వరూపము జూచి—'విరాడ్రూపా', యనుచు నెన్నో నుతులొనర్చినాఁడు. విశ్వాసము కుదిరినది.

* * *

మోహాంధకార మడంగుట, విడిచిన ధనుర్బాణము లర్జునుండు మరల ధరియించినాఁడు.—సరి—పటుపోటరియయినాఁడు.

* * *

శంఖారావములు చెవులు చిల్లులువోఁజేయుచున్నవి. నానాసేనాసంకులము, భీకరవీరజనారావములు, దిక్కులు ప్రతిధ్వనించుచున్నవి.

ఇంత భయంకరమగు భండనభూమిని మాటి మనము నిలువలేము.

వారిపోరాటము వారికే దగును—మన కేల నీగోల!

(సంపూర్ణము)

# పరిశిష్టము

## సింహావలోకనము.

యాదవకులశేఖరా, ధూర్తశిరోమణీ! ఇంతవఱకును నీయనుసరించిన కార్యక్రమము! నీరాయబారపు కలాపములో నీపని ముగిసినదని యనుకొంటిమి కాని యిప్పుడు దిగ్గున నిర్వేదములో నీవొక శాస్త్రరూపమున గొప్పసూత్రముల నిర్వచించి, యాతని యారాటముఁబోఁ గ్రోలి మానసము గుదురుపఱచి, యుద్ధమునకు బురికొల్పినావు. ఈ యూహలు నీ కానాటనె యుప్పతిల్లుచునేగద ఉత్తరాభిమన్యుల వివాహానంతరము తత్సభారంగము 1 సంగరసమారంభనారంగముగా నిటు నాగిత్యుతో ద్రుపదునితో చెప్పి, యాతని నాకసముపైకెగరునంతపట్టి యాతని పురోహితునే మొదటి రాయబారిగ నంపఁజేసినావు. ధార్తరాష్ట్రులకు ద్రుపదుని కడఁ బ్రాఁబగ కలదని నీ వెఱుంగుదువు. అట్లెఱింగియు ద్రుపదపురోహితునే రాయబారిగ నంచినావు. తొలి బ్రాహ్మణునే కురుసభ కనుపుటలోఁగూడ నీకార్యకౌశలము వెల్లడగుచున్నది. కౌరవపాండవులకుఁగల పరస్పరవిరోధములును, కురుపాంచాలములకుఁగల బ్రాఁబగలును బాగుగ నెఱింగినవాఁడీ పురోహితుఁడు. ఏమిచెప్పిపంపిన నంతియ చెప్పక అధికప్రసంగము సేయు స్వభావమువాఁడు. విప్రస్వభావముచేతనే శ్రుతికఠోరంబైన సంభాషణము సెప్పువాఁడు. తత్సంభాషణవిధానము విని కురువీరులు ధార్ష్ట్యమునఁ గినిసి దూతయైవచ్చిన బ్రాహ్మణుని నొగులఁజేసిరేని, కౌరవగౌరవము నశించును. బ్రాహ్మణహాని యొనర్చిరని ధార్తరాష్ట్రులను రాష్ట్రంపుఁ బ్రజలెల్ల నిందింతురు. తన్మూలమునఁగూడఁ బాండవులదెస యాశము సేకురఁగలదు అప్పుడప్పట్టున సాత్యకిప్రభృతుల మాట నొప్పక నొకదూతను పంపుటే మానియుండేని లోకపుసానుభూతి యింతసంపూర్ణముగా నొదవఁగూడదని నీ వెఱుంగకపోలేదు.

కృష్ణా, నీ వక్తృత్వమహిమముఁగూర్చి మేము తొలుదొలుతనే పరిముఖమున పరిశీలించియే యుంటిమి. మఱి యావిషయముఁగూర్చి యిట దలఁపంబనిలేదు. కాని 2 దుర్యోధనార్జును లేకకాలమ్మున నిను దర్శింపఁబోయినపుడు దుర్యోధనునకు నీ నారాయణగోపాలురబలము నిచ్చివేసి నీవుగా నర్జునునకు సాయముసేయంబోవు నపుడు పరమాప్తుండవయి యుండుమని, 3 "నిరాయుధుండనయి, సంగరారంభరహి

(1) రాయబారము 1-12; (2) ... ... 22-26; (3) ... ... 27;

తుండనగు నన్నుఁ గోరుకొనుట నీ కేమిప్రయోజనకారి యని యనుకొంటివి?'' యని యర్జునుతో నీ వనుటలో నీవు తలంచినది యేమి ట్లూహింతుము. "అన్యసహాయముపై నాధారపడకుము; స్వయంసహాయమే బలీయము" ని నీవుపాఠముచెప్పియుందువు. నీవు సాయుధుఁడవై అర్జునునకు సాయమొనర్తు ననినచో నాతఁడు నీపై నాధారపడి స్వప్రయత్నముల విరమించునని నీవు సంశయించియుండుటే సత్యమైనచో, మహా పరాక్రమశాలియగు అర్జునుఁడు నీ కప్పటున నిచ్చిన ప్రత్యుత్తరము చాలదా!

1 "యుద్ధమునకు నేను సహాయము కోరను. సుప్రసిద్ధుండవగు నీవే సమర మొనర్చినచో, యుద్ధమున నే నెంతశ్రమంపడినను పేరును బ్రతిష్ఠయూ నీవియె యగును.'' అని యాతఁడు నీతో నుడువుట నాశంకకు మఱి తావులేదు.

అనంతరము జరిగిన సంజయురాయబారముంగూర్చి యోచింతుమన్న నందును నీవు జోక్యము కలుగఁజేసికొనకపోలేదు. శుష్కప్రియోక్తులతో, శూన్యహస్తములతో—అది దౌత్యమో రాయబారమో కాని—నెఱపు మనిన సంభాషణవిధానమును సంజయుఁడు ధృతరాష్ట్రహృదయము పరిశీలించినవాఁడగుట నొకతెన్ను పట్టించినాడు. సంగరమునఁ దాఁ జాలక కాకున్నను, జనక్షయకారణంబగు యుద్ధమువలనఁ దా వడయు రక్తాన్నము నొల్లని ధర్మజుని మానసంపుఁదెన్నెఱింగిన సంజయుండు, యమనందనుని సంగరపరాఙ్ముఖునిగ నొనర్ప 2 నెన్నో యుపపత్తుల వెదకి వేదాంతవాక్యోపదేశమునఁ బాపము తనవిహితకర్మము నిర్వర్తించుకొనినాఁడు. అతఁడైనను 3 "కురురాజునొద్ద నొకరిమాట యింకొకరి కెక్కనివారు పెక్కండ్రు కలరు. అవినీతులును నీతిమంతులును సత్వసంపన్నులును దురహంకారులును నై కురుసభనున్నవారి నంతయును నం బనిలేదు. * * '' అని ధర్మజుతో నని తన దౌత్యము నిర్వర్తించినాఁడు. ఆ ప్రసంగానుసరమున వచ్చిన హేతువాదమున నీకు గోసరమును ధర్మజునకు గినుకయు జనించుటను, నీవు సంజయుతోఁ బ్రసంగింపవలసి వచ్చినది. నీ నపుడు ధర్మజుపలుకులను వ్యాఖ్యానము సేయఁబోయి, 4 'పాండవాగ్రజుని పలుకులకీతిఁ జూడ, సంధిపొసగదు కా యని తోచెడిని —' అని సంజయుతో నంటివి. 'అట్లగుట సంధికార్యంబు జయప్రదంబుగ నొనసాగఁజాలదని నే నెఱుంగుదు' నందువేమో? నీయెఱింగినంతవట్టు ధార్తరాష్ట్రు లిచ్చువన్నుకాంచి సంజయుం డెఱుంగడందువా? అట్లాతఁ డెఱుంగకుండెనేని,— 5 'దుశ్శీలురగు కౌరవులు

(1) రాయబారము 27; (2) ... ... 67, 70, 75; (3) ... ... 63;
(4) ... ... 78; (5) ... ... 70, 94.

మీరుఁ బాలికఁ జెఱఁదలంచిరేని ... .. ' అనియనం బనియేమి? పాండవేయులను ధార్తరాష్ట్రులిచ్చువారు కారని నీ వెంతయు నెఱుంగుదువో, సంజయుండును నంతియ యెఱుంగు. ఇఁక నీవనునది 1 సంజయోద్బోధితధర్మము నృపధర్మము కాదందువు. 2 బ్రాహ్మణధర్మ మందువు. నీవేమన్నను సంగరము బొనుపడకుండఁ జేయుటే సంజయునిదౌత్య పరమార్థముగా విస్పష్టమైనది. కాని యొకఁ డొకటి సేయబోవ నింకొకటి పనుకూడినట్లయినది. కురువీరుల బలాతిరేకముల పాండవేయులకుఁ దెలుపుటచే ధర్మజాదులకు మానసోద్రేకము జనింపఁజేసినాఁడు. అనంతరము కురువీరుల సమక్షమున పాండవ్యుల వీర్యాతిరేకముల నుగ్గించి చెప్పుటచే 3 మహామానియగు దుర్యోధనుని యహంకారాగ్నికి శత్రుజనవిక్రమోద్దీపనాజ్యముం దోఁడుజేసినాఁడు. ఇదియంతయు నప్రయత్నముగనో, అప్రత్యక్షముగనో, గాని జరిగిపోయినది.

ఇఁక నీ రాయబారమో బహుముఖమై, భిన్నభిన్నాశయములకు దావైనట్లు ప్రతిపదమందును స్పష్టమగుచున్నది.

సంజయుఁడు ధర్మజుతోఁ బ్రసంగించునపుడు, నీవు బ్రసక్తి కలుగఁజేసుకొన వలసిన యవసరము కలిగినంతనె అప్పటి కాసభను — 4 రాజులను యుద్ధము ధర్మ మగునా కాదా — యను ప్రశ్న ముప్పుట్టినమీఁదను—ధర్మజుఁ డొందందినమీఁద నెయ్యగుఁగాక— నీవందుకొని సంజయునితోఁ బ్రసంగించుటకు 5 'అతఁ డొప్పినను, ఒప్పకున్నను నేనీపని కట్టు న్యాయముగ నిచ్చెదను. ... ... ' అనియంటివి. అప్పటి కింకను పాండవాగ్రజుండు నిను గౌరవసభకనుపు నూహ పొందకున్నను, నీ చివరిమాటలతో ధర్మజున కట్టి యూఁత నొసంగినావు. నీవే 6 న్యాయముగఁ గౌరవసభకేగుదువని నంతనె ధర్మజునకు మఱింత సన్ను దొఱకినది. మఱియు నప్పట్టున నినుగాక వేఱొకని నాతఁ డెట్లా కురుసభ కనుప సాహసింపఁగలఁడు!

సంజయుండు మరలిన మరుదినమునఁ బాండవేయులు నినువరించి, కౌరవ సభకు నినుబుత్తెంచు నవసరమున ధర్మజాదు లొక్కొక్కరె నీతోఁ బలికిన పలుకులు నీవు చక్కఁగ గుర్తించితివి. వారివారి మనోవాసనల సంపూర్ణముగ గ్రహించితివి. కాని నిను జక్కఁగ నెఱుంగుట కాకొంతే యగ్రజున కేమాత్రమేని వశమయియుండ వలయునే కాని, తక్కొరు నినుగ్రహియింపనట్లు కానరాదు.

ఎల్లెని సంగ్రామంబు కానితెఱంగున గార్యసిద్ధియొనర్చుకొని రమ్మని ధర్మ

(1) (2) రాయబారము 73; (3) ... ... 141-170;
(4) ... ... 73; (5) ... ... 84; (6) ... ... 88;

జూడుము నినుగోరుచుండ, నీవాతనితోఁ గౌరవుల దుర్ణయంబులు చెప్పిచెప్పి-1 'ధార్త రాష్ట్రులిచ్చువారుకారు. సంగరముకాకతప్పదు' — అని నిశ్చయించియే వెడలితివి. అట్లగుటనెకదా, సంగరముతప్పదని నిశ్చయించిన నీయట్టిఁడు సంధివాక్యమ్ములు సెప్పఁబోరాదని పెక్కండ్రనుటకుఁ గతంబయ్యె. ఇంతకును సంధికిఁబోవుచున్న నిను భీమార్జునాదులు సంశయింపకపోలేదే! 2'ఏవిధముననైన నీవు సంధియె సమకూర్ప వలయు. అదియే మాకునువారికిని లోకమువారికిని సౌఖ్యావహంబగుట హితమగును' అని నృపవరుండు నీతోనన నీవాతనికిఁ గౌరవులదుర్ణయంబులు సెప్పి యాతని 3 నుద్రేకింపఁజేసిన పలుకులలో నీయూహలపోకడ బయల్పడకపోలేదే! 4 ధర్మజుఁడు సంధిఁజేసుకొనిరమ్మని నినుబుత్తెంచుటనట్లు కావించిరమ్మని నిన్నర్జునుండు సంభావింప నాతని కీవుభగోత్పదేశమొనర్చి, 5 హేతువాదములఁ దెల్పి, విరాటుపసలం జెట్టింప నర్జునుండువోయినప్పుడు భీష్ముండు దుర్యోధనునితోఁ జెప్పినతెఱంగును, దానికతం డుత్తరంబిచ్చినపోడిమియు, నీవు మఱలమఱలఁ గొనియాడుచు, మందెమేలములఁ బలికితివి. అమాయికుండని యెంచికాఁబోలును నకులుపలుకులకుఁ బ్రత్యుత్తరం బిచ్చినావుకావు: సహదేవుని సహజసాహిత్యంబు దెలుపు నాతనిపలుకులు నీమదికెక్కుటంగావలయు నూరకుంటివి. అట్లయ్యును నీమనమున నానందించియుండకపోవు!

ఇఁకమిగిలినది కృష్ణ: నామధేయసామ్యమున మీయిరువురు నొక్కటి యగుట యుచితంబయ్యె. 'వంచిపెద్దల నడియఁజాలక, గాజులుల్లేలనే మనసు గల్గుచునున్నదనిన ద్రోవది వీజడివై యాడినపలుకులకు నీ వామె నూఱడిలఁజేయఁ బలికినపట్టున, శత్రుసంహార మగుననియు, 6 నీయేడ్పుకోలందరియు కురునృపాలపుత్ర కళత్రంబులయేడ్పు లగుననియుఁ బలికి 7 "ఈజ్వాలపుణ్యలక్ష్మీసమేతులైన పాండు కుమారులు రిపుక్షయంబుసేసి అధికవైభవోపేతులగుట నీవు చూచెదవు: తడవులేదు. ఇది నిజంబు" అని యంటివి. ఇట్లు జరుగుటే నీయుద్దేశమని కొందరును, నీవనినట్లె జరుగుటచే నేదిజరుగకతప్పదో, అదియే మున్ముందుగ దెలిసికొని మఱియు నంటివని కొందరును బలుకుచుందురు. కాని యెవరేమన్నను, నీవుమాత్ర మిట్లెన్నిపట్టులనో స్పష్టముగనే నీమనోగతవిషయమును విశదీకరించితివి. ఇట్టిపట్టుల నన్నింటి నెత్తి చూచినచో, యుద్ధమే నీకభిమతమా యను సంశయముమాత్రము జనింపకమానదు.

పిమ్మట నీవు కరినగరముఁజేరఁబోయినది మొదలు కర్ణుని నీతోఁ దోడ్కొని

(1) రాయబారము 193–196; (2) ... ... 197; (3) ... .. 196;
(4) ... ... 199; (5) ... ... 196; (6) ... ... 205; (7) ... 206

వచ్చి యాతనితో మాటలాడి, యాతనినీడినంతదాఁక, నీవు నడిపించినవిధాన మరసిన నీపోకడ డిల్లముకాకపోదు. అడుగడుగునకును నీవు ధర్మసూక్ష్మముల నరయువాఁడవుగదాయని మదిం దలంకవలసివచ్చుచున్నదేకాని, కానిచో చెప్ప తగినవి లేకపోలేదు. నీవు స్వస్థానమున నుండఁగనె, నీవు కరినగరము వచ్చుచున్నావు కదాయని, నిను సంభావనసేయు తలంపున, ధృతరాష్ట్రసుయోధనులు నీకుఁ బ్రీతి పనిపిన కజ్జంబులును, బంగ్లును లోనుగాఁగల వానినెల్ల 1 వేష్యా ననుభవించిన పిదపంబు పలిపి యనుభవింపనొల్లనంటివి యందు దేమి తలంచియుందువు! పసపంపదయు దుర్యోధను నావాసంబున కేగినపు డాతఁడు నిను పంపుగాఁగోర 2 నీవు చెప్పినపలుకుల యందేమి భావముంచితివి! నీవుఁ బ్రాణసములైన పాండవుల కాతఁడు వైరియగుట, నీవును వైరియ యగుననియు, వైరియింట గుడువరానిదియు, మాపునకుఁ బోలిగుడుచువను, గట్టుము, వైకొనవనుంపగపనియు నోటిని, యింకెన్నెన్ని సూపనాయుస్సూక్తుల నెగడఁజేసి నీవు పాండవపక్షపాతివని నీయం దదివఱకే దుర్యోధనుఁడు పొందియున్న 3 పీపనెంపు మాటంతో వ్యక్తపఱచితివి. మాటమాటికిని, పాండవులయెడ దుర్యోధనాదులకుఁగల యలుకను బలపఱచు పలుకులే పలికితివి. నీవు కరినగరముఁజేరిన పిదప దుర్యోధనుతో ముఖాముఖిగాఁ బోరిపలుకులే నిరసములయ్యెఁగదా! అది మొదలుగ దుర్యోధనునకు నీయెడ ననాదరభావము కలిగినమాటయు నసత్యమే మున్నది! ని న్నాదరించి నిను బహూకరించి, నీయెడ బంధుప్రీతి నెఱపఁజేయఁ దలంచిన దుర్యోధనుని యుత్సాహంబునకు భంగంబు వాటిలఁజేయుటతో నాగక నీయెడ నాతఁడు విద్వేషమువహించునట్లు చేసితివి. ఇఁక కాకున్న దుర్యోధనుఁ డనుగ్రహసంప్రదాయముగల వాఁడగుట నాతని కన్నియు వక్క దోఁచుచుండునని సమర్థింతువేమో! అట్లయినను, ధార్తరాష్ట్రులోనసంగువారు కారని దుర్మార్గులని దెగడెంగియు నేల నీనరుపతికడ కఱుదెంచితివి! ఇందుకు నీసమాధానము మే మెఱుంగుదుములే! చేయఁదగిన విహితకర్మ మాచరించుటయును, దత్ఫలముపై నాసక్తి నొందకుండుటయును, మానవుని కర్మవిధానమని యనుటకు నీ వేమాత్రమును గొంకవనియు మే మెఱుంగుదుములే! నీయనుసంధానప్రయత్నమున సంధి కాకున్నను సంధిమాట నాసుయోధనుఁడు వినినను, వినకున్నను, మనస్సు నిశ్చింతమగుననియును, జనులందఱును పాండవులసేమమె కోరుదురనియు, దుర్యోధనాదుల నిందింతురనియు సామంతనృపాలురు పాండవులయెడ ననుకంపవహింతురనియు, శత్రురాజుల బలా

(1) రాయబారము 213; (2) ... ... 221-222; (3) ... ... 223;

బలసంపదం జూడవచ్చుననియు, ధర్మజుమానసమున నెలకొనియున్న యనుమానముం దీర్పవచ్చుననియుం, గురువృద్ధులును, ఆచార్యవర్గమును, పాండవులనె సంభావించున ట్లొనర్పవచ్చు ననియుంగూడ నెంచి సంధికార్యమునకని పోయియుందువు. నీవుగా సొచ్చి చెప్పకున్న లోకమువారలు నిను నిందింతురో కా యనితలంచి పోతివి. అనుసంధింపంబడినచో, సంధియే కావలెనని తలంచి, కురుసభం జేరియుందువు. నీవు కరినగరుంజేరిన తొలిరేయి కుడిచికూర్చుండి విదురుతో నిష్టాగోష్ఠిం బవరించుచు నీచెప్పిన దేమి? 1 నీయభిప్రాయ మెఱుంగఁగోరిన మాకు నీవు ధర్మజునితో నెఱిపిన సంభాషణవిధానము చాలును; 2 విదురునితో నీవనినవి చాలును; ఇంకను మే మెఱుంగఁగోరుదు మేని: ధృతరాష్ట్రునితో నీవు పలుకుచు దుర్యోధనుఁ డటనుండఁగనే, అతనిం జూచుచు 3 "—సుయోధనాదులకు—వీరలు" అని సుయోధనుం జూపుచు 'సధర్ములును, సమర్థులును గా'రనియు, నింకెన్నెన్నియో, నిందావాక్యము లానిండిన సభలో నాడి వారిని జిన్నఁబుచ్చితివి. సుయోధనుని వైరులగు పాండవుల, నందు నను 4 భీమసేనుం బొగడుచు సుయోధనుం దెగడితివి. వైరిజనవిక్రమంబాతఁడు విన సహించు ననియెంచియే యంతాడితివా? భీమాదులబాహుపరాక్రమం బుగ్గడించి నీవు దుర్యోధనుని బెదరఁగొట్టఁదలంచియే యుండినచో, నదియెల్ల దుర్యోధను నీర్ష్యా గుణమును వృద్ధిపరచుటకే యయినది కాని మఱి సంధికూర్చుటకు పనికివచ్చినది కాదు. ఇదియంతయుఁ జూచిన నీవు సంధి కాకుండుటకే ప్రయత్నించితి వనుటకు వీలగుచున్నది.

సుయోధను నీయొత్తంగినకన్న నాతని కన్నతల్లియగు 5 గాంధారియు నాతని గురుండగు 6 బలరాముండును, నాతని నెఱుంగకపోలేదు. అంతె యెఱుంగక కాదు ఉత్తరాభిమన్యుల వివాహానంతరమున వద్వివాహమంటపమునఁ జేరిన రాజులకూటమిని దుర్యోధనుకడకు దూతనంపుమాట వచ్చినయప్పుడు, అదూత కురుసభను నెఱపవలసిన సంభాషణవిధానముపట్ల బలరాముండు 7 "కౌరవేంద్రుని చిత్తవృత్తిం గనిపెట్టి విధేయుండై, వారిమనంబులు వీరిపైఁ బ్రాలునట్లు చేయుప్రసంగంబులు నెఱపి......" అనియనుటకుఁ గారణము. 8 దుర్యోధనుం దూఱక సవిశేషస్నేహబాంధవముల నెఱపి కార్యంబు చక్కనేసికొనవలయునని బలరాముండనుటకుఁ గారణంబు దుర్యోధనుని మహామానిగఁ జక్కఁగ నెఱింగియుంటయే. అటుకాదనియు, రాజ్యమునందు స్వత్వముగల వీరలు దుర్యోధనుకడ నింతగ్రిందగుకేల ననియు, నప్పటి కాసభం

(1) రాయబారము 194-195; (2) ... ... 226; (3) ... ... 235:
(4) ... ... 240; (5) ...... 263-269: (6), (7), (8) ...... 7.

జేసియున్న పెక్కండ్రు నకిరి. మృదుసంభాషణములవలనఁ దన యసమర్థతయే బయల్పడుననియెంచిరే కాని, కార్యసాధనము మఱియెంచినారు కారు. బలరాముని మాట యవలఁద్రోసినారు; ద్రుపదపురోహితుఁ గురుపతికడ కనిపినారు. ఆతఁ డెప్పటయటు దౌత్యమొనర్చినాఁడో కాని 1 బాహిష్కృతుఁడైనట్టు వెనుకకుఁబోయినాఁడు. అనంతరము కౌరవసభను దౌత్యమొనరింపవచ్చిన నీవును, ఆ 2 శాంతిబీజములను బలపఱచినావే కాని, దుర్యోధనుని మనోవాసనల నెఱింగియు మంచి సమున్నతమార్గము పట్టినావు కావు. కన్నతల్లియౌ గాంధారియైనను దుర్యోధనుని మనోవాసన నెఱుంగక పోయెనని యనుకొన వీలులేదు. 3 "శత్రుబలోద్యానమున దుర్యోధనుని జకితునిఁ జేయఁ బ్రయత్నించుట ప్రయోజనకారి కాఁజాలకుండుటయేకాక దోసము, పరిమాణప్రవమై నిష్పత్తిలఁగల" అని గాంధారి నుడివినదెల్ల గ్రహించినవారేగు మాత్రము దుర్యోధనుని మానసపుఁ గిన్నెలుంగఁజాలరు! అట్లగుట గాంధారీబలరాములె దుర్యోధనుని జక్కఁగ గుర్తించినవారయియున్నను, వారిరువురు పనిసేయుటకనువుపడినది కాదు. నీ వీకురుపాండవ వివాదమునఁ జేయఁదలఁచికొనినదాదిగ నిమఁ జక్కఁగ గుర్తించిరే బలరాముండే పక్షమును వహింప నొల్లక, తాఁ తటస్థముగా నియుండెను. దుర్యోధనుండు రాజ్యాలసాయముకొఱకు పోవుచు బలరాముఁ బర్వింప, నాతఁడు దుర్యోధనుతో — 4 "కృష్ణుని బాసి యే నొక్కనిముసము నుండఁజాలమియు, నాతనితో విరసంపుమాటలు పలుకఁజాలమియు నేనేమియు నవఁజాలక......... యేపక్షమును వహింపనైతి నని యనియెనే!" అట్లగుట దుర్యోధను నెఱింగిన గాంధారీబలరాములు జక్కని యూహాలనే పొందియుండిరనవలసి వచ్చుచున్నది. అట్లగుటను దుర్యోధనుని నీవు పోల్చికొనఁజాలనంటివను నూహ మాకు లేదు. గాంధారీబలరాము లాదుర్యోధను తెన్నెఱింగినవారగుట, సంధికార్య మొనఁగూడు విధానముఁ దామవలంబించి, యొకుల నవలంబింపుమనిరి. వారికన్నమున్నె దుర్యోధనుమార్గం బెఱింగినవాఁడవగుట నీ వేమార్గ మవలంబించిన నాతఁడు సంధి కీకొనమికిఁ దోఁడు, మఱింత చెలరేఁగి, కార్యభగ్నంబౌనకే దోషం గనో, అట్టి మార్గమునే అవలంబించితివి. సంధికిఁబోయినవానికి వలయు కార్యకౌశలము నీవు కురుసభం జూపలేదనువారికి, 'కాఁదగిన కార్యమునకు వలయు కార్యకౌశలమే చూపితి' నని నీవు ప్రత్యుత్తరం బొసంగ సంసిద్ధుండవె యగుదువు. ఏపర్యవసానము తన

(1) రాయబారము 191; (2) ... ... 1-16; (3) ... 263; (4) ... 33.

కోదవు నయ్యాదియొ రాఁదగినదనియు, విహితకార్య మొనర్చుటేగాని ఫలముతో నిమిత్తము లేదనియు, తత్పర్యవసానముం గూర్చి యూరాడ రాదనియు నుడువఁ గొంకని నీవు, కురుసభకు నిను ధర్మజుం డనుపుసమయాన నీతో నర్జునుండు, —1 ఫలసిద్ధి నొనగూర్పం దగు దైవము పగు నీవే పురుషుండవై సంధి సేయ ప్రయత్న మొనరించుచుండఁ గార్యము ఫలసిద్ధిం బడయకుండునే—" అనియు,—'కావని నట్లె యుండియుఁ గార్యంబులు ఫలసిద్ధిగాంచుచుండుట మే మెఱుంగ మే'—'నీ వొనరింపఁ బూనిన పనిని గీడు పుట్టునే!'—యనియు నీతో నన, నీ వదియెంత సమయస్ఫూర్తికల ప్రతిభాశాలివో కాని, చప్పున నాతనిపలుకుల మరలింపంబోయి కావలయు 2 'దైవ సహాయంబు లేనికార్యంబులు ఫలవంతంబులు కాఁజాలవు.' —— అనిపలికితివి. —3 అప్పటి తెరం గెఱ్ఱంగివత్తు నంటివి. దైవముచేత యెట్లగునో దాని నెఱుంగ— నంటివి. ఇట్లనుటయందును నీయూహలన్నియు సంగరపుఁదెస్సునె సూచించు చున్నవి. అది కాదందువేని, 4 "సహాయార్థము రాజులనెల్ల రావించి చివరను మమ్మును బిలువఁబంపుడు—" అని తొలిసంగరసమాలోచన సభయందుఁ బల్కి వెడలఁ గతం బేమి? అనంతర మీరాయబారము నెఱపవచ్చుచు, ధర్మజు నానఁ బ్రయాణోన్ముఖుండవగుచు, 5 "—కావున యుద్ధంబు సిద్ధంబు: ... ...నీ వనుత్సాహివి కావలదు. చతురంగబలంబుల నాయితంబు గావించుకొని, దొరలం బురికొల్పికొని, ఆలస్యంబులేక సంగరంబునకు సన్నాహంబు సేయుచుండవలయు—" నని చివర మాటలాడి, నీమనోనిశ్చయంబు నెలువరచినావు. అట్లగుట నీ పడుగడుగునకును యుద్ధమె సూచించినావా? సన్నద్ధపఱచినావా? పాండవులను యుద్ధానకె సన్నద్ధము కమ్మనినావు. సంధికిఁబోవువాని కట్టిమనోనిశ్చయముండ రాదను వారిమాటకేమి కాని, సుయోధనుచందమఱియ నీసంధికార్యము బోనుపడకున్నఁ బోనుపడకుండుఁగాక, కాని నీ ప్రసంగఫణితియు, నీ వాగ్ఝరీప్రకారంబును యుద్ధమునకే తగియుండెను; గాని, సంధిసేత కనుగుణమయియుండలేదు. కానిచోఁ దుట్టతుదకు కుంతిని దొలి దర్శింపఁబోయినపుడు నీచెప్పినమాటల కర్థమేమి? 6 "శత్రుకులోత్పాటన విధియాచరించి యున్నతరాజ్యాభిషేకోత్సవమందెదు వారిని నీ వనతికాలముననె మీ జేనకుతుకమ్మునఁ జూతువుగాక!—" అని నీవా కుంతితో ననలేవా! ఇట్లెంత

---

(1) రాయబారము 193; (2), (3) ... 200; (4) ... 12;
(5) ... 196; (6) ... 218.

కని నీయెడ దోసములెన్నుట యని పలంతువన్న, నీయన్నయా బలదేవుండె నిను 'దోషి' యనినాడని మాపాతకులనుటకు సిద్ధముగనున్నారు. నీస్వజనులె నినుగూర్చి చెప్పునప్పుడు 1 "ఇరువాగులవారిం జెగ్గువమని నే నెంత చెప్పినను, గృష్ణుండు నను వినండయ్యె. పలుకుపొం దెఱుంగనివారికి బూజావాక్యముల ననునయములం దెల్పి సంధిసేతమని యలిగి యేమని మగిడివచ్చినాండు మాకృష్ణుండు!" అని బలరాముం డనుచుండ, యింక మేమెట్లూరకుండగలము!

కాని యొకవిశేష మాబలరామువాక్యమునసే విస్ఫుటముగ గానవచ్చుచున్నది. ఆబలదేవుండే అదేఘట్టమున, 2"ఇంతకును మాకృష్ణున కెఱుకలేని ధర్మసూక్ష్మములు నాకుమాత్ర మెఱుంగవచ్చునా!" అని యనినాడు. అట్లనుట నాధర్మసూక్ష్మముల నీకార్యములందిమిడియున్న అంతసూత్రముల మేము బరీక్షింపబ్రయత్నింతుముగాక. ఎంతయో శ్రమంపడి సంపూర్ణప్రయత్నమొనర్చినయనంతరముంగూడ సంధియనువుపడకున్న మాఱుమిసేయవలయు ననుమాటగూడ ముందేనిశ్చయింతువు నీవు: నీయన్నకు రెండవపక్షము చక్షుగోచరమేకాదు. కృష్ణా, సంధికుదిరిపోవునేమో యను ననుమానమున, సంధి యనుసంధింపబడకుండుగాక యని, నీవెంతో పొరలితివనియును నను వారికెంత ప్రబలసాక్ష్యమున్నదనుచున్నారో, సంధియే జరుగవలె ననియు, తత్ప్రయత్నములే నడిపించితివనియు, ప్రకృతిదుర్లలితుల, వంచకుల, నొకద్రోవకుం దేం బ్రయత్నించుచు నెఱపు సంధికుదురకున్న నేమిజరుగవలెనో అదియు నీవెఱింగియుంట, నిట్లు కార్యక్రమము నడచినది యని యనుటకును నంతప్రబలసాక్ష్యమున్నది.

సంధిజరుగవలె నని, పాండవపక్షముననున్న నీశక్తిసామర్థ్యములు దెలుపంగోరియో, దుర్యోధను బంధనకార్యమునకు నీవు లొంగిపోయినచో, ధర్మజాదుల కపకీర్తియు, నీయసమర్థతబయల్పడుటయు దటస్థింపుమనని యెంచితివో, గాని నీవపుడట విశ్వరూపముం జూపుట సమంజసమును అప్రతర్క్యమును సంధిప్రయత్నములలో నిదియును ఒకరీతిని బలపరచునదే యగుచున్నది. అట్లే నీవు కర్ణుని కౌరవపక్షమునుండి చీల్చి పాండవపక్షమునకు రమ్మనియుంటివని యందుము. కాదందురేని, కర్ణునకు పాండవపక్షముననున్న ద్వేషోద్రేకదర్పిమను సడలించుటకే యగునందుము. ఇందు కేమందువు?

ధార్తరాష్ట్రహస్తగతమైన పాండునిరాజ్యభాగమనుదానిని, మఱల సము

(1) రాయబారము 327; (2) ... ... 328;

పార్జించి పాండవుల కంచఁజేయు ప్రయత్నమున నీకన్న, పాండవులయధీనమందున్న రాజ్యభాగము కౌరవుల కిప్పించుటలో శకునియే మిన్నయనిపించినాఁడనుచున్నారు. వంచనమార్గమున నెయగుగాక, మఱలమఱల దగవులు మొలకలెత్తిన నెత్తుగాక, గాని జీవహింపకాకుండ కార్యమొనర్చినాఁడు శకుని. నీవో, జీవహింసయగుటయు నసుర సంప్రదాయకులను, వంచకులను మఱికానరాకుండ జేయుటయు, దాయభాగపు దగవులు మఱి జాతముకాకుండ జేయుటయు, నెగడఁజేసినావు.

తుట్టతుదకు యుద్ధప్రారంభసమయమున నర్జునుండు దనకుఁ జేయాడదనియు, యుద్ధముసేయఁజాల ననియు ననినప్పుడు సైతము యుద్ధము నెఱపింపనేర్చినవె, నీవు గీతోపదేశ మొనర్చినానని నీయందొక భారము మోపఁబడినదిసుమా; కాని కొన్ని వైదికకారణములో అలౌకికకారణములో కనపరచి లౌకికకార్యము లొనర్పఁజేసినావు. అల్లేలోకమున నంపరు పెద్దలును-ఈకార్య మొనర్పనున్న నరకము ప్రాప్తించు- ననియు, -పాపమావహిలు- ననియు, జెప్పియే విహితకార్యము లొనర్పఁజేయుచున్నారు. అందు కొన్ని కొందరకును, మఱికొన్ని మఱికొందరకును బాధకములో సాధకములో అగుచునేయుండును. అల్లే అర్జును విషాదయోగము, అప్పటికార్యమును, కాలమును, పరిస్థితులును నీవును దర్శించుకొని యికకాకతప్పదనియు అయితీరవలెననియు నీకుఁదోచినది అర్జునునకు బోధించి అట్లా సమరమునొనర్పఁ జేసినావు. ఇది నీవుమాత్ర మెట్లుకాదనగలవు? నీవప్పు డర్జునున కాయుపదేశ మొనర్పకుండేని, ఆతఁడపు డాహవరంగమున కుఱుకఁజాలఁడు. మఱల నుపప్లావ్యమునకు మఱలును.—కాని యనంతరమాదరిద్రావస్థలో నుండజాలఁడు. సాటిరాజులలో దలవంపు ఘటిల్లును. కౌరవులయెడ దనమనమున నున్న సమ్మతిక మ్మత్తల్లె నిలచియె యుండును. మరల రేగును. అపుడాతనికిఁ దెన్నుగానరాదు. దుఃఖమునకుఁ గారణమగును. అట్టిపరిస్థితు లేర్పడనీయకుండఁ గాపాడుటే నీ ముఖ్యోద్దేశమగుట నెట్టి తెగింపుమాటలచేతనైనను, నీ వర్జునున కేమిబోధించినను, యెట్లు బోధించినను, అదియును సమయజ్ఞతయే యగును.

నీవు స్వార్థపరుండవయి పాండవులకు సాయమొసంగ బూనితివని యనుచున్నారు. నీయందు స్వార్థపరత యను దోసము నెన్నుచున్నారు. స్వార్థము కానిది లేదు; స్వార్థములేనివా డీయిల మనఁజాలఁడు. స్వార్థముతోఁ బ్రారంభింపబడనిది పరార్థమును జూపఁజాలము. స్వార్థపరార్థముల వ్యత్యాసములును, ప్రయో

జనములును, దౌత్యము ముగించుకొని, 1 ఉపప్లావ్యమునుండి కరిపురికి మరలుచుండిన సంజయుఁడు మార్గమధ్యమున వేగువానితో నెరపినసంభాషణమున మేమెఱింగితిమి. అనంతరము ధృతరాష్ట్రునకు విదురుఁడు 2 నీతులుగఱపుతెరవునంగూడ నీ స్వార్థమునుగూర్చిన ప్రసంగమును దెలిసికొనియుంటిమి.

ఆపన్నునుయమున నున్నవానిం జూచినయంతన మనసుగరఁగి, యాతిని నాయాపదనుండి విముక్తుంజేయు నంతపనుక మాకు మనసు బాధించుమనే యుండును. అరేఁకుస్థరింపఁబడిన తక్కణమె మామనసులు దేనికయాయి యుత్సాహపూరితములగుచుండును. కావున నాయాపన్నుస్ను నుద్ధరించుట యనుకార్యము మా మనసున నుత్పన్నంబైన బాధనడంచుకొనుట యను స్వార్థపరతను సూచించుమనే యున్నది కాని యిట్టి స్వార్థపరత లోకకళ్యాణప్రదమని, అన్యులు నిర్ణయించిరయే యుండుట, కృష్ణా, నీయందున్నదన్న స్వార్థపరత్వము లోకకళ్యాణప్రదమైన దగుట, సర్వజనసమాదరణీయమును, చిరస్మరణీయమును అగుచున్నది. ఇట్టి దృష్టిగల స్వార్థపరత్వము లోకమున నెల్లకాలములందును వాంఛనీయమె యగుచున్నది.

పద్మమువ జనియించుటో, పాలవెల్లిలో శయనించుటో, కానరానిస్వర్గపరివేళమున గాపురముండుటో, ప్రకృతినున్నవిశేషముల బారసీనాటకపు తెరలవలె మాటి మాటికి నిట్టె మూర్చివేయుచుండుటో సేయక, మాలో నొకఁడవుగా మాతృగర్భమునం జనియించి, పెరిగి పెద్దవాఁడవయి, అవంతీపురమున సాందీపునొద్ద నీవును సుచేలుండును, విద్యాభ్యాసము జేసినది మొదలు నీవు సకలకళావిశారదుండవయి, అఖిల విద్యాజాలసంవేదివయి సాందీపునొద్ద సెలవుగైకొని మగిడి స్వస్థానముంజేరినది మొదలు కంస నరక శిశుపాల దంతవక్త్ర జరాసంధ కాలయవనాదుల వధియింప నెఱపిన విధానములును, అందొక్కొక్క ఘట్టమున నీవు చూపినబుద్ధికుశలతయు మేము బరిశీలించి చూచియేయున్నాము.

వాసుదేవనామంబున నీవు భరతఖండంబున నపారమగు గీర్తిప్రతిష్టల నార్జించుచుండుటగాంచి, సహింపలేక కరవీరపురాధీశుండును, పౌండ్రనాయకుండును, పవిత్రమగునీనామమును ధరియించి యనిపిన వికారమును నప్రస్తుతమును నగు *రాయబారము లోకమెఱుంగకపోలేదే! అంతమాత్రమున వారధిపులుకాలేదే! నీవు క్రిందువడుటయు లేదే! కాని తుద కాస్పృగాలవాసుదేవుండును బౌండ్రకవాసుదేవుం

(1) రాయబారము 96; (2) ... ... 12‍1-121.

* ఉత్తరహరివంశము — నాచనసోమన.

## రాయబారము

డును బేరైన లేకమాసిపోలేదా! అట్లు సామ్యముగల నామముల ధరియించి లోకమును మోసపుచ్చదలంచిన వంచకుల నడంచుపట్ల నీనేర్పును బరిశీలించియేయున్నారము.

ఇట్లన్నిపట్టుల నీ విశేష శేముషీసనాథుండ వగుటచేతను, శత్రుజనములబారి నుండి దొలంగి సురక్షితముగా నుండుకొరకు ద్వారకకు రాజధానిని మార్పించుటయు లోనుగాగల రాజ్యతంత్రజ్ఞుల కుండవలసిన సుగుణసంపత్తియు, విద్యావైశద్యమును, మంత్రాంగవేత్తల కుండదగిన బుద్ధికుశలతయు నీయందు బొడసూపుటచేతను, ఆదర్శపురుషులగు శ్రీరామాదులవలె, నీవును ఆదర్శములం జెడనీయకుండ, వారినుండి భిన్నుండవయి బలక్షమాగుణములకు నడిమిమార్గమున ధర్మసూక్ష్మముల నెంచి చూపుచు, సంఘములో నపరాధములొనర్చు వంచకులనందఱ క్షమించినచో సమాజ మొక్కసారి ధ్వంసమయిపోవుననియు, సకలాపరాధులును శిక్షితులైనచో మానవకోటికిం బశుత్వమే ప్రాప్తించుననియు, నట్లగుట శిక్షాక్షమలమర్మ మెఱింగి తత్సామంజస్యమే ప్రధానమని ఆదర్శము, ఆచరణము.—నను నీరెంటికింగల అన్యోన్య సంబంధముం దెలుపు నెన్నో యుదాహరణములు నీ ప్రవర్తనమం దిమిడియుండుట చేతను, ఒక వైదికాచారమో కారణమో, చూపుచు, ఒక లౌకిక కార్యమొనర్పజేయుచుండుట యందు నీకుగల మహామహిమయుం జూచిజూచి, యింతవరకును నీతోం బ్రసంగించి, ప్రశంసించిన మేమును మాపాఠకులును, జాలయాయాసము నొందినాము. ఇప్పటి కింతతో సెలవుంగైకొని, యెంత తరచిచూచినను తనివితీరక యింకను మిగిలిపోవుచునేయున్న నీచరిత్రయే యొకగ్రంథముగా బ్రకటించి సఫలీకృతమనోరథుల మయి తరియించి మాపాఠకుల యామోదము నడసెదము.

ఓం తత్సత్.



# ఉపసంహారము

(ముడపాక పార్వతీశ్వరశాస్త్రి)

యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం॥
పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥
కర్మణా మనసా వాచా సర్వభూతేషు సర్వదా
అక్లేశవృత్తిర్యాప్రోక్తా త్వహింసా పరమర్షిభిః ॥
అహింసా పరమోధర్మో నాస్త్యహింసా పరంతపః
విధినాసా భవేద్ధింసా త్వహింసైవ ప్రకీర్తితా॥
పరద్రవ్యాపహరణం చౌర్యాద్వాథబలేనవా
స్తేయం తస్యానాచరణ మస్తేయం ధర్మసాధనం॥
కర్మణా మనసా వాచా, సర్వభూతేషు సర్వదా
అక్లేశవృత్తిర్యాప్రోక్తా త్వహింసా పరమర్షిభిః॥
పరద్రవ్యాపహరణం చౌర్యాద్వాథబలేన వా,
స్తేయం తస్యానాచరణ మస్తేయం ధర్మసాధనం॥

జన్మమెత్తినదాదిగ మనుష్యుఁడు సంపాదింపఁ దలఁచుకొను వానిలో ప్రధానమైనది యానందము.

ఆ యానంద సంపాదనమునకై మనుష్యుఁడు రెండుమార్గము లనుసరించుచుండును. అందు మొదటిది హింసామార్గము. రెండవది యహింసామార్గము. ఈ హింసామార్గమునకే స్తేయమార్గమనియు, నహింసామార్గమునకే యస్తేయమార్గమనియు, నామాంతరములు. చౌర్యమువలనగాని, బలమువలనగాని, పరద్రవ్యాపహరణము సేయుట స్తేయము. ఈమార్గము ననుసరించి లోకముల నాక్రమించుకొనువా రాసురసంపత్తిగలవారు. హిరణ్యకశిపు, రావణ ప్రముఖులీగణములోఁ జేరినవారు.

సర్వభూతములయందును, సర్వకాలములందును, క్లేశరహిత వృత్తితోఁ బ్రవర్తించుట యహింసామార్గము. ఈ మార్గమునఁ బ్రవర్తించువారు దైవసంపత్తిగలవారు. ప్రహ్లాద, వశిష్ఠ, జమదగ్ని, శుకాది ప్రభృతు లీగణములోఁ జేరినవారు. ఆసురసంపత్తిగల వారీమూఁడులోకముల నాక్రమించుకొనఁగలరు గాని, వారియధికారము లోకమునకు బాధకలిగించును గావున, వారిని లోకము చాల కాలము భరింపలేదు.

దైవసంపత్తిగలిగి, యహింసామార్గమునఁ బ్రవర్తించువారిని లోకము ప్రేమించుచుండునుగాని, వారు సాత్వికప్రవృత్తియే ప్రధాన వృత్తిగాఁగలవారగుటచే, రాజసతామసప్రవృత్తులతో నిండియుండు నీలోకము వారి మహాత్త్వము గ్రహింపలేదు. కావుననే, బ్రహ్మిష్ఠులగువా రరణ్యములలో నాశ్రమములు కల్పించుకొని, జ్ఞానయోగము నవలంబించి, ముక్తి చెందుచుండిరి.

ఆసురసంపత్తిగలవారిది కేవల కర్మమార్గము. దైవసంపత్తి గలవారిది కేవల జ్ఞానమార్గము. పర్యవసానమున నీరెండుమార్గములును లోకమునకుఁ బనికిరావనియే చెప్పవలెను. కావున, నీరెండు మార్గములకును మధ్యమార్గ మొకటికలదు. అది భక్తిమార్గము. ఈశ్వరార్పణబుద్ధితో కర్మమునాచరించుట దీనియందు ప్రధానము. ఈశ్వరార్పణబుద్ధితో మనుష్యుఁడుచేయు ప్రతికార్యమును లోకకళ్యాణప్రదమగుచుండును. గాన, నీమార్గమున,కర్మజ్ఞానమార్గములు రెండును గలసియున్నవి.

ఈమార్గము ననుసరింపవలసిన క్షత్త్రియులు యుద్ధముచేయవలసియున్నది. యుద్ధమున హింసకలదు. కాని లోకకళ్యాణమునకై చేయవలసివచ్చిన యుద్ధము భగవదర్పణబుద్ధితోఁ జేసినచో, నందు హింసయున్నను, అది యహింసాతుల్యమై లోకమునకును, భగవంతునకును, నామోదము కలిగించును. భగవదర్పణ బుద్ధితో

లోకకల్యాణమునకై మనుష్యులు కర్మమార్గమునఁ బ్రవర్తింపవలసి యున్నదను నీ మధ్యమార్గమును లోకమునకుఁ దెలియఁజేసిన మహాగ్రంథము శ్రీభగవద్గీత. ఈమార్గమును లోకమునఁ బ్రవర్తింప జేసిన మహాత్ముఁడు శ్రీకృష్ణుఁడు.

దైవాంశసంభూతుఁడును, క్షత్రియుఁడు నగు నర్జునుఁడు, అసురాంశసంభూతులగు కౌరవులతో యుద్ధముచేయవలసినచ్చినప్పుడు జ్ఞాతులయందలి మోహముచేఁ దత్కాలమున నర్జునునియందావేశించిన యహింసాప్రవృత్తిలోని లోపములను జూపుచు, భగవదర్పణబుద్ధితో నసురాంశసంభూతులగు కౌరవులను వధించుట లోకకళ్యాణకరమని చెప్పి, హింసారూపమైన యహింసామార్గము నుపదేశించి క్షత్రియుఁడగు నర్జునునిచే స్వకర్మమగు యుద్ధముచేయించుటకై యీ భగవద్గీతాశాస్త్రము శ్రీకృష్ణుఁడు ప్రవర్తింపఁజేసెను.

మహాత్ముఁడగు శ్రీకృష్ణుఁ డీనూతనమార్గము నర్జునున కుపదేశించుటమాత్రమేగాక, తాను బాల్యమునుండియు నామార్గముననే సంచరించి, లోకమున కాదర్శప్రాయుఁడయ్యెను గావున, గీతాశాస్త్రములోని ప్రధానమతము శ్రీకృష్ణుని ప్రవర్తనలో నెట్లున్నదియును బరీక్షింపవలయును.

ద్వాపరాంతమున భారతవర్షమునఁ బ్రధానస్థాన మాక్రమింపఁదలఁచుకొన్నవి రెండు రాజకుటుంబములు. అవి యాదవమాగధ రాజకుటుంబములు. యదువంశసంభూతుఁడగు శూరసేనుఁడు శూరసేనదేశమునకుఁ బ్రభువై మధురపర్యంతముగల దేశ మాక్రమించుకొని, మధురానగరము రాజధానిగా, యాదవుల నందఱను బరిపాలించెను. అతని కుమారుఁడగు వసుదేవుఁడు యాదవలోకమునకుఁ బ్రభువై, పెక్కు రాజకుటుంబములలోని కన్యకలను వివాహమాడి, యారాజకుటుంబములతో మైత్రిసంపాదించి, బలవంతుఁడై యుండెను.

## రా య బా ర ము

మగధదేశాధీశ్వరుఁడగు జరాసంధుఁడు గిరివ్రజము రాజధానిగా మాగధులను బరిపాలించుచుండి, భరతఖండమునఁ దన యధికారమును వ్యాపింపఁజేయుటకై పెక్కురురాజులతో మైత్రి గావించుకొనియు, పెక్కురురాజులను జంపియుఁ, బెక్కురను గారాగారమున నిలిపియు, బలవంతుండను ఖ్యాతిగడించెను. ప్రీతివలననేమి భీతివలననేమి, జరాసంధుని యధికారము మధురానగరము వరకును వ్యాపించెను గాని, మధురకు ప్రభువగు నుగ్రసేనుఁడు, తనయన్నగారి కుమార్తెలను వసుదేవున కిచ్చి వివాహముగావించి, మైత్రి చేసికొనుటచే, జరాసంధుని యధికారము మధురలో వ్యాపింపలేదు. జరాసంధుఁ డది సహింపక, యుగ్రసేనుని కుమారుఁడగు కంసునకుఁ దనకుమార్తెల నిచ్చి వివాహముచేసి, యాతనితో మైత్రి సంపాదించెను. జరాసంధుని యాదేశమున నేమరుపాటున నున్న వసుదేవుని నాతనిభార్యను దేవకిని, బంధించి, కారాగృహమున నుంచి, తండ్రి యగు నుగ్రసేనుని కారాగారమున నుంచి, కంసుఁడు తానే మధురానగరమునకు రాజయ్యెను. దీనితో జరాసంధుని యధికారము భరతవర్షమున పరిపూర్ణమయ్యెను. అతనితో సమానుఁడగు రాజు మఱియొక్కఁడు లేకుండెను. జరాసంధుఁడు హింసామార్గమునఁ బూర్వపు రాక్షసులందఱను బోలియుండెను. నిత్యమును భైరవపూజ సేయుచు భైరవునకు రాకొమరులను బలియిచ్చుచుండెను. బలియిచ్చుటకై రాజులను గారాగారమున సిద్ధముగా నుంచుచుండెను. జరాసంధుని యీహింసామార్గమునే యాతని మిత్రులగు కంస నరకాదులుగూడ నవలంబించియుండిరి.

కంసుని కారాగారమున నున్న వసుదేవుఁడు తనకు కారాగారమున జనించిన శ్రీకృష్ణుని తనమిత్రుఁడును, నాభీరుల ప్రభువును నగు నందునియింటఁ బెరుగునట్లుచేసి, యాతనికి యుక్తవయస్సు వచ్చినవెంటనే, కంసుని దుర్ణయములు నాతనికిఁ దెలియఁజెప్పించెను.

వెంటనే శ్రీకృష్ణుడు బయలుదేరివచ్చి, కంసుని బరిమార్చి, వసుదేవుని, నుగ్రసేనుని, కారాగారమునుండి విముక్తులను గావించి, యుగ్రసేనుని మధురకు రాజుగావించెను.

కంసుని మరణము లోకమునకుఁ గొంత బాధ తగ్గించెను. గాని, యది జరాసంధునకుఁ గోపముగల్గించి, యాదవులకు బాధను గల్గించెను.

శ్రీకృష్ణునిపైఁ గోపమున జరాసంధుఁడు పదునేడుపర్యాయములు మధురపై దండువెడలెను. కాని, యొక్కపర్యాయమైనను జరాసంధుఁడు మధురను ముట్టడింపలేక, శ్రీకృష్ణునిచేఁ బరాజితుఁడయ్యెను.

జరాసంధుఁడు కాలయవనునితో సంధిచేసికొని, యుభయులును గలసి మధురానగరమును ముట్టడించుటకై సిద్ధపడిరి. మ్లేచ్ఛసైన్యములతో కాలయవనుఁడు మధురానగరమును ముట్టడించెను. జరాసంధుఁడుకూడ వచ్చునట్లు కన్పట్టెను. వెంటనే శ్రీకృష్ణుఁ డీసంగతి గ్రహించి, సముద్రమధ్యమునఁగల ద్వారకానగరమునకు యాదవులను బంపి, జరాసంధుఁడువచ్చులోపల, కాలయవనుని మ్లేచ్ఛసైన్యములతోఁగూడ సంహరించెను. కావున, జరాసంధుని యీప్రయత్నముకూడ వ్యర్థమయ్యెను.

జరాసంధుడు జీవించునంతకాలము తనకును, యాదవులకును, లోకమునకును బాధతగ్గదని యాలోచించి శ్రీకృష్ణుఁడు తనకు బంధువులును, మిత్రులునునగు భీమార్జునులను తోడ్కొని గిరివ్రజమునఁ బ్రవేశించి, భీమునిచే జరాసంధుని మల్లయుద్ధమున జంపించి జరాసంధునికారాగారమునున్న రాజులందరిని విడిపించెను. అట్లే జరాసంధుని మిత్రుఁడగు నరకాసురుని సంహరించి యతనికారాగారమున నున్న రాజకన్యలను విడిపించెను. పిమ్మట లోక కంటకులగు శిశుపాల దంతవక్త్ర సృగాలాదులగు రాజులనుసంహరించి లోకోపకారమొనర్చెను. జరాసంధుని, దన్మిత్రులను వధించుటచే యాదవు

లందఱకును క్షేమముకలుగుటయేగాక, లోకమునకంతటికిని మేలు సమకూడెను. శ్రీకృష్ణుఁడవలంబించిన యీమార్గము హింసామార్గ మే యయ్యును, లోకమునకు బాధకలిగించుచున్నవారిని వధింప కున్నచో లోకమునకు శ్రేయస్సు కలుగఁజాలదు.

ఇంతలో కౌరవపాండవులకు ద్వేషకారణములు ప్రబలుచుం డెను. కౌరవపాండవ విరోధములను శ్రీకృష్ణుఁడే యొకసందర్భమున నీరీతిని క్షిప్తముగాఁ జెప్పెను.

సీ॥ దేవాంశభవులఁ గౌంతేయులఁ గల్యంశభవులు దుర్యోధన ప్రభృతు లహహ,
సహజవైరము గల్గి, శైశవంబాదిగాఁ బఱరాని బాధల పాలుఁజేసి
రనధికారికి రాజ్యమర్పించి తనభుజాబలమున బహురాజ్యముల గడించె,
నట్టి తమ్ముని పుత్త్రుఁడని ధర్మమున ధర్మసూనుని యువరాజుగా నొనర్చె
జనకుఁ డని వారికల్మికి సైపలేక, కైతవద్యూతమున వారి కల్మిబన్ని
నోడిసి, పాలైన నిడెనె దుర్యోధనుండు? వానికంటెను దులువ లెందైనఁగలరె?॥

సభకున్ ద్రౌపది నీడ్చితెచ్చి, యకటా, సభ్యుల్ వినన్, దుర్వచో
విభవంబేర్పడ, మానభంగమునకై విప్పించెఁ దద్వస్త్రముల్
శుభవృత్తంబు, సతీత్వ మత్తరుణిఁ దచ్ఛోకాబ్ధి దాటించె, నా
టి భృశాఘాగ్నియె ధార్తరాష్ట్రవనవాటం గాల్పఁగాఁ జాలదే?

కపటద్యూతమునం జయింపఁబడి, తత్ కౌంతేయు లెంతేనియున్
గృపణత్వంబున నున్నవారనుచు వారిన్ నవ్వ రారాజు, మి
త్రపరీతుండయి, ఘోషయాత్రఁ జని, గంధర్వుల్ దనుం గట్టఁగాఁ
గృపచే మున్విడిపించుమైనఁ గనెనే, హీనుల్ గృతఘ్నుల్ గదా.

గాంగేయాదు లెఱింగి చెప్పినను, శం ♦ కాపంక నిర్మగ్నుఁడై,
యంగీకారము లేక, నాగవిభుం ♦ డజ్ఞాతవాసంబునన్
భంగం బింతయు లేమి ధర్మసుతుఁడే ♦ పల్కంగ నాలించియున్
భంగం బాహవరంగమం దెనసియున్ ♦ బైకొన్నఁ జేటబ్బదే!

( శ్రీకృష్ణాభ్యుదయము )

## రాయబారము

కౌరవపాండవుల విరోధకారణములలో కౌరవులయందు బాధ కలిగించు స్వభావమును, పాండవులయందు బాధభరించు స్వభావమును వ్యక్తమగుచుండెను. శ్రీకృష్ణునకు రెండుపక్షములవారును సమానులేయయ్యెను. హింసాప్రధానులగు కౌరవులకు పశుబలసూచకమగు తన మూలబలమొసంగి, యహింసాప్రధానులగు పాండవులకు వాక్సహాయమే సహాయముగా నొసంగెను.

ఉభయపక్షములకును సంధికావించుటకై యెంతయో ప్రయత్నించెనుగాని, కేవల హింసాప్రధానులగుటచేఁ గౌరవులు సంధికీయకొనలేదు. కావున యుద్ధము తప్పనిసరి యయ్యెను.

భారతవర్షమునఁగల రాజులందఱును రెండుపక్షములలో నేదో యొక పక్షమును జేరిరి. పదునెనిమిది యక్షౌహిణుల సైన్యము యుద్ధమునకు సంసిద్ధమయ్యెను. యుద్ధమారంభింపవలసిన మహాతరుణమున నర్జునునకు విషాదము కలిగెను. ఆతఁడు హింసామార్గమునఁ బ్రవేశించుట తనకిష్టములేదని చెప్పి, గాండీవము నేలఁబడవైచి చెమటలూర్చుకొనుచు చతికిలఁబడెను. అప్పుడు శ్రీకృష్ణుఁడు భగవద్గీతాశాస్త్రము నాతనికుపదేశించెను. లోకమునకు బాధకలిగించిన పెక్కుఁరు దుర్మార్గులను దాను సంహరించెను. దానివలన లోకమునకు శ్రేయస్సు కలిగెను. కౌరవులు దుర్మార్గులు. కావున తనవలెనే యర్జునుడుకూడ దుర్మార్గులను సంహరింపవలెను. కంసాదులు తనకు బంధువులయ్యును దుర్మార్గులగుటచే లోకోద్ధరణకై తానెట్లు వారిని సంహరించెనో, యట్లే బంధువులయ్యును కౌరవులు దుర్మార్గులగుటచేతను వారిని సంహరింపవలసియున్నది.

ఐహికబంధుత్వములు శరీరముతో సంబంధించినవి గాని, యాత్మకు సంబంధించినవి కావు— అని చెప్పుచు నీవిధముగా శ్రీకృష్ణుఁ డర్జునునకు సుసమయమున నుపదేశించెను.

## —గీతాసారము—

ఆత్మకు లేవు బాధ్యతయు బాధకతయు నని తెల్పుచు, విషాదమునకు, దయకుఁ గరణంబులగు నహంకారమ్ము మమకార ముడిగించి, సంగరోద్యోగమునకుఁ గారణంబైన స్వకర్మంబు విడువక, ఫలకాంక్షవిడిచి, నిచ్చలు నొనర్చి, క్రమముగా సర్వధర్మములను విడిచి, నన్నే యాశ్రయింపుము, నే నశేష దోసములఁ బాపి, యుద్ధరింతు నిను మమత వలచటంచు వచించి, విశ్వాసమునకు విశ్వరూపంబుఁ జూపి, యవ్విశ్వభర్త పార్థుఁ డునిమిత్తముగ మహీభార ముడిపె.

(శ్రీకృష్ణాభ్యుదయము)

శ్రీకృష్ణునియీగీతోపదేశమువిని యర్జునుఁడు విషాదమువిడిచి శ్రీకృష్ణుని వాక్యములయందు పరిపూర్ణవిశ్వాసముంచి యాతనియందు సర్వాత్మభారార్పణ మొనర్చి, భక్తితో, విశ్వాసముతో యుద్ధమొనర్చెను. కౌరవులనుసంహరించి యుద్ధమునఁ బరిపూర్ణవిజయమందెను. జరాసంధుని వధవలన శ్రీకృష్ణుఁడును, కౌరవులవధవలన అర్జునుఁడును భూభారము నడఁచిరి.

శ్లో॥ యదాయదాహిధర్మస్య గ్లానిర్భవతి భారత।
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం॥
పరిత్రాణాయసాధూనాం వినాశాయచ దుష్కృతాం।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥

అని శ్రీకృష్ణుఁడు సెలవిచ్చియున్నాఁడు.

—Great men are the external images of the internal ideals of society—

అని యొకమహామహుఁడు సెలవిచ్చియేయున్నాడు. దుర్మార్గులు కలిగించు బాధలచే సన్మార్గులు బాధనొందుచుందురు. అట్టి దుర్మార్గులను నశింపఁజేయవలసినదని భగవంతుని ప్రార్థించుచుందురు. ఆప్రార్థనలకు ఫలితముగా నాదుర్మార్గులదుర్మార్గమునడంపగల మహాత్ముఁడాసంఘములోనే యుదయించును. శ్రీకృష్ణుఁడు, బుద్ధుఁడు, క్రీస్తు మొదలగువా రట్టి మహాత్ములు.

కేవలకర్మకే ప్రాధాన్యమొసఁగి, పాపములకు జంతుయజ్ఞములును, భౌతికప్రాయశ్చిత్తములునే పరిహారములని వాదించుచుండినయూదులకు జంతుయజ్ఞములవలన ప్రయోజనములేదనియు, భౌతికప్రాయశ్చిత్తమువలన ప్రయోజనములేదనియుచెప్పి, ఆత్మయజ్ఞము, పశ్చాత్తాపము ఈ రెండుమాత్రమే పాపములకుపరిహారముగలిగించుననియు చెప్పి క్రీస్తు అవతారపురుషుఁడయ్యెను.

జీవహింసారూపమైన వైదికతాంత్రికయజ్ఞములు చేయుచుండిన హిందువులకు అహింసారూపమైన సన్న్యాసమునుపదేశించి బుద్ధుడవతారపురుషుఁ డయ్యెను.

కేవల హింసాప్రధానములగు వృత్తులచే లోకము నాక్రమించుకొన్న దుష్టనృపాలురను సంహరించి అహింసాప్రధానులయిన బ్రహ్మర్షులు లోకులతోఁ గలసిమెలసి యుండగలుగునట్లు సంధానము చేసి, సకామకర్మమువలన లోకమునకు బాధయు, కర్మసన్న్యాసము వలన లోకమునకు బనికిరాకపోవుటయును, నిరసించి, ఈశ్వరార్పణబుద్ధితో జగన్మంగళమునకై నిష్కామకర్మము చేయవలసినదని లోకమునకుబోధించి, తానటులాచరించిన శ్రీకృష్ణుఁడు క్రీస్తుకన్నను, బుద్ధునికన్నను మిన్నయగు నవతారపురుషుఁడని చెప్పుటలో నెంతమాత్రము సందేహము లేదు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః



# అభిప్రాయములు

రాయబారము - మొదటి సంపుటము - సంజయ రాయబారము ప్రచురించిన పిమ్మట వచ్చిన అభిప్రాయములలో కొన్ని:—

### ఆంధ్ర విశ్వకళాపరిషత్ కళాశాల తెనుఁగు సంఘపత్రిక: దసరా సంచిక - అక్టోబరు - 1933.

"......వేంకటకృష్ణారావు పంతులు గారెంత కృషిసల్పిరోగాని, గ్రంథమునం దంతటను భావగాంభీర్యమును, శబ్దబలమును, అందుకు దగిన కారకము, తదనుగుణముగు శైలియుం గలవు.

ఇది తిక్కన హృదయమునంటినది; కవిబ్రహ్మ తిక్కనయజ్వ సూచ్యార్థ సూచనలకు విపులార్థ వివరణ మిది.. ..."

### ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక—సంపుటము ౨౨; సంచిక ౬.

"......విమర్శకులచే వ్రాయబడిన రాయబారపు కథాభాగములను, ద్యూతవాక్య కథాసందర్భాదులను, ఈ భాగమునుగూర్చి కొన్ని పుస్తక రూపకముగా బయలు వెడలిన వానిని, భారతమును ముం దిడుకొని, శ్రీ వేంకట కృష్ణారావుగారు రచించిన రాయబారమున మొదటి సంపుటము సంజయ రాయబారమును, పరిశీలనాదృష్టితో జదివితిమి. భారతకథాభాగమునిట్టియపూర్వరచనతోఁ బ్రారంభించుటకే సంజయరాయబారమే మూలమని నిరూపింపవలసియున్నది. ఇయ్యది పాణిని కృతసూత్రములకుఁ బతంజలి భాష్యము పగిదిగా భారతకథా భాగమునకుఁ బరమోపకారభూతమగు భాష్యమయి యొప్పారుచున్న దనుట స్వభావోక్తియే......".

### సుబోధిని - నెల్లూరు తే 20—1—1934.

శ్రీ కృష్ణారావుగారు రచియించిన సంజయ రాయబారము మిక్కిలి జాగ్రత్తతో జదివితిమి.

"..... ప్రకరణాంత సంవిధానము నవల ననుకరించును. రాజనీత్యాది వర్ణనం

కథనడపించుచు పాత్రలచేతనే సంభాషణ క్రమమున విమర్శచేయించుచు, వ్యాఖ్యానమ్ము తనకు దానుగా నడచుచుండు నట్లొనర్చిన గ్రంథ మిప్పటి కిది యొక్కటియే. ఈ వ్యాఖ్య ముద్దులు మూటగట్టు తేటతెనుంగుమాటలకు పెన్నిధి; చక్కని జాతీయోక్తుల గుప్తపరచిన రతనాల పేటిక; అజ్ఞాన తమఃప్రపంచమున అద్భుత కల్పనాశక్తిని సూచించు అపూర్వకరదీపిక......"

**THE HINDU—MADRAS, (Educational Suppliment.)**

d/ **12—3—34.**

"...............The way in which the author Mr. Venkata Krishna Rao has transmuted material taken from the Maha Bharata into a fascinating study of different characters & divergent policies is admirable. The book is a novel, a drama and a commentary rolled into one. Some of the characters in the Epic are presented in a new light. Characterisation apart, the book is an instructive and interesting study of the deplomacy and political philosophy of the Maha Bharata Period——".

**NEW ORISSA—Berhampur,** d/ **24—10—33**

"..........What strikes one at the first reading is the uniqueness of the style and the literary form. Beauties of phrase, words & idiom in plenty: but these do not seem to be exotic decorations but have their roof in the inherent excellence of the expression. To the lay reader there is an apparent quaintness but this is only apparent. The intellegent and scholarly reader cannot but admire the power and vigour of style——".

మ॥శ్రీ॥ పింగళి లక్ష్మీకాంతంగారు, ఎం.ఏ., ఛీఫ్ లెక్చరర్ - తెనుగు
ఆంధ్ర యూనివర్సిటీ కాలేజి, వాల్తేరు.

"......భారతాదిప్రాచీనగ్రంథములలోని ఏకదేశగాథలను ఎత్తి పలువురు పలువిధముల వ్రాసినపుస్తకములకును, శ్రీవేంకట కృష్ణారావు పంతులుగారు రచించిన యీ రాయబారమునకు, జాలవ్యత్యాసమున్నది. నే నెఱింగినంతవరకు అవన్నియు దండాన్వయప్రాయములు; ఇదియో వ్యాఖ్యాన ప్రాయము. రాయభాగ విషయమున కురుపాండవపక్షముల వాదప్రతివాదముల బలమును పరామర్శించి, స్వతంత్రుడగు ప్రాడ్వివాకుడు తీర్చిన తీర్పిది. ఈరకపు పుస్తకము మన భాషలో సరిక్రొత్త ...."

డాక్టరు చిలుకూరు నారాయణరావుగారు,
యమ్. ఏ., పి. హెచ్. డి., యల్. టి.,

"...... కథకు కథ, నవలకు నవల, నాటకమునకు నాటకము; విమర్శకు విమర్శ, యిన్ని యిమిడియున్నవి. మ॥శ్రీ॥ దేవరాజు వేంకట కృష్ణారావుపంతులు గారు రచించిన రాయబారమను గ్రంథమున... .."

విద్వాన్ అంగలూరి శ్రీనివాస తాతాచార్యులుగారు, ఒ.పి.యల్.,
ప్రధానాంధ్రోపాధ్యాయులు,
బోర్డు హైస్కూలు—గన్నవరం.

"శ్రీ వేంకట కృష్ణారావుగారు తిక్కన సోమయాజి గారి కవితయందలి భావగాంభీర్యమును బాగుగ నవగాహన మొనర్చుకొని, యందలి ప్రతివాక్యమును విమర్శనా దృష్టితోఁ బరిశీలించి వానిలోని భావమును లోకమునకు విశదీకరించి, తిక్కనకవితల్లజుని భావామృతమును జూరగొనఁ జేసిరి...

# D. V. Krishna Rao,

GADIVARI STREET, BERHAMPUR. (G.)

విక్రయమునకు సిద్ధముగానున్న గ్రంథములు.

## కా లూ రా యి

గ్రంథకర్త:—దేవరాజు వేంకట కృష్ణారావు గారు

వాఁడేవీఁడు, నేనే, అను నిరూపక నవలావతంసములతరువాయి భాగము. స్వతంత్రము. కన్నడ ఉరుదు భాషలలోనికి తర్జుమా కాబడినది. సినిమటోగ్రాఫు వారిచే తర్జుమా కాబడినది.

ఏ ప్రకరణమున కాప్రకరణమే స్వయం సంపూర్ణమయ్యు పూసలలోని దారమువలె నున్నది. దిగ్భ్రమ జెందించుకథ. తుద ముట్ట చదువువరకు విడువనీయదు. ఆంగ్లమున షెల్లాక్ హోమ్సు గ్రంథములు జదువలేదను విచారమును తొలగింపజేయుజాలు కథా కల్పనా చమత్కృతి గలది. వెల 0—12—0.

ఉ॥ రూపక ముఖ్య చిత్రములు ♦ ప్రోన్నతలీల సెసంగఁగాఁ గథా
రూపకమందు సామ్యము నె ♦ ఱుంగక యాంధ్రపు వాఙ్మయంబునన్
రూపకలంకమై తగ, ని ♦ రూపక మియ్యది యాలకించి, యే
రూపక యుందుగో తలల ♦ నూన ముదంబు మదిం జెలంగఁగన్.

## కో టీ శు త న య

కర్త:—సుప్రసిద్ధ రచయితలు తాత కృష్ణమూర్తిగారు బి.ఎ.ఎల్.టి

జర్మనీ, ఫ్రాన్సు, ఇంగ్లాండు, అమెరికా మొదలగు నాగరిక దేశములనిపించుకొనుచున్న వానిలో పాశ్చాత్యవిద్యాభివృద్ధిచే గలిగిన గర్భనిర్భేదకరమగు క్రూరకృత్యములును, వానిం బరిశోధింప డిటెక్టివ్ ఆఫీసర్ల బుద్ధికుశలతయు, అప్రతిహతములగు వారి ప్రయత్నములును చదువరుల గుండియ లవియజేయును.

క్షణ మెడములేక బయాస్కోపు ఫిల్ము వలె కాలచక్రముకన్న విపరీత వేగముతో హంతకునిచే జరుపబడిన భయానక దురంత కార్యములు చదువరుల యొడలు కంపింప జేయును. వెల 0-12-0.

# సుహృల్లత

చరిత్రాంశముల సమీకరించియుఁ బ్రవర్తనముల ప్రతిష్ఠింపఁబడిన మానవుల ననుసరించియు, జీవితవచనకావ్యము వ్రాయు టెంతయు దుర్ఘటము కాదు. సాంఘిక విషయము ననుసరించి వ్రాయుటయు నంత సులభము కాదు. కాని నైతిక విషయముల నధఃకరించి యొక నవలను వ్రాయుట యెంతయు దుస్తరము. అది బేకను ప్రభువు వక్కాణించినట్లు కేవలము నమలి పాఱవేయునదిగా నుండక, శాశ్వతామరసామాజికసత్యములతో వెలయుచుండవలయును. అట్టి యుత్కృష్టాదర్శములతో మానవజన్మంబునకు కాణాచియగు భావంబులలో నొక్కటియగు స్నేహమునందలి పరిణామంబులు సజ్జన దుర్జనుల మైత్రియు, వాని పర్యవసానములును, చక్కని కథారూపమున, మనంబుల కంటునటుల వ్యక్తీకరింపబడి యున్నవి. వెల 0—12—0.

# నానాఫడ్నవీస్

హిందూ దేశమున పూర్వయుగమున చాణక్యుడును, మధ్యయుగమున నైరోపా ఖండమున మైకవెల్లియు, నెంత సుప్రసిద్ధ పురుషులో అంత సుప్రసిద్ధ పురుషుడును అగు నానాఫడ్నవీస్ జీవచరిత్ర - మంత్రి యుగంధరుడు తెలింగానా రాజ్యమునకును, తిమ్మరసు విజయనగర సామ్రాజ్యమునకును, తిక్కనమంత్రి మనుమసిద్ధి రాజ్యమునకును, పూర్ణయ్యగారు మైసూరు రాజ్యమునకును, జేసిన మహా ముపకారములకంటె నీ నానాఫడ్నవీస్ మహారాష్ట్రమున కొనర్చిన మేలు కడుంగడు గొప్పది. ఇంగ్లండు నుద్ధరించినట్లు చెప్పఁబడు చున్న పిట్ మహామంత్రికన్న మహారాష్ట్రముపట్ల నీ నానాఫడ్న

# ప్రతిజ్ఞాచాణక్యము

శ్రీ ద్విజేంద్రలాల్‌రాయ్‌గారి నాటకమును మాతృకగా జేసికొని రచింపబడిన నూతననాటకము వెల 0—8—0.

బ్ర॥శ్రీ॥ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి ఉపోద్ఘాతము గలది.

# జానకీపరిణయము

ఇయ్యది అనేక పురాణములనుండి గ్రహింపబడిన యొక అద్భుతపౌరాణిక విషయమును కథావస్తువుగాఁ గలిగి, పండ్రెండు చిత్రపటములతో శోభిల్లుచుఁ జదువువారలకు ఆహ్లాద, విస్మయ, దిగ్భ్రమములు గలుగజేయుచునుండి, ఆంధ్ర లోకమున నిదివర కెన్నఁడు నెవ్వరిచేతను బ్రచురింపబడని నవనవలా శిరోమణి.

తప్పుల తమాషా యన నిదియే. ఇందలి కథ జానకీపరిణయాంతమువరకు వివరింపబడినది. మాయ రాముడు నిజమగు సీతను జూచి సీతకావని యనుకొని, ఆమెనువీడి మాయసీతనుజూచి నిజమగుసీతయనిభ్రమపడి యామె నెత్తుకొనిపోవుట; మాయసీత యగ్నిం బడుటగాంచి నిజమగు రాముడు భ్రమజెందిప్రాణత్యాగప్రయత్న మొనర్చుట; మాయరామలక్ష్మణవిశ్వామిత్రులచే జనకమహారాజు విభ్రమజెందుట లోనుగాగల చిత్రవిచిత్రములతో గ్రంథమంతయు(Comedy of Errorsవలె) విభ్రమాకరమై చదువరుల మానసముల భ్రమజెందించుచు పెక్కు చిత్రపటములచే శోభిల్లుచుండును. వెల 1—0—0.

గ్రంథకర్త:—దేవరాజు వేంకట కృష్ణారావు గారు.

# నారదమహర్షి జీవిత చరిత్రము

నారదుని చరిత్ర పదునెనిమిది మహాపురాణములలో గాని, పదునెనిమిది ఉప పురాణములలో గాని, శ్రీ మద్దేవీ భాగవతమున గాని, శ్రీమద్రామాయణము, భారతము మొదలగు ఇతిహాసములలో గాని ఒక్కచోట పూర్తిగా నెందైనను గానరాదు. కాని అన్నిటియందును కొంచెము కొంచెముగా చెప్పబడిన విషయము లున్నవి. పురాణములలో చెదరి యున్న నారదచరిత్ర ఒక్కచోట జేర్చి సుబోధక ముచేసి తెలుగువారి కిచ్చిన గ్రంథమిది. వెల 0-12-0.

# జగదక్షక శతకము

శతాధిక గ్రంథకర్తలు, కీర్తిశేషులు, బ్ర॥శ్రీ॥ మండపాక పార్వతీశ్వర కవీశ్వర విరచితము.